

# అమృత శృంగారం

జి.వి. పూర్ణచందు

# అమలిన శృంగారం

**A STUDY IN PSYCHOLOGY OF SEX**

జి.వి. పూర్ణచందు



ఫోన్ 63322
శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్ ప్రైజెస్
మ్యూజియం రోడ్ * ఏలూరు రోడ్ కార్నర్
గవర్నరుపేట ... విజయవాడ-2.

AMALINA SHRINGARAM

G. V. Purnachand

Publishers :

Sri Mahalakshmi Book Enterprises
Vijayawada-520 002.

First Edition :

MAY : 1980

Cover Design :

BAPU

*Price Rs.* 15 00

Block Making :

KRISHNA PROCESS

Cover Printing :

VIJAYA ART PRINTERS

Printers :

BEST PRESS
Vijayawada-2.

1(A)



సాహితీరంగంలో కార్యకర్తనుకావడానికి పూర్తి స్వేచ్ఛనిచ్చిన

అమ్మకూ, నాన్నగారికీ

2(1)

ఇదీ వరుస....

3

# హెచ్చరిక!

**ఇలాంటి పుస్తకం రాసేందుకు నీకెన్ని దమ్ములు బ్రదర్!**

రాస్తున్న విషయం గురించి నిశితమైన పరిశోధన చేయడం, చెప్పాలిస్సిన అంశాన్ని సమగ్రంగా సేకరించుకోవడం, సేకరించుకొన్న ప్రతిపాదనల్ని రమ్యమైన శైలిలో చెప్పడం, అన్నిటికీ మించి దీన్ని వ్రాయడం "బాధ్యత" గా భావించ గలిగిన చిత్తశుద్ధిని గుండెల్లో పాదుచేసుకోవడం, ఆసాంతం పట్టుదలతో సాగడం-ఇవన్నీ చాలా దమ్ములున్న వాళ్లు చెయ్యాల్సిన పనులు మిష్టర్!

నిండా బొడ్డూడనివాడివి-నీకిలాంటి అర్హతవుందా -ఉన్నదా? అని ప్రశ్నిస్తున్నాం. చెప్పు!సమాధానం చెప్పు.

చేత్తో పుస్తకాన్ని పట్టుకొని–"ఇవిగో దమ్ములూ, కొమ్ములూ" అని గొంతెత్తి అరచినా మేం ఒప్పుకోం. మేఁవంతా వచన కపితా సంకలనాల్ని సమీక్షించే కథక చక్రవర్తులం; కథా సంపుటాల్ని విమర్శించే శార్దూలాలం, మత్తేభాలం; నాటకరంగం గురించి ఉపన్యాసాలుదంచే నిఘంటు కర్తలం; అమ్మళ్లతీరుబడి మీద సొమ్ము చేసుకునే సాహిత్య సేవకులం–నీ పుస్తకాన్ని చీల్చి చెండాడుతాం జాగ్రత్త! పిల్ల కాకివి, నీకేం తెల్సు ఉండేల్ దెబ్బ!!

అసలు మేమీపుస్తకాన్ని చూస్తే, ముట్టుకుంటే చదివితే మైలపడిపోతాం– మాకొద్దు, వొద్దనేవద్దు, వద్దుగాక వద్దు!!!

ఈ పేజీని నేనే నింపాలన్న నీ పట్టుదలకి నీకి హెచ్చరిక చెయ్యక తప్పదు!

విహారి

# ఇది బాధ్యత...

సాహితీ సమరాంగణంలో ఒక సైనికుడిగా ఇన్నాళ్ళూ కవాతుచేస్తోన్నా. నాదంటూ ఒక అభిప్రాయాన్ని వెలువరించ డానికి నాకు పదిసంవత్సరాలు పట్టింది.

ఇంతకాలం సాహితీ సాంస్కృతిక కార్యకలాపాల్లో విరామం లేకుండా తిరిగాను. వివిధ సాంస్కృతిక సంస్థలతో నాకున్న సాన్ని హిత్యం నా రచనావ్యాసంగాన్ని మరింత మెరుగుపెట్టింది.

శ్రీవిహారితో పరిచయం అయ్యాక, నాలోవున్న కార్యకర్త పూర్తిగా మేల్కొన్నాడు. "స్పందన" కార్యవర్గ సభ్యుణ్ణయాను! విహారిశిక్షణలో సాహితీసంస్థల నిర్వహణానుభవం వలసినంత లభించింది.

సాహిత్య అకాడమీలో "యువకిశోరం" మా గుత్తికొండ సుబ్బారావుకు కుడిభుజంగా వ్యవహరిస్తూ మరింత కార్యకర్తృత్వం నేర్చాను.

మిమిక్రీ కళాకారుడూ, జర్నలిస్టూ శ్రీరాజశేఖరపాండే నాకు సాంస్కృతిక రంగానికి సంబంధించి ప్రాథమికపాఠాలు నేర్పిన వాడు. పాండేతో స్నేహంతో మనుషుల్ని చదవడం ఎలాగో చేతనైంది.

విషయజ్ఞానం ఉండీ, నూతన ప్రయోగాలకోసరం ఎక్కువ కాలాన్ని వెచ్చించే శ్రీ పురాణపండ రంగనాథ్ సాహచర్యం వలన సైన్సును సాహిత్యానికి మళ్ళించాలనే పట్టుదల బాగా పెరిగింది. సాహిత్యప్రయోజనాన్ని సాధించాలంటే రచనలు వైజ్ఞానికమైనవి

అవడం అవసరం.— అని భావించుకున్నాను. సోదరుడు రంగనాథ్ నన్ను సైన్సు ప్రపంచంలోకి లాక్కుపోయాడు.

మార్క్సిస్ట్ దృక్కోణంలోంచి చూస్తూ అనేకసమస్యలగురించి అప్పుడు మైత్రేయగారితో తరచూ చర్చిస్తూండేవాణ్ణి. హేతువుకు దూరంకాకుండేందుకు ఈ చర్చలు నాకెంతో ఉపయోగించేవి.

భారతీయ శాస్త్రాలపైన గౌరవంతోటే ఆయుర్వేద వైద్య విద్య నభ్యసించడం ప్రారంభించాను. అప్పుడప్పుడు నేనువ్రాస్తూ వచ్చిన వివిధ వ్యాసాల్ని మా మాష్టారు డాక్టరు సి. హెచ్. రంగారావుగార్కి చూపిస్తూండేవాణ్ణి. ఒకమంచిరచయితగా ఆయుర్వేదం లోని శాస్త్రీయ విషయాల్ని నలుగురికీ తెలియజేసేందుకు నేనొక సాధనం కావాలని వాంఛించిన ఆయన ఆకాంక్ష నాకు మహత్తరమైన వూపునిచ్చింది.

సెక్సుకు సంబంధించి సైన్సుతోపాటు ప్రజలలో సామాజిక అవగాహనకూడా కలిగించడం నా "బాధ్యత" అని భావించాను. మిత్రుడు గజేంద్రరావు ప్రోద్బలంతో ఈ పుస్తకం వ్రాశాను.

"ఈరచన మీకు మంచిభవిష్యత్తునిస్తుంది" అని ఆశీర్వదించిన శ్రీరామ్‌నారాయణ్ ముద్రణవిషయంలో తన "బెస్ట్‌ప్రెస్" లో నాకు పూర్తిస్వేచ్ఛ నిచ్చారు. నా ఆరాధ్య కళాతపస్వి శ్రీ బాపు కమనీయచిత్రం ఈ రచనకు ముఖచిత్రం కావడం నా అదృష్టం. విజయవాడ శ్రీ రామమోహన గ్రంథాలయసంస్థ వారునాకందించిన సహకారం మరువలేనిది.

శ్రీ మహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్ మిత్రులు ఎంతో ఉత్సాహంతో ఈ పుస్తకాన్ని వెలువరించారు.

ఎందరో మహానుభావులు ఇలా నన్ను ప్రోత్సహించారు. అందరికీ ఇవే నా వందనాలు!!

జి.వి. పూర్ణచందు

## అధ్యాయం ఒకటి



# చిన్నపిల్లలలో లైంగికభావాలు

## INFANTILE SEXUAL THEORY

8

ప్రీతిర్బలం సుఖం వృత్తి విస్తారో విపులం కులమ్।
యశో లోకాః సుఖోదర్కాః తృప్తిశ్చాపత్య సంశ్రితా॥

(చరకంచికిత్స అధ్యాయం 1.)

ప్రీతి, బలం, సుఖం, జీవనం, వ్యాప్తి, వంశవృద్ధి, కీర్తి, పుణ్యలోకాలు, సంతోషం.....ఇవన్నీ సంతానాన్ని ఆశ్రయించి వుంటాయి.

[తామెప్పుడు పెద్దవాళ్ళమౌతామా అని ఎదురుచూస్తున్న గూటిలోని
పక్షి పసికందులు]

9

# చిన్న పిల్లలలో లైంగిక భావాలు
## INFANTILE SEXUAL THEORY

ఫ్రాయిడ్ ఒక సందర్భంలో "మనుషులు సాధారణంగా సెక్సు విషయాలలో నిష్కపటంగా వుండరు .... తమ సెక్సువాలిటీని వాళ్ళు స్వేచ్ఛగా ప్రదర్శించరు కాబట్టి, అబద్ధాలనే మందపాటి దుస్తుల్లో సెక్సును మూసేస్తారు కాబట్టి - మనిషికి సెక్సు నిజాయితీ లేదు ...." అన్నాడు.

'గాలీ వెలుతురూ అనే ఈ రెండూ సెక్సుకు శత్రువులు' అనేది ఆయన వేసిన జోకు.

తమ లైంగిక జీవితాన్ని ఎవరూ ఎదుటి వాడికి చెప్పుకోవడానికి ఇష్టపడరు కాబట్టి, సెక్సు సున్నితత్వాన్నీ, పరిణామతః దాని అభివృద్ధినీ అంచనా వేయాల్సి వచ్చినప్పుడు, మనం మన బాల్యంలోని సెక్సు అనుభవాలను ఉదాహరణగా తీసుకోవల్సి వుంటుంది.

కాని, చిన్నప్పటి ఆ అనుభవాలను పెద్దయ్యాక ఇప్పుడు మననం చేసుకోవాలంటే కొంచెం కష్టమే!

ప్రత్యక్షంగా పిల్లలు చేసే పనులను 'పిల్ల చేష్టలు'గా కాక పరిశోధనా దృష్టితో పరిశీలిస్తే, మన చిన్ననాటి సంఘటనలు లీలగానైనా మనసులో మెదలక పోవు.

పోల్చుకుంటూ ఆలోచిస్తూంటాం. అవి చాలా అసంగతమైనవే కావచ్చు. అందులో కొంత నియంత్రతా (Repression) కనిపించవచ్చు.

కాని, ఆ అనుభవాలనే ఈ పెద్దలు తమ చిన్నతనంలో అనుభవించి వుండక పోతే, ఇంత ఎదిగింతర్వాత, వాళ్ళిప్పుడు లైంగిక జీవితంలోకి ప్రవేశించాక, సంపూర్ణమైన ఆనందాన్ని అనుభవించగలుగుతూ వుండేవారా?

ఈ ఆలోచనే ఫ్రాయిడ్‌ను చిన్నపిల్లల ప్రవర్తనలో సెక్సు ఛాయల్ని వెదికేందుకు ప్రేరేపించింది.

ఫ్రాయిడ్ చెప్పిన సిద్ధాంతం ప్రకారం, స్త్రీ పురుషుల మధ్య సహజంగా వుండే కామం ఏనాడో బిడ్డ పుట్టినప్పుడే నాటబడిన బీజం.... అది మొలక లేసి, ఎదిగి, యవ్వనం వచ్చాక ఫలిస్తుంది .... అని!

పిల్లలు లైంగిక కృత్యాలకు తలపడడానికి కారణం అది వాళ్ళకు ఆనంద దాయకం కావడమే!

పిల్లలలో సెక్సు భావాలను పరిశీలించడం ఒక కళ. వాళ్ళభావాలను పట్టించుకోకుండా క్షమించి వదిలేయడం ఒక ఔదార్యం.... అంతే!

||

# 1. లైంగికత ప్రవేశం

యవ్వనం వచ్చేవరకూ పిల్లలకు లైంగికోత్తేజం ఉండదనుకోవడం పొరబాటు.

దయ్యం పట్టినవాడి శరీరంలోకి ఆ దయ్యం ప్రవేశించినట్లు యవ్వనం వచ్చిం తర్వాత, ఎప్పటికో పెళ్ళయ్యిం తర్వాత, మనిషి మనసులోకి ఈ సెక్సు దయ్యం ప్రవేశిస్తుందని చాలామంది సెక్సును అనుభవించేసి వదిలేసిన పెద్దల నమ్మిక.

సెక్సుభావం పుట్టడంతోటే వుంటుందనీ, దానికి ప్రవేశం అంటూ వేరే ఒక 'దశ' వుండదనీ. వాదించిన ఫ్రాయిడ్ పరోక్షంగా - ఇప్పటి వరకూ అర్థంకాని భారతీయ సిద్ధాంతానికి ఊపిరి పోశాడు.

## పిల్లల సెక్సు ప్రత్యేకత

ఒక పాపలో గాని, బాబులో గాని, పుట్టినప్పటినుంచే లైంగిక ప్రేరణలుంటాయని ఫ్రాయిడ్ నిర్ద్వందంగా ప్రకటించాడు. ఈ విషయం మీద అనేక పండిత చర్చలు సాగాయి. ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సైకో ఎనాలిసిస్'అనే మనస్తత్వ శాస్త్రంలోని ఒకనవ్యవిభాగంలో పిల్లల లైంగిక భావ సిద్ధాంతం (Infantile sexual theory) ప్రధానమయ్యింది.

సెక్సుభావాలను వెంటనిడుకుని పుట్టే మనిషిలో, చిన్ననాటి ఈ లైంగికతే, పెరిగి పెద్దయ్యేసరికి, పరిపూర్ణతను పొంది, మనిషిలో

సంతానోత్పత్తి శక్తిని ప్రసాదించ గలుగుతోంది - అనేది ఫ్రాయిడ్ ప్రతిపాదించిన శైశవ శృంగార సిద్ధాంతంలోని సారాంశం !

బాహ్య ప్రవృత్తులతో నిమిత్తం లేకుండా, కొన్ని ప్రత్యేకమైన అవయవాలకు సంబంధించి, పిల్లల మనసులో దానికదే కలిగే ఉత్తేజం ఫలితంగా పసివాళ్ళు సైతం లైంగిక ఆనందం పొందగలుగుతున్నారు.

జననేంద్రియాలూ, గుదమార్గం, మూత్రమార్గం, కొన్నిచోట్ల కేవలం చర్మం పిల్లలలో లైంగికోత్తేజం కలిగిస్తాయి.

వీళ్ళ ఆనందానికి మరో వ్యక్తి ప్రేరణ అవసరం లేదు. తమకు తామే ఆవేశాన్ని తెప్పించుకోగలుగుతారు, దీన్ని "ఆటో ఇరోటిజం" ఆత్మ శృంగారం - అన్నాడు హావెలాక్ ఎల్లీస్.

'ఆత్మ శృంగార' తత్త్వం వున్న వ్యక్తుల భావాలలో లైంగికత వుండదు. కాబట్టి, పిల్లల సెక్సు వేరనీ, పెద్దల సెక్సు వేరనీ మనం ఒక నిర్ణయానికి రావచ్చు.

భార్యా భర్తల మధ్య వుండే లైంగిక సంబంధాలను మాత్రమే సెక్సు అనుకొనే పక్షంలో, ఈ 'సెక్సు' ను మనం పిల్లలకు అంటగడితే వాళ్ళకు మనం చేసే ద్రోహం అంతకంటే వేరే వుండదు.

ఫ్రాయిడ్ 'సెక్సు' అనే పదాన్ని మాత్రమే తీసుకున్నాడు. పెద్దల సెక్సుకూ, పిల్లల సెక్సుకూ బోలెడంత వ్యత్యాసాన్ని చూపించాడు.

ఆయన దృష్టిలో, సెక్సు సంపూర్ణంగా పరిపక్వత నొందడానికి పూర్వ రూపం లేక పునాది ఈ పిల్లల సెక్సు.... అవి !

13

# అమ్మా నాన్నల అనుకరణ

పసి పిల్లల్లోనూ సెక్సనేది వుంటుందని, ఇంత సిద్ధాంతాన్ని ప్రతిపాదించడానికీ ఫ్రాయిడ్ కొన్ని తప్పనిసరి పరిస్థితుల నెదుర్కోవాల్సి వచ్చింది. మనం అసహ్యంగానూ, వల్గర్‌గానూ భావించే ఈ సెక్సుకు ఆదినీ, తుదినీ కనుక్కోవాలనే తాపత్రయమే ఆ తప్పనిసరి పరిస్థితుల్ని కల్పించింది.

జీవితంలో సుఖ లేక దుఃఖ ప్రకృతిని "సెక్సు" అన్నాడు ఫ్రాయిడ్. అంటే, ఏదైతే సుఖానుభూతినీ లేక దుఃఖానుభూతినీ కలుగ చేస్తుందో అదే సెక్సు. భారతీయ సిద్ధాంతం "అనుకూల వేదనా సుఖమ్" అనీ, "ప్రతికూలవేదనా దుఃఖమ్" అనీ వర్ణించింది. సుఖం, దుఃఖం అనే ఈ రెండూ వేదనలే. సెక్సుకూడా ఫ్రాయిడ్ దృష్టిలో ఒక వేదనే. అది చిన్నపిల్లలలో చైతన్యానికి ప్రతీక।

రకరకాల సుఖానుభూతులలో ఒకటిగా సెక్సును మనం భావిస్తున్నాం. కానీ, పిల్లలకు అన్ని సుఖానుభూతులూ ఒకే రకం ఆనందాన్ని కలుగజేస్తాయి. ఆ ఆనందమే 'సెక్సు'। అప్పటికి ఆ వయసులో అదే ప్రయోజనకరమైందీ, ప్రమాదం లేనిదీ।

సుఖానుభూతి ఏదైనాసరే, అది ఆరోగ్యానికి చిహ్నం। చరకుడు శరీరానికీ, మనసుకీ, ఈ సుఖానుభూతికీ వున్న సత్సంబంధాన్ని చక్కగా వివరించాడు. *

---

(1) "శరీరం సత్త్వ సంజ్ఞంచ వ్యాధీనామాశ్రయో మతః
తథా సుఖానాం యోగస్తు సుఖానాం కారణం సమః"

(చరకం—శారీరం)

కాలం, బుద్ధి, ఇంద్రియాలూ, ఇంద్రియార్థాలు సమంగా కలిస్తేనే ఆరోగ్యరూపమైన సుఖం లభిస్తుంది. దీన్నే సమ్యగ్యోగం అంటారు. సుఖానుభూతికి శరీరం, మనస్సూ రెండూ సమానబాధ్యత వహిస్తాయి.

చిన్నపిల్లల విషయంలో ఇది స్పష్టంగా కనిపిస్తుంది. వాళ్ళ ఆనందానికి శరీరం, మనస్సు అనే భేదం లేదు. అంతేకాదు, వాళ్ళ సుఖానుభూతికి తరతమ భేదాలు లేవు.

నిజానికి పిల్లలలో ఓ ఆత్రం వుంటుంది.... "తామెప్పుడు పెద్ద వాళ్ళం అవుతామా...." అని ఎదురు చూస్తుంటారు. పెద్దలవలె ప్రవర్తించాలని అనుక్షణం తహ తహ లాడుతుంటారు. బొమ్మల పెళ్ళిళ్ళూ, మొగుడూ పెళ్ళాల ఆటలూ వగైరా పిల్లలు ఆడుకొనేందుకు ఇదే కారణం. ఈ ఆటల్లో చిన్న చిన్న అమ్మాయిలూ, అబ్బాయిలూ, అమ్మానాన్నల్ని అనుకరించడానికి ప్రయత్నిస్తుంటారు.

నిలబెట్టిన మంచాల వెనుక జేరి, పిల్లలు మొగుడూ పెళ్ళాల ఆటల పేరుతో చేసుకునే పనులు అచ్చం పెద్దల్నే పోలివుంటాయి. రహస్యంగా వాళ్ళు సాధించుకున్న విజ్ఞానాన్ని, ఆచరణలో పెట్టి, అలా చేస్తే ఎలావుంటుందో తెలుసుకునే ప్రయత్నాలు చేస్తారు. ఇదంతా పిల్లల లైంగికతే అనుకోవడానికి వీల్లేదు. ఇది కేవలం అనుకరణ - జిజ్ఞాసా - తెలుసుకోవాలనే కోరిక. ఈ కోరికతోటే పిల్లలు, అనేక పనులు చేస్తారు. అది ఆ వయసు లక్షణం....అంతే!

ఈ తతంగం అంతా పెద్దవాళ్ళ కళ్ళల్లో పడితే, వాళ్ళు కాసేపు నవ్వుకొని, మృదువుగా మందలించి, ఇంకనుంచైనా అసలు సంగతి వాళ్ళ కళ్ళల్లో పడకుండా వుండాలని జాగ్రత్త పడ్తుంటారు. పడ్తున్నామని భ్రమిస్తారు.

ఎటు తిరిగి పిల్లలకంతా తెలుసుకాబట్టి, వాళ్ళకేమీ తెలీదనుకునే మన పెద్దలు—'అమ్మా! నేనెలా పుట్టాను-' అని ఉత్సుకతతో అడిగిన పిల్లలకు సమాధానం చెప్పలేక - 'ఎలాగోలా పుట్టావులేరా ....' అనేసి కసురుకొంటుంటారు.

మానసిక శాస్త్రజ్ఞులు వాళ్ళకు అసలు విషయం అర్థం అయ్యేలా చెప్పడమే శ్రేయస్కరం అంటున్నారు. అలాగాక, అరిచీ, కరిచీ వాళ్ళ నోళ్ళు నొక్కేస్తే, పిల్లలు నిరాశా పూరిత వాతావరణంలో ప్రమాదకరమైన 'ఫ్రస్ట్రేషన్' లో పడిపోతారు.

అసలీ ప్రశ్న వెయ్యని పిల్లల్ని చైతన్యం వున్న వ్యక్తులుగా ఫ్రాయిడ్ సిద్ధాంతం అంగీకరించదు. చిలిపిచేష్టలు చెయ్యని పిల్లలు జడ పదార్థాలేననాలి.

పిల్లలకెంత సేపూ అంటే ఏవిటో తెలుసుకోవాలనుంటుంది. పెద్దలు తెలుసుకోనివ్వరు. వాళ్ళలోని ఆ 'తృష్ణ'ని అణిచి పారేస్తుంటారు.

ఇవ్వాళ ఇంత మంది మనోవికారులు మనమధ్య తిరుగుతున్నారంటే దానికి ఇదికూడా ఒక కారణంగా మనం ముందు గుర్తించాలి.

సెక్సంటే ఆనందాన్ని కలిగించే ఒక ప్రవృత్తి. ఈ ఆనందం వయసునుబట్టి పరిణతి చెందుతూంటుంది. ఒక్కో దశలో ఒక్కోరకం ఆలోచనను రేకెత్తిస్తుంది.

ఈ ఆలోచనలలో సుఖం, దుఃఖం రెండూ వుంటాయి. సుఖ దుఃఖాలు వయసునుబట్టి మారుతుంటాయి. అందుకని ముందుగా ఆ వయో దశల గురించి కొంత చర్చించాలి.

16

# వయసునుబట్టి లైంగిక భావాలు

మనిషి జీవితంలో బాల్యం, మధ్యమం, వార్ధక్యం అని మూడు విభాగా లున్నాయి.

పదహారు సంవత్సరాల లోపువాణ్ణి బాలుడంటారు. ఈ బాల్యాన్ని తిరిగి (1) దుగ్ధాశి (పాలు తాగేవాడు) (2) దుగ్ధాన్నాశి (పాలూ, అన్నం రెండూ తీసుకునేవాడు), (3) అన్న భుక్ (అన్నం భుజించేవాడు) ఇలా మూడు రకాలుగా విభజించారు. *

ఇది కేవలం శారీరకమైన విభజన. కాని, పూర్తి మనోవిశ్లేషణ చేయవలసి వచ్చినప్పుడు ఈ మాత్రం వివరణ చాలదు.

వయసునుబట్టి మనోవిశ్లేషణ చేసినవాడు 'ఎరిక్ - హెచ్ - ఎరిక్సన్' అనే అత్యాధునిక పిల్లల మానస వైద్య నిపుణుడు.

ఈయన మానవ జీవితాన్ని ఎనిమిది దశలుగా విభజించాడు.

మొదటి దశలో కొత్తగా పుట్టిన శిశువులలో మాతృస్థనాలనుండి స్తన్యాన్ని గ్రోలేందుకు పడే తాపత్రయం కనిపిస్తుంది. ఫలానా వ్యక్తి తన తల్లనీ, ఆమె వలన తనకు పోషణ లభిస్తుందనీ, తల్లిపట్ల ఓ విశ్వాసాన్ని (Trust) పెంచుకుంటాడు బిడ్డ.

కాల గమనంతో నెలలు నిండుతోన్నకొద్దీ, తన ఇంద్రియాలలో ఏదో తెలీని సాహసాన్ని గమనించగలుగుతాడు. ఈ సాహసమే ఆ చిన్నారి హృదయంలో రగిలే ఆకస్మిక ప్రవృత్తులకు (Impulses) ప్రతిస్పందన నిస్తుంది.

---

శ్లో॥ త్రివిధః సో உపి దుగ్ధాన్నాశీ తథాన్న భుక్ ।
దుగ్ధాశీ వర్ష పర్యన్తం దుగ్ధాన్నాశి శరద్వయం ॥

(భావ ప్రకాశం 3.41)

చిటికెవేస్తే చిరునవ్వు నవ్వుతాడు, నవ్విస్తే నవ్వుతాడు. చక్కిలిగిలిపెడితే నవ్వుతాడు. ఎత్తుకుంటే నవ్వుతాడు. ఊపితే నవ్వుతాడు. అసలు, పలకరిస్తేనే నవ్వుతాడు. ఇవన్నీ ఆ పసిబిడ్డ కొకే ఆనందానుభూతి. అది కేవలం బాహ్యప్రపంచానికి ప్రతి స్పందన. దాన్ని పిల్లల మనసుల్లో రగులుతున్న కోరికకు చిహ్నంగా ఫ్రాయిడ్ చెప్పాడు.

ఈ ప్రతిస్పందనే చైతన్యం. కోరికలులేనివ్యక్తి అచేతనుడు.

పుట్టిన దగ్గర్నించే ఈ కోరికని తీర్చుకునే ప్రయత్నం ప్రారంభం అవుతుంది. ఆప్రయత్నంలో కోరికతీర్చే వ్యక్తులమీదా, వస్తువులమీదా ఓనమ్మకం పెరుగుతుంది. ఈ నమ్మకం లేదా అప నమ్మకం మాత్రమే ఆపసిగుడ్డుకు అప్పటికి తెలిసింది.

అందుకే తన, పర, కొత్త, పాత భేదాల్ని నెలలపాపాయి కూడా గమనించ గలుగుతుంది.

"తనకు తృప్తినిచ్చేది భలానా" అనే విశ్వాసాన్ని, విజ్ఞానాన్ని పెంచుకునే దశ ఇది!

## ఆడపిల్లల వింత ఆలోచన

రెండవ దశకు ప్రవేశించిన పిల్లలకు దాదాపు రెండేళ్ళు నిండుతాయి.

మొదటిదశలోని విశ్వాసమే ఆత్మవిశ్వాసంగా మారుతుంది అవమానాన్ని గుర్తించగలుగుతాడు. ఫలితంగా తనను తాను నియమించుకునే శక్తి [Autonomy] పెరుగుతుంది. ఏదిమంచో, ఏదిచెడో పిల్లలు తమలో తాముచర్చించుకుంటారు.

రక రకాల సందేహాలు కలుగుతుంటాయి. పెద్దలసమాధానం కోసం ప్రయత్నిస్తారు.

ప్రేమ, అసహ్యం, ఒకవనివట్ల యిష్టత, అంగీకారం, స్వేచ్ఛగా తమభావాల్ని వెలిబుచ్చడంవంటి లక్షణాలు ఈదశలోనే కలుగుతాయి.

ఇంకా చెప్పాలంటే "భలానా పనిచెయ్యకూడదు" —అనే నిశ్చయాన్ని దృఢంగా నాటుకునేట్లుచేస్తే పొరబాటునకూడా చెయ్యనంత ఆత్మనియంత్రణనుసాధించుకుంటారు.

పసిపిల్లలు ఎంతపసివాళ్ళైనా, వాళ్ళలోనూ కొంత మానసికశక్తి (Psychic Energy) వుంటుంది. ఫ్రాయిడ్ ఈ మానసిక శక్తిని "లిబిడో" అన్నాడు.

ముఖం, గుదం, జననేంద్రియాలలో ముందు లిబిడో ప్రేరేపించబడ్తుందని మనోవిశ్లేషకుల సిద్ధాంతం.

లైంగికవాంఛను ప్రేరేపించే (ఇరోజినస్ జోన్స్) ప్రదేశాలీ మూడు.

వీటిలో ముందు, ముఖప్రదేశం [Mouth] లో కోరిక మొదలౌతుంది. కొంతవయసొచ్చేవరకూ పిల్లలు తృప్తిని కేవలం నోటిద్వారానే పొందుతారు.

నోరువలన తృప్తి గలిగేదశ కాబట్టి దీనిని ఆస్యదశ [Oral stage] అన్నారు.

తర్వాత, కోరిక గుదమార్గం[Anus] వరకూ పెరుగుతుంది. అప్పటికి మలమూత్రప్రవృత్తుల్ని నిరోధించేశక్తి కలుగుతుంది. క్రమేణాలైంగికవాంఛలు ప్రారంభం అవుతాయి. వయసు షుమారు రెండుసంవత్సరాలకు చేరుకుంటుంది దీన్ని "ఆసనదశ [Anal Stage]" అన్నారు.

ఈ దశలోనే పిల్లలు చిన్న చిన్నపుల్లల్ని మలమూత్ర మార్గాలలో దూర్చుకుందుకు ప్రయత్నిస్తారు. మాటి మాటికీ చేతులను అక్కడకే పోనిస్తుంటారు.

అంటే, అప్పటికి మలమూత్రమార్గాలలో ఉత్తేజం ప్రారంభం అయ్యిందన్నమాట.

అక్కడినించీ జననేంద్రియాలలో కూడా ఉత్తేజం మొదలౌతుంది. ఇది పిల్లలలో నిజమైన లైంగికదశ. [Phallic Stage] అప్పటికి వయసు ఎంతోఎదగకపోయినా, పిల్లలు మానసికంగా బాగా ఎదిగి ఉంటారు,

ఎంతకాదన్నా, అతనెంత పసివాడైనా ఆ రెండు మూడేళ్ళ పసికూనకు తన దృష్టిలో తానోవ్యక్తే!

అప్పుడా చిన్నవాడు తనలో తాను ప్రశ్నించుకుంటాడు.... తానుభవిష్యత్తులో ఎలాంటివ్యక్తిగా తయారవ్వాలని! తల్లిదండ్రుల తోటో, బంధువర్గంతో టో, గురువులతోటో తదితర పెద్దవాళ్ళతోటో తనని పోల్చుకొంటో ఆలోచిస్తాడు. తులనాత్మక పరిశీలన జరుపుతాడు.

కొంచెంనడవడం చాతనైనబాబు పరిగెత్తేందుకు ప్రయత్ని స్తాడు. పరిగెత్తడం కూడా చేతనైతే తాను చాలా ఎదిగిపోయాననుకుంటాడు.

దీన్ని "ఫాలిక్" దశ అంటారు మనోవిశ్లేషకులు. ఇదిబాల్య జిజ్ఞాసాదశ. లైంగికోత్తేజం కొద్దిగా ప్రారంభమవుతుంది.

ఆడపిల్లలు తమకు పురుషావయం ఎందుకు లేదూ....అని ఆలోచిస్తారు. లైంగికపరమైన ఆలోచనలు కుప్పతెప్పలుగా వస్తుంటాయి. కాని, జననేంద్రియాలు, వాటికి సంబంధించిన జ్ఞానం ఇంకా అస్పష్టంగా వుంటుంది. దీన్ని ఫ్రాయిడ్ Latency Period అన్నాడు.

మగపిల్లలు ఉత్తేజితమైన తన పురుషావయవాన్ని చూసి, తనలాగే మానవజన్మ ఎత్తినా, ఆడవాళ్ళకు ఈ అవయవం లేదు కాబట్టి అది తనకొక "వరం" అనుకుంటారు.

అప్పటికే పిల్లలకు తమ శరీరంలోగాని, ఇతరుల శరీరంలోగాని జననేంద్రియాలని స్పృశించగూడదన్న విషయం తెలిసిపోతుంది. దాన్ని "Genital taboo" అంటారు.

వద్దన్నకొద్దీ జననేంద్రియంపైకి చేతులు పోనిస్తారు, ఎంత నిరోధిస్తే అంత అతిగా ప్రవర్తిస్తారు. అవయవాన్ని స్పృశించే కొద్దీ మూత్రాశయంలోనూ (Urinary Bladder) మలాశయం (Bowels) లోనూ నియంత్రణ శక్తి సడలి మలమూత్రప్రవృత్తి అధికం అవుతుంది; బహుశః ఈ కారణం చేతనే పిల్లలు జననేంద్రియ ప్రదేశాన్ని నిషిద్ధ ప్రదేశం "Taboo Area" గా తెలుసుకోగలుగుతున్నారు.

మలప్రవృత్తిని, మూత్రప్రవృత్తినీ తనకు తానే స్వయంగా నిరోధించడంపై పిల్లలు దృష్టిని కేంద్రీకరించడం మొదలు పెట్టిందగ్గర్నించీ, వాళ్ళలో లైంగిక ప్రవృత్తి పెరుగుతుంటుంది.

ఈ దశలో ఆడపిల్లలు తానేదో తప్పు చేయుబట్టి, దానికి శిక్షగా దేవుడు తనకు పురుషావయవం లేకుండా చేశాడని భావించు కుంటారు. తన వయసు మగపిల్లల్లో నిలువునా నిలబడి కనిపించే అవయవం తనకు ఎందుకు లేదనే ప్రశ్న చిన్నారి ఆడపిల్లల్ని నిత్యం వేధిస్తూనే వుంటుంది.

వాళ్ళ ఆలోచనల్లో ఇంకో విచిత్రం వుంటుంది. పైకి తామో పెద్దపులిగానో, సింహంగానో వటిస్తారు. పిల్లలు కాబట్టి ఏవీ అనలేని పెద్దల్ని అంతకుమించి ఏడిపిస్తారు, కాని, నిద్రపోయినప్పుడు, ఆ సింహమో, పులో కలలో కనిపిస్తే "అమ్మబాబోయ్" అంటూ లేచి గుక్కపట్టి ఏడుస్తారు.

ఈ రకం ఆలోచనలనీ లేక భయాల్ని Castration complex అంటారు.

అయినా, ఈ ఆలోచనల్ని వాళ్ళు నిగ్రహించుకోగలుగు తారు. వద్దని మంచిగా చెప్తే మానెయ్యగలిగే నిగ్రహాన్ని కలిగి వుంటారు.

ఈ వయసులో ఈ నిగ్రహం ఎంత ఎక్కువగా వుంటే, ఎదిగింతర్వాత ఆవ్యక్తిలో స్వాయత్తన శాసన శక్తి (Autonomy) అంత తీవ్రంగా వుంటుంది.

అందుకే, మంచి చెడుల తీర్పు వట్ల తమదంటూ ఒక నిర్ణయానికి వచ్చేట్లు పిల్లలను ప్రోత్సహించాలి.

ఎదుగుతున్న పిల్లల చుట్టూ వున్న సామాజిక పరిస్థితులు వాళ్ళ అభివృద్ధిని కాంక్షించేవిగా వుండాలి. పిల్లలకు స్వయం నిర్ణయాధికారం ఇచ్చి, అందుకు తగిన మార్గ నిర్దేశికతను కల్పించడం మన పెద్దల్లో లోపించిన విద్య.

ఈ నాటి యువతరంలో ఇంత అస్థిరతకూ, ఇంత చంచలతకూ కారణం, వాళ్ళ పెంపకంలో చిన్నప్పటినించీ తలిదండ్రులు తగిన బాధ్యత వహించకపోవడమే!

"ఎవ్వరూ స్వతహాగా తెలివి తక్కువ వాళ్ళు కాదు....మనిషి విజ్ఞానం అంతా అతని మనసులోనే వుంటుంది...." అన్నాడు అరిస్టాటిల్.

అందుకే వాళ్ళ మనసు ఎదిగే పనులు చేయడం, చేయించడం అవసరం. పిల్లల్ని దయ్యాల గురించీ, పెద్దపులుల గురించి, శవాల గురించీ భయపెట్టి పెంపకం చేస్తోన్న మన నాయనమ్మల ఆచారాలకు దూరంగా, వాళ్ళ మనసును వికసింపచేసే ప్రయత్నాలు తలిదండ్రులకు తెలీడం లేదు.

కోపం వచ్చిన అమ్మ, అన్నం తిననని మారాంచేసే బాబుని "బూచాడి" కిస్తానని భయపెట్టే కన్నా పుత్ర ద్రోహం వేరే వుందా?

## సృజనాత్మక ప్రేరణలు

ఇంక మూడవ దశకు చేరుకునే సరికి పిల్లలు మానసికంగానూ, శారీరకంగానూ ఇంకొంత ఎదుగుతారు.

ఇది నాలుగైదేళ్ళ వయసున్న పిల్లలకు చెందిన దశ!

"ఈ పనిని నేను ఛ స్తే చెయ్యను—" అనే మొండితనాన్ని సాధించుకుంటారు. ఏ విషయాన్నైనా స్వయంగా సాధించాలనే పట్టుదల పెరుగుతుంది. మెంటల్ పవర్– మానసిక శక్తి దృఢంగా వుంటుంది. లైంగిక పరమైన ఆలోచనలు విచిత్రంగా మొలక లేస్తాంటాయి.

బొమ్మల పెళ్ళిళ్ళు వంటి ఆటలపైన మోజు పెరుగుతుంది.

ఇదంతా బాల్యం! ఇంక నాలుగో దశకు చేరుకునే సరికి 8–10 సంవత్సరాల పిల్లల్ని వయసింక అసలు జీవితంలోకి లాక్కు వెళ్తుంది. కష్టం అంటే ఏమిటో తెలుసుకుంటారు. దాని ఫలితాలు గమనిస్తారు. సమాజంలో తమకు తాముగా ఒక గుర్తింపుని పొందాలనే ప్రయత్నాలు ప్రారంభిస్తారు.

"ముందు నేను—" అనే పోటీకి తలబడతారు. ఈ వయసులో అన్నింటి కన్నా ముఖ్యమైన విషయం, సృజనాత్మక ప్రేరణ (Automobile instinct) పెరుగుతుంది, ఏవేవో యంత్రాలు తయారు చెయ్యాలని ప్రయత్నిస్తారు.

పిల్లలకు ఈ వయసులో చక్కటి ఊహా ఉత్సాహం ఉంటాయి. కారునో, రైలునో నడుపుతున్నట్లు వింత శబ్దాలు చేస్తూ హుషారుగా పరుగెడు తుంటారు.

ఉన్నత పాఠశాలలకు వెళ్ళడం ప్రారంభిస్తారు కాబట్టి కొత్త స్నేహాలూ, కొత్త ఆలోచనలూ, కొత్త రుచులూ తెలుస్తుం టాయి. నిజానికి ఈ దశలోనే వాళ్ళకు సరైన మార్గ దర్శకత

కావాలి, ఇంట్లో తలిదండ్రులు, బయట ఉపాధ్యాయులూ ప్రవ ర్తించే తీరు వాళ్ళ మనసుపైన ముద్రలు వేస్తుంది.

పెద్దలు వాళ్ళ మనోభావాల్ని ప్రోత్సహించాలి. అవసర మైతే సవరించాలే గాని, కాదని హింసించడానికి ప్రయత్నిస్తే, ప్రమాదకరమైన నిరుత్సాహం, నిరాశల పాలిట పడిపోతారు. పసివాళ్ళు

ఇంక ఇక్కడ నించి యవ్వనంలోకి అడుగు పెడతారు పిల్లలు. శారీరిక మానసిక ఎదుగుదలలు కనిపిస్తాయి "ఐదవ దశలో" జీవితంలో రెండో దశాబ్దాన్ని దాటుకు పోతుంటారు.

ఇప్పుడే, "Dating" అనబడే కామ సాహచర్యం ప్రారంభం అవుతుంది. "ఇది సామాజికంగా తప్పులేని లైంగిక కృత్యం అంటుంది ఆధునిక వైద్య శాస్త్రం.

## లైంగికత ఆచరణకు వచ్చేదశ

యవ్వనంలో ప్రథమభాగాన్ని ఎడోల్ సెన్స్-"కిశోరావస్థ" అంటారు, ఇది జీవితంలో నిజమైన విలంబనకాలం. అటు బాల్యమూ కాక, ఇటుయౌవనమూ కాక మధ్యలో వున్న దశ ఇది.

కేవలం ఆడపిల్లల చూపులు సోకితేనే చలించిపోయే స్థితికి ఎదుగుతారు మగపిల్లలు. ఆడపిల్లలూ అంతే! బాహ్యంగా "స్పర్శ"ల వలన లైంగికోత్తేజనం పొందడం ప్రారంభిస్తారు. దీన్ని Necking లేక Petting అంటారు. వాత్స్యాయనుడు ఇలాంటి కృత్యాలను "బాహ్యఆయతనం" అన్నాడు.

బాహ్యఆయతనంలో 1. ఆలింగనం [Hugging] 2, చుంబనం [Kissing] 3. నగ్నత్వప్రదర్శించకుండానేలైంగిక కృత్యానికి తలపడి, ఉత్తేజానికిలోను కావడం....అనే మూడు అంగాలున్నట్లు ఆధునిక మానసశాస్త్రం వర్గీకరించింది.

వాత్స్యాయనుడు బాహ్యఆయతనాన్ని * పదిరకాలుగా వివరించాడు. 1, ఆలింగనం 2 చుంబనం 3. దంతక్షతం, (పళ్ళతో కొరకడం) 4. నఖక్షతం (గోళ్ళతో గిచ్చుకోవడం) 5. సీత్కృతం (మృదువుగాతట్టుట-ప్రవహణనం) 6. పాణిఘాతం 7. సంవేశనం (రతికోసం వివిధభంగిములలో కూర్చోవడం) 8. ఉపసృప్తం [రత్యారంభకకృత్యం] 9. జౌపరిష్టం-(జననేం ద్రియాన్నినోటితో పట్టుకోవడం Fellatio) 10. పురుషాయితం [రతికి తలపడడం]

వీటిని రతిపూర్వకృత్యాలంటారు. వీటికి పునాది కిశోరావస్థ అప్పటికే కొద్ది కొద్దిగా మొలకలేస్తున్న లైంగికభావాలు ఈదశలో ఆచరణలోకి వస్తాయి. ఇది ప్రేమ, ఆనందం అనే రెండు భావాలకు సంబంధించిన విషయం.

ఇది సంభోగానికి ప్రత్యామ్నాయం. సంభోగంవలన కలిగినంత ఆవేశం [Orgasm] కలుగుతుంది.

ఇది మగవాళ్ళలోనే ఎక్కువగా వున్న అలవాటు. ఆడపిల్లలు సాధారణంగా అంత ధైర్యం చైలేరు. ఇది ప్రపంచ వ్యాప్తంగా వున్న ఆచారం.

---

* ఆలింగనం చుంబన దంతకర్మ నఖక్షతం సీత్కృత పాణిఘాతమ్ సంవేశనం చోపసృప్తౌ పరిష్టం నరాయితం చేతిదశాంగ మాహుః

ఈ కిశోరావస్థలో మనసు నిర్మలంగా, ప్రశాంతంగా వుంటుంది. ఉత్తమ ఆదర్శాలతో కూడుకొని వుంటారు పిల్లలు. పెద్ద అయినాక ఏవేవో సాధించాలని కలలు గంటుంటారు. సమాజమూ, సహజీవనమూ అనేవదాలమీద ఆసక్తి కనబరుస్తుంటారు. రకరకాల ఆశయాలూ, ఆలోచనలమధ్య ఉక్కిరి బిక్కిరి అవుతుంటారు. ఈ వయసులో తన కన్నా పెద్ద వాళ్ళతో స్నేహాలూ, వారి ప్రోత్సాహమూ లభిస్తే పిల్లలు హుందా తనాన్ని పెంచుకోగలుగుతారు.

వీళ్ళే-రాబోయేతరానికి కాబోయే రాజులు.

ఈ యాంత్రిక యుగంలో మనలేతయువ్వనులు యంత్రంలా మారకుండా వుండాలంటే, వాళ్ళలో జీవితం పట్ల, భవిష్యత్తు పట్ల ఆశను చిగురింప చేయాలి. సమాజంమీదా, అందులోని కుళ్లుమీదా వాళ్ళకు పూర్తి అవగాహన కలుగ చెయ్యాలి. ఉన్న సత్యాన్ని నిర్మొహమాటంగా వాళ్ళకు బోధ పరచాలి.

ఉన్నత ఆశయాలను ఉద్బోధిస్తే, గ్రహించి, అర్థం చేసుకొని, ఆచరించగలిగే వయసది. మన సమాజంలో ఈకిశోరులు [Adolescents] బంగారంలాంటి అవకాశం అనదగిన ఈ లేత యువ్వనంలోనే అశ్రద్ధ చేయబడడం విచారకరం.

## కామాన్ని సేవించే కాలం

లేతయువ్వనం లోంచి ఎదుగుతోన్న పిల్లలు అసలైన కామసేవితకాలం-యువ్వనంలోకి చేరుకుంటారు. సంతానోత్పాదక శక్తి [Generating Power] ప్రారంభం అవుతుంది.

రజస్వల అయిన ఆడపిల్లని "మెనార్కి" అంటారు "మెనార్కి"కు ముందే స్తనాల పెరుగుదల కనిపించినా, అప్పటి నించీ త్వరితంగా ఎదగడం ప్రారంభిస్తాయి. నెలనెలా రజస్సు స్రవిస్తుంటుంది.

ఆడపిల్ల రజస్వల కావడంతోటే అమ్మానాన్నలు పెళ్ళి ప్రయత్నాలు ప్రారంభిస్తారు. ఈ తొందరపాటు తనాన్ని అటు ఆధునిక వైద్యశాస్త్రం కూడా ఖండిస్తోంది. బాల్య వివాహాలు శాస్త్రి క్రమైనవిగా చలామణి అయిన మన దేశానికి ఇంతటి దారుణమైన అలవాటు ఎలా సంక్రమించిందని నిలదీస్తే మన పెద్దలు ఇవాళ సమాధానం చెప్పేందుకు సిద్ధంగాలేరు.

"యౌవనం" అనేది కామాన్ని సేవించే కాలాన్ని సూచిస్తుంది. "యువా" అనేధాతువుకు పడుచువాడని అర్థం. ఇంకొన్ని ధర్మశాస్త్రాలైతే అర్ధకామాల్ని ఇప్పుడే అనుభవించాలి-అని నిర్దేశించిన సంఘటనలున్నాయి.

వాత్స్యాయనుడు "కామంచయౌవనే" అని ఒక సూత్రాన్ని చెప్పాడు .యౌవనంలోనే కామాన్ని సేవించాలని సూచించాడు. యౌవనాన్ని Puberty అంటారు.

ప్యూబర్టీ అనేపదం ప్యూబిస్ మీంచి వచ్చింది. నాభికీ, జననేంద్రియాలకూ మధ్యగల ప్రాంతం ప్యూబిస్. ఇక్కడ పెరిగే రోమాలని "ప్యూబిక్ హైర్" అంటారు. ఈ రోమాలు యవ్వనంలోకి అడుగు పెట్టిన వారిలోనే కనిపిస్తాయి. వీటి పెరుగుదల మొదలయ్యిందంటే, పిల్లలు పెద్ద వాళ్ళయ్యారని గుర్తించాలి. వాళ్ళను "ప్యూబ్ సెంట్స్" అంటారు.

ఈ కోమాలనను సరించే మగపిల్లల్లో నూనూగు మీసాలూ, ఆడపిల్లల్లో స్తనవృద్ధీ కనిపిస్తాయి. అప్పటికే ఆడపిల్లలు "పక్క చూపులు" ప్రారంభిస్తారు. అది ఆవయసు ప్రాథమిక లక్షణం.

కొంతమంది ఆడపిల్లలు యవ్వనానికి (మెనార్కె) ముందే మానసికంగానూ, శారీరికంగానూ ఎంతో ఎదిగినట్లు కనిపిస్తారు. కొంతమందికి ఇరవై ఏళ్ళొచ్చినా స్తనాలు ఎదగవు. [Secondary Sexual Characters] పెరగకపోవచ్చు. దీన్ని "లేట్ ప్యూబర్టీ" అంటారు. ఇదీ ఒక రకం వ్యాధి విశేషమే!

స్నేహం, వంటరి తనం అనే రెండు ధర్మాలు ఈ వయస్సుల్ని బాగా ప్రభావితం చేస్తాయి. భావాలలో ఎటువంటి మనోవికారాలూ లేనివాడు స్నేహ ధర్మాన్ని పాటించగలడు. కాంప్లెక్సులున్న వ్యక్తి స్నేహితులు లేనివాడై, వంటరితనంలో మగ్గుతూ, ఈ సమాజంలోంచి విడివడి ఊలిపికట్టలా తయారౌతాడు.

ఈ వయసులోనే లైంగికంగా నిజమైన "జనిటాలిటీ" వృద్ధి చెందుతుంది. ఆడ-మగ "భావం" పెరుగుతుంది. మనసు సెక్సు మీదికి లాక్కుపోతుంటుంది. ఆకలికన్నా సెక్సు ఎక్కువగా మండిం చేస్తుంటుంది.

ఆడవాసన తగిలితే చాలు లైంగికోత్తేజం కలుగుతుంది. లింగోత్థాపన కలుగుతుంది. ఇంకా అప్పటికి అందరికీ స్ఖలనం కావడం ప్రారంభించక పోవచ్చు. మగవాళ్ళు మాత్రం తేలికగా తమ సెక్సు భావాల్ని బైట పెడ్తుంటారు.

ఒక యువకుడి చెయ్యంత దూరంలో నిల్చున్న ఒక ఆడ పిల్లకు వెంటనే "కోరిక" జనిస్తుంది. కాని, ఆడవాళ్ళు తమ కోరి కని అంత త్వరగా బైటపెట్టరు.

ఏమైనా ఈ దశలో లైంగిక కృత్యాలకు తలవడే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలున్న వ్యక్తులు కొంచెం నెమ్మదిస్తే మంచిది.

చరకుడు—"ఆయువును కోరే స్త్రీ పురుషులు పదహారు సంవత్సరాలకు పూర్వం, డెభ్భై సంవత్సరాల అనంతరం సంభోగం చెయ్యకూడదు-అందువలన ఆయువుక్షీణిస్తుంది...." అని చెప్పాడు.

అతి బాల్యంలోనే సంభోగానికి తలబడితే, శరీరధాతువులు ఇంకా అప్పటికి సంపూర్ణంగా పుష్టి నొందక పోవడం చేత, కొద్ది నీళ్ళు కల సరస్సు కొంచెం ఎండకే ఎండిపోయినట్లు, ధాతువులు క్రమంగా క్షీణించి బలం, ఆరోగ్యం నశించిపోతాయి....అని చెప్పాడు చరకుడు. *

దురల వాట్లకు ఎక్కువ అవకాశంవున్న ఈదశలోనే అనేక మందిలో హేతువాదం వేపూ, నాస్తికత్వం వేపూ మొగ్గు ఎక్కువగా కనిపిస్తుంది.

ఇంక, యవ్వనంలోంచి తరుణ వయస్కు [Adults] లౌతారు యువకులు. ఇది ఏడవ దశ.

---

* "ఆయుష్కామో నరః స్త్రీభిః సంయోగం కర్తు మర్హతి!
అతిబాలోహ్య సంపూర్ణ సర్వధాతాః స్త్రియో వ్రజన్॥

[చ. చి. అ. 2]

వాళ్ళకు ఉత్పాదక శక్తి సంపూర్ణంగా వుంటుంది. మనసు పరిపక్వత నొందుతుంది. సంఘం పట్ల తమ బాధ్యతను గుర్తిస్తారు. అలా గుర్తించగల శక్తి వున్న వ్యక్తుల అవసరం సమాజానికెంతో వుంది. అలాగే, అతని పరిపక్వతకూ కొంత మార్గదర్శకత, మరింత ప్రోత్సాహం ఈయాల్సిన బాధ్యత కూడా ఈ సమాజం గుర్తించగలగాలి.

తరుణావస్థ తర్వాత పరిపూర్ణ మానవుడిగా రూపొందుతాడు మనిషి. అప్పటికి మనిషి చివరిదైన ఎనిమిదవదశకు చేరుకుంటాడు.

సంసార బాధ్యతలూ, మృత్యు ప్రేరణ [Death Insti ncts ] విసుగూ, విరక్తి [Asexuality] ల నెదుర్కొంటాడీ దశలో! డబ్బులేని వాడికిది "శనిమహద్దశ!"

ఇక్కడికి చేరుకున్నాక మనిషికి భవిష్యత్తుపట్ల విపరీతమైన భయం కలుగుతుంది. ముందుకు తొంగి చూస్తాడు. ఎంత వెదికినా లేదు సుఖం-లేదు సుఖం-లేదు సుఖం జగత్తులో....అనే అనిపిస్తుంది!

# 2 తల్లిదండ్రులతో అనుబంధం

మన కుటుంబాలలో తండ్రికి-కూతురికి, తల్లికి-కొడుక్కి సాన్నిహిత్యంఎక్కువగా వుండడం గమనించేవుంటారు చాలామంది. అమ్మకు కొడుకుమీదా, నాన్నకు కూతురుమీదా మమకారం

ఎక్కువగా వుంటుంది. ఈకారణంచేతనే అన్నాచెల్లెళ్ళమధ్య చిన్న చిన్న తగాదాలు చెలరేగటం కూడా కద్దు.

పెద్దల మమకారాలలోవుండే ఈవ్యత్యాసాన్ని ఆసరాగా తీసుకొని రెండు మూడేళ్ళ వయసున్నసుపుత్రుడు, తండ్రిస్థానంలో తానున్నట్టు, తాను తండ్రికన్నా తల్లికి లైంగికంగా ఎంతో చేరువలోవున్నట్టూ భావించుకుంటాడు. అలాగే, తండ్రిపట్ల విపరీతమైన అనురాగాన్ని పెంచుకున్న రెండుమూడేళ్ళ పుత్రిక తల్లికి బదులుగా ఆమె స్థానంలో తానున్నట్టు రకరకాలుగా వూహించుకుంటుంది.

నిజానికివి పిచ్చిఊహలు. పైకివరమ అసహ్యకరమైనవిగా అనిపిస్తాయి. కాని, నూరు సంవత్సరాల మనిషిలైంగిక జీవితానికి పునాది ఈభావన. తలిదండ్రులపట్ల అమితమైన భక్తిప్రవృత్తులు పిల్లలలో పెరగాలంటే ఈఆలోచనలు వాళ్ళలో కలిగితీరాలి! పాల రాతిభవనానికైనా కొండరాతితోటే పునాదులు వేసినట్టు, మనిషి వరమపవిత్రంగా అనుభవిస్తోన్న శృంగారానికి చిన్ననాటి ఈఅనుభవాలే ఆసరాగా, బాసటగానిలుస్తాయి. ఎంతవిచిత్రమైన అనుభవాలతో సెక్సు మనిషిని నడిపిస్తోంది....!

తలిదండ్రులపైన లైంగిక భావాలు కలగడాన్ని "ఎడిపస్ కాంప్లెక్స్" అంటారు, అది పరమతుచ్ఛమైన, నీచమైన మానసిక వికారం. దాన్ని అభంశుభం ఎరుగని భగవత్స్వరూపులైన పసిపాపలకు అంటగట్టి ఫ్రాయిడ్ మాతృద్రోహంచేశాడని చాలామంది అతన్నివెలివేశారు. తలిదండ్రులతో పిల్లలకు అక్రమ సంబంధాన్ని అంటగట్టిన వ్యక్తిగా ఫ్రాయిడ్‌ను చరిత్రహీనుణ్ణిచేశారు.

కాని, పెద్దలలోవుండే అన్నిమనోవికారాల్నీ పిల్లలుచిన్న వ్వుడే రుచిచూస్తారనీ, అది ప్రకృతిసహజం అని వాదించాడు ఫ్రాయిడ్.

## అమ్మానాన్నలమీద లైంగికవాంఛలు

పిల్లలకు ఏమీతెలీదని అమాయకంగా కనిపించే వాళ్ళ ముఖాలను చూసిమోసపోతారు చాలామంది. కాని, పిల్లలను మించిననటులు లేరు.

ఏదైనా ఒక విషయాన్ని గోప్యంగా వుంచదలుచుకున్న పిల్లలనించి ఆ రహస్యాన్ని రాబట్టాలంటే, అదిభగీరథప్రయత్నమే అవుతుంది.

రహస్యంగా సాధించుకున్న ఏవిజ్ఞానం అయినా పిల్లలలో చాలా నిగూఢంగా వుంటుంది. అలా తమకు తెలిసిన విషయాలలో సత్యాసత్యాలను వెదికేందుకు ప్రయోగాలు మొదలుపెడతారు అందులో అమ్మనాన్నల్ని అనుకరించడం ఒకటి అది కేవలం అనుకరించే ప్రయత్నమే! అలాచెయ్యడం తప్పనే సంగతి వాళ్ళకు తెలీకపోదు లేకపోతే వాళ్ళు దాన్నిరహస్యంగా ఎందుకాచరిస్తారు?

అయినా పిల్లలకెంత తెలిసినా, వాళ్ళసెక్సుభావాలు వేరూ, పెద్దల ఆలోచనా సరళివేరూ! పెద్దల కోర్కెలలోవున్న స్వార్థం పిల్లల్లో కనిపించదు. పెద్దలఆలోచనల్లోవున్న కుళ్ళు పిల్లలలో దొరకదు.

పిల్లలు ఒక విషయాన్ని అర్థంచేసుకున్నంతరీతిగా దాన్ని వంటపట్టించుకోలేరు. ఉదాహరణకు ఆక్సిజన్ తయారుచెయ్యడం ఎలా.... అన్న విషయాన్ని బాగా బట్టీయంపట్టిన ఓఅబ్బాయిని అడిగితే, అతను గడగడా అప్పజెప్పెయొచ్చు. అతనికే కావలసిన పరికరాలనిచ్చి తయారు చెయ్యమంటే అది వాడివల్లకానిపని అవుతుంది. ఎందుకనంటే, వాడికి తెలిసిన విషయమే అయినా, అదివాడికి వంటపట్టలేదు. అలా వంటపడితేనే ఆవిషయంలో వాడికి సంపూర్ణమైన "ప్రాక్టికల్‌నాలెడ్జి" వున్నట్టు.

సెక్సూ అంతే! పిల్లలకు సెక్సుగురించి బోల్డెడంత తెలిసి వుండవచ్చు. కాని, ఇంకా భావపరిణతి నొందని అచిన్నారి హృదయాలకు "కీహోల్స్" వంటిరకరకాల రహస్యమార్గాల ద్వారా "సెక్సు విషయాలదర్శనం" అయినప్పుడు, అదోరకం వింతఅనుభూతిగానే తోస్తుందా క్షణానవాళ్ళకి. అంతకుమించి ఆలోచించలేరువాళ్ళు.

పిల్లలు ఐదేళ్ళు దాటితేనేగాని సాధారణంగా, హస్తప్రయోగాది కృత్రిమ కృత్యాలకు అలవడడంజరుగదు. అయితే, వీళ్ళలో లైంగికభావాలు ప్రేరేగడానికి పెద్దలు చేసుకునేపనులు చూడడం ఒక్కటే కారణం అనడానికి వీల్లేదు. పిల్లలకు ఇంట్లోవాళ్ళతోవుండే అనుబంధాలుకూడా వాళ్ళమీద ఎంతోప్రభావాన్ని చూపిస్తాయి. తల్లిదండ్రుల పాత్రేఇందులో ఎక్కువగావుంటుంది.

## పిల్లలు నిగ్రహాన్ని పాటిస్తారు

బిడ్డపుట్టిన మొదటినెలలో తనంతతానుగా "తల" ను కదిలించే శక్తిని పొందుతాడు. రెండోనెలలో వంగివున్న తలని నిలబెట్ట గలుగుతాడు. "ఊ" లు కొట్టడం ప్రారంభిస్తాడు. నాలుగో నెలలో ఎత్తుకున్నప్పుడు తలని వాలనీయకుండా వుంచగలడు. ఆరోనెలకు కూర్చోవడానికి ప్రయత్నిస్తాడు. ఒకటి, రెండు అక్షరాలమాటల్ని ఉచ్చరించగలుగుతాడు. తొమ్మిదోనెలకుగాని ఏ ఆధారం లేకుండా కూర్చోవడం చేతకాదు "దా దా" అనడంకూడా వొచ్చేస్తుందప్పటికి.

సంవత్సరం పూర్తయ్యేసరికి కూర్చున్నవాడల్లా నిలబడి గోడల్ని పుచ్చుకొని నడవడం ప్రారంభిస్తాడు. రెండక్షరాలమాటలన్నీ స్వంతంగా అనడం చేతనౌతుంది, ఇంకో మూడునెలలకల్లా నడవడం పూర్తిగా వచ్చేసి నాలుగు అక్షరాల మాటలు కూడా అనై గలుగుతాడు.

ఏణ్ణార్థం అయ్యేసరికి మంచాలు, కుర్చీలు తమంతతామే ఎక్కడం ప్రారంభిస్తారు. కళ్ళు, ముక్కు, నోరు వీటిని గుర్తుపట్ట గలుగుతారు. రెండోసంవత్సరానికల్లా పరుగులు తీస్తారు. రెండున్నర ఏళ్ళొచ్చేసరికి వంటరిగానే మెట్లెక్కిదిగటం ప్రారంభిస్తారు, వస్తువుల పేర్లన్నీ క్షుణ్ణంగా తెలిసిపోతాయి.

రెండేళ్ళపిల్లలకు మలమూత్రవిసర్జన సమయంలో ఆనందం ఎక్కువగా వుంటుందన్న సంగతి ఆధునిక మానసశాస్త్రం గమనించింది. సంవత్సరంనరకుగానీ, మలమూత్రవేగాల్ని ఆపగలిగే

శక్తిరాదు. ఈశక్తి వచ్చిందంటే, వాళ్ళలో లైంగిక ప్రేరణలు ఆనందదాయక మౌతున్నాయని గుర్తించాలి.

వాళ్ళగుండెలుచేసే గానంలోనే అనేక మానసిక ఆందోళనలూ, అనంతమైనపిపాసా, అజ్ఞాతమైన భావావేశం అన్నీ మిళితంగా వుంటాయి.

ఏది ఎందుకో వాళ్ళకు తెలీదు. దేన్నికోరుతున్నారో, కోరి ఏంచెయ్యాలో అంతకంటేతెలీదు.

అంతర్గతంగా తమశరీరంలో ప్రవహించే ఆకస్మిక ప్రవృత్తుల్ని [Impulses] తృప్తిపరచుకోవడం ఒక్కటే వాళ్ళకుచేతనైంది.

కోరికతీరితే హాయిగా నవ్వుతారు. కాదు పొమ్మంటే గుక్కపెట్టిఏడుస్తారు. అంతటినిరంకుశత్వంవుంది కాబట్టే వాళ్ళశరీరాన్ని మించిన మనసుచేసే అలజడికి పిల్లలు తట్టుకోగలుగుతున్నారు.

కోరికల్ని రెండురకాలుగా మనం విభజించుకుంటే........ ఒకరకం వాంఛలు ఆ క్షణాన్నే వాటిని సాధించు కోవలసిందిగా వాళ్ళను ప్రేరేపిస్తాయి. ఇంకో తరహా మనసులో వుండలేక లోపలి భావాలులోపలే అణిగిపోతుంటాయి,

పిల్లలలైంగిక భావాలు ఈరెండో కోవకు చెందినవి. ఈ కోర్కెలు మనసు దాటిబైటకురావు. అంటే పిల్లలు మనకన్నా ఎక్కువ నిగ్రహాన్ని పాటిస్తున్నారనమాట!

పెద్దల కోరికలు బలంగానూ, తీవ్రంగానూ వుంటాయి. బాలలవిషయంలో కోరికలు చిరకాలం నిలవవు. అథవా నిలిచినా, అంతగా వాళ్ళనిబాధించవు. కాబట్టి భావనియంతణ (Repression), మనో నిగ్రహం అనేవి పిల్లలకు సుసాధ్యంగా వుంటాయి.

అంతేకాదు, ఈ చిట్టిపావలూ- బాబులూ తమ తలిదండ్రుల పట్ల పెంచుకున్న "వక్ర ప్రమకారం" మన సామాజిక పరిస్థితుల రీత్యా చెల్లదు కాబట్టి, ఆ కోరిక తీరేదికాదు. కాబట్టి వాటిని తప్పని సరిగా అణచుకోవాల్సి వుంటుంది. అందునా, పిల్లలకోరికలు అవి జనించినంత తీవ్రంగా తీరేవిషయంలో పట్టుబట్టి కూర్చోవు కాబట్టి నిగ్రహం వాళ్ళకు ఈజీయే అవుతుంది.

అలా ఆచరణ సాధ్యంకాని కోరికలు, తత్ఫలితంగా ఏర్పడిన నిగ్రహం .. వీటివలన తల్లిపట్ల మాతృభావం, తండ్రిపట్ల పితృభావం బలంగా నాటుకుపోతాయని ఫ్రాయిడ్ సిద్ధాంతీకరించాడు. వయసు పెరుగుతున్నకొద్దీ అమ్మానాన్నలలో గౌరవ ప్రదమైన అనుభంధాన్ని క్రమేణా ఏర్పరచుకోగలుగుతారు. ఇది గొప్ప భావ పరిణతిగా మనం చెప్పుకోవాలి. అది కేవలం నిగ్రహం వలనే సాధ్యం అవుతోంది.

చిన్నప్పుడు పిల్లలు తలిదండ్రులతో లైంగిక భావాలు పెంచుకోనుండక పోయినట్లయితే, ఈ సమాజంలో మాతృత్వానికి, పితృత్వానికి తావేవుండేది కాదని ఫ్రాయిడ్ వాదించాడు. ఇవ్వాళ మనం అమ్మానాన్నల్ని గౌరవిస్తున్నామంటే చిన్నప్పటి మన సెక్సు భావాలనే జారుడు మెట్లని నిగ్రహం అనే అయు

ధంతో మన పురోగమన పథంలోంచి తొలగించేసుకో గలిగామన్న మాట. అయినా పిల్లలమనసుల్లో, అంతరాంతరాళంలో ఏదో మూల లైంగిక ప్రవృత్తి మూల్గుతూనే వుంటుంది. ఊహ పూర్తిగా తెలిసేవరకూ దాని ప్రభావంనుంచి దూరంగా పోలేరు పిల్లలు. ఒక వైపు గౌరవిస్తూనే ఇంకో వైపునించి దొంగతనంగానైనా వక్రంగా ఆలోచిస్తారు.

ఇలామనం చెప్పుకుపోతే, తల్లి తండ్రులమీద కోరిక పెంచు కున్న బిడ్డల లైంగిక భావాల్ని పెద్దల సెక్సంతచేసి ఆలోచిస్తే, పిల్లల్నిమించిన గూండాలు మనకు కనిపించరు. అదికేవలం "అవిద్య" చేత సంభవించేదిగా ఫ్రాయిడ్ ఒప్పుకోలేదు, ఆయన వర్ణించిన సెక్సు సంభోగ సంబంధమైందీ. సంభోగ యోగ్యమైందీ కాదు కాబట్టి, పిల్లల్లో సహజంగా జనించే ఈ కోరికల్ని కేవలం ఆనందానుభూతులుగా మాత్రమే గ్రహించవలసి వుంటుంది. పిల్లలు తల్లిదండ్రులతోటి వ్యభిచరించడంలేదు.

ఆ మాటకొస్తే, తల్లికూడా పొత్తిళ్ళలో వున్న తనబిడ్డకు పాలిచ్చేవప్పుడు, భర్తతో మైథునంలో పాల్గొన్న తృప్తిని అనుభవిస్తుంటుంది. బిడ్డ స్తన్యాన్ని గ్రోలుతుంటే, ఆతల్లి తన పతితో గడిపిన మధుర స్మృతుల్ని మననంచేసుకొంటుంటుంది.

దీన్ని తల్లిచేస్తోన్న వ్యభిచారంగా భావించగలమా? ఇక్కడకూడా సెక్సుఅనేది ఒక సుఖానుభూతి మాత్రమే! తల్లి ఆసుఖానుభూతిని బిడ్డకు పాలీయడంవలన పొందుతోంది. అది తల్లిజరిపే హస్తప్రయోగం ఎంతమాత్రమూ కాదు.

ఈ రెండు క్షణాల సుఖానుభూతికాలంలో ఏతల్లి అయినా ఆ బిడ్డని తన భర్తగా భావించుకోగలదా? అలాగే పిల్లలూనూ........! పిల్లల మనసుల్లో కూడా ఇలాంటి సుఖానుభూతులే జనిస్తాయి. ఈ అనుభూతి ఏర్పడడం భవిష్యత్తులో ఏర్పడనున్న లైంగికతకు అంకురార్పణ మాత్రమే.

తమ లైంగిక భావాలని తమకు బాగాదగ్గరగా వున్న పెద్దలమీద ముందు ప్రయోగించుకుని అది ఆచరణ సాధ్యంకాక నిగ్రహించుకోవాలని ప్రయత్నిస్తారు పిల్లలు. ఫలితంగా పెద్దల మీద ప్రేమ మునుపటికన్నా ద్విగుణీకృతమౌతుంది.

ఇలా తాత్కాలికంగా అణిగిపోయిన సెక్సు(సుఖానుభూతి)లో రెండు అంశాలుంటాయి. ఒకఅంశ క్రమేణా రూపాంతరం చెంది పెద్దలభక్తిగా మారుతుంది. మరొకఅంశ, పరిణామాన్నొంది అసలైన సెక్సుగా రూపొందుతుంది!

## పెద్దల నెందుకు గౌరవించరు?

ఐదారేళ్ల వయసొచ్చేసరికి, పిల్లలు సహజీవనం నేర్చుకుంటారు. ఈ సహజీవనంలో కొన్ని కొత్త విషయాలు వాళ్ళకు తెలుస్తుంటాయి. తమకు తెలిసిన విషయాలను యథాతథంగా అనుకరించడానికి ప్రయత్నిస్తారు పిల్లలు.

వాళ్ళ ఆలోచనల్ని ప్రభావితం చేసేది ముఖ్యంగా కుటుంబ విషయాల్నే అందుకని, లేత హృదయాల్ని దెబ్బతీసే పరిస్థితులు ఇంట్లో కల్పించకూడదు. ఆవయసులో బలంగా ముద్రపడిన

విషయాలు జీవితాంతం అలాగే వాళ్ళ మనసుల్లో నిలిచిపోతాయి. రకరకాల మనోవికారాలకు ఇవే కారణం అవుతాయి.

పిల్లలు అనుకరించే విషయాలనుబట్టి కుటుంబ వ్యవహారాలను అంచనా వెయ్యొచ్చు మనం. ఒక మిత్రుడు ఒక జోక్ చెప్తుండేవాడు, ఆడపెత్తనం వున్న ఓ కుటుంబంలోని ఓ బుజ్జి పాపాయిని పిలిచి, మీ అమ్మానాన్నల బొమ్మ వేసి చూపించమన్నాడట ఆయన. ఆ పాపాయి వాళ్ళ నాన్న ముఖానికి చిన్న సున్నాచుట్టి, ఏడుపుమూతిపెట్టి పైన పిలక పెట్టిందిట. వాళ్ళమ్మ ముఖాన్ని మాత్రం పెద్ద సున్నాతో వేసి భయంకరమైన కళ్లూ, బారచాచిన నాలుకా వేసిందిట.

ఈ కథనుబట్టి ఆ ఇంట్లో ఆడపెత్తనం, తండ్రి అసమర్థత, తల్లి దురుసుతనం వంటి విషయాలు ఆ పసిపిల్ల హృదయాన్ని బాగాకుదిపివేశాయని మనం ఊహించవచ్చు.

ఇంకొందరు తండ్రులుంటారు. తమ మగతనాన్నంతా ఇంట్లో భార్యమీదా, పిల్లలమీదా ప్రదర్శిస్తుంటారు. చీటికిమాటికీ చిర్రుబుర్రులాడుతూ, అయిన్దానికీ, కానిదానికి తిట్టిపోస్తూ చెయ్యి చేసుకుంటూ వినోదిస్తుంటారు.

పిల్లలలో తలిదండ్రులపట్ల ఏహ్యభావం పెరగడానికి పెద్దల ఇలాంటి అహంకారంతో కూడినదురుసుతనమే కారణం. పిల్లలు పెద్దవాళ్ళై, తలిదండ్రులు వృద్ధులయ్యాక, అప్పుడు తమ "పగ"ని తీర్చుకుంటారు పుత్రులు।

పదీ పదిహేను సంవత్సరాల వయసు మధ్యవున్న పిల్లల్లో ఎక్కువ మందికి ఇంట్లోంచి పారిపోవాలనే తలంపు విపరీతంగా వుంటుంది. దీనికి తలిదండ్రుల పెంపకంలో లోపం వుండడమే కారణం ! ఏ విషయంలో ఐనా సరే, వాళ్ళను అంగీకరింపచేసే [Convince] ప్రయత్నాలు జరగాలిగానీ తమకున్న అధికారాలతో పెద్దలు పిల్లల నోళ్లు నొక్కేస్తే వాళ్ళు మానసికంగా చాలా దెబ్బతింటారు.

భయంతో కూడిన భక్తీ, భక్తితో కూడిన భయం అనీ భయం రెండు రకాలు. గురువుగారినీ చూసి భయపడతాం, పెద్ద పులినీ చూసి భయపడతాం, కానీ, పెద్ద వాళ్ళపట్ల గౌరవ భావం కలిగినప్పుడు మనం ప్రదర్శించేది, భక్తితో కూడిన భయం. పెద్ద పులిని చూసినప్పుడుండేది భయంతో కూడిన భక్తి. దానివలన కేవలం భయం మాత్రమే వుంటుంది. ఈ రెండోరకం-భయంతో కూడిన భక్తిని పిల్లల్లో మనం పెరగనివ్వకూడదు. అందువలన చివరికి భయం మాత్రమే మిగిలి పోతుంది. తలిదండ్రుల పట్ల గౌరవం, అభిమానం, ఆత్మీయతలూ కనిపించవప్పుడు.

వాళ్ళంత వయసు వీళ్ళకూ వచ్చాక, ఆ భయం కూడా వుండదు. ఇంక పిల్లలనుంచి పెద్దలు ఆశించేందుకు మిగిలేదేముంది? తాము జన్మ నిచ్చినందుకు కనీసకృతజ్ఞత కూడా పుత్రులనుంచి పొందలేని వయోవృద్ధులైన తలిదండ్రులు గతాన్ని ఒకసారి నెమరవేసుకోవడం కూడా అవసరం.

క్షమించాలి, వృద్ధతరాన్ని దూషించే పితృద్రోహం కాదిది. వార్ధక్యంలో తలిదండ్రులను సరిగా చూడని పిల్లల విషయంలో ఆలోపాన్ని పూర్తిగా కొడుకులమీదే నెట్టినిందించడం అంత సబబుకాదు.

ఏకారణంగానైనా, పిల్లల సున్నితమైన మనస్తత్వాన్ని దెబ్బతీసే ప్రయత్నాలు ఇంట్లో జరిగితే, అప్పటికప్పుడే ఆ "కసి"ని తీర్చుకోలేని పిల్లలు అదేమనసులో వుంచుకొని విపరీతంగా ఆలోచించి ఉన్మాదం, అపస్మారం [Epilepsy] వంటి వ్యాధుల్ని తెచ్చుకోవడం, కాస్త తట్టుకోగలిగిన పిల్లలు ఎదిగాక, పూర్తి శక్తి వచ్చాక, తలిదండ్రులమీద తమ "కసి"ని తీర్చుకోవడం చేస్తుంటారు.

పిల్లల్లో వచ్చే రకరకాల మానసవ్యాధులు, ముఖ్యంగా మూర్ఛ వ్యాధి, ఉన్మాదం, అపస్మారం, హిష్టిరియా, మైగ్రైన్ అనే తలనొప్పి వంటి వాటికి ఇంట్లో పెద్ద వాళ్ళ బాధ్యత తప్పకుండా వుంటుంది. అందుకనే వాళ్ళను గాయపరిచేయత్నాలు చెయ్యవద్దని సత్సంతానాన్ని కోరే తలిదండ్రులకు మనవి!

## పిల్లలకు పిల్లలను కనాలనే కోరిక

పెద్దల సెక్సు తృప్తి నొందాలంటే స్త్రీ పురుషులిద్దరూ కలియాల్సిన అవసరం వుంది. కాని, పిల్లల్లో లైంగికానందం మరో వ్యక్తితో నిమిత్తం లేకుండా, కేవలం తమకుతామే తెచ్చి

పెట్టుకొనే ఉత్తేజంవలన సాధ్యపడుతోంది. దీన్ని "ఆటో ఇరోటిజం" [ఆత్మశృంగారం] అంటారు.

పిల్లలలో శృంగారికత [Eroticism] కేవలం జననేంద్రియాలకు మాత్రమే సంబంధించిందికాదు. శరీరంలో చాలా భాగాలలో లైంగికోత్తేజం వుంటుంది. పిల్లల సర్వ శరీరం ఉత్తేజిత భాగమే. అదిక్రమేణా అభివృద్ధిచెంది పెరుగుతున్న కొద్దీ పటిష్టమైన లైంగిక వ్యవస్థగా రూపొందుతుంది.

ఇది నిరోధించబడిన ఆత్మ శృంగార తత్త్వంవలన సాధ్యపడుతోంది. అంటే ఆత్మశృంగారం పూర్తిగా అడ్డుకోబకడపోతేనే మనుషులు హస్తప్రయోగానికి తలపడతారు. నిరోధించబడిన ఆత్మశృంగారంవలన దంపతులమధ్య కోరిక బలంగా వుంటుంది.

తండ్రిని చంపి, తల్లిని భార్యగా చేసుకున్న ఎడిపస్ అనేరాజు కోరికలు చిన్ననాటి ఆత్మశృంగార తత్త్వం నిరోధించబడక పోవడం చేత కలిగినవే. తల్లితో అతనికున్న లైంగిక సంబంధాల కారణంగా ప్రసిద్ధిచెందిన "ఎడిపస్" పేరనే ఈమనో వికారానికి ఎడిపస్ కాంప్లెక్సు అనిపేరు పెట్టారు. ఈవికారం వున్న వ్యక్తులకి ఆత్మహత్య చేసుకోవాలనే తత్త్వంకుండా వుంటుంది. ఎడిపస్‌రాజు ఆత్మహత్య చేసుకునే మరణించాడు.

షేక్స్పియర్ తన "హామ్లెట్"లో "ఇన్సెస్ట్ కాంప్లెక్సు"గా దీన్ని వర్ణించాడు. "ఇన్‌సెస్ట్స్" అంటే సగోత్రికులు. తన కుటుంబంలోని వ్యక్తులతో-వావీ, వరుసా పాటించకుండా సెక్సు సంబం

ధాన్ని పెంచుకోవడం ఇన్‌సెస్టు కాంప్లెక్సుగా షేక్స్పియర్ వ్రాశాడు.

అయితే, ఈవికారం పిల్లల విషయంలో అత్యంత సహజమైంది. అందుకని, ఫ్రాయిడ్ దీనికి "న్యూక్లియర్ కాంప్లెక్స్" అని పేరుపెట్టాడు. పిల్లలు తలిదండ్రుల మీదపెంచుకొనే లైంగిక వాంఛలే న్యూక్లియర్ కాంప్లెక్స్. అది తలిదండ్రులతో పిల్లలు చేసే మానసిక వ్యభిచారం ఎంత మాత్రముకాదు. చైతన్యంవున్న ప్రతి బిడ్డలోనూ ఇది సహజాతమైన ప్రకృతి.

అలా ఎదుగుతున్న బిడ్డకు రెండు మూడేళ్ళు వచ్చేసరికి ఈ న్యూక్లియర్ కాంప్లెక్సులో కొంత లైంగికత చోటు చేసుకొంటుంది.

అప్పుడా చిన్నారి హృదయంలో కొన్ని ప్రశ్నలుదయిస్తాయి. మనుషులెలా పుడతారు? ఎక్కడినుండి పుడతారు? ఎందుకుపుడతారు?, ఏంచేస్తే పుడతారు?....ఇలా రకరకాల ధర్మసందేహాలు పిల్లలలో.

అక్కడితోటే, ఈ సందేహాలతోటే ఆగిపోతే ఇంత గందరగోళం వుండేదికాదు.

అది క్రమేణా తనూ ఓబిడ్డను కనాలనే కోరికకు దారితీస్తుంది. అప్పుడాబిడ్డవయసు రమారమి 2-4 సంవత్సరాల లోపు వుండవచ్చు.

ఈ దశలో పిల్లలు పాపాయి బొమ్మలనెత్తుకొని అమ్మలు తమనెలా లాలిస్తారో అలాగే జోలపాడుతూ, ఆడిస్తారు. బొమ్మని

అడ్డంగా పడుకోపెట్టుకొని, గుండెలకాన్చుకుని, అమ్మపాలిచ్చి నట్టు తామూ పాలీయడం మొదలు పెడతారు. కాళ్ళమీద ఆ బొమ్మనే బోర్లాపడుకోబెట్టి, పసిపిల్లలకు నీళ్ళుపోసినట్టు పోస్తారు.

ఓణీలు వేసుకోవాలనీ. చీరకట్టుకోవాలనీ మోజు పడతారు. ఇంట్లో అక్కనో లేక, ఇంటిపక్క రెండుజడల సీతనో చూసి వాళ్ళ అలవాట్లన్నీ నేర్చుకుంటారు.

ఇదంతా అమ్మఅంతో అక్కఅంతో త్వరత్వరగా ఎదిగి పోవాలని ఓ తహతహ!

ఈ పిల్లల్ని కనాలనే కోరిక ఓ రెండుమూడేళ్ళున్న మగ పిల్లవాడిలో కలిగిందనుకోండి.... ఆ వయసులో వాడికి స్త్రీ జననేం ద్రియాలగురించిగానీ, వాటి ప్రయోజనాల గురించిగాని, ఏవీ తెలీని పరిస్థితి! ఏవేవో బుద్ధికి తగినవి ఊహించు కుంటాడు.

ఏ పనీ పాటావుండని వయసుకాబట్టి ఆలోచించుకోడానికి బోళ్ళెడంత తీరికవుంటుంది. బుద్ధిపోయినంతదూరం పోతాడు. ఇంట్లోగానీ, అచుట్టుపక్కలగానీ, తన వయసు అడపిల్లలే లేరను కోండి, ఆడవాళ్ళకూతనలాగే పురుషావయవం వున్నదనుకుంటాడు. అధవా, సందర్భవశాత్తూ కొంచెంపెద్దవాళ్ళ జననేంద్రియాన్ని చూడడంతటస్థించినా ఆశ్చర్యపోతాడంతే!

పెద్దవాళ్ళు తనకంటే ఎక్కువ తింటారు కాబట్టి, కడుపు అంత లావౌతుందనీ, ఆ కడుపులోవున్న తిండినేతిని తయారైన పిల్లలు అక్కడే కొంతకాలంపెరిగి, వాళ్ళ గుదమార్గం [Anus] ద్వారానో,

మూత్రమార్గం [Urethra] ద్వారానో బయటకు వస్తారనీ అంచనాలు వేస్తాడు.

అదృష్టవశాత్తూ, పెద్దల రతిక్రీడలు చూడడం తటస్థించిందనుకోండి, అమ్మానాన్నా అధికారం [Over Powering] కోసం కీచులాడుకుంటున్నారనుకుంటాడు.

పిల్లలూ పిల్లలూ వంటరిగా కలిసినపుడు సాధారణంగా చర్చించుకునేది ఈవిషయాల గురించే! మొగుడూ పెళ్ళాలఆట, బొమ్మలపెళ్ళిళ్ళూ వగైరావాళ్ళకు కొంతవరకూ లైంగికవిజ్ఞానాన్ని కలుగచేస్తాయి. తమకంటే వయసులో పెద్దవాళ్ళసాహచర్యం వలన పిల్లలకు చాలా విషయాలు తెలుస్తాయి.

## పెళ్ళికిముందే సెక్సుతెలియాలి!

వాత్స్యాయనుడు " పాగ్యౌవనాత్‌స్త్రీ" అనిఒకసూత్రంచెప్పాడు. స్త్రీలు అన్నివిషయలతోపాటూ కామశాస్త్రిన్నీ యవ్వనానికి ముందే నేర్చుకోనుండాలి—"అన్నాడు. క్రీస్తుకాలం వ్యక్తులనుంచి ఇంతకన్నా గొప్పగా "స్త్రీసమానత్వం" ఆశించలేమేమో....?

యౌవనం వచ్చాక పెళ్ళయిందంటే స్త్రీఅస్వతంత్రురాలై, విద్యావిహీన అవుతుంది కాబట్టి, పెళ్ళికి ముందే స్త్రీకి సకల శాస్త్రిలూ బోధించమన్నాడు.

"కన్యానాం సంప్రదానాంచ కుమారాణాంచ రక్షణమ్" అంటూ మనువు, ఎనిమిదేళ్ళుదాటింతర్వాత ఎవరూ తమ

కుమార్తెను గానీ, కొడుకునుగానీ ఇంట్లోవుంచుకోకూడదు— అనేది జాతినియమం కావాలన్నాడు.

అయిదో ఏడాదినుంచే విద్యాలయానికివంపి (Residential School) అక్కడే చదువయ్యేవరకూ వుంచేయాలి అట్లా పిల్లల్ని వంపని తలిదండ్రుల్ని దండించమన్నాడు.

ఈ రెసిడెన్షియల్ పాఠశాలల ప్రయోజనాన్ని నొక్కి చెప్పిన మనువు అవి సక్రమంగానూ, ఉన్నత సంస్కారులుగానూ పిల్లల్ని తీర్చిదిద్దేట్లు చూడవలసిన బాధ్యతని ప్రభుత్వానికి గుర్తు చేశాడు—

"రాజు మధ్యాహ్నసమయంలోగాని, అర్ధరాత్రులుగానీ మనసు ప్రశాంతంగా ఉన్నప్పుడు మంత్రులతోగానీ, స్వయంగా గాని ధర్మార్థకామాలను గురించి విచారించాలి. తన రాజ్యంలో ఆడపిల్లల పెళ్ళిళ్ళూ, పిల్లలచదువులూ, వాళ్ళవినయవిధేయతల గురించి ఎప్పటికప్పుడు సమాచారాన్ని అందుకొంటూవుండాలి. అప్పుడేరాజు (ప్రభుత్వం) ప్రజారంజకుడనిపించుకోగలుగుతాడు- అన్నాడు.

ఇంక అసలు విషయానికి వస్తే, వాత్స్యాయనుడు ఆడ పిల్లలకు యవ్వనానికి ముందే దాంపత్యజీవితాన్ని దేదీప్యమానం చేసుకొందుకు కామసూత్రాల్ని, అరవైనాలుగు కళల్ని నేర్పించ మన్నాడు. యావద్సంసారం ఆడవారిచేతుల్లోనే వుంటుంది. కాబట్టి ఆమె విద్యావంతురాలౌతే, మొత్తం కుటుంబవ్యవస్థే బాగు పడుతుంది....అని ఆయన అభిప్రాయం.

విజ్ఞానం శక్తివంతమైంది-Knowledge Is Power—అనేది నానుడి. కాని, లైంగికవిజ్ఞానం మహత్తరమైంది-అనేది న్యూనుడి.

యౌవనంలోకి అడుగుపెట్టకమునుపే బాలలకు సెక్సు గురించి తెలియచెయ్యాలి. ముఖ్యంగా మానసిక స్వాస్థ్యరక్షణ [Mental Hygeine] ను వాళ్ళు పాటించేలా చూడాలి.

సెక్సంటే ఏమిటో, భవిష్యత్తులో దానివలన ప్రయోజనం ఏమిటో వాళ్ళకు అర్థంకావాలి. లేకపోతే, సెక్సుసందేహాలకు సమాధానం దొరకని పిల్లలు దానిగురించి అతిగా ఆలోచించి మానసికంగా బలహీనులయ్యే ప్రమాదము వుంది.

ముఖ్యంగా రజస్వలకానున్న ఆడపిల్లలకు అంతకు మునుపే తనకు జరగబోయేదేమిటో తెలిసేవుంటే అందువలన యవ్వనంలోకి అడుగిడే ఆడపిల్లలు భయంనించి కాపాడబడ తారు. జననేంద్రియాలరక్షణ నెలాచేసుకోవాలో, మలినాదుల నుంచి ఎలాకాపాడుకోవాలో వాళ్ళకు పూర్తిగా తెలియడం అవసరం.

అంతేకాదు, పిల్లలకిచ్చే రకరకాల శిక్షణల్లో, గొప్పవాళ్ళ చరితలు చెప్పడం, దేశభక్తిపూరితమైన భావాలు రేకెత్తేవిధంగా వాళ్ళను తయారుచెయ్యడం ముఖ్యం.

పొరబాటుగానైనా "ద్వేషం," "అసహ్యం" అనే భావాలు పిల్లలలో కలగడంచాలా ప్రమాదకరం. ప్రేమించే

వయసది. ప్రేమించబడేవయసది. ఆ వయసులో పిల్లల నోటి వెంబడి కుళ్ళు కుష్టు వంటి పదాలు ఉచ్చరించబడకూడదు. సమాజంలోని నైరాశ్యాన్ని పిల్లలకు నూరిపోసినందువలన వాళ్ళలో వ్యతిరేకభావాలు పెరగడంతప్ప సాదృశగుణం లోపిస్తుంది.

"Ethos Of Action"—ఆదర్శపూర్వకమైన పద్ధతుల్లో వీరరసయుక్త శిక్షణలో పిల్లలు పెరగాలి.

కాని, ఈ యుగపుయాంత్రికతకు పిల్లలుకూడా బలైపోతున్నారు. కారల్‌మార్క్స్ చెప్పిన "క్రాఫ్ట్‌ఇడియసీ"—అమాయక శ్రామికత—మనపిల్లల్లోనూ పెరిగిపోతోంది.

ఈ చదువులూ, ఈ గురువులూ, ఈ ఆలోచనలూ ఇవన్నీ జాతిని నిర్వీర్యం చేసేస్తోన్నాయి. దీనికి పరిష్కారం లేదా?

# 3. శిశువులు నోటిలో వ్రేలెందుకు వేసుకుంటారు?

శృంగార భావాలను రెచ్చగొట్టే చోట్లను "ఇరోజినస్ జోన్స్" (కామస్థానాలు) అంటారు. ఈరోస్ (EROS) అనేవాడు మన్మథుడి వంటి ఓ గ్రీకుల ప్రేమదేవత. అతడి పేరనే శృంగారానికి "ఇరోటిజం" అని పేరు వచ్చింది. "ఇరోజినస్ జోన్" అంటే లైంగికానందాన్ని ప్రేరేపించే కొన్ని నాడుల కలయిక!

[Transform]. ఇదేకాదు, పిల్లల ఏ సుఖానుభూతైనా సెక్సువల్ ప్లెజర్ గా మార్పిడి నొందవలసిందే.... అన్నారు.

అయితే, ఫ్రాయిడ్ మరోచోట, "అందరు వ్రేలు చీకే పిల్లలూ ఈ అలవాటు వలన ఆనందాన్ని పొందుతున్నారను కోవడానికి వీల్లేదు, అది కేవలం ఒక అలవాటు మాత్రమే కాబట్టి, అందులో సుఖానుభూతి వుండాలని లేదు, ఇలాంటి పిల్లల్నందర్ని సెక్సుగాట కట్టేందుకూ ఆవకాశంలేదు—" అన్నాడు.

ఫ్రాయిడ్ ప్రకటనల్లో ఈ విధమైన వైరూవ్యత మనకు కనిపిస్తుంది. సుఖానుభూతి లేనిదే ఏదైనా ఒక అలవాటు ఎలా సంభవం అని మనం అడగొచ్చు. ఇక్కడ, ఒక ఉదాహరణను పరిశీలించండి....

పొగత్రాగే అలవాటున్న వాళ్ళంతా, పొగత్రాగడంలోని ఆనందాన్ని పొందుతున్నారనగలమా....? దాహం అవుతోన్నా సిగరెట్ త్రాగుతారు, ఆకలి అయ్యేప్పుడూ త్రాగుతారు. గుండెల్లో మండుతోన్నా త్రాగుతారు. అలా త్రాగుతోన్నప్పుడు కళ్ళు తిరిగి నట్లయినా, వొళ్ళు తూలినా భరిస్తారు. సిగరెట్ మాత్రం ఆర్పరు. ఇది ఆనందం, తృప్తి వగైరాల కోసం కాదు. దాన్ని "సిగరెట్ బానిసత్వం" అనాలి. పిల్లలు అదే పనిగా నోట్లో వ్రేలు వేసుకుని చప్పరించడమూ అంతే!

## ఆకలి తీర్చుకోవడానికి !

జననేంద్రియం కామస్థానాలలో [Erozinous zone] ముఖ్యమైంది కాబట్టి, దాన్ని గురించిన ఓ అస్పష్ట జ్ఞానం ఇదో ఏటికే లభించి వుంటుంది కాబట్టి, చేతులక్కడికే పోతుంటా యెప్పుడూ.

పసి పిల్లలు జననేంద్రియాలలో పుల్లలు దూర్చుకోవడం, హస్తప్రయోగం అంత ఘాటైన పదం వాడవలసినంత నేరంకాదు. అందులో కొంత అజ్ఞానం, కొంత సుఖానుభూతీ మిళితంగా వుంటాయి. అలా చెయ్యడం తప్పని వాళ్ళకు నచ్చేట్లుచెబితే ఆ పని చెయ్యరింక పసికందులు. అది వాళ్ళ నిజాయితీ!

వ్రేలు చీకే అలవాటూ ఇలాంటిదే. ఈ అలవాటుని త్వరగా మానుకోలేని పిల్లలు ఎదిగిం తర్వాత హస్తప్రయోగానికి ఎక్కువగా అలవడతారు.... అని ఫ్రాయిడ్ గమనించాడు.

ఆకలి కలగంగానే మాతృస్తనాల కోసరం పసిగుడ్డు కూడా వెదుకులాట ప్రారంభిస్తుంది. స్తనచుబుకం నోటికి తగలగానే చప్పరించడం మొదలు పెడ్తుంది. ఇది "స్ట్రగుల్ ఫర్ ఎగ్జిస్టెన్స్" లో ఆకలి తీర్చుకోవడానికి మనిషి జరిపే మొట్ట మొదటి పోరాటం. ఈ "ఆకలి కోరిక" తీరనప్పుడు, పిల్లలు స్తనాగ్రాన్ని పోలిన తన బొటన వ్రేలిని నోట్లో వేసుకు చప్పరి

## యవ్వనంలోనే ఆడామగా నిర్ధారణ

అంటే, ఒకవ్యక్తి ఆడా-లేక మగా....అని నిర్ణయించాలంటే యవ్వనంవచ్చేవరకూ ఆగాల్సివస్తుంది. ఎందుకంటే, పురుషరూపం వున్న ఒకవ్యక్తి ఐక్య ప్రవృత్తి స్త్రీమార్గాన పయనించడం మొదలు పెట్టే అతను మానసిక నపుంసకుడౌతాడు.

నిజమైన నపుంసకులు [Eunachs] ఏ దసరాకో సంక్రాంతికో తుమ్మెదపదాలు చెప్పుకొంటూ, విచిత్రవేష ధారణలతో బజార్లలో మనకు కనిపిస్తుంటారు. వీళ్ళుకాక, పైకి కనిపించని రకరకాల మానసిక నపుంసకులు మనమధ్యనే చాలా మంది వున్నారు. వాళ్ళని చికిత్సద్వారా మార్చేందుకు అవకాశం లేకపోలేదు.

ఈ వివరణల సారాంశం ఏమిటంటే, చిన్నప్పుడు వంటరిగా మొదలైన ప్రవృత్తులు లైంగికతలేని సెక్సును పిల్లలలో ప్రారంభిస్తాయి. కొంచెంఎదిగాక, సెక్సువిషయమై వాళ్ళలో అస్పష్టమైన ఆలోచనల్ని రేకెత్తిస్తాయి. ఇంకా ఎదిగాక, ఆఖరికి సెక్సంటే తానోనిర్ణయానికి వచ్చేసమయానికి ఈ ఇంపల్సులన్నీ ఏకమైఒకే ఐక్యప్రవృత్తి ఆధీనంలోకి వచ్చేస్తాయి. అందుకు మనిషికి సరిగ్గా ఒక యవ్వనకాలం పడుతుంది.

నోట్లో వ్రేలుందన్న జ్ఞానంకూడా వుండదు వాళ్ళకి. పదిహేనిరవై సంవత్సరాలు వచ్చే వరకు కూడా ఈ అలవాటుని వదులుకోలేని వ్యక్తులున్నారు.

## లైంగికానందంగా మార్పిడి

డేవిడ్సన్ (1967) ఈ వ్రేలు చీకడాన్ని పిల్లలలో ఏదో వ్యాధి విశేషంగా భావించి ఖంగారు పడవద్దన్నాడు. ఈ అలవాటు వున్న పిల్లలికీ, లేని పిల్లలికీ శారీరికంగా గానీ, మానసికంగాగానీ ఏవిధమైన తేడా కనిపించలేదు. దానిని బలవంతాన నిరోధింప చేసినా క్రొత్త రోగలక్షణాలు రాలేదన్నాడు డేవిడ్సన్.

ఈ వ్రేలు చీకడం వలన ఎదుగుతున్న పళ్ళలో అవలక్షణాలు కలగవచ్చని కొందరంటారు. కాదు, పళ్ళు ఇంకా గట్టిపడి, సమంగా ఎదుగుతాయి .... అని మరికొందరు! ఇది వివాదాస్పదమైన విషయం.

దానికి మనోవిశ్లేషకులు చెప్పిన సమాధానం ఏమిటంటే:

పిల్లలు వ్రేలు చీకడం వలన ఆనందాన్ని పొందుతున్నారు. కాబట్టి వ్రేలు చీకే అలవాటు ఒక సుఖానుభూతి వాళ్ళకి. ఈ సుఖానుభూతి లైంగికానందంగా మార్పిడి నొందుతుంది

లిన్డనేర్ అనే శాస్త్రజ్ఞుడు పిల్లలు నోటిలో వ్రేలు వేసుకోవడం ఇరోజినస్ జోన్ ని ఉత్తేజితంచేసే హస్తప్రయోగంగా వర్ణిస్తూ, ఒక కొత్త వాదనను లేవదీశాడు.

పిల్లలు తెలీక నోట్లో వ్రేళ్ళు పెట్టుకొంటే, అది సెక్సేననే సరికి పండిత లోకానికి కడుపు మండిపోయింది. దానికి తోడు, అప్పటికే వెలి వేయబడ్డ ఫ్రాయిడ్, ఈ సిద్ధాంతాన్ని ప్రచారం చెయ్యసాగాడు.

కేవలం బొటన వేలిని చప్పరించడం వలనే అనంతమైన లైంగిక ఆనందాన్ని పొందగలుగుతారు పసి పిల్లలు. ఎందుకంటే బొటనవ్రేలు పిల్లలలో మాత్రమే "ఎరోజినస్ జోన్"—అని వాళ్ళ వాదన. అసలీ హస్తప్రయోగం అనే జాడ్యం పిల్లలకెలా అంటుతుందో ముందు పరిశీలించాలి.

నిజానికి హస్తప్రయోగం అంటే, ఈ ఇరోజినస్‌జోన్‌లను ఎవరికివారే ప్రేరేపింపజేసుకుని తృప్తినొందడం. కాస్త ఊహ తెలిసి, దాదాపు ఐదారేళ్ళ వయసు వచ్చేవరకూ పిల్లలకీ అలవాటు అబ్బదు. ఐదో సంవత్సరం మనిషి జీవితంలో గొప్ప మార్పును తెచ్చి పెడ్తుంది. బడికి పోవడం ప్రారంభించిన దగ్గర్నుంచీ ఆలోచనలు కొత్తవి పుట్టుకు వస్తుంటాయి. తెలీని అలవాట్లను రుచి చూస్తుంటారీ వయసులో పిల్లలు.

56

# 4. కోరికల పుట్టుక

మనసు ఎదగని పిల్లల భావాలలో యవ్వనం వచ్చేవరకూ ఒక నిశ్చయత అనేది వుండదు.

ఇందుకు కారణం, వాళ్ళలో సుఖానుభూతికి కారణమయ్యే ఆకస్మిక ప్రవృత్తులు [Sexual Impulses] ఎంతసేపూ ఒకదానికొకటి సంబంధరహితంగా వుంటాయి. ఏసుఖంఅయినా ఒకేరకం అనుభూతిని పిల్లలలో కలిగించడానికి కారణం. అసుఖంతాలూకుప్రవృత్తి ఒంటరిగానేకృషిచేయడమే. వీళ్ళఒక్కొక్కప్రవృత్తీ దేనికదే స్వతహగా సుఖానుభూతిని కలిగిస్తుంది. అన్నిరకాల ప్రవృత్తులూ కలవని కారణంగా, ఏ ప్రవృత్తీ సంపూర్ణజ్ఞానాన్నియుక పోవడంచేత పిల్లలకు, ఇది భలానా ఆనందంఅనే విచక్షణవుండదు. అంతేకాదు, పిల్లలఆనందానికి. ఆడా, మగా తేడా కూడా వుండదు.

పిల్లలలో ఈ వంటరి ప్రవృత్తులే యవ్వనంలోకి అడుగుపెట్టేసరికి కలిసిపోవడం ప్రారంభిస్తాయి. అంటే, అనేక రకాల లైంగిక ప్రవృత్తులు ఒకే "సెక్సుజోన్" ఆధిపత్యంలోకి వస్తాయి. అలా ఏకీకరణంచెందిన ఐక్యప్రవృత్తికి, రెండు దిశలున్నాయి. ఒకటి ఆడ. రెండు మగ.

స్తారు. ఫలితంగా నోటిలోకి లాలాజలం స్రవించి ఆకలి కొంత సర్దు కుంటుంది. దాన్ని పట్టుకుని "సెక్సు" అనడం కన్నా దౌర్భాగ్యం లేదని ఫ్రాయిడ్‌ను అంతా తిట్టిపోశారు.

పాలెర్మో అనే శాస్త్రజ్ఞుడు ఫ్రాయిడ్ వ్యతిరేకి. ఆయన పిల్లల వ్రేలు చీకే అలవాటుని సెక్సుకు అంటగట్టడాన్ని ఆరోగ్య కరమైన పరిశోధనగా అంగీకరించలేదు. పసి పిల్లల వ్రేళ్ళు నోటితో ఎక్కువ సంబంధాన్ని కలిగి వుంటాయి కాబట్టి స్తన్యాన్ని గ్రోలే ఆత్రంలో, స్తనాలకు బదులు బొటన వ్రేలిని వేసుకోవడం అనేది కేవలం యాధృచ్ఛికంగా జరిగే సంఘటన అన్నాడాయన.

ఆకలి కలిగినప్పుడు అమ్మ పాలివ్వక పోతే, స్తనచుబు కాన్ని పోలిన బొటన వ్రేలినే స్తనంగా భావించుకుని నోట్లో పెట్టు కుంటారు. ఫలితంగా స్రవించిన లాలాజలాన్ని మింగి ఆకలి తీర్చు కుంటారు....

స్తనాలైతే, ఏవో నిర్ణీత సమయాల్లో ఆకలి కలిగినప్పుడు మాత్రమే లభిస్తాయి. తన స్వంత బొటన వ్రేలికీ కాలనియతి లేదు కాబట్టి, పిల్లలు వ్రేలు చీకడానికి అలవాటు పడతారు" అంటూ ఫ్రాయిడ్ని ఖండించాడు పాలెర్మో!

అలా వ్రేలు చీకడానికి అలవాటుపడ్డ పిల్లలకు తామూ దుర భ్యాసానికి బానిసలమౌతున్నామన్న గ్రహింపు వుండదు. తమ

## నపుంసకులుగా మారకుండా వుండాలంటే ?

ఈ విధంగా ఒకే సెక్సుజోన్ ఆధిపత్యంలోకి వచ్చిన ప్రవృత్తులు మాత్రమే అసలైన లైంగికావేశాన్ని ఒకక్రమపద్ధతిలో ఏర్పరచ, ఎటువంటి మనోవికారాలూ లేకుండా, రతిలో సంపూర్ణ సౌఖ్యాన్ని అందియు గలుగుతాయి, మానసికస్వాస్థ్యాన్ని, సామర్ధ్యాన్నీ పెంచి, సత్సంతానోత్పత్తిని ఏర్పరిచే శక్తిని వానగూర్చ గలుగుతున్నాయి.

యవ్వనం వచ్చేవరకూ పిల్లలకు స్త్రీపురుష వైరూవ్యత కనిపించదు, పిల్లల ఆలోచనా సరళిలో స్త్రీత్వంగానీ, పురుషత్వం గానీ లేకపోవడంచేత, వాళ్ళలైంగిక విషయాలు కేవలం వ్యక్తిగత మైనవిగా పరిగణించ బడ్డాయి. పెద్దల సెక్సు తృప్తినొందాలంటే మరోవ్యక్తి పొందు అవసరం. అదే పిల్లల సెక్సువిషయంలో, వాళ్ళ లైంగిక ప్రవృత్తులు రెండోవ్యక్తికోసరం ఆరాటపడవు. మనసులో అంకురించినభావాలు మనసులోనే తృప్తినొంది, మనసులోనే అణిగిపోతాయి. ఇదే ఇంతకు మునుపుమనం చెప్పు కున్న ఆత్మశృంగారం [Auto Erotism]

ఈ ఆత్మశృంగారం వున్నవ్యక్తులకు మరోవ్యక్తి అవసరం కనిపించదు. మానసికంగానే "రతిఆనందాన్ని" వాళ్ళు పొందగలరు. దీన్నిమనం "యోగరతి" అని పిల్చుకొంటే, పిల్లలు భగవత్స్వరూపులేననడంలో ఎటువంటి సందేహం లేదు.

(ఎదుటివ్యక్తి అవసరంలేకుండా కేవలహస్త ప్రయోగం తోటి తృప్తిపడేవాళ్ళకి విషయంలో మినహాయింపు)

ప్రవృత్తుల ఏకీకరణ జరగడంవలన యవ్వనుల్లో ఈ ఆత్మ శృంగారతత్వాన్ని నిరోధించేశక్తి ఏర్పడుతుంది. అదిపూర్తిగా నిరోధించబడనివ్యక్తులు, హస్తప్రయోగానికి తలపడడం జరుగుతుంది.

అంటే, నిజమైన స్త్రీత్వం, పురుషత్వంవున్న యువతీ యువకులు పొరబాటుగానైనా "హోమోసెక్సువాలిటీ" ని అంగీకరించరు.

హోమోసెక్సువాలిటీకి అలవడిన వ్యక్తులుకూడా సహజమైన సంభోగానికి తలపడతారు.కాని, ఆత్మశృంగారతత్వం నిరోధించబడిన వ్యక్తులకన్నా సమర్థతతక్కువగావుంటుంది. తృప్తి అల్పంగా వుంటుంది.

అందుకు శరీరంలో కోరికలను ప్రేరేపించే instinctsఅనబడే అంతఃప్రేరణలే కారణం. అంతఃప్రేరణల అజ్ఞల్ని ఆకస్మిక ప్రవృత్తులు పాటిస్తూ మనిషిని నడుపుకుపోతాయి.

ఇటీవలి కాలంలో ఈ ఇన్స్టింక్ట్లను చదవడాన్ని ఒకశాస్త్రంగా రూపొందించడం జరిగింది. దాన్ని "ఇథాలజీ" అంటారు.

"Ethos" అంటే ఆచారం లేక అలవాటు అని గ్రీకు అర్థం. దానిగించే "ఇథాలజీ" ఏర్పాటయింది. మనుషుల ప్రవర్తన, దానివెనకవున్న శాస్త్రీయతనీ పరిశీలించడం ఈశాస్త్రం లక్ష్యం. జంతువులన్నింటిలోనూ ఒక్కోజంతువుకూ ఒక్కోరకం Instincts వుంటాయి, వాటన్నింటినీ ఈ శాస్త్రం పరిశోధిస్తుంది.

## కామాన్ని క్రమపరిచే యంత్రాంగం

మనిషి లైంగికానందాన్ని తృప్తిగా అనుభవిస్తున్నాడంటే, అతని ఆకస్మిక ప్రవృత్తుల్లో అంతర్గతంగావున్న అంశ రూపాలు [Components] పూర్తిగా తృప్తినొందాయని అర్థం, అంశరూపాలనేవి సూక్ష్మాతి సూక్ష్మమైనవి. ఇవి అనేకం కలిసి ఆకస్మిక ప్రవృత్తులనేర్పరుస్తాయి. మళ్ళీ ఈ ఆకస్మిక ప్రవృత్తులన్నీ ఏకమై ఒకే ఐక్యప్రవృత్తినేర్పరచి, బలమైన నాడీవ్యవస్థను నిర్మిస్తున్నాయి. ఈ బంధం ఎంతబలంగావుంటే, కోరిక అంత బలంగా వుంటుంది.

ప్రతి పదార్థం అణువుల కలయికతోటి ఏర్పడుతోంది కదా! అణువులు పరమాణువులు వలనా, ఆపరమాణువులు ఇంకా ఇంకా సూక్ష్మాంగాల వలనా ఏర్పడుతున్నాయి. ఈసృష్టే ఒక కలయిక!

అలాగే, సెక్సుప్రవాహంలో ఎదిగినమనిషిలోవుండేది ఒకేఐక్య ప్రవృత్తి ఈఐక్యప్రవృత్తికొన్ని ఒంటరి ప్రవృత్తుల కలయిక

వలన ఏర్పడింది. ఈవంటరి ప్రవృత్తులలో సూక్ష్మమైన అనేక అంశరూపాలున్నాయి. ఈ అంశ రూపాలన్నీ కలిసి ఐక్యప్రవృత్తి నేర్పరస్తున్నాయి.

మనిషి కోరిక తీర్చుకొని తృప్తినొందుతున్నాడంటే, అతనిలోని ఇలాంటి ప్రవృత్తులు కూడా తృప్తినొందాయని అర్థం. ప్రవృత్తులు తృప్తినొందాయంటే అందులోని అంశరూపాలు తృప్తినొందాలి. ఈ అంశరూపాలు ఎంత ఎక్కువ తృప్తిచెందితే మనిషి అంతసుఖాన్ని అనుభవించినట్టు!

ఇలా అంశరూపాలు కలవడంవలన మనిషిలో పరిపూర్ణత అనేది సిద్ధిస్తోంది.

యువ్వనం వచ్చాక-చర్యా,ప్రతిచర్యల లైంగికజీవన ప్రవాహవేగాన్ని నిరోధించి, ఆనకట్టలా అడ్డుకొనే మహత్తరమైన శక్తి మనసుకువుంది.

ఈ శక్తి నిమనసుకు సంక్రమింపచేసింది ఇందాకటి అంశ రూపాలే. కొన్నివంటరి ప్రవృత్తులనుకలిపి ఏర్పడిన "ఐక్య ప్రవృత్తి" లో, అందుకుఆకలి తోడ్పడిన అంశరూపాలలో కొన్ని ఒక్కోసారి కలవకుండా ఎదురుతిరుగుతాయి. ఇలా ఎదురుతిరిగిన అంశరూపాల వలన కొంత ప్రయోజనం వుంది. అవిఅతిగావున్న కామాన్ని తగ్గిస్తాయి. అసలు లేని కామాన్ని పెంచుతాయి.

మనిషిలో కామాన్ని క్రమపరిచే యంత్రాంగం ఈ అంశ రూపాలే!

యవ్వనానికి రాకముందే నాలుగు దశల్ని అధిగమించిన పిల్లలు-మానసికంగా సిగ్గుని, అవమానాన్ని, విరక్తిని, నీతినీ, ఆనందాన్నీ, ఆప్యాయతనీ....రకరకాల పరిస్థితుల్లో రకరకాలుగా అనుభవించివుంటారు.

ఆనందించో, ఆవేశపడో, ఏడ్చో, ఏడ్పించో, శైశవంనించి కౌమార్యంనించి, కైశోరదశ [Adolescency] లోకి చేరుకుంటారు.

అప్పుడు మనసనేకేంద్రంనించి బయలుదేరిన రకరకాల ప్రవృత్తులు పిల్లల్ని ప్రేరేపిస్తుంటే, అందులో అశాంతి, అవమానం విరక్తి, మనసును చంపివేసే భయంకరమైన నిస్పృహలనించి ఈ వేరుపడిన అంశరూపాలే మనిషిని రక్షిస్తాయి. రక్షకభటుల్లా ఇవి సెక్సువాంఛకు కాపలా కాస్తుంటాయి. అందుకే, బలమైన ప్రవృత్తులు [Impulses] మనసులో జనించాలి. అందుకు నాడీవ్యవస శక్తివంతమైనది కావాలి. నాడీవ్యవస్థ బలపడడానికి, ఆయుర్వేదం వృష్యపదార్ధాలను సేవించమంటోంది.

నిరాశా, నిస్పృహల వలన మొదటగా దెబ్బతినేది మనిషిలో సెక్సుమాత్రమే! ఈ సెక్సుని మేల్కొల్పడానికి వాజీకర ఔషధాలు [Aphrodisiacs] శ్రేయస్కరం!

# 5. పిల్లలలోనూ శుక్రం ఉంటుంది!

ఈ నిరూపణలను బట్టి పిల్లలలో "లైంగికతలేని సెక్సు" వుంటుందన్న ఫ్రాయిడ్ సిద్ధాంతం పట్ల కొంత అవగాహన ఏర్పడి వుంటుంది.

ఆయుర్వేదీయులు ఇంకొంచెం ముందుకు పోయారు. పసిపిల్లల్లో సైతం శుక్రం వుంటుంది అని ఆయుర్వేద సప్తధాతు సిదాంతం చెప్తోంది.

చిన్ననాటి ఆకస్మిక ప్రవృత్తులే రూపాంతరం చెంది, పెద్దల సంభోగ యోగ్య కామంగా మారుతుందని ఫ్రాయిడ్। చిన్ననాటి శుక్రధాతువు యవ్వనం వచ్చాక రూపాంతరం చెంది గర్భోత్పాదనకుకారణం అయ్యే శుక్రంగా మారుతుందని ఆయుర్వేదం॥

## శుక్రధాతువు తయారీ

ఏ సిద్ధాంతం అయినా, ప్రకృతి ప్రేరణలేనిదే లైంగికావయవాలకు సంబంధించిన నాడులలో స్పందన వుండదనే అంగీకరిస్తుంది. ఈ నాడులు స్పందిస్తేనే సంభోగేచ్ఛ వుత్పన్నమౌతుంది. శరీరంలోని లక్షలాది జీవకణాలలో వున్న "ప్రోటోప్లాజమ్" కూ

ఈ కామానికీ సంబంధం వున్నట్టు అధునిక శాస్త్రజ్ఞులు అనుమా నిస్తున్నారు.

అయితే ఆయుర్వేదం, సెక్సు కోరిక జనించడానికి శుక్ర ధాతువుకు ప్రధాన స్థానాన్నిచ్చింది. ఈ శుక్రధాతువు ఆహార సారం. అది సర్వ శరీరగతం. జీవకణంలో వుండే "ప్రోటో ప్లాజమ్" ను శుక్రధాతువుగా భావించేందుకూ అవకాశం వుంది.

మనం తీసుకున్న ఆహారం ముందుగా రసధాతువు (Blood-Plasma) గా మారుతుంది. ఆ తర్వాత రక్తంగానూ, మాంసంగానూ, మేదస్సు(Fat) గానూ, అస్థిగానూ, మజ్జగానూ మారి చివరికి శుక్రంగా మారుతుంది. అంటే, పుష్టికరమైన ఆహారం పుష్టికరమైన శుక్రాన్ని పెంచుతుంది.

మృదువుగా, స్నిగ్ధంగా వుండే మజ్జ నుంచి శుక్రం పుడ్తోంది. అస్థులనేవి వాయు, ఆకాశ భూతాల గుణాలను కలిగి వుంటాయి. ఈ రెండు గుణాల వలననే అస్థిలో గట్టిదనంతో పాటు, చిన్ని చిన్ని రంధ్రాలు కూడా ఏర్పడతాయి. కాబట్టి, అస్థి లోపల వుండే మజ్జ (మూలుగ) నుంచి శుక్రం జనించి, అస్థిలోని ఈ రంధ్రాల ద్వారా బైటకు చేరుకుంటుంది. ఇది సర్వ శరీరాన్ని సిరల ద్వారా వ్యాపిస్తుంది.

హర్షోద్రేకం కలిగినప్పుడు, లేక సంభోగం అనే "వ్యాయామం" వలనా ప్రేరేపించబడి, ఈ శుక్రధాతువు నీరు పల్లానికి ప్రవహించినట్లు వృషణాలను చేరి గర్భోత్పత్తికి కారణం అవుతోంది.

ఈ శుక్రధాతువు, ఆడా మగా, ఇద్దరికీ సమంగానే వుంటుంది. పెద్దా చిన్నా అనే భేద భావం లేదు. ప్రతి వ్యక్తి లోనూ, చివరికి నపుంసక, షండులలో సైతం వుంటుంది. అది సర్వ శరీరగతమైనదనీ యవ్వనం వచ్చాక మాత్రం, పురుషుల జననేంద్రియం నించి బయటకు ప్రవర్తించ గలిగే శక్తి గలదవుతుందనీ, స్త్రీలలో స్తన్యం ఏర్పడడానికీ ఈ శుక్రధాతువే కారణం అనీ ఆయుర్వేదం చెప్తోంది.

"పువ్వు మొగ్గగా వున్నప్పుడే, అది విచ్చుకున్నాక వచ్చే సుగంధాన్ని ఆఘ్రాణించలేం గదా! అది వికసించి, కేసరాలు విడివడ్డాక, దాని సుగంధం దానికదే బైటకు వ్యక్తమౌతుంది. అంటే, ముకుళావస్థలో కనిపించని ఒక పరిమళం పుష్పితావస్థలో కనిపిస్తోంది. అప్పటి వరకూ ఆ పరిమళం సూక్ష్మరూపంలో వుంటుంది. పిల్లలలో శుక్రధాతువూ అంతే। అలాగే పిల్లలకు పదహారేళ్ళు వచ్చే వరకూ, శరీరంలో మాంసం, అస్థి మొదలైన ధాతువులు పరిపక్వం కావు. పదహారునించీ, ముప్ఫయి సంవత్సరాల వరకూ క్రమంగా ధాతువులు వృద్ధినొందడం ప్రారంభిసాయి.

వదహారుకు ముందునుంచే బాల్యావస్థలో మీసాలు, రోమ రాజి [Pubic hair] కనిపిస్తుంటాయి.

సాధారణంగా పిల్లలు సుకుమారులుగా, కష్టాలను సహించ లేని వారుగా ఉంటారు. శ్లేష్మధాతువు బలిష్టంగా వుంటుంది కాబట్టి సత్త్వ గుణప్రధానంగా వుంటారు. వీళ్ళు మానసికంగా అనవ స్థితంగా వుంటారని చరకుడు స్పష్టంగా చెప్పాడు.

## శుక్రసారుల లక్షణాలు

ఆహార సారమైన శుక్రధాతువు బలంగా వున్నట్లయితే, మనిషి మానసిక స్థితి, తజ్జనిత కోరికలూ అన్నీ బలంగా వుంటాయి వీళ్ళని శుక్రసారు అంటారు. ఈ శుక్రసారులను చూసి ఇట్టే చెప్పెయ్యవచ్చు.

ఏడవ ధాతువైన శుక్రమే "ఓజస్సు" కు కారణం అవుతుంది. ఆ వ్యక్తి చంద్రుడిలా మెరిసి పోతున్నాడు అని ఎవరైనా చూసి మనం అనుకున్నామనుకోండి, అది అతని ముఖంలో ఏదో చెప్ప లేని కాంతిని చూడడం వలన చెప్పగలుగుతున్నాం. స్వయంగా ప్రకాశవంతమైన ముఖారవిందాన్ని మనం 'ఓజస్సు' అని చెప్పుకోవచ్చు.

ఈ ఓజో సంపన్నులు చాలా సౌమ్యులుగా వుంటారు. మహా సుందరంగా వుంటారు. స్నిగ్ధంగా వుంటారు. దంతాలు గుండ్రం

గానూ, సమంగానూ ఒకదానికొకటి కలిసినవిగానూ, వుంటాయి వీళ్ళు సొగసైన కన్నులు కల్గి ప్రసన్నంగా. స్నిగ్ధంగావున్న శరీర వర్ణాన్ని కలిగి వుంటారు. చక్కటి కంఠస్వరం. దీప్తమైన కాంతి. గొప్ప నితంబ ప్రదేశం [Heavy buttocks] కలవారై వుంటారు.

వాళ్ళు మాత్రమే సంభోగంలో సంపూర్ణమైన ఆనందాన్ని పంచగలుగుతారు. కొంచెం భోగలాలసంగా వుంటారు. ప్రశస్తమైన బలం వుంటుంది.

ఒక్క మాటలో చెప్పాలంటే. శుక్రసారులు అంటే.— నాడీ వ్యవస్థ బలంగా వుండి, ఎటువంటి మనోవికారాలూ, నరాల బలహీనతలూ లేని వాళ్ళు — అని నిర్ణయించవచ్చు.

ఆడవాళ్ళు గానీ, మగవాళ్ళు గానీ, శుక్రధాతువును బలంగా వుండేట్లు కాపాడుకుంటే. సుఖాన్నీ. ఐశ్వర్యాన్నీ. ఆరోగ్యాన్నీ. గౌరవాన్నీ చక్కటి సంతానాన్నీ కలిగి వుంటారు.... అని చాటుతోంది ఆయుర్వేదం.

మన పిల్లల్ని మనం చిన్నప్పటి నుంచే అలా తయారు చేయగలగాలి. ఇక్కడ ఒక చిన్న విషయాన్ని జ్ఞాపకం వుంచుకోవాలి. ఆహార సారమైన శుక్రధాతువే స్త్రీ పురుషులలో లైంగికతను ప్రేరేపిస్తుంది. ఈ శుక్రధాతువే మనసును తన అధీనంలో వుంచుకొని సత్త్వ గుణాన్ని,సాధు తనాన్నీ ఏర్పరుస్తుంది.మనిషికి బలాన్ని, సుందర రూపాన్నీ కలుగ చేస్తుంది. సత్సంతానాన్ని

జనింప చేస్తుంది. అంటే, బలమైన కోరికలు ప్రేరేపించబడే వ్యక్తిలో ఇన్ని బలాలుంటాయి. దానికంతటికీ కారణం సర్వ శరీరంలో వ్యాపించివున్న శుక్రధాతువే!

## కోరికలను కలిగించే శుక్రధాతువు

"హర్ష, బల, గర్భోత్పాదనై శుక్రం" అన్నారు. "హర్షః" అనే పదానికి అనంతార్థం వుంది. కోరికల్ని ప్రేరేపించే Instincts ను హర్షంగా ఆయుర్వేదీయులు వర్ణించారు.

కాబట్టి, శుక్రధాతువుకు అంతఃప్రేరణలను [Instincts] ఏర్పరచడం, శరీరానికి బలాన్ని కలిగించడం, గర్భోత్పాదక శక్తిని పెంపొందించడం అనే మూడు లక్షణాలున్నట్లు చెప్పబడింది.

బలమైన శుక్రధాతువు వున్నవాడికి చంచలమైన "మానసిక స్థితి" వుండదు. మనిషి స్థిరంగా వుంటాడు. అల్పమైన విషయాలకు లొంగిపోడు. దాన్నే ఫ్రాయిడ్ ఒంటరి ప్రవృత్తులు బలంగా కలిగంగా చెప్పాడు. ఎల్లిస్ చెప్పిన ఆత్మ శృంగార తత్త్వం [Auto Erotism] యవ్వనం వచ్చాక నిరోధించబడడానికి కారణం, యవ్వనంలో శుక్రధాతువు బలంగా వుండి ఎక్కువ శ్రమిస్తుంటుంది, కాబట్టి!

నపుంసకత అనేది ఈ శుక్రధాతువు బలహీనంగా వుండడం వలనే కలుగుతోంది.

కాశ్యపుడు, శుక్రధాతువు గురించి చెబుతూ—

"అన్యోన్య సంశ్రయా హురన్యోన్య గుణవన్తిచ।
మహాభూతాని దృశ్యాని దార్వగ్ని తిలతైలవత్ ॥"

అన్నాడు. అంటే, "శుక్రధాతువులో వుండే పంచమహాభూతాలు ఒకదానితో ఒకటి కలిసి, అన్యోన్యగుణాలు కలవై కట్టెలలో అగ్నిలా నువ్వులలో నూనెలా, యవ్వనంవచ్చేవరకూ అదృశ్యంగా వుండి, యవ్వనంవచ్చాక శుక్రాన్ని ప్రేరేపిస్తాయి—" అని!

లైంగికపరమైన ఆకస్మిక ప్రవృత్తులు (Sexual impulses) గానీ, గర్భోత్పత్తికి కారణమైన శుక్రధాతువుగానీ యవ్వనం వచ్చేవరకూ అంతర్గతంగా వుండిపోవడానికి వాటినేర్పరచిన అంశరూపాలేకారణం. శుక్రధాతువులో పంచమహాభూతాలూ, సెక్సువల్ ఇంపల్స్‌లలోని అంశరూపాలూ సమానభావాల్ని స్ఫురింప చేస్తున్నాయి.

యవ్వనంవచ్చాక, సంయోగసమయంలో బైటకుకనిపించే తెల్లటిజిగురుపదార్థాన్ని [Semen] శుక్రంగామనంచెప్పుకొంటాం. కాని, ఇప్పటివరకూ చర్చించిన శుక్రధాతువూ ఈ శుక్రమూ ఒకటి కాదు శుక్రధాతువు బలంగా వున్నప్పుడు, దానివలన ప్రేరేపించబడిన శుక్రమూ బలంగా వుంటుందనేది ఈచర్చలో సారాంశం.

పంచమహాభూతాల బంధనం [Bond] కారణంగానే శుక్రం యవ్వనంవచ్చేవరకూ బయల్వెడలడంలేదు. ఈపంచమహాభూతాలు పృథివి, జలమూ, అగ్ని, వాయువు, ఆకాశం అనేవి! వీటికలయిక కారణంగా ఏర్పడిన శుక్రధాతువు ఆడ, మగ, పెద్ద, చిన్న అనే తేడా లేకుండా, శరీరం అంతా వ్యాపించిపోతుంది. అయినా ఎవరికీ కనిపించదు. చెరకులో చెరకురసం కంటికి కనిపిస్తోందా?

# శుక్రాన్ని దాచుకోవాలి!

ఈ నిరూపణలనుబట్టి శుక్రధాతువు ఆవశ్యకత అర్థంఅవుతోంది కదా! ఇప్పుడు హస్తప్రయోగంవలన నష్టాన్ని పరిశీలిద్దాం.

ముష్టిమైథునంలో కోల్పోయే "శుక్రం" ఆహారసారమైన శుక్రధాతువు ప్రేరేపించడంవలన ఏర్పడుతుంది. నష్టపడిన శుక్రాన్ని ఈ శుక్రధాతువే పూరిస్తుంది. నష్టంఎక్కువైనకొద్దీ శుక్రధాతువు బలహీనమౌతుంది. శుక్రధాతువు అంటే నాడీవ్యవస్థే! ఇదిఅయుర్వేద సిద్ధాంతం. అయితే ఈనాడీవ్యవస్థకూ, శుక్రధాతువుకూ గల సంబంధాన్ని ఆయుర్వేదవైద్యం ఇంకా నిరూపించవలసివుంది.

Sexual Impulses బలహీనమౌతే, ఆత్మశృంగారతత్వం పెరుగుతుందని హేవలాక్ ఎల్లిస్ ప్రతిపాదించాడు. అంటే, మానసికంగా హర్షతలేకుండా, కేవలం సుఖలాలసంతో, సెక్సు పుస్తకాలు చదివి వీర్యస్ఖలనాలు చేసుకునే వ్యక్తులు బలహీనమైన ప్రవృత్తుల్ని కలిగివున్నారని అర్థం. దాన్ని మానసికనపుంసకతగా ఆధునికవైద్యులూ అంగీకరిస్తారు.

వైద్యావధాని శ్రీకందుకూరి వెంకట సుబ్బారావు ఈవిషయాన్ని చక్కటికవితలో వర్ణించారు.

"దైవశాసన మంచుఁదలపోసి పెండ్లాడి
ప్రజల సృష్టింపఁగాఁ బాల్పడ్డ తేజమే
ఆహార సారమౌ జనులారా!
అది దాచుకొనుఁడయ్య జనులారా॥

(ఆరోగ్యప్రబోధగీతం)

ఖూతునుచూసినా, విన్నా వెంటనే స్ఖలించిపోతుంది కొందరిలో వీర్యం. అంతేకాదు, రాత్రిళ్ళు కలిగే స్వప్నస్ఖలనాలు (Nocturnal Emissions) కూడా నరాల బలహీనత కారణంగా జనించేవే। ఈవ్యాధివున్నవ్యక్తులు సహజంగానే చంచలమైన మనఃస్థితిని కలిగివుంటారు. లైంగికపరంగా ఆలోచిస్తే, వీళ్ళుఒకే వ్యక్తిపైన స్థిరమైన ప్రేమను కలిగివుండరు. అసలు ప్రేమించే ఓపిక వీళ్ళకువుండదు. రోడ్డుమీద కనిపించే ప్రతి ఆడదానితోటి వ్యభిచరిస్తున్నట్టు పగటికలలు కంటుంటారు. వీళ్ళందరికీ స్వప్నస్ఖలనాదిదోషాలు వుంటాయనడంలో ఎటువంటి సందేహంలేదు.

స్వప్నస్ఖలనాలు యువకులలోనే ఎక్కువ. వీళ్ళకుచికిత్స వృష్యపదార్థాలను సేవింపచేయడం. వృష్యపదార్థాలు సేవించే స్త్రీలకు హిస్టీరియా అంత సులభంగా రాదు.

ఇలా శుక్రధాతువును పెంచేపదార్థాలను వాజీకర ఔషధాలంటారు. వాజీ అంటే గుర్రం. అన్ని జీవులలోనూ గుర్రానికి సంభోగ సామర్థ్యం ఎక్కువ. గుర్రంలా సంభోగించగలగాలి అన్న ఆశ మనిషన్న ప్రతివాడిలోనూ వుంటుంది, మనపూర్వులకూవుంది. అందుకే ఈ మందుకు గుర్రంలా సంభోగింపచేసేఔషదం—వాజీకర ఔషధం [Aphrodisiac Drug] అన్నారు.

వీటిని వాడడం, అదేపనిగా సెక్సుకోరికను తీర్చుకోవడానికి కాదు, బలమైన నాడీవ్యవస్థను నిర్మించుకొని, బలమైనకోరికను పెంచుకొని తద్వారా సత్సంతానాన్నికనమని।

అందువలన మనసుకు "హర్ష" గుణం పెరుగుతుంది. హర్షం అంటే సంతోషంమాత్రమే కాదు, ప్రకృతికి స్పందించేగుణం చైతన్యం! అచేతనుల్లో అకస్మిక ప్రవృత్తులుండవు. శరీరంలో ఒక అవయవం చేతనత్వంకోల్పోతే ఆభాగానికి గానీ, లేక ఆభాగంనించిగానీ ఎటువంటి నాడి సంచారం [N rvous Flow] వుండదు. నాడులద్వారా ప్రవృత్తులు ప్రయాణిస్తాయి.

సత్త్వగుణం వున్నవాడికి జలతరంగంలా, రజోగుణం వున్న వాడికి శబ్దతరంగంలా, తమోగుణం వున్నవాడికి వాయుతరంగంలా ఈప్రవృత్తులు ప్రయోగిస్తాయని చెప్తారు.

ఈగుణాలగురించి రాబోయే అధ్యాయాలలో చర్చిద్దాం.

## నాడీవ్యవస్థను బలపరిచే స్వర్ణప్రాశన

కాబట్టి నాడీవ్యవస్థ పుట్టిందగ్గరమంచీ బలంగా వుండేట్లు జాగ్రత్త పడాలి. లేకపోతే పిల్లలు పరమ జడంగా, మూర్ఖంగా తయారౌతారు.

ఎక్కువ మంది పిల్లలలో ధారణశక్తి [Memory] లోపించడం, చదువుపట్ల శ్రద్ధలేకపోవడం, దురలవాట్లకు లోను కావటం వగైరా. నాడీవ్యవస్థ బలహీనంగా వుండడం కారణంగా జనిస్తున్నాయి.

ఈ దుస్థితి రాకుండా బిడ్డ పసిగుడ్డుగావున్నప్పుడే మనం తగిన చర్యలు తీసుకోవాలి. సత్సంతానాన్ని కోరుకునే ప్రతి దంపతులూ అచరించవలసిన, అచరించగలిగే ఒక మహత్తర ప్రయోగం—స్వర్ణప్రాశన....!

మనకు. స్వర్ణప్రాశన ఒకప్పుడు ఆచారంగా వుండేది. ఎందుకో ఈమధ్య మనవాళ్ళు దీని సంగతే మరిచిపోయారు.

స్వర్ణప్రాశనను పాపాయికి మూడోనెలలోనే చేయించాలి. దీనికి మంత్రాలూ, భోజనాల తతంగం అవసరంలేదు. మీకు మీరే ఇంట్లో ఈ కార్యక్రమాన్ని నడుపుకోవచ్చు.

సరిగ్గా బిడ్డకు మూడో నెల రాగానే, పల్చటి స్వర్ణ పత్రాన్ని [బంగారపు రేకు] తేనెతోటి, తేనె కన్నా ఎక్కువగా గానీ, తక్కువగా గానీ వుండేట్లు ఆవునెయ్యిని కలిపి బిడ్డ చేత నాకించడమే స్వర్ణ ప్రాశన.

ముట్టుకుంటేనే పొడి అయ్యేటంత పల్చటి రేకులు బంగారం నుంచి తీయగలరు. అది మంచి బంగారం అయితేనే అంత పల్చగా వస్తుంది. షుమారు ఒక అంగుళం రేకుతో ఈ కార్యక్రమం అయిపోతుంది.

వాంతులూ, విరోచనాలూ వంటి వ్యాధులు లేని బిడ్డకు మూడోనెలలో, అన్నప్రాశనకు ముందే ఈ స్వర్ణప్రాశన చేయించాలి. అందువలన బుద్ధి పెరగుతుంది. ఆకలి పెరుగుతుంది. బలాన్ని పెంచుతుంది. ఆయువు వృద్ధి నొందుతుంది. ఇది కళ్యాణ కారకంగానూ, పుణ్య కారకంగానూ చెప్పారు ఆయుర్వేదీయులు.

స్వర్ణం అన్నిటికన్నా ఉత్తమమైన వృష్య పదార్థం. ఇది బిడ్డల శరీరానికి మంచి రంగు నిస్తుంది. గ్రహబాధల నుంచి [Infections] దూరం చేస్తుంది.

స్వర్ణప్రాశన జరిగిన నెల రోజులలోపే బిడ్డ మేధావంతుడవుతాడు. ఆరు నెలలలోపు ఏకసంతగ్రాహి అవుతాడు. అంటే— స్మరణ ధారణ శక్తులు అద్భుతంగా పెరుగుతాయి.

ఆచార వ్యవహారాల పట్ల నమ్మకం వున్నవాళ్ళు జాతకర్మ సంస్కారాలలో స్వర్ణ ప్రాశన కూడా ఒకటిగా చెప్తారు. అయితే వాగ్భటుడు, స్వర్ణ ప్రాశనను పుట్టిన నాలుగు రోజులకు చేయించమన్నాడు. ఎందుకంటే, దుగ్ధవహ స్రోతస్సులు [Mammary Ducts] మొదట్లో మూసుకుపోయి వుంటాయి. వెంటనే బిడ్డకు పాలు పట్టడానికి వీలుపడదు. ముఖ్యంగా మొదటి ప్రసవాన్ని పొందిన తల్లులలో [Primi paras] ఇది సంభవం. ఆ కారణంగా నాలుగో రోజునే యీలన్నాడు. జాత కర్మలు కావాలని కోరుకునే వ్యక్తులు కూడా, అవి పూర్తయిన తదుపరి నాలుగో రోజునే చేయాలని వాదించు కున్నారు.

ఏమైనా, ఇప్పుడీ ఆచారం మాత్రం మనలోంచి మటు మాయమై పోయింది. సరస్వతీ, శంఖపుష్పి, వస మొదలైన ద్రవ్యాలను కూడా కలపమని చెప్పాడు వాగ్భటుడు.

స్వర్ణప్రాశన జరిగిన పిల్లలకు, మరే ఇతర రకాలైన వాక్సినేషన్లూ అవసరంలేదు. పోలియో, డిఫ్తీరియా వంటి వ్యాధుల నుండి నిర్భయుంగానూ, నిశ్చింతగానూ వుండవచ్చని ఆచరించిన అనుభవజ్ఞులు చేస్తున్న ఛాలెంజీ!

స్వర్ణం జీర్ణం అయ్యే పదార్థం కాదు. తీసుకున్న తర్వాత కొద్ది క్షణాలు మాత్రం శరీరంలో వుండి, కేవలం స్పర్శామాత్రం గానే మూత్రపిండాల నుంచి, గాత్ర సౌకుమార్యం వరకూ, జీవితాంతం వ్యాధుల పాలిట శత్రువులా పనిచెయ్యగలుగుతుంది స్వర్ణం, ఇదీ స్వర్ణ ప్రాశన మహత్యం!

# అమలిన శృంగారం

## LOVE IN CONFLICT WITH SEX



## అధ్యాయం రెండు

72 (13)

సరససాంగత్య సుఖ
వికాసముల కన్న
దుస్సహ వియోగ భరమె
మధురము సకియ

రాయప్రోలు "తృణ కంకణం"

[ ఆరాధిస్తున్న దంపతులు....అమరావతి శిల్పం ]

# అమలిన శృంగారం

## Love In Conflict With Sex

ప్రేమ అనేదిమనిషి దైనందిన జీవితానికి ఒకసమాధానం. ప్రేమ ఆత్మప్రేరకంగా పనిచేసే దివ్యౌషధం.. ఇది సిద్ధాంతగ్రంథాలలో మనకు దొరికే ఒక బోగస్ సమాచారం.

అవసరం గడుపుకోవడం కోసరం, సెక్సుకుతిని తీర్చుకోవడం కోసరంమాత్రమే ఈనాటి లైంగిక సంబంధాలు ఉపయోగపడుతున్నాయి. అందులో "ప్రేమ" కేవలం "శాస్త్రార్థం" గామిగిలిపోయింది దీనికి మనిషి ఆలోచనావిధానంలోని "చంచలతే" కారణం. చంచలమైనవ్యక్తులు, ప్రేమలేకుండా కోరికని పెంచుకోవడమే వ్యభిచారం. ఒక నియతిలేని ఈ సంబంధాల వలన మనిషిలోపలి Air Tight పొరబాటునకూడా అణగదు. ఆతపన లోంచి మనసూ మనిషి రక్షించబడతారనుకోవడం దురూహ!

శరీరంలోని ప్రతి అణువు స్థిరంగావుంటూ, దానిపనిని అది చేసుకుపోవడాన్ని "Homeostasis" [స్థిరగుణం] అంటారు. ఇది శ్లేష్మధాతువు వలన సంభవమని ఆయుర్వేదం చెప్తోంది.

బాహ్యంగా మనం పీల్చుకునే ప్రాణవాయువు [Oxygen] మనం తీసుకునే పోషకఆహారం, శుద్ధమైనజలం....ఇవి ఈస్థిర గుణాన్ని (Homeostasis) పెంచుతాయి.

శరీరంలోవున్న మలాలను (Wasteproducts) బయటకు విసర్జింపచేయడంవలన ఈ స్థిరగుణం కలుషితం కాకుండా వుంటుంది.

శరీరానికి సహజంగా వుండవలసిన ఉష్ణోగ్రత స్థిరంగా వుండేట్లు చేయగలిగే శక్తినే మనం "హోమియోస్టేసిస్" అంటాం. అంతర్గతంగా జరిగే భౌతిక రాసాయనిక ధర్మాలు స్థిరంగా వుంచడం దీని బాధ్యత. అది శ్లేష్మధాతువువలన సంభవం.

వేళకు నిద్రపోవడం, పనికి తగ్గ విశ్రాంతి తీసుకోవడం, ఒక నియతిప్రకారం ఆహారవిహారాలు సేవించడం శ్లేష్మధాతువును పెంచేపనులు. అంటే వీటివలన శరీరంలో స్థిరగుణం [Homeost_asis] బలంగా వుంటుంది.

మనిషి చంచలతలేకుండా ఒకే ఆలోచనమీద, ఒకేపనిమీద' ఒకే విషయంమీద శ్రద్ధచూపగలగడం శ్లేష్మధాతువును పెంచేట్లు చేస్తాయి. అలాగే శ్లేష్మధాతువు ఎంతపెరిగితే మనిషి అంత స్థిరంగావుంటాడు. ఇవిరెండూ పరస్పర అనుబంధాన్ని కలిగి వుంటాయి.

శ్లేష్మధాతువు ఎటువంటి దుష్టిచెందకుండా వుండడాన్నే "ఓజస్సు" అంటున్నాం

మనిషి మరణించాడంటే అతనిలో ఓజస్సు మరణించిందని అర్థం. అంటే మనిషి మనుగడకు మనం చెప్పుకునే "బలం" ఈ

ఓజస్సే శ్లేష్మధాతువువలన ఓజస్సు [Immunity] పెరుగుతుంది. వ్యాధినిరోధశక్తి, మనోవికార నిరోధకశక్తి, స్థిరత్వం పెరుగుతాయి.

మనసులో చెలరేగే కోరికల్ని నిగ్రహించుకోవడానికి ఓజస్సు అవసరం. కోరికలవలన "చంచలత" పెరుగుతుంది. Homeostasis దెబ్బతింటుంది.

"ఓజస్సు" ఎంతవుంటే, కోరికలసాధనవలన జనించిన తృప్తి అంత ఎక్కువగా వుంటుంది.

కాబట్టి, మన కోరికలు అమలినంగావుండాలన్నా, మన తృప్తి అధికంగా వుండాలన్నా, మన సుఖానుభవం చిరకాలం నిలిచిపోవాలన్నా మనిషికి స్థిరత్వం కావాలి.

ఆలోచనల్లోనూ, ఆచరణల్లోనూ స్థిరంగా వుండే వ్యక్తికి వ్యాధినిరోధకశక్తి ఎక్కువగా వుంటుంది. చంచలమైన భావాలున్న మనిషి శారీరికంగానూ, మానసికంగానూ వ్యాధిపీడితుడే.

"అమలిన శృగారం" సిద్ధించాలంటే ముందు ఈ విషయాన్ని గమనించాలి.

# 1. ప్రేమ ఎలా పుట్టింది?

"ప్రేమించ గలవాడు నిత్య సంతోషి ..." అన్నాడు 'ప్లేటో' తన సింపోజియంలో.

"ప్రేమ ఎప్పుడూ "నిగ్రహం" చేతఆవరించబడి వుంటుంది నిగ్రహం కోరికలను క్రమపరుస్తుంది. మనిషికి పరిపూర్ణమైన

సుఖంలభించేట్లు చెయ్యగలిగే శక్తి నిగ్రహానికే వుంది—అంటాడు ప్లేటో....

ప్లేటో ప్రేమ సిద్ధాంతం వలన హోమోసెక్సువల్ సంబంధాలు రూపుమాసిపోతాయని "ప్లేటోస్ ఫాట్" అనే పుస్తకంరాసిన జి. యమ్. ఎ. గ్రబ్బీ అన్నాడు.

స్త్రీపురుషుల సంభోగానికి పరమార్థం సత్సంతానం మాత్రమేననీ, సుఖలాలసత్వాన్ని తీర్చుకోవడానికి ప్రేమను బలిచేసి "సెక్స్" ను మాత్రమే అనుభవించడం ప్రకృతికి ద్రోహంఅనీ—అంటాడు. ప్లేటో!

కేవలం శారీరిక సౌందర్యాన్ని చూసిప్రేమించేవాడు అస్థిర మైన ప్రేమకలిగి వుంటాడు. అందుకేఆత్మసౌందర్యాన్ని ప్రేమించ మన్నాడు. అది డివైన్ బ్యూటీ! దివ్యసౌందర్యం!!

ప్లేటో ప్రతిపాదించిన ఈప్రేమ తత్వానికి "ప్లెటోనిక్ లా" అనిపేరు, ఇంద్రియ తర్పణాన్నిచ్చే సౌందర్యం నుండి ఆత్మిక సౌందర్యం వైపునడిపించేది నిజమైన ప్రేమ! ఆత్మిక సౌందర్యం నుండి ఆధ్యాత్మిక సౌందర్యం వైపునడిపించేది ప్లేటో ప్రేమ!!

విచిత్రం ఏమిటంటే ఇంతసిద్ధాంతం రూపొందించాక, లైంగిక సంబంధాలను నిషేధించిన ప్లేటో,అనుచరులు రానురానూ దానికి మినహాయింపులిచ్చుకొంటూ చివరికి "ప్లేటోప్రేమ"ను సర్వ నాశనం చేశారు.

ప్లేటోపైన అనేకపుస్తకాలు వ్రాసిన "కాస్టిగ్లియోన్"చుంబనం గురించి వ్రాస్తూ, ముద్దుపెట్టుకోవడం అనేది రెండు శరీరాలు ఏకం

కావడంకోసంకాదు. రెండు ఆత్మలు ఏకంకావడానికీ, రెండు ఆత్మలు ఆయా శరీరాలనించి విడివడడానికీనూ...." అన్నాడు. ఒకనకిది నటనగానూ, అడ్డదారులు తొక్కేదిగానూ, ప్లేటో పేరుచెప్పుకొని వ్యభిచరించే జాణతనంగానూ క పించడంలో ఆశ్చర్యంలేదు.

మనకీ అనుమానం వస్తుందనే, "కాస్టిగ్లియోన్" కొంచెం ముందు జాగ్రత్తపడి "ప్లెటోనిక్ లవర్" యువకుడుగావుండకూడదని, అరవై మూడేళ్ళ "మైకేలేంజిలో" నలభై ఏళ్ళ "విక్టోరియా కొలోనా" ని ప్రేమించడం మాత్రమే ప్లెటోనిక్ "లౌ" అవుతుందనీ అదే ఆదర్శనీయమనీ చెప్పాడు....

ఈ వివరణ ఇంకా నవ్వుపుట్టిస్తుంది. ఉపయోగంలేని వ్యర్థ సిద్ధాంతాలతో మనుష్య సమాజం చాలాకాలం వృధా చేసిందనడానికి ఇవే నిరూపణలు!

ఆత్మనిగ్రహం పెరిగితే "ఆత్మస్థయిర్యం" పెరుగుతుందనీ, తద్వారా బలమైన సమాజాన్ని మనుషులు ఏర్పరచుకోవచ్చుననీ ప్లేటో ఆశించాడు.

దీన్ని దాదాపు ప్రపంచం అంతా అపార్థం చేసుకుందంటూ—హావెలాక్ ఎల్లిస్ వంటిపాశ్చాత్యపండితులే విచారించారు. అయితే ప్లేటోలో ఛాందస్తాలు కూడాకొన్నివున్నాయి....స్త్రీ అసమానత, వరవిక్రయాలూ వంటి సెక్సునేరాలను రూపుమాపాలంటే సెక్సునే నిరోధించాలి....అన్నాడు. ఈ వాదన ఎలుకలను చంపడానికి ఇంటినే తగలబెట్టినట్లుంది.

ఇలాంటికొన్ని తలతిక్కవాదనలుండబట్టే ప్లేటోనించి ఫ్రాయిడ్‌దాకా దార్శనికభావాలున్న వ్యక్తుల్ని సమర్థించేందుకు శాస్త్రీయదృక్పథంకలిగిన వ్యక్తులు వెనకాడసాగారు.

సెక్సుమీద వాత్స్యాయనుడివంటి ప్రాక్‌పండితులూ, డేవిడ్, కేపెల్లెనస్ వంటి పాశ్చాత్యపండితులూ అనేకానేక గ్రంథాలు వ్రాశారు. ప్లేటో, ఆయన అనుచరులూ, సెక్సువ్యతిరేక నినాదాలతో చైతన్యాన్ని అణిచేందుకు ప్రయత్నించారు. నిజానికి, సెక్సుకావాలన్న పండితులు "How To Do It" అనే దృక్పథంతో మాత్రమే గ్రంథరచనసాగించారు. వద్దన్నవాళ్ళు వైరాగ్యాన్ని ప్రేరేపించారు.

ఇద్దరూ సెక్సులోని పవిత్రతనీ, ప్రయోజనాన్ని పట్టించుకోకపోవడం మన దురదృష్టం!

## శృంగారంలో రకాలు

తృప్తులు నాలుగురకాలని భారతీయ మానసవిజ్ఞానంచెప్తోంది దుఃఖాభావతృప్తి (వేదనలేనితృప్తి); సర్వకామావాప్తి తృప్తి(కోరికలన్నీ తీరినతృప్తి); కృతకృతత్వతృప్తి (చేయదగినదంతచేసిన తృప్తి) ప్రాప్తిప్రాప్యత్వతృప్తి(లభించవలసినదంతా లభించిన తృప్తి).

అంటే, వేదనలేనప్పుడూ, కోరికలన్నీ పూర్తిగాతీరినప్పుడు చేయవలసిన కార్యాన్ని చేసినప్పుడు, మనకు రావలసినదంతా పూర్తిగా వొచ్చినప్పుడు ....ఈనాలుగు సందర్భాలలోనే మనకు నిజమైన తృప్తి లభిస్తుంది!

తృప్తిని కలిగించే ప్రతి అనుభూతినీ "సెక్స్" అన్నాడు ఫ్రాయిడ్! "శృంగారం" అనే పదం లైంగిక పరమైన అర్థంలో గాక ఫ్రాయిడ్ చెప్పిన "సెక్స్" దృష్ట్యాఆలోచిస్తే పరమపవిత్ర మైనదిగా కనిపిస్తుంది.

శృంగారానికి "శుచి" అనే నామాంతరంవుంది. "శృంగారః శుచిరుజ్వలః" అనే నిర్వచనానుసారం. శుచిగా (జుగుప్స కలిగించ కుండా) వుండే, ప్రకాశవంతమైన అనుభవాన్ని శృంగారంఅన్నారు.

కేవలం స్నేహం, వాత్సల్యమే ఈ శృంగారంలో మనకుకని పిస్తాయి.శృంగారం..అనేపదంలోమమత, అనురాగం, ప్రణయం స్నేహం.... ఇన్ని అర్థాలున్నాయి.

ఇక్కడ "ఋతు" (సెక్స్) లేదు. ప్రేమ మాత్రమేవుంది.

"సెక్స్"కు శృంగారం అనువాదంకాదు. సెక్సువేరు, శృంగారంవేరు. ఫ్రాయిడ్‌చెప్పిన "సెక్స్"కూ బయట మనం మాట్లాడుకునే ఋతుసెక్స్‌కూ చాలాతేడావుంది. ఒకటి "అమలిన శృంగారం". ఇంకొకటి "మలిన శృంగారం" ఈరెండింటిదారులే వేర్వేరు!

ఫ్రాయిడ్ "Infantile sexual theory"లో అసూయా ద్వేషాలు లేని సుఖాన్ని కలిగించే సర్వ ప్రవృత్తుల్ని "శిశు శృంగారం"లోకి చేర్చాడు.అమలిన శృంగారవాదులైతే ఈ సర్వ ప్రవృత్తుల్ని పెద్దల శృంగారంలోకి కూడా చేర్చుకున్నారు.

అందుకే పిల్లల "సెక్స్" అమలిన శృంగారం అనపలసిన అవసరం ఉంది.

రమ్యాలోకంలో ప్రేమ ప్రస్తావనలో స్నేహం, సురతం వాత్సల్యం అనే ఈ మూడూ ప్రేమకు అంగాలుగా చెప్పబడ్డాయి సురతం అంటే, లైంగిక సంబంధమే [Sexual deed] ! కాని, రతి అంటే (రతి-రమ్-క్రీడాయాం అనే అర్థంలో) క్రీడించడంఅని!

యోగి ఆత్మరతి కలవాడు. ఆత్మానందాన్ని పొందేవాడు. అమలిన శృంగారం కేవలం ఈ "ఆత్మరతి"కి సంబంధించినది.

తన బిడ్డకు పాలిచ్చేప్పుడు ఒక విధమైన పులకరింతను పొందుతుంది తల్లి. అదీ సుఖానుభూతే కాబట్టి దాన్ని శృంగారమే అనాలి కదా! అమలిన శృంగార వాదులు దాన్ని "పుత్ర శృంగారం" అన్నారు.

భర్త మైథునంలో ఇచ్చినంత తృప్తిని పాలు తాగడం ద్వారా బిడ్డ తల్లికి అందచేస్తున్నాడు. అందుకేనేమో తల్లి, బిడ్డ ముందైనా సరే పమిట లేకుండా ఉండలేదు.

శంకరాచార్యుల వారు దేవీ స్తన కలశాలను వర్ణించారు. దీనిని "మాతృ శృంగారం" అన్నారు. మరి ఫ్రాయిడ్ - శిశు శృంగార సిద్ధాంతాన్ని ప్రతిపాదించినప్పుడు, తలిదండ్రులతో తమ కుండే అనుబంధాల వలన రెండేళ్ళ వయసున్న పిల్లలు అమ్మతోటి, నాన్నతోటి విపరీత బంధాన్ని పెంపొందించు కోవాలని చూస్తారు.... అన్నప్పుడు, మనవాళ్ళు కూడా ఫ్రాయిడ్‌ను ద్రోహి, దుర్మార్గుడు అని తిట్టిపోశారు.

ఈ సంకుచిత మనస్తత్వం మన వాళ్ళలో ఇంతగా నాటుకు పోవడం చేతనే మన శాస్త్రాలు గానీ, మన ఆలోచనా విధానం గానీ, వెలుగులోకి రాలేక పోతున్నాయి.

శృంగారాన్నీ, సెక్సునూ ఒకే గాటన కట్టేసి, గడ్డి పెడుతున్న పాశ్చాత్య సమాజాన్ని గుడ్డిగా అనుకరించే దుస్థితికి మనం దిగజారాం అంతే!

ఇద్దరు పురుషుల లేక, ఇద్దరు స్త్రీల మధ్య వుండే అలైంగిక స్నేహాన్ని "స్నేహ శృంగారం" అన్నారు. అదే, ఒక పురుషుడూ ఒక స్త్రీ కేవలం మనిషికీ మనిషికీ మధ్య వుండ వలసిన అనుబంధాన్ని పెంచుకొని స్నేహితంగా వుంటే దాన్ని "ఫిలియా" అంటారు. ఫిలియా కూడా స్నేహ శృంగారమే!

భారతీయ తత్త్వ చింతన చెప్పేదేవిటంటే, ఆనందాన్ని కలిగించే ఏ ప్రవృత్తి అయినా, దాని వలన ఎదుటి వ్యక్తి దుఃఖించకుండా వున్నంత వరకూ, అది శృంగారమే అవుతుంది. శృంగారం అంటే ఎదుటివ్యక్తితో అనుబంధం మాత్రమే. అందులో "సెక్సు" ప్రసక్తి లేదు.

సెక్సునూ శృంగారాన్నీ విడదీసుకొని ఆలోచించుకోగల దశకు మనం ఎదగాలి.

## మన్మథుడి అవతరణ

"మన్మథుడు [ఈరోస్] ఈ విశ్వాన్ని ఏర్పరచడానికి పంపబడ్డాడు. అప్పుడంతా నిశ్శబ్దం. అప్పుడు ప్రకృతి నగ్నంగా ఉంది. నిశ్చలంగా ఉంది. ఇప్పుడంతా జీవితం. ఆనందం. చైతన్యం....." అని ఆదిమ గ్రీకు పురాణంలో వ్రాయబడి వుంది.

ఈ ఈరోస్‌ను అర్థం చేసుకోవాలంటే మనం కాస్త చరిత్ర లోకి వెళ్ళాలి. *

అది అగాథనుడి నివాసం. అక్కడ సోక్రటీసు, అరిస్టోఫేనస్, అల్సిబియాడిస్ ఇంకా చాలా మంది విందు చేసుకుంటున్నారు. అంతకు క్రితం రోజు, తాను బహుమతిని గెల్చుకున్నందుకు అగాథన్ ఆపూట పండితులందరికీ విందు చేస్తున్నాడు. వచ్చిన వాళ్ళంతా పండితులే కాబట్టి కొంచెం సేపు శాస్త్ర చర్చ అక్కడ సహజంగానే ప్రారంభమైంది.

ప్రేమ టే ఏమిటి?" అనడిగాడు సోక్రటీసు. 'డయోటిమా' దేవత విషయాన్ని అప్పుడతను ప్రస్తావించాడు.

డయోటిమా ప్రేమకు గురువు. అతను మరణించే మనిషి కాదు. అలాగని మరణించలేని దేవుడూ కాదు. రెంటికిమధ్య సంధి లాంటివాడు. అతనో గొప్ప ఆత్మ [Daimon]. అతను దైవత్వానికీ, అమరత్వానికి మధ్యవర్తి, మనిషికి దేవుడికి మధ్య సంధానకర్త. ఈ ప్రకృతిలోని శక్తులన్నీ అతనిలో వున్నాయి. అతని శిష్యుడు ఈరోస్. ఈరోస్ ఒకశక్తి. మనిషినీ, అతని పరిసరాలనీ ఒకచోట చేర్చి, ప్రకృతివైపు అంతరోన్ముఖుణ్ణిచేసే ప్రేమదేవత ఈరోస్.

ఈరోస్ కేవలం ఇద్దరు వ్యక్తుల మధ్య కలయికను ప్రోత్సహించేవాడు కాదు. జ్ఞానంకోసం తహతహలాడే ప్రేరణ [Instinct] ఈరోస్. సత్యంతో ఐక్యంఅయ్యేలా మనిషినినడుపుకు పోయేది ఈరోస్. ఆయనవలనే మనంకవులమయ్యాం. శాస్త్రజ్ఞుల మయ్యాం. నీతిమంతులమయ్యాం....

* See love and will — Rollo may — P. 7'.

ప్రేమనేది ఈరోస్ రూపంలో మనిషిలోవున్న ఒకశక్తి. దాన్ని సంపూర్ణంగా సాధించుకున్న మనిషి అజేయుడు. అమరుడు....

"ఈరోస్ నాకరికతని నిర్మించే ప్రేరకం నాగరికత మన్మథుడి ఆజ్ఞలను పాటిస్తేనే చైతన్యవంతమౌతుంది. మనిషిలో చెల రేగే శృంగారిక ప్రవృత్తులకు ఒక క్రమశిక్షణ, ఒకమార్గ నిర్దేశకతా కల్పించగలిగే ఏకైక వ్యక్తి మన్మథుడు. ఈ ప్రవృత్తులన్నీ ఒడు లేని నదిలాంటివి. వీటికి ఒకమార్గం కావాలి లేకపోతే నిరువృథా అయిపోతుంది. శృంగారికానందమూ అంతే!' అన్నాడు సోక్రటీసు. ఫ్రాయిడ్ సిద్ధాంతాలకు ఈ వాదనే ప్రేరణ!

## కామంలేనిదే ప్రేమలేదు!

ఆరిస్‌కూ అఫ్రొడైట్‌కూ మన్మథుడైన ఈరోస్ పుట్టాడు. కాని, ఈరోస్ అందరుపిల్లల్లా ఎదగక, పసిగుడ్డుగానే కొన్ని సంవత్సరాల పాటుండిపోయాడు ఒకసారి "ఆకాశవాణి" ఈరోస్‌గురించి "కామంలేనిదే ప్రేమ ఎదగదు—Love Can Not Grow Without Passion —" అని పలికింది! ఆ తర్వాత అతని తలిదండ్రులకే "కామం" అనబడే "యాంటీరోస్" పుట్టాడు. అంటే ఈరోస్ అనే ప్రేమకు ప్రేమ రహితుడు సోదరుడుగా పుట్టాడు.

ప్రేమ, కామం ఇద్దరూ అల్లారుముద్దుగా పెరుగుతున్నారు. ఇద్దరూ అజానుబాహులే. అందగాళ్ళూ, మధురగాత్రాలూ.

ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, కాముణ్ణి వదలి ఒక్క క్షణం దూరంఅయితేచాలు, మన్మథుడు ఎప్పటిలాగే చిన్నపిల్లవాడిలా మారిపోయి పిల్లచేష్టలన్నీ చేసేవాడట!

ఈ కథనుబట్టి, ప్రేమ, కామం అనేవిరెండూ అవినాభావం సంబంధం కలవనీ, అంతతేలికగా విడదీయ వీలులేనివనీ అర్థం అవుతోంది. ప్రేమలేని కామకలాపాలు అవాంఛనీయమైనవని నమ్మిన పురాణకాలం నాటిగ్రీకులు మన్మథుణ్ణి సృష్టించుకొని ఆరాధించారంటే, ఆనాటి సమాజం ఉన్నతిని మనంఊహించ వచ్చు.

ఇవ్వాళ పాశ్చాత్య సమాజంలో మన్మథుడికీ యాంత్రికతకూ నిరంతర పోరాటం సాగుతోంది [war between Eros and Technology], కాని కామానికీ, యాంత్రికతకూ ఘర్షణలేదు ఈనాటి మన పరిశోధనలన్నీ సెక్సును రక్షించేవిగా వున్నాయి. సంతాన నిరోధఔషధాలు, సంభోగించడం ఎలా? అనిప్రాసేసాహితి గూఢాలు ఈయుగాన్ని పరిపాలిస్తున్నారు...." అంటున్నాడు అమెరికన్ సమాజపు పవిత్రతావాది "రోలో మాయ్"

ఫ్రాయిడ్ ఈరోస్‌గురించిచెప్తూ "Thanatos" అనబడే 'మృత్యు పేరణ' Death Instinct కు వ్యతిరేకంగా ప్రతిజ్ఞపూని మన్మథుడు శరీరంలోకి ప్రవేశిస్తాడు... జీవితంకోసం, చైతన్యం కోసం మృత్యువుపైన ధ్వజమెత్తినవాడు మన్మథుడు—" అన్నాడు.

"మృత్యు ప్రేరణ" అంటే నిశ్శబ్దం. జీవిత వ్యవస్థ అంతా "ఈరోస్" వలనా, ఈరోస్‌లో పోరాడే ఈ నిశ్శబ్దం వలనా సాగి పోతోంది.—" అన్నాడు ఫ్రాయిడ్ మనిషి జీవితంలో "చరమ ఘడియ"లకు ఫ్రాయిడ్ ఒక్కడే ప్రాముఖ్యత నీయగలిగాడు. అది ప్రకృతిలోని ఏకైక అత్యవసర ప్రవృత్తిగా ఈ మనోవిజ్ఞాని

మాత్రమే అంగీకరించి, ఆలోచించి, దానిని కూడా కోరికను ప్రేరేపించే "Instinct" గా భావించాడు.

అందుకే ఫ్రాయిడ్‌ను విమర్శించే వ్యక్తులు— అతని సిద్ధాంతాల వెనక పురాణ సంబంధమైన ఆలోచన లున్నాయని అవహేళన చేశారు.

## తృప్తిని పొడిగించాలి

ఫ్రాయిడ్ మనిషిలోని అంతః ప్రేరణలని రెండు రకాలుగా వర్గీకరించాడు. ఒకటి సుఖానుభూతి నిచ్చేది. రెండు దుఃఖానుభూతి నిచ్చేది. సుఖానుభవ ప్రేరణలకి "ప్రేమ", దుఃఖానుభవ ప్రేరణలకు ద్వేషం కారణంగా ఆయన విశ్లేషించాడు.

"మనిషిలోని అన్ని శక్తుల్నీ నడిపేది "ప్రేమ" అనే ప్రేరణ. దాని వలననే మానవజాతి నడుస్తోంది. మానవజాతి నిలుస్తోంది—" అన్నాడు ఫ్రాయిడ్. సుఖానుభవ ప్రేరణలకు ఫ్రాయిడ్ సెక్సు అని పేరు పెట్టాడు. అందులో లైంగిక ప్రవర్తనకు ఆధారమైనవాడు "ఈరోస్" (మన్మథుడు).

ఫ్రాయిడ్ దృష్టిలో సెక్సు, కామం అనేవి జీవితపు ప్రధాన ప్రేరణలు [Life instincts]. మనిషినీ మనిషినీ కలిపే మిత్ర వర్గాలివి స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలు, పుత్ర వాత్సల్యం, దేశభక్తి, పొరుగువారిని ప్రేమించడం, నిష్కల్మష స్నేహాలు— ఇవన్నీ సెక్సేనని నిక్కచ్చిగా చెప్పాడు ఫ్రాయిడ్. అవి లైంగికం గానీ, అలైంగికం గానీ, స్వలింగకం [Homo sexual] గానీ అదంతా సెక్సే నన్నాడు.

కాని, కరోస్ నడిపే శృంగారంలో దీనికి పూర్తి వ్యతిరేకత వుంటుంది. నిద్రలేచి తను ప్రేమించిన వ్యక్తిని గురించి ఆలోచిస్తారు. అప్పటి వరకూ తామిద్దరూ గడిపిన మధుర క్షణాన్ని మననం చేసుకుంటారు. ఆ అనుభూతిలోని తియ్యదనాన్ని [Savoring] అనుభవిస్తుంటారు. అందులో ఎప్పటికప్పుడు కొత్తదనాన్ని చవిచూస్తుంటారు.

ప్రేమ కోసం తహ తహలాడడమే అమలిన శృంగారం. "ప్రతి ప్రారంభం తియ్యదైనదే!" అనే ఫ్రెంచి నామెతే అమలిన శృంగారం. తృప్తిని పొడిగించడం "అమలిన శృంగారం" లోని ఆదర్శం!!

కొన్ని మానసికమైన ఆవేగిక అస్థిరవిషయాలలో సైతం కొన్ని నిజాలు దొర్లకపోవు. ప్రేమ అనేది అలాంటి అవాస్తికత లోంచి పుట్టిన వాస్తవిక అంశం. ఇది ప్రకృతి సహజప్రవృత్తి.

సృష్టిఏర్పడింతర్వాత ప్రేమచాలా కాలంవరకూ మనసులోనే వుండి. మనసు నిర్వర్తించే సృష్టికార్యానికి తోడ్పడుతుండేది. రాను రానూ నాగరికత పెరగింతర్వాత, ప్రేమ మనసులోంచి వాక్స్థానం లోకిచేరి, బాగా "వాడుక" లోకి వచ్చింది. కొంతకాలానికి ప్రేమ శాస్త్రాల్లోకిపోయి అక్కడ నియమాల, వర్గీకరణలతో బంధించ బడింది. ఇప్పుడు అక్కడకూడా లేదు. ప్రేమ ప్రపంచంలోంచి పూర్తిగా తప్పించుకపోయింది.

అయినా, మనసు సృష్టికార్యాన్ని ఆపడంలేదు. పశువులూ మనుషులూ బిడ్డల్ని కంటూనేవున్నారు.

ఇప్పుడాచరించబడ్తోన్న ప్రేమ—కేవలం లైంగిక ప్రవృత్తి చేత అప్పటికప్పుడు జనించి, లైంగికవాంఛ తీర్చుకునేందుకు

ఉత్తేజిత స్పందనల లోని "లయ"ను ఈ సెక్సుగా వివరించాడు ఫ్రాయిడ్. దానిలోని ఉద్వేగాన్ని తగ్గించడమే లైంగిక కృత్యంగా పేర్కొన్నాడు. సెక్సనేది శరీరంలో వ్యగ్రతనీ లేక ఉద్వేగాన్ని [Bodily tension] కలిగిస్తుంది. సెక్సును తృప్తి పరచడం అంటే, ఈ ఉద్వేగాన్ని ప్రసారితం[Release] చెయ్యడమే!

"ఈరోస్" అనేది గొప్ప ఆకర్షణ శక్తి. అది ముందుండి మనిషిని తనవైపుకు రప్పించుకుంటుంది. కాని సెక్సు వెనుక నించి మనిషిని తోసుకు వెళ్తుంది. ఈరోస్ మనల్ని ఆహ్వానిస్తుంది. సెక్సు మనల్ని పోలీసులు జైలుకు తీసుకు పోయినట్లు తోసుకు పోతుంది. ఈరోస్ మనిషికీ మనిషికీ మధ్య అనుబంధాన్ని పెంచుతుంది. మనిషికి మానవతా ధర్మాన్ని గుర్తుచేస్తుంది. సెక్సు మనో వికారాన్ని ప్రేరేపిస్తుంది.

ఈరోస్ ప్రసక్తి వున్న లైంగిక కృత్యం శృంగారం. నిజమైన శృంగారంలో ఉత్తేజం అంతకంతకూ పెరుగుతుందే కాని తరగదు.

ఈరోస్ ప్రసక్తి లేని లైంగిక కృత్యం "సెక్సు" అనబడే వ్యభిచారం. సెక్సులో ట్యూమ్ సెన్సు, డిట్యూమ్ సెన్స్ అనే రెండవస్థలున్నాయి. ట్యూమ్ సెన్స్‌లో ఆనందం, ఆవేశం వుంటాయి. డిట్యూమ్ సెన్స్‌లో తృప్తి, విరమణ వుంటాయి. శృంగారంలో ఈ విరమిం ప్రసక్తి లేదు.

సెక్సు విరమించబడ్డాక మనుషులు నిద్రకుపక్రమిస్తారు వ్యభిచారులయితే బట్టలు కట్టుకొని ఇంటికొచ్చి పడుకుంటారు.

మాత్రం ఉద్దేశించబడి, తృప్తి కలిగాక నశించిపోతుంది. కాబట్టి దీన్ని "లైంగికప్రేమ" [Sensual Love] అన్నాడు ఫ్రాయిడ్. ఇది వ్యభిచారభావాలున్న వ్యక్తులలో కలిగే ప్రేమ. దీనికి రంగూరుచీవాసన వుండవు.

అసలైన ప్రేమ మనిషికి అసాధ్యమైంది. ఫ్రాయిడ్ ఈ ప్రేమకిచ్చిన నిర్వచనం గొప్పది.

"ఇంక ఆవ్యక్తితో మన కెటువంటి అవసరమూ లేదు, ఆవ్యక్తి ఎట్టిపరిస్థితులతోనూ మనకు ఉపయోగపడరు—" అని తెలిశాక కూడా, ఆవ్యక్తి వట్ల ప్రేమను చంపుకోలేకపోవడం" నిజమైన ప్రేమ ప్రేమనశించేదికాదు. ఇంకోరూపంలోకి మారేదీకాదు, అది అస్థిరమైంది. అసాధారణమైంది.

ఈ ప్రేమ కామరహితం. [Passion Less] ఇక్కడ మాతృ భ్రాతృ ప్రేమల వసక్తిలేదు. "అన్న" వంకతో దొంగాటకాల ప్రస్తావనలేదు. కల్తీలేనిది, కల్మషంలేనిది. ఇద్దరుస్త్రీ పురుషుల మధ్యవున్న స్నేహబంధం....అంతే!

రోలోమాయ్ ఇలాంటి ప్రేమను "ఫిలియా" అన్నాడు. "ఫిలియా" ను గ్రీకులు స్నేహం అనే అర్థంలో ప్రయోగిస్తారు.

ఆయన ప్రేమను నాలుగురకాలుగా విభజించాడు. అందులో మొదటిది సెక్సు—ప్రేమ. లస్ట్, లిబిడో అనేవి ఈ లైంగిక ప్రేమలోని తీవ్రదశలు. ఇది వ్యభిచారులమధ్య వుంటుంది.

రెండవది "ఈరోస్" (శృంగారప్రేమ) ఇది పవిత్రమైన దంపతులమధ్య వుంటుంది.

మూడవది "ఫిలియా." ఇది నిష్కల్మష ప్రేమ. ఇద్దరు పురుషులూ లేక ఇద్దరు స్త్రీలూ స్నేహంచేసినట్లు ఒక పురుషుడూ, ఒకస్త్రీ ఆప్యాయతతో, ఆత్మీయతతో మెలగడం ఫిలియా! ఇది పవిత్రమైన స్నేహితులమధ్య వుంటుంది.

ఇంక నాల్గవది "అగాపె" పొరుగువారిని ప్రేమించడం వాళ్ళకుతోడ్పడం. ఇది సహృదయులలో వుంటుంది. భగవదారాధనను కూడా "రోలోమాయ్" అగాపె అనే ప్రేమలోకి వర్గీకరించాడు.

లాటిన్‌లో "కారిటాస్" అంటే సర్వమానవ సౌభ్రాతృత్వం. దాన్ని గ్రీకులు "అగాపె" అంటారు.

## హిందువుల అగ్రతాంబూలం

"ప్రియస్వభావః ప్రేమా" అని అమరసింహుడు ప్రేమను నిర్వచించాడు. ఈ ప్రేమకు పూజ్యభావంముఖ్యం. ప్రేమించుకునే వ్యక్తులమధ్య పరస్పరభక్తి, గౌరవం నాటుకుపోవాలి.

యిటువంటి ప్రేమనేర్పుకుంటేరాదు. వ్యక్తులు సంస్కారవంతులుకావాలి. వాళ్ళు స్వయంగానే ఉన్నత మనస్కులు కావాలి. ప్రేమించడం ఒకకళ అన్నారందుకే పెద్దలు!

భిక్షూచమన్‌లాల్ తన "హిందూఅమెరికా" గ్రంథంలో జాతుల ఆచార వ్యవహారాలనాధారంచేసుకొని అమెరికాలో "మయ" "ఇంకా" జాతులు హిందువులేనని నిర్ధారించాడు. కాని, ఆయనకంటే చాలాకాలంముునుపు, పంథొమ్మిదో శతాబ్దంఆదిలోనే "బ్రిస్టన్" అనే శాస్త్రజ్ఞుడు ప్రేమలోని తియ్యదనాన్ని ఆస్వా

దించడంలో ఆర్యజాతులకూ, అమెరికాలోని "మయ" జాతికీ చాలాదగ్గిర పోలికలున్నాయనీ. బహుశః వీరిపూర్వులు ఆర్యులే అయ్యుంటారనీ ఒకవాదనను లేవదీశాడు. సైకాలజీ ఇలాచరిత్రను కూడా నిర్ధారిస్తోంది!

ప్రేమించేవిషయంలో హిందువులలో మరే జాతికిలేనంత శక్తివుంది. సోక్రటీసు, ప్లేటోవంటి ప్రేమవాదుల్ని ప్రసవించిన గ్రీకుజాతి ప్రేమనుపొందడానికి ఎప్పుడూ వెనకే వుంటోందట: హోమోసెక్సువల్స్ గ్రీకు వీరులలో అధికులట!

ప్రకృతి ఏదృష్టితో చూసేవాడికి ఆవిధంగానే కనిపిస్తుంది. ఫ్రాయిడ్—పిల్లలునోట్లో వేలువేసుకోవడం 'సెక్సు' అన్నాడు. మాతృస్థనకలశాలను వర్ణించిన శంకరాచార్యుల వారిది భక్తి శృంగారం అన్నారు. తల్లి బిడ్డకు పాలిస్తూ పొందేఆనందాన్ని మాతృ శృంగారం-అన్నారు. సినిమావాల్ పోస్టర్ నుచూసి హస్త ప్రయోగం చేసుకునేవాడిది హస్తశృంగారం అందాం!

ఇదంతా సెక్సేనా? సెక్సుకు ఒక పద్ధతి, ఒకనియమం అంటూ ఏవీలేవా? అది విచ్చలవిడిగా బజార్న పడవలసిందేనా? జాతిని అభివృద్ధి వరచే ఈ ఏకైక విశేషం -సెక్సు- ఇవ్వాళ వెర్రి తలలు వేసి మనిషినినడిరోడ్డున పడేస్తోంది.నాగరికత పర్యవసానం ఇదేనా?

రామాయణగ్రంథానికి కారణమైన క్రౌంచ మిథున వియోగ కథను జ్ఞాపకంచేసుకోండి .. తనజతను కోల్పోవడంవలన దుఃఖించే ఆపక్షిభావంలో మనకు కేవలం ఋతు కనిపించదు. నాగరికుణ్ణని

గుండెలు బాదుకుంటున్న ఈ మనిషి లోలేని ఎలిమెంట్లేవో అవక్షి వేదనలో వున్నాయి.

"ఈరోస్" అంటూ ప్లేటో చెప్పిన మన్మథుడి అంశరూపాలే అజంటలో వున్నాయి. అదిలేకుండా, వ్యభిచరించే వ్యక్తులు వేశ్యలమీద పెంచుకునేది "సెక్సు-ప్రేమ." ఇది రానురానూ సక్రమంగా సంసారంచేసుకునే దంపతులలోకూడా కనిపించడం విచారకరం.

## ప్రేమించే కళాకారులుకంది!

కొంతమంది వాదిస్తుంటారు—పెళ్ళిలోనే ప్రేమ అనేది ఒకభాగం కాబట్టి, పెళ్ళిఅయినాక యువతీయువకులు చేసేది ప్రేమించుకోవడమే కాబట్టి ప్రేమగురించి ఇంతకు మించిన చర్చలు అనవసరం ...అని!

సృష్టికార్యం చెపితేతెలిసేదికాదు.దానిగురించి నేర్చుకోవడం ఏమిటి....? పెళ్ళిఅయినవాళ్ళేమైనా పసిపిల్లలా? అనే పెద్దలకు హావెలాక్ ఎల్లిస్‌చెప్పిన సమాధానం ఇది ...

Even the elementary facts of coitus needs to be taught—సంభోగానికి సంబంధించిన ప్రాథమిక నియమాలను సైతం బోధించవలసిన అవసరం వుంది—అంటాడాయన! సృష్టికార్యంగురించి తెలియచేయకుండా పెళ్ళిచేసి వదిలేస్తే వాళ్ళు జీవితాంతం మూర్ఖులుగానే వుండిపోతారంటాడు సర్‌జేమ్స్ పిగెట్.

ప్రేమించేకళలో లైంగిక ఆరోగ్యం [Sexual Hygeine] క్రమశిక్షణ అనేవి ప్రధానంగా వుంటాయి. స్థిరమైన అనుబంధాన్ని

స్థిరమైన భావాన్నీ, స్థిరమైన సంతానాన్నీ, స్థిరమైన జాతినీ సాధించుకోవాలంటే ప్రేమించే కళనుఅభ్యసించి తీరాలి. అది సాధనవలన సాధ్యపడుతుంది.

లైంగిక ప్రవృత్తులనేవి [Sexual impulses] మనిషి బలహీనతకు నిదర్శనంగా క్రైస్తవ మతం చెప్తోంది. కన్యగానే ఆడపిల్లలను వుంచేయడాన్ని గొప్పగా భావించుకున్న క్రైస్తవ మతాధికారులు ప్రేమించడాన్ని నిరశించారు. ఇప్పటికీ వీళ్ళు సెక్సు రాహిత్యమే కావాలంటారు.

సెక్సు నీతి సాధ్యపడాలంటే జంట కట్టేవాళ్ళు ప్రేమికులు కావాలి. ప్రేమించే శక్తి వున్నవాడు భార్యను ప్రేమిస్తాడు. పిల్లలను ప్రేమిస్తాడు. శ్రామిక జనాన్నీ ప్రేమిస్తాడు. అలా ప్రేమించగల వారికే సంభోగ సామర్థ్యం వుంటుంది.

ప్రేమించడం ఒక కళ! మనుషులంతా ప్రేమించే కళాకారులు కావాలి!!

ప్రేమనేది "Aim inhibited sex" అన్నాడు ఫ్రాయిడ్. సెక్సు కోరికను అణచుకోవడం వలన నిజమైన ప్రేమ పుడుతుందని ఆయన సిద్ధాంతం. ఇది ఇద్దరు స్త్రీపురుషుల మధ్య బలమైన లైంగికతను ప్రేరేపించే ప్రేమకు సంబంధించిన విషయం!

సెక్సు కోరికను ఎంత తగ్గించుకుంటే దంపతుల మధ్య అనుబంధ , ప్రేమ అంత పెరుగుతాయి. ప్రేమ ఎంత ఎక్కువగా వుంటే తృప్తి అంత ఎక్కువ లభిస్తుంది. తృప్తి ఎంత సిద్ధిస్తే సంభోగ సామర్థ్యం అంత వున్నట్లు!

## ప్రియుని కోసరం ఏడుపు — వ్యాధి విశేషమా?

నువ్వు కాదంటే నేను నుయ్యో గొయ్యో చూసుకుంటాను— అంటాడు ప్రియుడు. ఇలా ఒకరినొకరు బెదిరించుకోవడం "ప్రేమ" సాధారణ లక్షణాలలో ఒకటి.

"నీకేమైనా పిచ్చి పట్టిందా?" అని ప్రశ్నిస్తుంది ప్రేయసి పరమకటువుగా.

అవును! నిజంగా ప్రేమించి, ఆ ప్రేమ విఫలమవడం వలన పిచ్చి పట్టేందుకు అవకాశమూ లేకపోలేదు.

"పిచ్చి" అనబడే ఉన్మాదాన్ని ఆయుర్వేద శాస్త్రం— "ఉన్మాద్యతే మనః అనేన ఇత్యున్మాదః" అనే వ్యుత్పత్తి చేత మనసులో చంచలత కలిగించే ప్రతి వ్యాధీ ఉన్మాదమేనని చెప్పింది. ఈ నిర్వచనానుసారం, మానసికంగా మనిషిని చపలుణ్ణి చేసే ప్రతిదీ ఉన్మాదమే కదా .. అంటే, చంచలమైన మనసు కలిగిన వ్యక్తులంతా ఉన్మాదులే ఆధునిక మానస శాస్త్రం "చంచలత" ను మనోవికారంగా చెప్పింది. ఆయుర్వేదం ఉన్మాదంగా [Insanity] చెప్పింది. ఈ రెంటికీ పెద్ద తేడాలేదు!

తను ప్రేమించిన వ్యక్తిని కోల్పోయినప్పుడు, లేక తన ప్రేయసి మరణించినప్పుడు, ఆ ఆవేదనను తట్టుకోలేక మనసు నిత్యం రోదించడాన్ని "మౌర్నింగ్" అనే వ్యాధిగా చెప్పాడు ఫ్రాయిడ్. ఇది "శోకం" అనే లక్షణంగా ఆయుర్వేదం పేర్కొంది.

అలాకాక, తన ప్రేయసి తనను ఛీ పొమ్మన్నప్పుడు, ఇంటికి వచ్చి అదే పనిగా ఏడవడాన్ని "మెలాన్ ఖొలియా" అన్నాడు ఫ్రాయిడ్. దాన్ని "చింత" అనే లక్షణంగా చెప్పారు ఆయుర్వేద శాస్త్రకారులు.

చింత, శోకాదుల వలన కలిగిన "ఉన్మాదం" లో "మనో విభ్రమం" ముఖ్యమైన లక్షణం. మనసు గాఢంగా అభిఘాతాన్ని పొందడం వలన చంచలమౌతుందనీ, అదే మనోవికారాలకు కారణమనీ స్పష్టంగా చెప్పారు ఆయుర్వేదీయులు.

ఈ వ్యాధి సోకిన వ్యక్తి తన మనసులో దాచుకున్న రహస్యాల్ని విచిత్రంగా బైటపెట్టుంటాడు. మూర్ఛ పోవడం వంటి కొత్త వ్యాధులు జనిస్తాయి. ఒకప్పుడు వెర్రిగా సంగీతం పాడుతుంటాడు. కారణం లేకుండానే నవ్వుతుంటాడు. అకారణంగా ఏడుస్తుంటాడు. యుక్తాయుక్త విచక్షణా జ్ఞానం వుండదు. మూర్ఖత్వం పెరిగి పోతుంది....అని చెప్పారు ఆయుర్వేద శాస్త్రజ్ఞులు.*

ఫ్రాయిడ్ శోకాన్ని "మౌర్నింగ్" అన్నాడు. ప్రేమించిన వ్యక్తి మరణించడం వలన అతని గుండె పెట్టే గగ్గోలే మౌర్నింగ్. ఇది బాధాకరమైన సంఘటన [Painfull symptom] ఆ వ్యక్తికి. బాహ్య ప్రపంచం అంటే ఉత్సాహం పూర్తిగా

---

* "....... జాయేత చోత్కట తమో మనసో వికారః
చిత్తం భ్రమితిచ మనోఽనుగతం విసంజ్ఞో
గాయత్యథా హసతి రోదితి చాతి మూఢః
(మాధవ నిదానం, ఉన్మాద ప్రకరణం. 14.)

పోతుంది. తాను ఏడవడం వలన తన ప్రియురాలు తిరిగి రాదన్న సంగతి అతనికి తెలుసు. ఆ ఏడుపు ఆమెను తిరిగి రమ్మనీకాదు.... అది"శోక వ్యాధి" లక్షణం అంతే!

శోక వ్యాధి—[Mourning] సోకిన వ్యక్తులు మరోవ్యక్తిని ఆమె స్థానంలో వూహించుకోలేరు. ఇది స్త్రీలలో ఎక్కువగా గమనించవచ్చు. ఇలాంటి పురుషులు బహు తక్కువ మంది. బహుశః స్త్రీల ఈ బలహీనతపైన దెబ్బ కొట్టడానికేనేమో, విధవా వివాహాలను సంఘం ఆమోదించలేక పోతోంది.

ఫ్రాయిడ్ "చింత వ్యాధి"ని "Melancholia" అన్నాడు. తీవ్రమైన విచారాన్ని "చింత" అంటారు.

శోక వ్యాధిలోలా ప్రేమించిన వ్యక్తి మరణించనవసరం లేదీ వ్యాధిలో. తనను కాదన్నా, తనకు కనిపించకుండా పోయినా, కనిపించినా మరొకడితో తిరుగుతున్నా, అల్ప బలంవున్న మనస్కులకు "చింత వ్యాధి" జనిస్తుంది.

బాహ్య ప్రపంచం అంటే ఉత్సాహం పోతుంది. ఎక్కడ లేని వైరాగ్యమూ వచ్చేస్తుంది. ఇంక ప్రేమించే ఓపిక పూర్తిగా నశించి పోతుంది. లేని పోని భ్రమలన్నీ వస్తుంటాయి. రకరకాల మనో వికారాల్ని అనుభవిస్తారు.

ఏదో వెలితిగా భావించుకొంటారు. అదేమిటో పైకిచెప్పలేరు.

కొందరు చింతావ్యాధిపీడితులు తనుకోల్పోయిన వ్యక్తి పేరూ ఊరూ అన్నీ చెప్పగలరు. కాని, ఆవ్యక్తి తమకేమౌతారంటే చెప్పలేకపోతారు. ఇలా క్రమేణా వాళ్ళలో అచైతన్యం, జడత్వం వ్యాపిస్తాయి.

ఇవి రెండూ ప్రమాదకరమైన వ్యాధులే. అవి మదిరి భయంకరమైన అవస్మారం (Epilepsy), మూర్ఛ, పిచ్చి వంటి అసాధ్యవ్యాధులకు దారితీస్తాయి. ఆడవాళ్ళకు హిష్టీరియా పిలిస్తే వస్తుంది—అనడానికి కారణం ఇదే. బాధపెట్టే బంధువర్గం మధ్య జీవిస్తోన్న కోడలుపిల్లకు తరచూ హిష్టీరియారావడం అత్యంత సహజం. చింత, శోకం ఇవిరెండూ అధికంగావుంటే ఆమగిషి మనకు దక్కనట్టిలెక్క.

### "ఆత్మహత్య" రోగలక్షణాలు

సందర్భం వొచ్చింది కాబట్టి మరోముఖ్యమైన విషయం గురించి కూడా చర్చిద్దాం.

వివిధకారణాల వలన మనసు బలహీనపడడాన్ని "న్యూరోసిస్" అంటారు. మానసిక బలహీనతతీవ్రమై ఉన్మాదదశకు చేరుకోవడాన్ని "సైకోసిస్" అంటారు.

ప్రేమకు దూరమైన వ్యక్తుల్లో ఈ "సైకోసిస్" జనించేందుకు అవకాశాలు ఎక్కువవున్నాయి. పదిమందిచేత ఛీ అనిపించుకున్న మనుషుల్లో ఆత్మహత్యచేసుకోవాలనే కోరిక పెరుగుతుంది.

ఈ "సైకోసిస్" లో ఆత్మహత్యచేసుకోవాలనే కోరిక పెరగడం ఒక ముఖ్యమైన వ్యాధివిశేషం.

ఈ కోరిక తరచూ జనిస్తుంటుంది రోగుల్లో. ఉన్మాదం (చంచలత) తీవ్రంగావుంటుంది. "మెలాన్ఖోలియా (చింత) ఈ వ్యాధికి కారణంగాచెప్తారు. దీన్ని Manic Depressive Psychosis అంటారు.

మనిషి విచారగ్రస్తుడై వుంటాడు. ఈ ప్రపంచంలో తాను బ్రతకడానికి అనర్హుణ్ణనే ఓ వెర్రిఆలోచన వుంటుంది వీళ్ళలో. ఈజీవితం నీటిబుడగలాంటిదనే మెట్టవేదాంతం చెబుతుంటారు. తనను తాను శిక్షించుకోవడంద్వారా ఈ పాపిష్టినరజన్మ ఎత్తినందుకు పాపపరిహారం అవుతుందనే గుడ్డినమ్మకం ఈ వ్యాధి గ్రస్థుల్లో కనిపిస్తుంటుంది.

కొంతమంది తాము ఆత్మహత్య చేసుకోబోయేముందు, తమ పిల్లల్ని చంపేయడానికి ఏమాత్రం వెనుకాడరు. తన పిల్లల్ని హత్యచేయాలనే ఈ తాపత్రయంకూడా వ్యాధిలక్షణమే!

తాను చేసేపొరపాటు పనులన్నీ న్యాయమైనవేనని వాదిస్తుంటారు' ఎవరైనా కాదని ఖండిస్తే ఆ అవమానాన్ని భరించలేక శరీరాన్ని గాయపరచుకోవడంవంటి హింసాత్మక కార్యకలాపాలూ సాగిస్తారు. తనలో ఏదోలోపం వుండబట్టే తనకీ గతిపట్టిందని అనుకొంటారు. కాని, ఆ తప్పుని ఇంకో వ్యక్తిపైకి నెట్టందే వాళ్ళకి తృప్తి వుండదు.

నిద్రపట్టకపోవడం, ఆకలిలేకపోవడం, బరువుకోల్పోయినట్లు అనిపించడం (లఘుత్వం), లైంగికవాంఛలు పూర్తిగా అణిగి పోవడం....ఇవి ఆత్మహత్య రోగలక్షణాలు!

తమమాటే వేదంఅంటారు. తాముచేస్తోందే న్యాయం అంటారు. కాదంటే పొడుచుకుచస్తామని బెదిరిస్తారు.

ఈ వ్యాధి సాధారణంగా 15 సంవత్సరాలనించీ 45 సంవత్స రాలవయసులోపు ఎప్పుడైనారావచ్చు. వాళ్ళజీవితం ఎప్పుడో ఏనూతిలోనో గోతిలోనో అంతమైపోతూవుంటుంది సాధారణంగా.

## దయ్యాల్ని చూసే మనుషులు

అలా, ఎవరి అభిమానాగికీ నోచుకోని, స్నేహితులేలేని మనిషిని మరోవింతవ్యాధి బాధిస్తుంది.

మనిషిని సమాజంలోంచి వేరుచేసి అతన్ని ఎందుకూ పనికిరాని భ్రష్టుడినిచేసివదిలే మానసిక వికారం షైజోఫ్రీనియా దీన్ని "విఘటనమనసు" (Split mind) అనిచెప్పుకోవచ్చు.

ఇది వంటరి తనాన్ని ప్రేరేపించే దారుణమైన మనోవ్యాధి· వీళ్ళకు ప్రేమించేశక్తివుండదు. వీళ్ళను ప్రేమించే వ్యక్తులు వుండరు.

రకరకాల భ్రమలు (Hallucinations) కలుగుతుంటాయి·

కొంతమంది పరమనిశ్శబ్దంగా వున్నప్పుడుకూడా వింత ధ్వనులు వినిపిస్తున్నాయని చెప్తుంటారు. అలాగే, మనకు కనిపించని వింతవస్తువులేవో వాళ్ళకి కనిపించినట్లు చెప్తారు. ఎడారిలో కూర్చోబెట్టినా గారెలవాసన ఎక్కణ్ణించోవస్తున్నదంటారు మరికొంతమంది.

ఈ మనోవికారుల్నిచూసి, ఇదంతా అతీంద్రియశక్తిగా భావించుకొని పూజలూ, పునస్కారాలూ ప్రారంభిస్తారు మన అమాయకభక్తకోటి. ఈ భక్తకోటి ఇలాంటివాళ్ళుకాబట్టే ఈ వికా

రులంతా "బాబా" లుగా మారి చికిత్సలకు బదులు పూజలూ, నైవేద్యాలూ పొందుతున్నారు.

నేనే కీస్తునీ, నేనే రాముణ్ణీ, నేనే జొరాష్టరునీ అనే చాలా మంది బాబాలలో ఈ మనోవికారంవుంది. తననితాను అతీత మానవుడిగా (Superman) భావించుకోవడమే 'షైజోఫ్రినియా'!

వీళ్ళ అదృష్టం ఏవిటంటే, వీళ్ళవికారమే ఈదేశంలో వీళ్ళ పాలిటి బ్రహ్మాండమైన వరం అయ్యింది.

"పారానోయియా" అనే వ్యాధిలో దయ్యాలుకూడా కనిపిస్తుంటాయి....!. తాముదయ్యాలతో మాట్లాడుతున్నామని చెప్పుకొంటారీవ్యాధిపీడితులు.

అవివాహితుల్లోనూ, లైంగికవాంఛలు తృప్తినొందని వ్యక్తుల్లోనూ ఈరెండు మనోవికారాలూ ఎక్కువగా వుంటాయి.

సెక్సును అర్థం చేసుకోలేకపోవడం, సెక్సునుసక్రమంగా వినియోగించుకోలేకపోవడమే మనోవికారాలకుకారణం. ప్రేమించిన వ్యక్తినే సంభోగించే వాళ్ళకు మనోవికారాలు జనించవు. అదే అమలిన శృంగారం....

# 2. పెళ్ళెందుకు చేసుకోవాలి?

"స్వేచ్ఛా శృంగారం" కోసం స్త్రీపాతివ్రత్యాన్ని సైతంనిరసించినచలంగారు, వివాహంతో నిమిత్తంలేని ప్రేమవ్యవస్థని కోరుతూ, పెళ్ళిఎందుకు అన్న విషయంమీద ఇలారాశారు....

"సహజమైన కామం తీర్చుకోవడం ఒక్కటే వుద్దేశ్యమైతే, వివాహం అనవసరం. సంఘానికి వివాహం అవసరం.

1. పిల్ల లక్షేమంకోసం తల్లిదండ్రులు ఇద్దరూ పాటుపడటం కోసం.

2. భార్యాభర్తలూ కాపురాలుగావుంటే స్త్రీకోసం పురుషులూ, పురుషుడికోసం స్త్రీలూ తగాదాలు పడరు.

3 సంఘం ఆరోగ్యం...."

నిజానికి—పెళ్ళి, దాని ప్రయోజనం ఇదేఅయితే, పెళ్ళికి తలపడే అమ్మాయిలకూ, అబ్బాయిలకూ, వాళ్ళకు పెళ్ళిళ్ళుచేసే అమ్మానాన్నలకూ ఈరకం ఆలోచనా విధానమేలేదు.

ఒకస్త్రీని తన స్వంతంచేసుకోవడానికి, ఒకఆడదానిమీద తను అధికారంచెలాయించడానికి, బైటతిరిగితే అయ్యేఖర్చుని భార్యకేపెట్టి ఆమెతోటే తృప్తిపడడానికి, వంటింటిచాకిరికీ, తన బట్టలుతికించుకోవడానికీ, తలకు కొబ్బరినూనెరాయించుకోవడానికీ, ఇంటికిరాగానే బూట్లువిప్పదీయించు కోవడానికీ, వెళ్ళేప్పుడు పాలిష్‌చేయించి తొడిగించుకోవడానికీ, తానెంత అసమర్థుడైనా, అనాకారిఅయినా, అనుక్షణం తనఅడుగులకు మడుగులొత్తుతూ, తన కాళ్ళకునమస్కారాలు పెట్టించుకోవడానికీ, ఒకఆడదాని చేతవెట్టిచాకిరీ చేయించుకోవడానికి మన మగజనం పెళ్ళికి తలబడుతున్నారు.

మరి, మధ్య తరగతి మహిళలు పెళ్ళెందుకు చేసుకుంటున్నారంటే, సంఘం(?) కోసం, పరువు కోసం, మర్యాద కోసం, బలవంతాన కోరికలను పెళ్ళిదాకా దిగమ్రింగి, తండ్రికి ఓపిక కుదిరినాక, తనను "నచ్చింది" అన్న మగాడు తన కట్నానికి

అంగీకరించినాక, వాడి సంపాదనలో శేషజీవితాన్ని గడవ డానికి— మొహమాటానికి— పెళ్ళికి అంగీకరిస్తున్నారు.

వీళ్ళలో ఏఒక్కరికీ ప్రేమ-పెళ్ళి-శృంగారం అనే పదాల వెనుక అంతర్యం తెలీదు తెలిసినా దాన్ని పట్టించుకోరు. మొగుడు అకారణంగా తిట్టినా, కొట్టినా, రెండు క్షణాలు గుడ్లలో గుడ్లలు కుక్కుకొని అంట్లుతోముకోవడంలో మునిగిపోయే ఈనాటి సగటు "ఆడమనిషి"కి జీవితంపట్ల ఒక అవగాహన, ఒక ప్లాను, ఒక నిర్ణయం వుండేందుకు అవకాశం లేదు. మన దేశంలో వివాహ వ్యవస్థ బానిస భావాలతో నిండి పోయింది.

చలంగారే అన్నారు— పెద్దవారు సంబంధము నిర్ణయిస్తే' బుద్ధి తెలీక పూర్వమే కట్టారంటారు. వాళ్ళనే నిర్ణయించుకోమంటే, మేము పొరపడ్డామంటారు. చిన్నప్పుడే పెళ్ళి చేసుకోమంటే పూర్ణానుభవం రాలేదంటారు. పెద్దయిన తర్వాత చేసుకోమంటే, యీలోపున యెట్లా నంటారు. భర్తల్ని మార్చుకోవడానికి అనుజ్ఞ యివ్వకపోతే, వాళ్ళే మార్చుకుంటారు. అజ్ఞయిస్తే కాపురాలు నిలవవు. పిల్లలకు యిళ్ళుండవు.

ఇదీ మన కాలపు యువతీ యువ లు "పెళ్ళి" అనే వ్యవస్థ పట్ల ప్రదర్శిస్తోన్న గౌరవం.

## పెళ్ళి — దాని పరిణామం

టర్నర్ అనే పండితుడు ప్రేమను రెండు రకాలుగా విభజించాడు. ఒకటి-కేవలం పెళ్ళి కోసం— బాధ్యతలు మోయ డానికి. రెండు-కేవలం సెక్సు కోసం— కోరికను తీర్చుకోవడానికి అన్నాడు. ఈనాటి పరిస్థితిని చూస్తే ఈ రెండూ పరమదౌర్భాగ్యం

గానే ఆచరించబడుతున్నాయి కుటుంబ వ్యవస్థ మొహమాటానికి సాగుతున్న "వ్యాపారం".

ప్రారంభ రోమన్లు బానిసల్ని ప్రస్తావించేప్పుడు ఈ కుటుంబ శబ్దాన్నే ఉపయోగించారు. "ఫామిలియా" అంటే బానిసత్వం. "ఫాములస్" అంటే ఇంటి బానిస. ఫామిలియా అనే పదం ఒకే ఇంటిలో వుండే బానిసల మొత్తాన్ని సూచిస్తుంది. పనికిమాలిన బానిసల్ని కాల్చి చంపేసే హక్కు కూడా యజమాని (తండ్రి) కున్నట్లు ఏంగిల్స్ వ్రాశాడు.

నిజానికి భాషావేత్తలు చెప్పిన ఈ పదోత్పత్తి వలనం బానిసత్వం లోంచి కుటుంబ వ్యవస్థ వచ్చినట్లు కనిపిస్తోంది.

కాని, పెళ్ళి పరిణామ క్రమాన్ని నిర్ణయించిన మోర్గన్, ఏంగిల్స్ వంటి సామాజిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం కుటుంబ వ్యవస్థ లోంచే బానిసత్వం వచ్చిందనీ, పెళ్ళి లోంచే వ్యభిచారం పుట్టిందనీ స్పష్టం అవుతుంది.

ప్రకృతి జీవనానికి పెళ్ళి ఒక కార్య సాధకం ఎంతమాత్రమూ కాదు. అప్రధానమైన ప్రపంచపు ఆచారాలలో ఇదొకటి. ఒక జాతి రక్షించబడడానికి పెళ్ళి చేస్తోన్న మేలంటూ ఏదీ లేదు. పెళ్ళి లేకపోతే మనుగడ లేదన్నది లేదు. విలువలేని విషయాలలో పెళ్ళి మొదటిది.

ఇలా మాట్లాడితే, మన సామాజిక వాదులు అంగీకరించక పోవచ్చు. అందుకే పెళ్ళి ప్రాముఖ్యత ఏవిటో ముందు మనం నిర్ణయించాలి.

పెళ్ళి అంటే కలయిక. కలయిక వలన జరిగే మేలు పరస్పర సహకారం. పరస్పర సహకారం వలన ఉన్నతమైన సాంఘిక నిర్మాణాన్ని చేపట్టగలుగుతాడు. మనిషి పుట్టిన ఇన్ని సంవత్సరాలలోనూ ఇప్పటి ఈ స్థితికి స్త్రీ పురుషుల పరస్పర సహకారమే కారణం.

కాబట్టి, పెళ్ళిని మనం ఈ విధంగా నిర్వచించవచ్చు. తాత్కాలికంగాగాని, శాశ్వతంగాగాని, ప్రేమ నిండిన స్త్రీ పురుషుల కలయిక వలన మానసికమైన ఎదుగుదల కలిగి, సంతానోత్పత్తినీ, దాని అభివృద్ధినీ నిర్ణయించగలిగే వ్యవస్థ పెళ్ళి!"

తరతరాల సాంఘిక, సామాజిక సాంస్కృతిక విశిష్ట భావ సంపుటి.... ఈ వివాహం. అది సెక్సుకు మాత్రమే పరిమితమైంది కాదు. మనిషికీ మనిషికీ మధ్య అనుబంధాన్ని, అవగాహననూ ఏర్పరచగలిగే ఒక ఉద్యమంగా ఈ వివాహాన్ని ఉపయోగించుకోవాలి. పెళ్ళనేది ఎవడో ఒక దేవుడు సృష్టించిన ఘనకార్యం కాదు. దాని వెనక మానవజాతి వయసంత చరిత్ర ఉంది.

## వ్యభిచారంలేని పెళ్ళిళ్ళు

కుటుంబ వ్యవస్థ ఈనాటి ఈ దశకు పరిణమించడానికి ఎన్ని వొడిదుడుకుల్నెదుర్కొన్నదో మనకు మోర్గన్ పండితుడి "ఏనిసెంట్ సొసైటీ" అనే పరిశోధిత గ్రంథం వలన తెలుస్తుంది. ఏంగిల్స్ చెప్పిన కుటుంబ వ్యవస్థకు ఈ గ్రంథమే ఆధారం.

మనిషి అవతరణతోపాటే "కామం" కూడా జనించడం అత్యంత సహజం. మొదటి సారిగా జరిగిన మానవ సంభోగం

సంతానోత్పత్తి నుద్దేశించికాక, కామోద్రేకాన్ని అణచుకోవడానికే ననడానికి ఆతర్వాత జరిగిన సంఘటనే సాక్ష్యం

ఆ రోజుల్లో ఒకేసారి ఆడవాళ్ళు బహు భర్తృత్వాన్నీ, మగవాళ్ళు బహు భార్యాత్వాన్నీ అవలంభించే వారని పరిశోధకులు నిర్ణయించారు. ఇది "ఉమ్మడి వివాహబంధం"! ఆ ప్రాంతంలో నివసిస్తున్న యావత్ మగజాతీ భర్త. మొత్తం ఆడజాతి భార్య — అంతే!

అందు వలన ఇంకో తరానికి వచ్చేసరికి వారంతా భార్యా భర్తలే కాదు. సోదరీ సోదరులు కూడా అయ్యారు. సోదరీ సోదరులూ తలిదండ్రులూ కలిసి జంట కట్టడం ప్రారంభించారు.

కాని, ఈ పశు ప్రవృత్తి అంతగా విజయవంతం కాలేదు. జంతువు కన్నా పరిణతి పొందవలసిన మానవుణ్ణి ప్రకృతి జంతువులా ప్రవర్తించనీయ లేదు. తలిదండ్రులకూ, సంతానానికీ మధ్య లైంగిక సంబంధాల నిషేధంతో కుటుంబ నిర్మాణం మొదటి మెట్టెక్కింది. ఆ తర్వాత సోదరీ సోదరుల మధ్య సంబంధాలు నిషేధించబడ్డాయి.

ఈ ఆచారాన్ని నిషేధించిన తెగలు వేవేగంగా అభివృద్ధి చెందాయని వ్యాఖ్యానించాడు ఏంగెల్స్. గ్రీసు రోములు ఈ నిషేధం పాటించి దాని ద్వారా నాగరికతలోనికి పరిణతి పొందాయి.

రక్త బాంధవ్యం లేని ఈ గణాల మధ్య వివాహం జరగడం వలన శారీరికంగానూ, మానసికంగానూ కూడా బలిష్టమైన

సంతానం కలగసాగింది. అభివృద్ధి పొందుతున్న రెండు తెగలు.... ఒంటిగా కలిసినప్పుడు కొత్త పుర్రె, మెదడు, విస్తరిస్తుంది. రెండు తెగల వారి శక్తులు ఇద్దరిలోనూ విస్తరిస్తాయి...." అన్న మోర్గన్ వాక్యాలను ఈసందర్భంలో ఏంగెల్స్ ఉదాహరించాడు.

కానీ, ఇంత ఔన్నత్యం అంత తేలిగ్గా రాలేదు. దాని వెనకాల మరో చరిత్ర ఉంది. హవాయి దీవులలో ఇప్పటికీ కొనసాగుతున్న ఒక ఆచారం ఈ వ్యూహకు ప్రేరణ.

కొంతమంది అక్కాచెల్లెళ్ళు — వాళ్ళు ఒక తల్లికే పుట్టిన బిడ్డలు కావాలని లేదు... వరసకైనా కావచ్చు — తమ తమ్ముడి భర్తలకు ఉమ్మడి భార్యలౌతారు. ఈ భర్తలంతా అన్నదమ్ములు కావాలని లేదు. కాకపోయినా, వాళ్ళు "ప్యూనలా" అని పిలుచుకుంటారు. ప్యూనలా అంటే, "సహచరులు" అని. సహచరత్వం స్త్రీ కలయికకు సంబంధించింది కాబట్టి ఈ పెళ్ళిని ప్యూనలాన్ పెళ్ళి అన్నాడు మోర్గన్.

ఇదొక రకం గుంపు పెళ్ళి. వీళ్ళ బిడ్డలకు తండ్రి ఎవరో తెలేదు. తల్లి మాత్రం తెలుసు కాబట్టి సంతానాన్ని తల్లి వైపు పరిగణించి, ఇంటి పేరు తల్లి ఇంటి పేరే వుంచే ఆచారం ఉండేది. అప్పుడు ఇంటి పెత్తనం అంతా ఆడదానిదే. అక్కడ బోళ్ళెడంత సెక్సు స్వేచ్ఛ. ఇంకా వ్యభిచారం అనే పదం పుట్టలేదు. ఏం చేసినా ఆ సమాజంలో వ్యభిచారం కాదు.

అలాంటి గుంపు పెళ్ళినుంచి మార్పు తెచ్చింది రాక్షస వివాహం. ఓ యువకుడు కొందరు మిత్రులసాయంతో, ఇంకో గుంపునుంచి ఒక యువతిని ఎత్తుకు వచ్చి అనుభవించదలచుకునప్పుడు, తనిమిత్రులతో సహా అంతా ఆమెను వరుసగా సంగమి

స్తారు. ఆఖరిసారిగా ఈ ప్రయత్నం చేసిన వాడికి ఆమెదక్కు తుంది. అప్పుడు ఆమె అతనికి భార్య అవుతుంది. రేపు ఇంకొకడు అదే పని చేస్తే ఆమె మొదటి వాడినుంచి రెండోవాడికి సంక్ర మిస్తుంది. తదనుగుణంగా మొదటివాడు ఆమెపైని హక్కును కోల్పోతాడు. ఇలా రాక్షస వివాహం జంట పెళ్ళికి అంకురార్పణ పలికింది.

ఈదశలో మగవాడు ఒకే ఆడదానితో జీవిస్తాడు. ఆర్థిక కారణాల మూలంగా బహు భార్యాత్వం క్రమేణా తగ్గిపోయింది. కాని, ఇతర స్త్రీలపైన వాంఛ మాత్రం మగవాడిలోంచి పోలేదు. ఇదే వ్యభిచారానికి ప్రేరణ. ఒకడితో కాపురం చేస్తున్నంత కాలమూ స్త్రీఖచ్చితంగా పాతివ్రత్యం పాటించితీరాలన్నది ఒక నియమం అయిపోయింది. లేకపోతే కఠినంగా శిక్షించేవారు.

ఇదంతా చూస్తుంటే, ఇప్పటి ఆచారాల ప్రకారం ఆనాడు "మూక ఉమ్మడిరంకు" జరిగేదనిపిస్తుంది. తాపీధర్మా రావుగారు "మనం అంతా అలాంటి రంకుజాతికి పుట్టిన సంతే" అన్నారు వ్యంగ్యంగా! ఇలా పెళ్ళి అనేది ఒక జాతి మనుషుల పరిధినుంచి ఒక జంట పరిధికి తగ్గిపోతూవచ్చింది. అప్పటికి పెళ్ళి ఒకరూపాన్ని దిద్దుకొంది.

## పెళ్ళంటే ఒక ఒప్పందమా?

ఈ జంట పెళ్ళిలో ప్రేమ అనేది ప్రధానాంశంకాదు. అవ సరంకోసం ఇద్దరూ కుదుర్చుకునే ఒక ఒప్పందం మాత్రమే ఇది కొంతవరకూ పరిణతి పొందిన మనిషి సాంధిచుకున్న వివాహ వ్యవస్థ.

అంతక్రితం అమలులోవున్న కుటుంబ పద్ధతులలో మగ వాళ్ళకు ఆడవాళ్లు కరువు అయిన సంఘటనలు లేవు. పైపెచ్చుచాలా

ఎక్కువగా లభిం వారు కాని, క్రమేణా ఒక ఆడ ఒకే మగవాడికి పరిమితం అయ్యె. ఆశతీరని అదే మగవాడు ఇంకో ఆడదాని కోసం కూడా ప్రయత్నించడంతో ఆడకరువు ఎక్కువయ్యింది. ఫలితంగా వ్యభిచారం అనే వ్యవస్థ పుట్టుకురాక తప్పిందికాదు. స్త్రీలకు డబ్బిచ్చికొనుక్కోవడం, ఎత్తుకు పోవడం ఎక్కువయ్యాయి. దీంతో అప్పటి వరకూ వున్న ఆడపెత్తనం రద్దయ్యింది. తల్లిహక్కు పోయింది. ఇంటిపేరు మగవాడికి మార్చబడింది.

"ఏంగిల్స్ వ్రాశాడు" తల్లి హక్కును రద్దు చెయ్యడం స్త్రీ జాతికి సంభవించిన మొదటి పరాజయం. దీనివలన ప్రపంచ చరిత్రే మారిపోయింది. ఇంటి విషయాలలో కూడా మగవాడికే అధికారం వచ్చింది. ఆడది పరాభవాన్ని పొందింది, మగవాడి కామానికి బలైపోయింది. పిల్లల్ని కనేయంత్రం అయి పోయింది...."

జాతి పెద్దలంతా కలిసి, ఆడదాని శీలాన్ని రక్షించడానికి పాతివ్రత్యాన్ని నిర్ధారించడానికీ, స్త్రీనిబేషరతుగా భర్తకు "అమ్మడం" ప్రారంభించారు.

ఇలా, మనిషి అభివృద్ధి దశల మూడింటిలోనూ, మూడు విధాలైన కుటుంబ వ్యవస్థలున్నట్లు ఏంగెల్స్ వివరించాడు. ఆటవిక యుగంలో గుంపు పెళ్ళి, అనాగరిక యుగంలో జంట పెళ్ళి, నాగరిక యుగంలో దంపతి వివాహం — దానికి తోడు వ్యభిచారం అవతరించాయి.

ఇప్పుడున్న పెళ్ళి ఇలా ఏర్పడింది. కాబట్టి వ్యభిచార భావాలతో కూడుకున్న ఈ పెళ్ళి కావాలో వద్దో ఎవరికి వారే ఆలోచించు కోవాలి!

పెళ్ళికి కామం ఒక్కటే ప్రధానాంశంకాదు. బిడ్డల కోసం అంత కంటే కాదు. అంతకు మించిన "అనుబంధం" ఈ పెళ్ళి వలన

సాధించబడాలి. దానికి ఈ నాటి మన ఆచారాలు అడ్డుపడుతున్నాయి. ఆ అనుబంధాన్ని కలుషితం చేస్తున్నాయి. మనిషి చేత మానసికంగా గానీ, శారీరికంగా గానీ వ్యభిచరింప చేస్తున్నాయి ... ఇది గమనార్హం;

## రోమన్లలో కన్యాశుల్కం

**జర్మనీలో** స్త్రీ పురుష సమానత్వాన్ని సాధించడం అనే ఒకానొప్పటి ఉద్యమం పూర్తిగా తుడిచి పెట్టుకు పోయాక, "సెక్సు-స్వేచ్ఛ" అనేది అణిగి పోయాక, రోమన్ల ప్రభావంవలన ప్రపంచ వ్యాప్తంగా పెళ్ళి అనే ఓ నరకం నాటుకు పోయింది.

కన్యాశుల్కాన్ని పెంపొందించింది, భార్య అనే బానిసను కొనడాని కుపక్రమించింది మొట్టమొదటగా జర్మన్య భూమి-జర్మనీయేనంటారు. సింధూ నాగరికత ఉచ్ఛదశలో వున్నప్పుడే అక్కడ ఈ ఆచారాలన్నీ వుండేవట. కన్యాశుల్కం దాదాపు అన్ని దేశాల్లోనూ విశేష ప్రచారం పొందిన ఆచారం.

రోమన్లు ఈ కన్యాశుల్కాన్ని "అర్రహా" [Arrha] అనే వాళ్ళు. బంగారంతో చేసిన ఉంగరాన్ని కన్యక చేతికి తొడిగితే చాలట!

**ఇంగ్లండులో** ఆడపిల్లలు కన్యాశుల్కాన్ని ఇచ్చినందుకు పాదాలపైన పడి ముద్దిడేవారట. ఫ్యూడల్ వ్యవస్థ కొనసాగినంత కాలం రష్యాలోనూ, ఫ్రాన్స్‌లోనూ ఈ ఆచారం కొనసాగింది.

**వివాహ** వ్యవస్థ ఇలా చీడపట్టడానికి క్రైస్తవమతంలో జరిగిన విపరీత పరిణామాలే కారణం. ఆరవశతాబ్దానికి ముందు పెళ్ళి అనే వ్యవహారంలో క్రైస్తవమతానికి ప్రాధాన్యతలేదు. ఇష్టపడ్డ యువతీ యువకులు పెళ్లి చేసుకొని, ఆ తర్వాత చర్చికి పోయేవారు.

పెళ్ళనేది చర్చిలోనే జరగాలనీ, దంపతుల్ని మతాధికారి ఆశీర్వదించాలనీ, మతం ప్రసక్తీ, మంత్రం ప్రసక్తీ ఆ తర్వాతనే వచ్చాయి. బెర్ట్రాండ్ రస్సెల్, పవిత్రంగా సాగుతోన్న వైవాహిక జీవనంలో వ్యభిచార బీజాల్ని నాటిన క్రైస్తవమతాధికారుల్ని తెగతిట్టి పోశాడు.

హిందూ వివాహాలు వేదోక్తం. ముస్లిం వివాహాలు ఇస్లాం మతచట్ట ప్రకారం జరుగుతాయి. 1?వ శతాబ్దంలో కేథలిక్ చర్చి ఏర్పరచిన "కేనన్" చట్టం ప్రకారం క్రైస్తవ వివాహాలు జరుగుతున్నాయి. ఆ చట్టంలో "ప్రైవేట్"గా చేసుకునే పెళ్ళి పాపంగానూ, నేరంగానూ ప్రకటించబడింది!

## పెళ్ళిళ్ళలో రకాలు

భారతీయ సాంప్రదాయంలో అనాదిగావస్తోన్న ఆచారాలలో పెళ్ళి అనేది సెక్సు దృష్ట్యానూ, పిల్లల్ని కనడం దృష్ట్యానూ పరమ పవిత్రమయ్యింది. "సెక్సుకతి" తీరడానికి జరిగే ఈ పెళ్ళిళ్ళు మొత్తం ఎనిమిది రకాలుగా వున్నట్లు గౌతమధర్మ సూత్రాలవలన తెలుస్తుంది.

మొదటిది బ్రాహ్మ వివాహం.

విద్యా, చరిత్రా, బంధు, శీల సంపన్నుడైన వరుణ్ణి తండ్రి వెదికి, పట్టుకొచ్చి, ఉన్నంతలో కూతుర్ని వస్త్రాభరణాలతో అలంకరించి, పెళ్ళిచేసి వంపేయడమే బ్రాహ్మ వివాహం.

ఈ పెళ్ళిలో, ఈమెను బాధలు పెట్టను, సుఖపెట్టాను' చక్కగా ఏలుకుంటాను. చచ్చేవరకూ కలిసే వుంటాను—" అని వరుడు పొరబాటుగా కూడా, ఊకదంపుడు వాగ్దానాలు చేసే అవసరం, అవకాశంలేదు. వాగ్దానం చెయ్యక పోయినా, కూతుర్ని సుఖపెట్టే వాడన్న నమ్మకంవున్న సంస్కారవంతుడికే ఇచ్చిచేయా

అని చూస్తాడట తండ్రి. ఇది అత్యంత ఉన్నతమైన వివాహంగా ప్రకటించబడింది.

రెండవది ప్రాజాపత్య వివాహం.

"సంయోగ మంత్రః ప్రాజాపత్యే సహధర్మశ్చర్యతామితి"

"జీవితాంతం నీతోనే కలిసినడుస్తాను—ఇంకో ఆడదాని జోలికి పోను—" అని "సంయోగమంత్రం" చెప్పించి వరుడి చేత వాగ్దానం చేయించి, కూతుర్ని "దానం" చేసే వివాహాన్ని ప్రాజాపత్య వివాహం అంటారు. ఇవి "మధ్యమం" అన్నారు.

మూడవది ఆర్ష వివాహం:

"ఆర్ష గోమిథునం కన్యావతే దద్యాత్"

ఈ వివాహంలో వరుడు గాని, ఆయన తరఫున బంధువులు గాని, పెళ్ళి కూతురు తండ్రికి గోమిథునాన్ని (ఒక ఆవు, ఒక ఎద్దు) దానం ఇచ్చి, సర్వాలంకృతమైన వధువును "తోలుకు" పోతారు.

నాలుగవది దైవ వివాహం:

"అంతర్వేధృతి దానం దైవోఽలంకృత్య"

ఇది పరమ భయంకరమైనది. తనచేత యజ్ఞం చేయిస్తున్న ఋత్విక్కుడికి తన కూతురును అలంకరించి దక్షిణగా సమర్పించుకోవడం దైవ వివాహం.

ఐదవది గాంధర్వ వివాహం:

"ఇచ్ఛంత్యా స్స్వయం సంయోగో గాంధర్వః"

వధువూ, వరుడూ పరస్పరం ఇష్టపడి తమకు తామే స్వతంత్రించి చేసుకునే పెళ్ళిని గాంధర్వ వివాహం అంటారు. దీనిని

కొందరు తుచ్ఛమైందనీ, కొందరు పర్వాలేదనీ, కొందరు మంచిదనీ అన్నారు.

ఆరవది అసుర వివాహం:

"విత్తే నానతి స్త్రీ మతామాసురః

స్త్రీమంతుడంటే ఎక్కువ మంది ఆడపిల్లలను కన్న తండ్రి. ఆయన సహజంగా ఆర్థికంగా వెనకపడి ఉంటాడు కాబట్టి, ఆ కూతుళ్ళను అమ్మడం ప్రారంభిస్తాడు. అలా కొనుక్కుపోవడం అసుర వివాహం, కొనుక్కుపోయినవాడు సుఖపెట్టేవాడైతే కన్నె చెర విడిపించిన పుణ్యాన్ని పొందుతాడని వ్రాశారు.

ఇక్కడ ఒక చిన్న విషయాన్ని గమనిద్దాం .... డబ్బును వరుడు, వధువు తండ్రికిస్తే దాన్ని "అసురం" అంటారు. అసురం ఇచ్చి చేసుకున్న వివాహం కాబట్టి అసుర వివాహం అయ్యింది. అసురాన్ని ముందుగానే వధువు పేర్న వ్రాసేసి, ఆమెను వివాహమాడితే దాన్ని "అరణం" అంటారు. ఆస్త్రీ తనకు సంక్రమించిన అరణాన్ని యథేచ్ఛగా ఖర్చుపెట్టుకోవచ్చు.

ఇవి రెండూ కన్యాశుల్కంలోని రెండు విభాగాలు. కొందరు అమ్మాయిల తండ్రులు అసురాన్నీ, అరణాన్నీ కూడా కోరేవారట!

ఏడవది రాక్షస వివాహం:

"ప్రసవ్య దానా ద్రాక్షసః"

తలిదండ్రుల్ని బెదిరించి, వారి కన్యకను బలాత్కారంగా ఎత్తుకుపోయి అనుభవించే దోపిడీని రాక్షస వివాహం అంటారు.

ఎనిమిదవది పైశాచ వివాహం:

"అసం విజ్ఞా తోవ సంగమాత్పైశాచః"

నిద్రమత్తులో గాని, అప్రమత్తంగా గాని ఉన్న కన్యకను బలవంతం చేయడం పైశాచ వివాహం.

ఈ ఎనిమిదింటిలోనూ మొదటి నాలుగే ధర్మబద్ధమైనవిగా ప్రకటించబడ్డాయి. కొందరు విశాల హృదయులు గాంధర్వ వివాహన్ని కూడా చేర్చారు. మరికొందరు పెద్ద మనుష్యులు కన్యాశుల్కానికి కక్కుర్తిపడి, అసుర వివాహం కూడా ప్రశస్తమైనదిగానే వాదించారు.

## పాతివత్యాన్ని నమ్మని మగజాతి

పెళ్ళికి ముందు అమ్మాయిలూ, అబ్బాయిలూ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో హాయిగా కాలం గడుపుతారనీ, పెళ్ళయిన తర్వాత వారి భావాలకూ, అందులోని ఆవేశానికీ సంకెళ్ళు పడతాయనీ, ఒకే వ్యక్తితో నూరేళ్ళ భవిష్యత్తు ముడిపడి పోతుంది కాబట్టి— పెళ్ళనేది "బానిస ప్రవృత్తి"ని మనిషిలో పెంపొందింప చేస్తుందనీ మనం నిత్యం చూస్తున్నాం కాబట్టి అంగీకరించక తప్పడం లేదు.

స్త్రీ మీద అధికారం మగవాడికి ధారాదత్తం చేయబడ్డే, సమస్యలతోపాటు బాధ్యతలూ నెత్తిన రుద్దబడి, స్త్రీ బానిసత్వానికి బలైపోయిందనేది కూడా అనాదిగా వస్తున్న ఉపన్యాసమే! స్త్రీ పరిస్థితి మారకపోవడమే ఈ ఉపన్యాసాలకు నిదర్శనం!

మగవాడు "తాను ఎవర్తెతో పోయినా ఫర్వాల్లేదు. ఆడది పర పురుషుణ్ణి కనీసం కన్నెత్తయినా చూడకూడదు—" అన్నాడు. ఇసుక కుండ కరిగి పోయిందని రేణుక శిరస్సు నరికించిన జమదగ్ని కడుపు అంతగా ఎందుకు మండింది...? తనను వదిలి తన భార్య పర పురుషుడైన ఇంద్రుణ్ణి చూసిందన్న కారణంగానే కదా.

అసూయ ఆడవాళ్ళ కన్నా మగవాళ్ళకే ఎక్కువ అనడానికి ఈ ఒక్క నిదర్శనం చాలు.

నిజానికి పాతివ్రత్యంపైన మగవాడికి నమ్మకం లేదు. వుంటే, మగవాడు వ్యభిచారాని కెందుకు తలపడతాడు? స్త్రీ శీలాన్ని కాపాడ గలిగింది మగజాతే! వ్యభిచారాన్ని విస్తృతం చేయగలిగింది మగజాతే!!

"ఇద్దరూ లేక ముగ్గురు భార్యలు చాలు బాబో...." అని అరిచే దశ నుంచి ఇవ్వాళ్టికి ఈ స్థితికి వచ్చింది మన సమాజం.

ఆడదాన్ని వరుడనబడే మగ పశువుకు "దాణా"గా వేస్తే ఆయన గారికి సకల మర్యాదలు చేస్తే అప్పుడాయన "మేయడం" ప్రారంభిస్తాడు. ఈ దాణాని వరుడికి దానంగా ఇచ్చానని అమ్మాయి తండ్రి తృప్తి పడతాడు. శాస్త్ర పూర్వక విధితో వరుడికి దానంగా ఈయబడిన స్త్రీని "ప్రత్త" అంటారు.

ప్రత్తలు మూడు రకాలు.

మనసులోనే, ఫలానా వ్యక్తికి తన కూతుర్ని ఇచ్చి పెళ్ళి చేద్దామని తలంపు రావడాన్నే 'నోటి దానం' లేక "వచోదత్త" అంటారు.

పండూ పసుపూ పుచ్చుకొని శుభమస్తు అని పెద్దలు దీవించిన సంబంధాన్ని మనోదత్త అంటారు.

ఉదక స్పర్శిక — అంటే, ధారాదత్తం చేయబడిన ఆడది.

మొత్తం మీద వాత్స్యాయనుడి కాలానికే స్త్రీని పశువులా తోలుకు పోయే ఆచారం విపరీతంగా వున్నట్లు ఈ పేర్లు పెట్టిన పద్ధతి నిరూపిస్తోంది.

అందు వలన స్త్రీకి చదువుకునే హక్కు లేకుండా పోయింది స్త్రీల ఈ దుస్థికి జాలి పడ్డాడు వాత్స్యాయనుడు. (*) అయినా. ఈ "వ్యవస్థ మారాలి" అనడానికి ధైర్యం చైలేక పోయాడు.

అందుకే, తనకు పూర్వం నుంచీ వస్తున్న ఆచారాల్ని ఏర్పరచిన పండిత వర్గాన్ని దుయ్యబడుతూ, విద్యావకాశాలు లేని స్త్రీకి, తన సంసారాన్ని చక్కదిద్దుకొని తను సుఖపడి, భర్తను సుఖపెట్టే "విజ్ఞానం" అయినా వుండాలనే ఉద్దేశంతో తాను కామ శాస్త్రం వ్రాసినట్లు వాత్స్యాయనుడే చెప్పుకున్నాడు.

---

* యోషితాం శాస్త్ర గ్రహణ స్యాభావా దనర్థకహ
శాస్త్రే స్త్రీ శాసన మిత్యా చార్యాః (1.3.4. వాత్స్యాయనం)

## పెద్దలు చేసే పెళ్ళి చెల్లదు!

బూర్జువా వర్గానికి ప్రతినిధులైన మతాధికారులు చెప్తోన్న నిర్వచనాలు పరిశీలిస్తే, వాళ్ళ దృష్టిలో పెళ్ళి అనేది కేవలం ఒక "ఒప్పందం"! అది పరమ పవిత్రమైంది. అది చట్టబద్ధమయిన ఒక వ్యవహారం. ఇద్దరు మనుషుల్ని ఇష్టం వున్నా లేకపోయినా కలిపి కట్టిపడేసే అమానుష చర్య గాబట్టి, పవిత్ర కార్యాలలో కెల్లా ఇది ముఖ్యమైంది.

పైకి మాత్రం మన పెళ్ళిళ్ళు అమ్మాయీ అబ్బాయీ ఇష్టపడే చేసుకుంటున్నట్టు కనిపిస్తుంది. ఇద్దరూ అంగీకరించారు కాబట్టి "శుభస్య శీఘ్రం" అంటారు పెద్దలు.

కాని, ఈ ఇద్దర్ని అంగీకరింప చేసిందెవరు? ఈ పెళ్ళిని కుదిర్చిందెవరు?

దంపతులు కాబోతున్న యువతీ యువకులు తమనూ, తమ శరీరాలనూ, శరీరాంగాలనూ ఇష్టపూర్తిగా సమర్పించుకునేటందుకు అధికారం లేని ఈ "పెళ్ళి" ఎలా చెల్లుతుంది?

పెళ్ళైనద ంపతులు ప్రేమించు కోవడం ధర్మం అయినప్పుడు, ప్రేమించుకున్న స్త్రీ పురుషులకు పెళ్ళి కావాలన్నది ఎందుకు ధర్మం కాదు? అది నీతి బాహ్యమైంది ఎలా అవుతుంది?

"స్వతంత్రంగా పరిశీలించి నిర్ణయించుకునే హక్కు మతానికి చర్చికి కూడా వర్తింప చేస్తూ, తమ శరీరాలనూ, ఆత్మలనూ, ఆస్తి పాస్తులనూ, సుఖ దుఃఖాలను కూడా పెద్దలే నిర్ణయించాలనే దుర్భరాధికారాన్ని మన యువతరం సహిస్తారా?...." అని గర్జించాడు ఏంగెల్స్.

కాని, ఇక్కడి పరిస్థితి వేరు. ఆ గర్జన చెవిటి ముందు శంఖారావమే — మన దేశంలో!

## మన యువతరం శుద్ధ అమాయకులు

ఇండియాలోనే కాదు చాలాదేశాల్లో కూడా పెళ్ళి అనేది కేవలం సెక్సువల్ ఎడ్జెస్‌మెంట్లు కోసమే జరుగుతోంది! శారీరిక కారణాలే ప్రముఖపాత్ర వహిస్తున్నాయి.

పెళ్ళి విషయాని కొచ్చేసరికి, అప్పటివరకూ, తన సైకో జెనిటిక్ అభివృద్ధినిగానీ, సాంస్కృతికంగా తాను పెంచుకున్న ఆశయాలను గానీ సద్వినియోగం చేసుకోలేకపోతోన్నారు మన యువతరం.

అంతకుముందు ముక్కూ మొహమూ ఎరగని ఒక జంట చేత, పెళ్ళనే కొన్ని ఘడియల తతంగం తర్వాత, "గడియ"

వేయించేస్తే, వాళ్ళు పొందే ఆనందం వ్యభిచారాన్నిమించిన పవిత్రమైనదా?

భలానా వ్యక్తితో నువ్వు జీవితాంతం కలిసి కాపురం చెయ్యాలని కొంపలో పెద్దలూ, పెళ్ళి చేయించిన వంతులుగారూ, అర్థం కాని సంస్కృతంలో అర్థంలేని వాగ్దానాలు చేయించి, "నాతి చరామి" అని పదేపదేవల్లింపచేసి, కాపురం చేసుకోండింక....అని శాసిస్తే,ఆ "నవదంపతులు" అప్పట్నించి ప్రేమించుకోవడం ప్రారంభిస్తే,ఆ ప్రేమలో-ఔన్నత్యం, ఔచిత్యం వున్నాయనగలమా?

అయినా, మన అబ్బాయిలూ అమ్మాయిలూ అమాయకులు కాబట్టి మీరిద్దరూ ఇవ్వాళ్టి నుంచి మొగుడూ పెళ్ళాలర్రా-అనేయంగానే, పప్పు బెల్లాలకోసం ఎగబడే బడిపిల్లల్లా ప్రేమించడం మొదలెట్టగలుగుతున్నారు.

అంతకంటే అమాయకులు అది కూడా చేతకాక యాంత్రికంగా దాంపత్యం చేయడానికి అలవాటు పడి పోతున్నారు.

ఈ పరిస్థితి మారాలంటే, తలిదండ్రులూ, పిల్లలూ కలిసి చర్చించుకొని ఒక అవగాహనకు రావాలి. నామంటే చెల్లాలనే పెద్దల మొండి వైఖరి పిల్లల పెళ్ళిళ్ళ విషయంలో ఏ మాత్రం చెల్లదు.

## మతాధిపతుల శాడిజం—
## సతీ సహగమనం

ఈ వైజ్ఞానిక యుగంలో కూడా ఇంకా సతీసహగమనం ఆచరించబడడం, విధవా వివాహాలు జరగక పోవడం భారత దేశం శతాబ్దకాలం వెనకాలనడు స్తోందనడానికి గుర్తు.

ఆ స్తవ్యస్త రాజకీయాలూ, మతకల్లోలాలు, ఎదుగూ బొదుగూలేని శాస్త్రీయాభివృద్ధి, పురోగమించే ధ్యాసలేని ప్రజానీకం, సెక్సు "యావ" లోపడికొట్టుకుపోతున్న యువతరం, సినిమాలూ అన్నివినాశకర భావాల మధ్య నలిగిపోతున్న భారతీయత గురించి పట్టని మనుషులు ఇంకాయుగాల వెనకాల నడుస్తున్నారు. ఈ పరిస్థితి ఎప్పటికి మారునో....

రాజారామ్మోహనరాయ్ ఒకసారి తన బంధువర్గంలో ఒక వ్యక్తి మరణించినప్పుడు స్మశానం దాకా వెళ్తే అక్కడ జరుగుతోన్న ఘోరాన్ని చూసి చలించి పోయాడు. ఆ మరణించిన వ్యక్తి ప్రక్కన అతని భార్యను బలవంతాన కాళ్ళూ చేతులూ కట్టి చితిపైన పడుకోబెట్టి నిప్పంటిస్తున్నారు. ఆమెకట్లు త్రెంచుకు పారిపోకుండా ఒక కసాయివాడు పొడవైన వెదురు గడతో ఆమెను నొక్కిపట్టున్నాడు

అక్కడికీ, ఆమె ప్రాణభయంతో చితిని దూకి హాహాకారాలు చేస్తూ పారిపోతుంటే కరలతో చావగొట్టి చితిలోకి ఈడ్చి పారేశారట.

సతీసహగమనం పేరుతో ఇంతదారుణ హత్యాకాండకు పూనుకన్న పండిత వర్గాన్ని సహించలేకపోయాడు రాయ్. బ్రిటిష్ ప్రభుత్వ సాయంతో ఎందరో విధవల ప్రాణాలను కాపాడి తిరుగులేని విజయాన్ని సాధించాడురాయ్

చచ్చిపోయిన వ్యక్తి ఆస్తికోసం బంధురాబందులు చుట్టూ జేరివన్నినకుట్రే సహగమనం అనేదురాచారం అంటాడు, రామ్మోహనరాయ్. ఇది బెంగాలు దేశంలో మరీవెర్రితలలు వేసిన ఆచారం.

ఆ విధవ ఒకవేళ సహగమనానికి ధైర్యం చెయ్యలేకపోతే, పుణ్యలోకాలు ప్రాప్తిస్తాయిని మభ్య పెట్టేవారట. మొగుణ్ణి నరకానికి పంపుతోన్న రాక్షసీ అని నిందించే వారట అంగీకరించని వాళ్ళని అంటరాని వాళ్ళుగా సమాజంలోంచి వెలివేసేవారు. వేద పండితులచేత మాయ మాటలు చెప్పించి స్వర్గంమీద లేని పోని ఆశలు కల్పించే వారట. అక్కడికీ వినకపోతే కాళ్ళూ చేతులూకట్టేసి, పైలైతే నరికేసి ఎత్తిమంటల్లో పారేశేవారట.

అందుకు వాళ్ళు కల్పించిన ఆశల్లో-

"భర్తను అనుగమించే స్త్రీ మనుష్య శరీరంలో ఎన్ని రోమాలుంటాయో అంతకాలం, అంటే షుమారు 3 కోట్ల 50 లక్షల సంవత్సరాలకాలం స్వర్గంలో వుంటుందట *

ఇది పండితులు విధవలను మభ్యపెట్టడానికి పన్నిన పన్నాగాల్లో ఒకటి!

"మగవాడు బ్రహ్మ హత్య చేసినా కృతఘ్నుడయినా, మిత్రఘ్నుడయినా, వాడి భార్య సహగమనం చేస్తే ఎలాంటి పాపం అయినా కొట్టుకు పోయి పునీతుడౌతాడనీ మాయ కబుర్లు చెప్పారు, మతపిశాచాల మూర్ఖత్వాన్ని ఆసరా చేసుకొని బంధువర్గం పన్నిన కుట్రలో భాగం ఇది." ఇది అంగీరసుడు చెప్తున్నాడు" అని తనకు తానే రాసుకున్నాడా స్మృతి కర్త.

---

* శ్లో॥ తిస్రః కోట్యర్ధ కోటీ చయానిలోమానిమానిషే
తావచ్ఛలభతే స్వర్గం భర్తారం యాను గచ్ఛతి
(పరాశరస్మృతి)

1 ఈ శ్లోకాలు రాసి, ఈ నియమాల నేర్పరచిన వాళ్ళు నిస్సంశేహంగా శాడిస్టులే!

మనధర్మ శాస్త్రాల్లో ఏవైనా అనాగరిక విషయాలు ఎత్తి చూపిస్తే "అది ఆనాటి సమాజానికి అణువుగా వుండేది...." అని ఊరికే స్వోత్కర్ష ప్రారంభిస్తారు పండితులు. మరి, ఈశ్లోకాలు ఏ సమాజానికి అనువైనవి? ఏ వ్యక్తులకు అనుకూలమైనవి??

పిచ్చి పట్టిన ప్రతివాడూ ధర్మ సూత్రాలు వల్లిస్తే, ఆత్మ హత్యని మించిన పుణ్యకార్యం, వ్యభిచారాన్ని మించిన పవిత్రతా వుండవనే అంటాడు!

భర్త, వున్న వూళ్ళోకాక, పరదేశంలో మరిణిస్తే, అతని చెప్పులను రొమ్ములమీద పెట్టుకొని సహగమనం చెయ్యాలని బ్రహ్మ పురాణంలో వున్నదట.

గౌతమస్మృతి సహగమనాన్ని నిర్ద్వంద్వంగా ఖండించింది.

"ఏ స్త్రీ బ్రాహ్మణ జాతి దైవుండీ భర్తతో సహగమనం చేస్తే, అది ఆత్మహత్యగామారి. తననుగాని, తన భర్తనుగాని ఏ స్వర్గానికి తీసుకుపోదు—" అని! 2)

---

1 శ్లో॥ బ్రహ్మఘ్నోవా కృతఘ్నోవా, మిత్రఘ్నోవాఽపిమానవః!
తంవై పునాతి సానారి ఇత్యంగీ రసభాషితమ్॥

[అంగీరసస్మృతి]

2 శ్లో॥ యాస్త్రీ బ్రాహణజాతీ యామృతం పతిమను ప్రజేత్
సాస్వర్గ మాత్మ ఘాతేన ఆత్మానం నపతింనయేత్.

[గౌతమస్మృతి]

ఇవ్వాళ దాదాపుగా ఈ ఆచారం అంతరించినా, భర్త మరణించిన స్త్రీని ముండనం చేయించడం, గాజులు పగలగొట్టడం. తెల్లచీరకప్పి నీచంగా తయారు చేయడం వంటి అవమానాల బారి నించి, "విధవ"లను కాపాడేందుకు సంఘ సంస్కర్తలు ఇప్పటికైనా పూనుకుంటే బావుణ్ణు.

వైధవ్యం శోకిన స్త్రీని అనాకారిగా తయారు చేస్తే, ఆవిడ జోలికి పోవడానికి ఏమ డూ సాహసించడనీ, కాబట్టి ఆవిడ కలకాలం పవిత్రంగానే వుండి పోతుందనీ వాళ్ళ నమ్మకం.

కాని, గిరీశం మహానుభావుడి లాంటి కాపర్ కాసులకు కక్కుర్తి పడే రసికులు కోకొల్లలు. బుచ్చమ్మలు, వెంకాయమ్మలు అందుకు తగ్గట్టుగానే వున్నారు. మరి, ఈ అనాచారాన్ని ఆపి, విధవా వివాహాల కార్యక్రమాన్ని ఎందుకు పునరుద్ధరించరూ?

## కన్నెల మనుగడే అదృష్టం!

గోవా క్రైస్తవులలో స్త్రీలు అవివాహితలుగా, బ్రహ్మచారిణులుగా వుండి పోవడం తరచుగా వుంది. అక్కడి జానపద గీతాలను పరిశీలిస్తే పురుషద్వేషులూ, సెక్సు భయస్థులూ ఎక్కువమంది వున్నట్లు కనిపిస్తారు.

శ్రీ వినాయక సదాశివ్ సుఖ్ థణ్ కర్ భారతిలో ప్రచురించిన ఈ జానపదగీతం వివాహితుల దుస్థితిని వర్ణిస్తుంది.

"పెళ్ళి వద్దు, మగవాడి సావాసమే వద్దు,
కన్నెతనమే నాకు కమ్మగా వుంది!
పెళ్ళాడిన వారి కష్టాలు కోటాను కోటి
ముండమోస్తే మరీదయా దాక్షిణ్యం
కన్నెల మనుగడే అదృష్టం

స్వేచ్ఛగా సంతోషంగా వారు గడిపేస్తారు.

ఓ కన్నెతనమా! ఎంత కమ్మని దాగివి!!

నీవు లేకుండా ఈలోకంలో వుండలేను.

పెళ్ళి పాడుగాను! మగవాని సావాసం పాడుగాను!

కన్నెతనమే నాకు కమ్మగా వుంది.

అంటూ వాపోతుంది ఓ కన్నెపిల్ల. ఆ అమ్మాయికింకా కన్నెతనమే కావాలనుందట. అంత సెక్సు విద్వేషం ఎందుకు కలిగింది? వసంతుడి కోసం ఎదురు చూడవలసిన వయసులో, తన నేలే మన్మథుడి పొందు కోసం తహతహలాడవలసిన సమయంలో కన్నెదనమా–కమ్మనిదానివీ అంటోందెందుకనోమరి!

క్రైస్తవ సమాజంలో విధవా వివాహాలకు పట్టింపు లేకపోవడం గొప్ప విషయమేగాని, అది వెర్రితలలు వేసి చాలా విపరీత పరిణామాలకు దారి తీస్తున్నట్లు ఇంకోగేయం హృదయ విదారకంగా చూపిస్తుంది.

"నాకు పన్నెండేళ్ళు నిండాయి.

పదమూడో ఏడు పడింది.

ఇలా సుఖంగా జీవితం గడుస్తుండగా,

అయ్యో–నాన్న దేవలోకం చేరాడు.

మా అమ్మ నా కన్నతల్లి.

మారు మనువాడింది!

నా అన్న నా కోసం ఎవర్నయితే
తాంబూలాలు పుచ్చుకున్నాడో
అతన్నే అమ్మ పెళ్ళాడింది।
అమ్మ పెళ్ళాడింది॥
ఓ దేవతల్లారా స్వర్గంనించి
భూమి మీదకు దిగిరండి.
తిరిగి వెళ్ళి మా నాన్నకు చెప్పండి—
మా అమ్మ మారుమనువాడిందని।
నా కోసం చూసిన వాణ్ణే పెండ్లాడిందని.
మా అమ్మ పెళ్ళికూతురమ్మయ్యింది.
నాకు పెళ్ళికూతురమ్మయ్యింది.
పెళ్ళికూతురయ్యింది....

ఇలా సాగుతుందా గేయం ఇంకా వయసులోనే వున్న తల్లి, తన కూతురుకూ వయసొస్తే, సహజమైన అసూయని కన్న కూతురు పట్ల కూడా పెంచుకున్న సందర్భాలు మనం ఎరిగినవే।

## 3. ఆచారం-వ్యభిచారం

అవినీతికరమైన, అనైతికమైన వృత్తి నవలంభిస్తోందన్న ఆరోపణని మినహాయిస్తే, వ్యభిచారిణుల ఆలోచనా విధానం సరియైనదే ననిపిస్తుంటుందొక్కొక్కప్పుడు.

వ్యభిచారాన్ని నిరోధించే ముందు, కొన్ని విషయాలను సానుభూతితో పరిశీలించాలి. సామాజిక అనారోగ్యానికి [Danger to the health of community], స్త్రీ మానసిక అస్వాస్థ్యానికి,

పురుషుడి మనోదౌర్బల్యానికి దారితీసే ఈ వ్యభిచారాన్ని నివారించడానికి వేశ్యల వలన కలిగే సుఖవ్యాధులను రూపుమాపితే "వేశ్యాతనం" కొన్ని పరిస్థితులలో వాంఛనీయమైనదనే సామాజిక వాదులున్నారు. ప్రపంచ ప్రఖ్యాత వేదాంతి, శాస్త్రజ్ఞుడు "బెర్ట్రాండ్ రస్సెల్" వ్యభిచారం ఆవశ్యకతను సంపూర్ణంగా సమర్థించాడు.

జీవించడానికి మార్గాలనేకం వున్నప్పటికీ, వాటిని ఉపయోగించుకోలేక పోతున్నది స్త్రీ లోకం. "వ్యభిచార సమాజం"లో జీవనోపాధి కోసమే వ్యభిచరించే వేశ్యలకన్నా కాముకుల ప్రాబల్యం అధికంగా ఉంపె కాబట్టి వ్యభిచారాన్ని నిరోధించాలని మరి కొందరి పట్టు!

సుఖలాలసత్వానికి వ్యభిచరించే స్త్రీలు వేశ్యలుగా గుర్తించబడడం లేదు. మగవాడి బలహీనతని ఆసరా చేసుకుని పొట్ట పోసుకుంటోన్నదే వేశ్య.

## వేశ్యలు దేవతలు

వేశ్యలంటే కొందరికి రాక్షసులుగానూ, కొందరికి పిశాచాలుగానూ కనిపిస్తే, అనేక మందికి దేవతలుగా కనిపిస్తారు.

నావికులూ భార్యలను విడిచి వ్యాపార విషయాలపైనో, ఉద్యోగ విషయాలపైనో దేశాలు తిరిగే వారూ, స్త్రీ సంబంధమైన ఆలోచనలకు దూరంగా ఉండలేని వారూ, వ్యభిచరించక తప్పని సరి అయినప్పుడు ఈ వేశ్యా సమాగమం, వారికి కొంత "ఈజ్"ను కలిగించగలిగిన పరిస్థితులలో, వేశ్యలు దేవతలుగానే కనిపిస్తారు.

వ్యభిచారాన్ని సమూలంగా నిర్మూలించ బూనడం సమాజంలో ఒక వర్గానికి తీరని ద్రోహం చెయ్యడమే అవుతుంది.

ఇక్కడ ఓ చిన్న విషయం— ప్రేమ లేనిదే సుఖానుభూతి లభించదని మనం నిర్ణయించినప్పుడు, వేశ్యా సమాగంలో "దేవత" స్ఫురణకు వచ్చేటంత "శృంగారం" ఉన్నదనగలమా....?

కోర్కెలను తాత్కాలికంగా తీర్చుకోవడమే వేశ్యా సంగమం లక్ష్యం.

అది రంభతో కలిసిన ఆనందం ఇచ్చేదైతే. అంతకంటే అల్ప సంతోషం ఉందా? ఒక్క స్త్రీని ఐదారుగురు కలిసి ఒకేసారి అనుభవించడం కన్నా "హస్త ప్రయోగం" ఎక్కువ ఆనందాన్నిస్తుందికాదూ....

భార్యపైన ప్రేమలేని భర్త, సమాజం కోసం దాంపత్యాన్ని నటిస్తాడు. వేశ్యలను వుంచుకోవడం వీళ్ళుపాటించే సాంప్రదాయం.

కొందరు అల్ప సంతోషులు ప్రేమ ఎప్పుడు కలుగుతుందో, ద్వేషం ఎప్పుడు కలుగుతుందో నిర్ణయించలేనంత చంచలంగా ఉంటారు. వీళ్ళ మనోచాంచల్యానికి భయపడి భార్యలు వీళ్ళ చెంతకు చేర సాహసించరు. అంత చంచల హృదయం వున్న వాళ్ళు కాబట్టి ఏవేశ్య దొరికితే ఆమెను సంగమించి, ఆమెపైన అప్పటికప్పుడు అరక్షణంసేపు ఎక్కడలేని ప్రేమనూ పెంచుకుంటారు. ఆమె తన సర్వస్వం అన్నంతగా ప్రేమించేస్తారు. కోరిక తీరాక ఆ ప్రేమను నిలబెట్టుకోలేక పోవడమే వీళ్ళ ప్రత్యేకత!

వ్యభిచారాన్ని చంచల హృదయులు ఇలా పెంచి పోషిస్తున్నారు. ఈ నేరం నూరుపాళ్ళూ మగవాడిదే!!

## వేశ్యల కోసం ప్రత్యేక ప్రభుత్వం

శ్రీ సురవరం ప్రతాపరెడ్డి తన "ఆంధ్రుల సాంఘిక చరిత్ర" లో క్రీ.శ. 10-13 శతాబ్దాల నాటి సామాజిక పరిస్థితులను అత్యద్భుతంగా నిరూపించారు.

"ఆ రోజుల్లో ధనవంతులు తమ వుంపుడుకత్తెలను, భోగం వాళ్ళని ఉత్సవాలకు వెంట తీసుకొని పోయి, అందరూ చూసేట్లు సరసాలాడే వాళ్ళ"ని శ్రీ రెడ్డి ఆ కాలం నాటి సాహిత్యం ఆధారంగా వివరించారు.

పూర్వం ఎంత ఎక్కువ మంది వేశ్యలను వుంచుకుంటే అంత ఘనమైన విషయంగా సామాన్య ప్రజలు కూడా చెప్పుకునేవాళ్ళట. ఎక్కువ మంది వేశ్యల కధిపతికి బిరుదులు కూడా ఇచ్చే వాళ్ళట.

నాగన్న మంత్రి (మంత్రిగారంటే, ప్రజాసంరక్షకుడైన రాజుని నడిపించే కీలకమైన వ్యక్తి కదూ....!) అంగనా హృదయ సరోజ షట్పదము అనే బిరుదుని పొంది ఘనత వహించిన వ్యభిచారట. "రాయ వేశ్యాభుజంగ" అని మరొక ధనవంతుడు బిరుదు పొందాడు. తన ఉంపుడుకత్తె ముచ్చటని "భోగినీ దండకం"గా రచింప చేసుకున్న సింగమనాయుడి వంటి డబ్బున్న బూర్జువాలు మన సమాజంలో చాలా మంది ఉన్నారు.

వీళ్ళు వేశ్యల కోసం ప్రత్యేక ప్రభుత్వాన్నే నడిపిన కొన్ని సంఘటనలున్నాయి. ఒక్క ఓరుగల్లులోనే ఆ రోజుల్లో ఇరవై వేల మంది వేశ్యలుండే వాళ్ళంటే ఎంత దోపిడీ వుండేదో మనం ఊహించవచ్చు. అరవదేశానికి సంబంధించిన ఒక పిళ్లేగారు ఓ వేశ్యతో గొడవ పడితే, ఆ కేసుని "వేశ్యా న్యాయస్థానం"లో విచారించారట.

మన దేశంలో వేశ్యాతనం ఒక వృత్తి కాబట్టి అది చాలా పవిత్రమైంది అని వాదించే వాళ్ళు మనలో లేకపోలేదు.

పవిత్రమైనదిగా గుర్తించబడ్డ ఎంత దోపిడీ అయినా దేవుడి భక్తులకు ఘనకార్యమే. కొన్ని కులాలు ఈ వ్యభిచారం పేరుతో

అణగద్రొక్కబడ్డాయి.... అని విమర్శిస్తే యీ పవిత్రతావాదు లంగీకరించలేరు.

హిందువులను కలకాలం వదలడాడకి ఇష్టపడని కులతత్త్వం. కాకతీయుల పరిపాలనానంతరం ఇంకా స్థిరపడి పోయింది. "వందితులం" అని అధికారం చెలాయించే పెద్ద కులస్థులే ఈ వ్యభిచారానికి పాల్పడ్డారనీ, దాన్ని పెంచి పోషించారనీ చరిత్ర ఘోషిస్తోంది. "మతమౌఢ్యం" అనుకొని మనం సరిపెట్టుకోవడానికి ఇది అంతకు మించిన మహా నేరం. స్త్రీ సమాజానికే పరమ అవమానకర సంఘటన!

## మతం రూపొందించిన వ్యభిచారం

శైవుల, వైష్ణవుల వివాదం కాకతీయులు పోయాక ఇంకా విజృంభించింది. మరి కొన్ని కొత్త కులాలు పుట్టాయి.

శైవుల్లో లింగాయతలు, బలిజలు, జంగాలు, తంబళ్ళు మొదలైన కులాలు కొత్తగా ఏర్పడ్డాయి. వైష్ణవులలో నంబులూ, సాత్తానులూ, దాసర్లూ ఏర్పడ్డారు. తిండికి లేకపోయినా, మతం కోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయని వీళ్ళ మూర్ఖత్వా న్నేమనాలి?

అక్కడితో ఆగలేదు. శైవుల ఇష్టదేవతా వాహనం బసవడు కాబట్టి, ఉన్నతమైన జాతి ఎద్దు ఊరు మీదకు బసవడి పేరుతో వదిలే వాళ్ళు. అలాగే బసవడి పేర్న కొంత మంది ఆడవాళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యకుండా మతం కోసం బలవంతాన వ్యభిచారంలోకి దింపేవాళ్ళు. వీళ్ళను "బసివిరాండ్రు" అని పిలిచారు.

ఇది గమనించారు వైష్ణవులు. వాళ్ళకూ కన్ను కుట్టింది. మతం పేరుతో ఉచితంగా లభిస్తున్న స్త్రీని వాళ్ళు మాత్రం

ఎందుకు వదిలిపెట్టాలీ అనుకున్నారు. వేశ్యలనే ముద్రలు వేసి దేవదాసీలను సిద్ధం చేశారు.

పోటీ పడి శైవులూ, వైష్ణవులూ స్త్రీని ప్రయోగించి మత ప్రచారం సాగించారు. ఈ పండిత ప్రకాండులే తిండికిలేక కొందరు ఆడవాళ్ళు అల్లల్లాడిపోయి, తప్పనిసరై శీలాన్ని అమ్ముకుంటే, చీదరించుకొని, నరకానికి పోతావు— అని బెదరించారు. విష కన్యలనే పేరుతో స్త్రీని నిలువెల్లా విషోక్తం చేసే ఆచారం కృష్ణ దేవరాయలు కాలం వరకూ మన దేశంలో ఉన్నది. ఇవన్నీ మన పూర్వతరం వాళ్ళూ, నీతులు వ్రాసిన వాళ్ళూ చేసిన తప్పులు!

ఒకప్పటి తరం చేసిన పనులను ఈ తరం ప్రశ్నిస్తోంది. ఈ తరం చేసే పనులను రేపటి తరం ప్రశ్నిస్తుంది. ఏం చేసినా, రాబోయే తరానికి సమాధానం చెప్పుకోగలిగేట్లుండాలి!

## వ్యభిచారవ్రతం

స్త్రీ పురుషుల ఈ అపవిత్రకూటమిని ప్లేటో....ఈరోస్ ఆఫ్ అఫ్రొడైట్ పెండిమూస్ "—అన్నాడు. పవిత్రమైన స్త్రీ పురుషుల అలైంగిక సంబంధాలను "హెవెన్లీ అఫ్రొడైట్ పెండిమాస్—" అన్నాడు.

అఫ్రొడిజియాక్ అంటే ఉత్తేజితలైంగికక్రియ. [Exciting Sexual Activity]. లైంగికతను పెంచేద్రవ్యాలని అఫ్రొడిజియాక్స్ అంటారు. ప్రాచీన గ్రీకులకు అఫ్రొడైట్ శృంగారదేవత. సంతానాన్ని ప్రసాదించే కల్పతరువు. అఫ్రొడైట్ దేవాలయంలో పూజారిణులుకూడా వేశ్యలే! ఈపూజారిణులను "కాదిష్టు" లంటారు. కాదిష్టులంటే పవిత్రమైనవాళ్ళని అర్థం.

క్రీ. పూ. అయిదవశతాబ్దానికి చెందిన హెరిడోటస్ తన కాలంలో అమలులోవున్న ఓ ఆచారం గురించి కొన్ని విషయాలు వ్రాశాడు.

నిత్యపాతివ్రత్యాన్ని పరమనిష్టాగరిష్టంగా అవలంభించేస్త్రీ సైతం తన జీవితంలో ఒక్కసారైనా వ్యభిచరించందే మోక్షాన్ని పొందలేదనివాళ్ళు నమ్మేవారంటఆనాడు. ప్రతిపతివ్రతా తనకు తీరు బాటైన ఓ శుభముహూర్తాన ఈ అఫ్రొడైట్ దేవాలయానికివచ్చి వ్యభిచారం అనే వతాన్ని అచరించడం మొదలు పెడుతుంది. ఆమెవ్రతనిష్ఠపూనాక ఆదారినపోయేబాటసారి ఆమె స్తనాలపైకి నాణాన్నొకదాన్ని విసిరేస్తాడు. ఆమె ఆనాణెపు విలువగురించి పట్టించుకోదు. కనీసం అతని అందచందాలనుగానీ, సామర్థ్యాన్ని గానీ దృష్టిలో వుంచుకోదు. కోరినంత కాలం అతనితో గడుపుతూ, తృప్తి పరుస్తూ, ఆగుళ్ళోనే "కాపురం" చేస్తుంది.

ఆ తర్వాత అతనందచేసిన నాణాన్ని "అఫ్రొడైట్" దేవాలయానికి సమర్పించి ఎప్పటిలాగే పవిత్రంగా కాలాన్ని వెళ్ళబుచ్చుతుంది.

ప్రాచీన జాతులన్నింటిలోనూ, నిజానికిఇలాంటి ఆచారాలెన్నో, ఏదో ఒకరూపంలో అవలంభించబడ్డవే!

ఇలాంటి అనాచారాల్ని చూసి చూసీ విసిగిపోయిన ప్లేటో తన ప్రేమసిద్ధాంతంలో స్త్రీ పురుషసమాగమాన్నే నిషేధించాడు. కాని, ప్లేటో ప్రేమసిద్ధాంతం విజయవంతంకాలేదు. దంపతుల మధ్యకూడా ప్రేమవుండాలనడానికి బదులు, ప్రేమించుకున్న వ్యక్తులు దంపతులు కాకూడదన్న విపరీతాభిప్రాయం ప్లేటోలో కనిపిస్తుంది. అసలు ఆడా మగా మాట్లాడుకోవడమే "పాపం" అనే పచ్ఛాదనాన్ని ప్రదర్శించాడు ప్లేటో.

స్త్రీ నీచమైంది-అనేభావన వున్నంతకాలం "ప్రేమ" కు తావులేదు. స్త్రీసమానత్వం లభించనంతకాలం వ్యభిచారం ఆగదు.

అంతేకాదు, అభియోక్త (రతిసల్పువాడు, అనురక్తుడు) వున్నంతకాలం వేశ్యామణులు మడిగట్టుకోగలగడం అసాధ్యమే!

## పాతివ్రత్యాన్ని రక్షిస్తున్న వేశ్యలు

ఇండియాలో దేవదాసీవృత్తి అమలులో వున్నకాలంలో క్రైస్తవదేశల్లోకూడా ఇలాంటి దేవదాసీతత్వం పవిత్రంగానే ఆచరించబడుతుండేది. వ్యభిచారిణి ఆనాడు ఒక భర్తృరాలు మాత్రమే!

ఆ మార్గానపోయే బాటసారులకు సేదతీర్చి సేవచేయడాన్ని వాళ్ళు "మాధవసేవ"గా భావించుకున్నారు ఈరకంవ్యభిచారాన్ని భగవదారాధనగా ఆచరించేవారు. కాబట్టి వ్యభిచారిణులకు అక్కడ పతివ్రతలకన్నా ఎక్కువ గౌరవంవుండేది. ఆమెను కలిసినవారికి కూడా అంతేగౌరవం దక్కేది.

ఈ "సెక్సుకార్యం" లో పవిత్రత ప్రధానంగా కనిపిస్తుంది మనకు! ఆచారరీత్యా ఆలోచిస్తే ఈశృంగారంలో కాముకతకు అవకాశంలేదు. శాశ్వతత్వం ప్రసక్తేలేదు. అయినా, ఆరోజుల్లో ఈవ్యభిచారం సుఖలాలసత్వంకోసం, ఆటపట్టుగా మారకపోవడం విచిత్రం.

అలాంటి ఒకవ్యవస్థలోకి క్రైస్తవమతాధిపతులు ప్రవేశించారు. ముందు ఈ ఆచారాన్ని తిరస్కరించారు. పేజీలకు పేజీలు వేశ్యలను తిట్టిపోశారు, వాళ్ళను బైటకుగెంటి చర్చితలుపులు మూసేశారు. ఇందుకు కారణం దేవాలయం "అపవిత్రం" అవు

తుందనికాదు. తాముసాగించే వ్యభిచారవ్యాపారంలో ఈ భక్తు రాండ్రు సహకరించ నిరాకరించడమే!

ఫాదరీలే స్వయంగా వేశ్యలను తార్చి సంచులు నింపుకునే వారని విమర్శించాడు రస్సెల్.

వాళ్ళ బేర సారాలకు అంగీకరించని దేవదాసీలను నిరాశ్రయులను చేశారు.

అథవా, ఈ పోరు పడలేక ఏ స్త్రీ అయినా అంగీకరించినా, వాళ్ళకు లభించే వేతనం చాలా తక్కువ. తమ దగ్గర బానిసల్లా బ్రతుకుతున్న స్త్రీలను కూడా ఈ రొంపిలోకి దించి ఈ వృత్తి కళాకారుల నందరినీ కలిపి ఏక కులంగా ప్రకటించారు. ఇది క్రైస్తవ దేవాలయాల తెర వెనుక జరిగిన "భాగోతం"గా వర్ణించాడు రస్సెల్.

ఈ దేవదాసీ ప్రక్రియ అటు క్రిస్టియన్ దేశాలలోనూ, ఇటు హిందూ దేశంలోనూ, మరి కొన్ని ముస్లిం దేశాలలోనూ దాదాపు ఒకే కాలంలో అభివృద్ధి చెంది రాజ్యం ఏలాయి. అంటే, పరిణామ క్రమంలో మనిషి ఆలోచనా విధానంలో ఈ బూర్జువా తనం దాదాపు అన్ని దేశాలలోనూ ఒకే సమయంలో ఆధిపత్యాన్ని వహించిందని గమనించాలి.

దీని వలన పరోక్షంగా ఒక మేలు జరిగింది. "పెళ్ళి" అనే వ్యవస్థలో ఒక భాగంగా వ్యభిచారం చోటు చేసుకున్నా, గౌరవంగా జీవితాన్ని గడుపుతోన్న ఇల్లాళ్ళ మాన ప్రాణాలు దక్కాలంటే, వేశ్యలే వాళ్ళను ఆదుకుంటున్నారేమో నని పిస్తుంది.

బలం వున్న వాడికే స్త్రీ అనే భయంకరమైన వ్యవస్థ రూపుమాసి పోయిందంటే అందుకు వేశ్యలే కారణం. బలవంతుడైన

కాముకుడిలో వేడిని చల్లార్చి, తద్వారా వాడి ఇంటి ప్రక్కన అద్దె కుంటున్న ఓ బలహీనుడి భార్యను కాపాడిపెడుతున్నారు వేశ్యలు.

"లేకీ" అనే సామాజిక వాది వ్రాస్తాడు, "స్త్రీ పవిత్రతకు వ్యభిచారిణులు రక్షక భటులు— సేఫ్ గార్డ్సు" అని!

ఈ వంకతో వ్యభిచారాన్ని సమర్థించవలసిన దుస్థితి ఏర్పడింది. కూటికి లేక, పేదరికంతో అల్లల్లాడే "జాతి ఆడపడుచుల" మానాన్ని అమ్ముకొంటుంటే అయ్యో... అనుకొన్న కొందరు సానుభూతిపరులు చేయగలిగింది లేక ఈరకంగా వ్యభిచారాన్ని సమర్థిస్తున్నారు. ఇంతకంటే, సామాజిక వాదులు చెయ్యగలిగిందేమీ లేదేమో....

# 4. సుఖవ్యాధులను జయించగలమా?

"స్త్రీ పురుష ఆకర్షణ నీతి గాని, అవినీతి గానీ, లోకంలో ఉంది. లేదనీ, వుండకూడదనీ, ఏదో తమ చిత్త మొచ్చిన విధంగానే ఉండాలనీ ఎంత వాదించినా, ఎన్ని వేదాంతాలు చెప్పినా అది మాయం కాదు. కనక వెర్రి బోధనలు మాని సహజమైన శరీరాకర్షణ వల్ల కలిగే యీ రోగాల నుంచి ఎట్లా తప్పించడమా అని ఆలోచించి ఇన్ని యుగాలుగా ఈ నీతుల్ని బోధిస్తున్నారు. రోగాలు ఎక్కువై సంఘ దౌర్బల్యం నానాటికీ ఎక్కువవడమే గానీ, ఇంక ఏమీ ఫలితం కనబడలేదు. ఎంత నీతి బోధించినా శరీరాలు శరీరాలుగానే వున్నాయి—" అన్నారు చలం.

సెక్సనేది మనిషి జీవితానికి ఓ కార్నర్ స్టోన్. మనకు దాని గురించి తెలిసింది చాలా తక్కువ. మైథునం చేయడం చేతనైన ప్రతివాడూ సెక్సంతా నాకు తెలిసిపోయిందను కుంటాడు. సెక్సు సినిమాలు చూస్తూ, వెర్రి కేకలు వేస్తూ, స్తంభించిన అంగాన్ని

చేతులతో నొక్కుకునే అమాయక ప్రజానీకానికి సెక్సు గురించి తెలుసనే అనుకోవాలా .... ?

సెక్సు కోరికలో ఈనాటి మనుషులకు స్వచ్ఛత లేదు. ఆత్రంతోటి, అహంకారంతోటీ అనర్థాలు తెచ్చుకొంటున్నారు మన నాటి తరం. ఆలోచించి చేస్తే ఏపనీ చెడిపోదు. సభ్యతా సంస్కారాలను దెబ్బతీయని ఏ కృత్యమైనా, ఎదుటి వాడికి అపకారం చేయని ఎంత స్వార్థమైనా జీవన పోరాటంలో నైతిక ప్రాధాన్యత కలిగినదే!

## సిఫిలిస్ చరిత్ర

బ్రతకడం కోసం నిరంతరం చచ్చి బతుకుతూ, సుఖించేందుకొసం అడ్డదారులు వెతుకుతూ, సుఖం దొరక్కపోగా అసలు బతుక్కే "ఎసరు పెట్టుకొని" జీవిత పరుగు పందెంలో గో బ్యాక్ అనిపించుకున్న మనుషులు గతిలేక వ్యభిచారానికి పాల్పడుతున్నారు వ్యభిచారులకూ, సుఖవ్యాధులకూ ఉన్న అవినాభావ సంబంధం ఇప్పట్లో విడదీయ వీలులేనిది!

సుఖవ్యాధులు విస్తరించడానికి పురుష జాతి మానసిక దౌర్బల్యమే కారణం.

ఇవ్వాళ సుఖవ్యాధి అంటే, జ్వరం వచ్చినంత సాధారణం అయిపోయింది. ఇంతకు ముందు లేని "లైంగిక తీవ్రత" ఈనాడు ఇంతగా అయిపోవడానికి కారణం సామాజిక వాదులకు అంతు పట్టడంలేదు అంతు దొరికితే అది చంద్రమండలాన్ని జయించినట్లే!

"సాపత్యం, సదారం బాధతే నరం" అంటూ ఆక్రోశించిందో కవి హృదయం. భార్యా పిల్లలతో సహా ఇంటిల్లిపాదినీ వేధించే దుర్మార్గపువ్యాధి—సుఖవ్యాధి సుఖం వలన సంప్రాప్తించి, సుఖం తర్వాత వ్యక్తమయ్యేది సుఖవ్యాధి. It is the punishment

on the spot అన్నాడు కిన్సే అమాయకులైన నేరస్థుడి భార్యా పిల్లలకీ శిక్ష ఎందుకో!

సర్వ ప్రపంచానికీ సుఖించడం వలన కలిగే పరమ దుఃఖ కరమైన ఈ వ్యాధి పదిహేనవ శతాబ్దంలో అవతరించిందనీ, అమెరికా ఖండానికి వలస పోయిన ఆంగ్లేయులనించి ప్రపంచానికి సంక్రమించిందనీ సిఫిలిస్ చరిత్ర చెప్తోంది.

కారణం ఏదైనా కానీండి-సిఫిలిస్‌కు మరోపేరు ఇండియన్ డిసీజ్.

ఇండియాలో ఈ వ్యాధికి "ఫిరంగి వ్యాధి" అనిపేరు. ఆయుర్వేద సంహితల్లో ఫిరంగి వ్యాధి గురించిన వివరణ పదిహేనవశతాబ్దానికి పూర్వం రచించిన వాటిలో కనిపించదు.

ఫిరంగం అనేదేశాన తరచుగా పుట్టి వ్యాపించే వ్యాధి విశేషం కాబట్టి దీన్ని ఫిరంగి వ్యాధి అంటారని భావప్రకాశంలో వ్రాయబడింది. ఈ రోగం కేవలం "కరస్పర్శ" వలన కూడా సంక్రమిస్తుందని చెప్తారు. భారతదేశాన్ని ముస్లింలు ముట్టడించి ఆక్రమించుకున్న తర్వాత ఈ ఫిరంగి వ్యాధి మనకు అంటగట్ట బడిందని ఆయుర్వేద శాస్త్రం స్పష్టీకరిస్తోంది. పోర్చుగీశీయులు ఇండియాలో దీన్ని ప్రబలించేశారు.

ఇటలీ దేశస్థులు 1945లో తమపైకి యుద్ధానికి తలపడిన ఛార్లెస్ (8) అతని సైన్యం తమదేశానికి వ్యాధిని అంటకట్టారని చెప్తుకుంటారు.

"బూరెట్" అనే శాస్త్రజ్ఞుడు మనిషితోపాటే ఈ భూమండలం మీద పుట్టిన వ్యాధి ఇది-అన్నాడు. అది ఈ మధ్యకాలంలో వచ్చినదికాదనీ, మనిషికి "సహజాతం" అని వాదించాడు. సనాతన కవుల కావ్యాలను ఆయన తన వాదానికి నిరూపణగా తీసు

కున్నాడు. జూలియస్ సీజర్ సంస్థానంలో కూడా సిఫిలిస్ వుందని, రోమ్‌నగరం నించి చుట్టు ప్రక్కలకు వ్యాపించిందనీ ఆయన నిరూపించాడు.

ఇంకొందరు ఇటీవలి పరిశోధకులు సిఫిలిస్‌కు "ఆసియా" ఖండం పుట్టిల్లని నిర్ధారించారు. మొదట్లో ఆపాపాన్ని చైనా మీదకు నెట్టారు. కాని "ఒకామూరా" అనే జపనీయుడు 16వ శతాబ్దానికి పూర్వం చైనాలో ఈ వ్యాధివున్న జాడలేవీ లేవని చెప్పి చైనా మించి ఆ అపనింద తొలగించాడు.

ఆ మధ్య ఈజిప్ట్‌లో క్రీస్తు పూర్వం 2,400కు చెందిన కొన్ని ఆధారాలను బట్టి, సిఫిలిస్ వ్యాధిగ్రస్థ అస్థులుగా నిర్ణయించబడ్డ అస్థి పంజరాల ప్రదర్శన ఒకటి జరిగిందిట మెక్సికో చరిత్రపైన విశేష పరిశోధన చేసిన "సీలర్" అనే శాస్త్రజ్ఞుడు పురాతన మెక్సికోనగరం మొత్తాన్ని ముట్టడించి తుడిచి పెట్టిన "మహమ్మారి" ఈ సిఫిలిస్ వ్యాధేనని ప్రకటించాడు.

ఇలా అనేకమంది అనేక దేశాలమీదకు అనేక రకాలుగా ఈ వ్యాధి చరిత్రను నెట్టారు. ఈ సంక్రమింప చేసిన వారికి అసలి వ్యాధి ఎలా వచ్చింది— అని ప్రశ్నించినప్పుడు-"అయాలా అనే శాస్త్రజ్ఞుడు" సిఫిలిస్ పూర్వం ఒక చర్మవ్యాధని, గతంలో ప్రజల్ని విపరీతంగా పట్టి పీడించి కొంతకాలానికి కండె ఆకారంలో వుండే స్పైరోచీటా అనేజీవాణువు ఆశ్రయించడంవలన అది సిఫిలిస్ అనే వ్యాధిగా రూపాంతరం చెందిందనీ ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

1530లో ఫ్రాంకస్టోరస్ అనేకవి "సిఫిలిస్ సైవ్‌మోర్బస్ గాలికస్" అనే కావ్యం వ్రాశాడు! ఆ కావ్యనాయకుడు పేరు సిఫిలస్ వాడికా కథలో ఈ వ్యాధి సోకుతుంది. సిఫిలస్‌కు సోకిన వ్యాధి కాబట్టి అతని ఈ పేర్నవ్యాధి కాపేరు వచ్చింది!

మనదేశంలో రికార్డయివున్న చరిత్ర ప్రకారం, యూరపు దేశాల్లో ఒకటైన ఫిరంగిదేశంనించి ఈ వ్యాధి మనకు వచ్చిందని భావప్రకాశకారుడన్నాడు. దీనికి చికిత్సకోసం ఫిరంగి పెట్టుదుంపని మూలికా ఔషధంగా ప్రయోగిస్తారు ఈ మొక్కను "మధుస్నుహి" అనీ "చోపచీనీ" అనీపిలుస్తాం మన. "Smilaxchina" అనబడే ఈ మొక్కకే "ద్వీపాంతరపచ" అనే మరోపేరుంది.

ఇవన్నీకాదు, ఈ వ్యాధిని ప్రపంచానికి అంటగట్టింది అమెరికాయేనని బల్ల గుద్ది చెప్పగలనంటాడు "డా॥ ఇవాన్ బ్లాచ్'' అనే జర్మన్ వైద్యుడు.

## మనసుపై ప్రభావం

సుఖవ్యాధి సోకడానికి వేశ్యలేకారణం అయితే, వేశ్యలకు ఈ వ్యాధిని సంక్రమింప చేస్తున్నదెవరు?

పైకి నీతి సూత్రాలు వల్లించే పెద్దలే సమాజంలో సుఖ వ్యాధులు వ్యాపించడానికి కారకులవుతున్నారు. నీతిదుర్నీతులకూ, ఈరోగాలకూ సంబంధంలేదు అంటాడు రస్సెల్. సుఖ వ్యాధులను రూపుమాపితే వ్యభిచారం ఇంకా పెరుగుతుందనీ, ఈ వ్యాధుల భయం వుంది కాబట్టి మనుషులంతా వ్యభిచరించడం లేదనీ, భావించే కొందరు దైవభక్తులు సుఖ వ్యాధిని సమూలంగా నిర్మూలించేందుకు అడ్డుపుల్ల లేస్తున్నారని ఆరోపించాడు రస్సెల్.

కాస్త గుండె ధైర్యం వున్నవాడు వైద్యుడితో సంప్రదించి వ్యాధిని ముదరకుండానే నయం చేసుకొంటున్నాడు. పరువూ, ప్రతిష్ఠల్ని పట్టుకు వ్రేలాడే మనుషులు, ఈ రోగాల్ని అంటించుకొనేప్పుడూ, అపాపాన్ని చేసేప్పుడూ లేని పరువునీ, సిగ్గునీ, డాక్టర్‌కు చెప్పుకొనేప్పుడు ప్రదర్శిస్తొంటారు. వీళ్ళు రోగాలను

తమలోనేదాచుకొని, అమాయకులైన ఆడవాళ్ళకు పంచిపెట్టి. శృంగార ప్రపంచంలో వాతావరణ కాలుష్యంలా తయారవుతున్నారు. అందుకే నీతి కబుర్లు చెప్పేవాడిలో ఈ సుఖవ్యాధు లున్నాయేమో ముందు పరిశీలించండి!

సుఖవ్యాధి మనిషికి తరుణ వయస్సులో సంక్రమిస్తుంది. సుఖవ్యాధి సోకినవాడి పిల్లలు గొడ్రాళ్ళుగానూ, నపుంసకులుగానూ పెరిగే అవకాశం వుంది.

తండ్రినుండి ఒక్కొసారి తల్లి ఈవ్యాధి సోకకుండా తప్పించుకోవచ్చు. కాని, అది "బీజదోషం" వలన నేరుగానే పిల్లలను కబళించే ప్రమాదం చాలావుంది. అలాంటప్పుడు, ఈ తండ్రికి పుట్టిన బిడ్డకు యుక్త వయసు వచ్చేవరకూ ఆ వ్యాధి బయట పడక పోవచ్చు; యవ్వనంలో, అతనింకా కళ్ళు తెరవకమునుపే ఒక్కసారిగా సుఖవ్యాధి లక్షణాలు ప్రస్ఫుట మౌతాయి.

అందుకే, వ్యభిచరించే తండ్రులారా .. హెచ్చరిక! మీకు నైతికంగా పిల్లలను కనేహక్కులేదు .. మీ సుఖవ్యాధిని మీలోపలే దాచుకొని, మీ రక్తంలో కలుపుకొని, మీ బీజంలో చేర్చుకొని మీ పిల్లల నిండు జీవితాన్ని బలిచేసే అధికారం మీకులేదు—!

ఇది ఎంత ప్రమాదకరమైన వ్యాధి అంటే, రానున్న తరాలలో, శారీరికంగా ఏర్పడే అవలక్షణాలకు ఈ సిఫిలీసే నాంది పలుకుతోంది.

మనసుమీద, మెదడుమీద, సుఖవ్యాధుల ప్రభావం మనిషిని హేయమైన స్థితిలో పడవేస్తుంది.

ఈ అంటు వ్యాధివలన జనించిన విషపదార్థాలవలన రక్తం క్షయించబడ్తుంది. ధాతు వైషమ్యం ఏర్పడుతుంది. శరీరం కృశించి పోతుంది. మెదడుకు సంబంధించిన కొన్ని పొరలు వాచి

పోతాయి. రక్తనాళాలు క్షీణించి పోతాయి. అన్ని అవయవాలకూ రక్త సరఫరా సంపూర్ణంగా జరగదు. ఫలితంగా పక్షవాతం వంటి మరికొన్ని అదనపు వ్యాధులు జనిస్తాయి.

ప్రపంచంలో ముప్పైఅయిదు శాతం అనారోగ్యం కేవలం ఒక్క సుఖవ్యాధి వలననే ఏర్పడుతోంది నలభైశాతం మనో వ్యాధులు. అరవైశాతం అంధత్వం; ముప్పైశాతం వంధ్యత్వం, నలభై మూడుశాతం గర్భ సావాలూ, ఈ సుఖవ్యాధి పుణ్యమాని ఏర్పడుతున్నాయి ... అని చాలాకాలం నాటి హవెలాక్ ఎల్లిస్ అంచనా!

ప్రపంచం అంతా ఇంత విపరీతంగా వ్యాపించి పోయిన ఈ సిఫిలిస్ పాశ్చాత్యదేశాల్లో తక్కువగా వున్నదని వాళ్ళు చెప్తు కుంటారు.

## వేశ్యల సహాయాన్ని అర్థించండి!

ఒకప్పటి వ్యభిచారం వేరు. ఇప్పటి వ్యభిచారంలేదు. అప్పటికీ, ఇప్పటికీ ఆశయం ఒకటే కావచ్చు. ఆచరిస్తున్న తీరులో మాత్రం చాలా మార్పు వచ్చింది. అయినా ఇంతగా అభివృద్ధి చెందిన ఈ వైజ్ఞానిక యుగంలో సైతం వ్యభిచారం ఇలా ఇంత అశాస్త్రీయంగా కొనసాగడం బాధాకరంగానే వుంది.

వ్యభిచరించే విధానం మారాలి. ఎందుకంటే, మనజనం వ్యభిచారాన్ని మాన లేరు కాబట్టి.

వేశ్యలూ, వేశ్యలపైని ఆంక్షలూ — ఇవన్నీ ఎప్పుడో వెలిసి పోయాయి. ఇంకా మనం మధ్య యుగపు ఆలోచనలనే పట్టుకు వ్రేలాడుతున్నాం.

బెర్ట్రాండ్ రస్సెల్ అంటాడు, కామానికి కక్కుర్తి పడే వాళ్ళతో పోలిస్తే కేవలం భుక్తి కోసం, శీలాన్నీ ఆరోగ్యాన్నీ త్యాగం చేస్తున్న స్త్రీ మూర్తుల్ని మించిన సంఘ సేవకులు వేరే లేరని!

వ్యభిచారాన్ని ఎందుకు నిరోధించాలంటే, మదించిన మగ వాడి నుంచి రోగాలు వేశ్యలకు సంక్రమించకుండా వుండాలి కాబట్టి!

వ్యభిచారాన్ని చట్టబద్ధం చేసి, వేశ్యల మొఖాన "వీళ్ళు వేశ్యలు..." అని ఓ ముద్రవేసి, ప్రత్యేకంగా అందుకు కొందరు అధికారుల్ని నియమించి తనిఖీ జరిపించి, వైద్య పరీక్షలు చేయించడం కొన్ని దేశాల ప్రభుత్వాలు ఉచితంగానూ, స్వచ్ఛందంగానూ చేస్తున్న ప్రజాసేవ!

వేశ్యల నుండి వ్యాధులు సంక్రమించకుండా చూడడం ఈ పథకం ఉద్దేశ్యం. మరి, వేశ్యలకు తమ రోగాల్ని అంటించే పురుష పుంగవుల మాటేమిటో....

సుఖవ్యాధులున్న వారు వ్యభిచరిస్తే కఠిన కారాగార శిక్ష అమలు పరిచే ఏర్పాట్లు చేస్తే కొంతవరకైనా, సామాజిక అనారోగ్యం తగ్గేందుకు అవకాశాలన్నాయి.... అని ఒక వాదన!

ఏ చట్టాలైనా ప్రత్యక్షంగా అవినీతిని పెంచేవేగాని, దాన్ని రూపుమాపేందుకు దోహదపడడం లేదనేది ఇన్నాళ్ళుగా మనం ప్రభుత్వాలను చూసి తెలుసుకున్న నగ్న సత్యం!

ఫ్రాన్స్‌లో వ్యభిచారంపైన పన్ను వేసి లాభాలు గడిస్తోన్న పెద్ద పెద్ద మునిసిపాలిటీలు వ్యభిచార నిరోధాన్ని వ్యతిరేకించాయిట. అదే, జర్మనీ, ఇంగ్లాండ్‌లలో అయితే, "వ్యభిచార నిరోధక స్వచ్ఛంద సంస్థలు" మన దేశంలో రాజకీయ పార్టీలకన్నా ఎక్కువగా ఉన్నాయట. అయినా, ఈ దేశాలు సుఖ వ్యాధిని జయించ లేక పోయాయి.

అందుకని, పదిమందీ తిరిగే పబ్లిక్ స్థలాలలో వేశ్యలు కనిపించడం నేరంగా ప్రకటించారు. పార్కులలో తిరగడం వంటి పనులు చెయ్య కూడదన్నారు. వేశ్యలు సినిమాలూ, నాటకాలూ చూడడాన్ని నిషేధించారు. కనీసం కిటికీలలోంచి బైటకు చూడడం, నవ్వడం, తుమ్మడం, దగ్గడం కూడా చెయ్యకూడదు పొమ్మన్నారు. అయినా, జర్మనీ సుఖ వ్యాధిని రూపుమాపలేక పోయింది.

ఒక వేశ్య తన వృత్తిని మానేసి, జీవితాన్ని పవిత్రమైన మార్గంలోకి మళ్ళించి, ఆత్మ సంయమనాన్ని సాధించినట్లయితే ఆమె బ్రతకడం కోసం పెన్షన్ సౌకర్యాలు కల్పించేందుకు కూడా జర్మనీ వెనుకాడ లేదు. అయినా వేశ్యలు మారలేదు. కాదు, వేశ్యని మారనీయలేదు!

ఈ పరిస్థితి మారేదెప్పటికి?

సామాజిక వాదులారా.... తప్పదు— వేశ్యల సహాయాన్ని అర్థించండి. ఆమె బ్రతకడానికి మరో మార్గం చూపించండి!

## మనుషులెందుకు వ్యభిచరిస్తారు?

ఇల్లాలి గయ్యాళి తనం వలన గృహాలలో అశాంతి మగవాణ్ణి వ్యభిచారుల వైపు మళ్ళిస్తుంది. ఇంటి కంటే "గుడి" పెంచ్చలామణి అయ్యే క్లబ్బులే పదిలం అనిపిస్తుంది.

ఆర్థిక పరమైన ఇబ్బందుల వలన సంసార పక్షపు స్త్రీలు సైతం వ్యభిచారానికి లొంగి పోక తప్పడం లేదు.

ఇంక యువతరానికొస్తే, భావాలు ఎదగని అబ్బాయిలు—మందు కొట్టడం, వేశ్యల్ని కలవడం తమ మగతనానికి "ఛాలెంజ్"గా భావించడం ఈ రోజుల్లో ఫాషనై పోయింది. "నేనిన్నిసార్లు చేశానోయ్" అని అడక్కుండానే చెప్పుకొనే అబ్బాయిలు అలా చెప్పుకోవడం కోసం వ్యభిచారానికి పాల్పడుతున్నారు.

ఇటువంటి అల్ప సత్త్వం వున్నవాళ్ళ కోసమే చలం ఆరాట పడింది. కనీసం "మ్యూజింగ్స్" చదివినా వీళ్ళలో పరివర్తన వస్తుందేమో!

అమాయకత్వం కూడా వ్యభిచారాన్ని పెంచే మార్గాలలో ఒకటి. మనసు ఎదగని కారణాన, వయసు పెరుగుతున్న అమ్మాయిలు ఈనాటి సమాజం ఇస్తోన్న స్వేచ్ఛని చాలా దుర్వినియోగం చేసుకొంటున్నారు.

చవకబారుతనానికి అలవాటు పడిపోయిన యువతరం సెక్సు నియంతృత్వాన్ని పెంచుతున్నారు.

ఇలాంటి మానసిక నపుంసకులతో కలిసి మనం సెక్సు స్వేచ్ఛ గురించి పోరాడడం అనవసరం. స్థిర చిత్తులైన యువతీ యువకులే ముందుకు రాగలరు.

బ్రిటన్‌లో జరిపిన సర్వేలో వ్యభిచారుల్లో చాలా మంది మతి స్థిమితం లేని వాళ్ళేనని తేలింది.

చిన్న పిల్లలను సంభోగిస్తే సుఖ వ్యాధి పోతుందని కొందరిలో ఓ మూఢ నమ్మకం ఉంది. అందుకని, ఇంకా కళ్ళు

తెరవని ఆరేడేళ్ళ ఆడ పిల్లల్ని పశువులా అనుభవిస్తే, ఎదగని ఆ పావల జననేంద్రియం చీలిపోయి, వాళ్ళ రోగాలు ఆ పసికందులకు అంటుకున్న సంఘటనలెన్నో!

దంపతుల మధ్య ఎడబంధం కూడా వ్యభిచారానికి మనిషిని నడుపుకు పోతుంది. మడి కట్టుకున్న భార్యలతో విసిగి పోయిన భర్తలు మరో మార్గం చూసుకున్న వాళ్ళెంతమందో.

పరాశర స్మృతిలో ఒక చోట— పతి బ్రతికుండగా అతన్ని సుఖపెట్టడం మాని, నోములూ, ఉపవాసాలూ చేస్తే, ఆస్త్రీ తన భర్త ఆయువును హరించి నరకాన్ని పొందుతుంది .... అని వ్రాయబడింది. మొగుడు వ్యతిరేకిస్తున్నా, వ్రతాలు, నోములూ చేస్తే అదంతా రాక్షసులకు చెందుతుందట.

నరకం మాట ఎలా వున్నా పూజలు చేసే ఆడవాళ్ళు భర్తని వేశ్యల దగ్గరకు పంపుతున్నారని ఎవ్వడో స్మృతి కర్తలు గమనించారు. చలం ఈ మడి ట్టుకునే వాళ్ళే రోగాల వ్యాప్తికి కారణం అవుతున్నారన్నారు.

జీవిత పోరాటంలో విసిగి, వేసారి, విఫలమయిన వ్యక్తులు బహు యాంత్రికంగా, తమ గురించి తమకే ఏవీ పట్టనట్టు, చాలా అమాయకంగా, విరాగిలా, మస్తులా తిరుగుతుండే కొందరు నిరాశాజీవులు కావాలని కాకపోయినా, ఎందుకు చేస్తున్నారో తమకు తెలీకుండానే వ్యభిచారం అనే రొంపిలోకి దిగి పోతారు. ఇది మనిషిలో "ఫ్రస్ట్రేషన్"ను పెంచి నైరాశ్యంలోకి నెట్టివేస్తుంది. ఇది కేవలం స్వయంకృతాపరాధం. రోగాల వ్యాప్తికి వీళ్ళూ కారణం అవుతున్నారు.

పారిశ్రామిక నగరాలూ, యాత్రా స్థలాలూ, వ్యాపార కేంద్రాలూ, వ్యభిచారానికి నిలయాలు. ఇక్కడి వ్యభిచారం మన

పోలీసు వ్యవస్థకు తెలీకుండా జరగడం అసంభవం. మన దేశంలో శాసనాలూ, నియమాలూ ఏర్పాటు చేసినకొద్దీ అవినీతి ఆది నుంచి పెరుగుతూనే వుంది కానీ తరగలేదు.

సమాజ సంస్కారానికి ధర్మ శాస్త్రాలు ఏనాడూ ఉపకరించలేదు. వ్యభిచారాన్ని చట్టం బద్ధం చేసి, వేశ్యలకు లైసెన్సులిస్తే రోగాలు ఆగుతాయా?

సుఖవ్యాధులను జయించాలంటే మనిషిలో శాస్త్రీయ దృక్పథం పెరగాలి. చంచలమైన మనస్థితి పోవాలి. ఎదుటి వ్యక్తిని ప్రేమించే మనస్తత్వం కలగాలి.

ఇవి సాధ్యమైనప్పుడే సుఖవ్యాధులను జయించగలుగుతాం!

# 5. ఆత్మ నిగ్రహం అనర్థదాయకం!

ఆత్మ నిగ్రహం సాధించుకోవడం గొప్ప విషయమే కాని, అందుకోసం శరీరంలోంచి కొంత శక్తిని వెచ్చించవలసివుంటుంది. ఈ శక్తి "ఖర్చు"కు తట్టుకోగలిగినవారికే కోరికలపై ద్వేషం ఏర్పడుతుంది. అప్పటికిగాని భోగియోగి కాలేడు.

కోరికను నిగ్రహించుకోవాలంటే మనోబలం కావాలి. మానసికంగా బలహీనుడైన వ్యక్తి కోరికను తీర్చుకోలేకపోతే, చంపుకోదలచిన ఆకోరికే అతన్ని పదేపదే వేధించడం ప్రారంభిస్తుంది.

వాత్స్యాయనుడు ఆత్మ నిగ్రహం విషయంలో "సెక్సు"ను విసర్జించమని చెప్పలేదు. యోగాభ్యాసకులెవరో కొందరు సెక్సు రాహిత్యాన్ని సాధించుకోగలిగిన వారు లేకపోలేదు. యీకొద్ది మందినీ దృష్టిలో వుంచుకొని, యీ నిగ్రహంనీతుల్ని సార్వజనీకం చేసి, ప్రజలలో ప్రచారం గావించి, అందరికీ బలవంతాన అంట

గట్టబోతే, పవిత్రమైన సృష్టికార్యం ఆగిపోతుంది. పరిణామ చక్రం నిలిచిపోతుంది. ఇంతకు మించిన పాపం భక్తులకు వేరే వుంటుందా?

అందుకు మనిషిని ముందు నిగ్రహానికి సమాయత్త పరచాలి. మనోబలాన్ని పెంపొందింప చేయాలి యోగాభ్యాసన చేయించాలి. అప్పుడుగానీ నిగ్రహం సాధ్యపడదు. అంతవరకూ చిత్తవృత్తి నిరోధం ప్రసక్తి కేవలం పుణ్యకాలక్షేపమే!

నిజానికి నిగ్రహం అవసరం అంతగా యీ సమాజానికిలేదు. నిగ్రహం దృష్ట్యా కాక బలమైన కోరిక దృష్ట్యా మనిషి కొన్ని నియమాలను తనకు తాను ఏర్పరచుకొంటే నైతిక ప్రమాణాలు పెరుగుతాయి. విమర్శకులు యీ విషయాన్ని సాలోచనగా పరిశీలింతురుగాక!

తగిన మోతాదులో సెక్సును నిత్యం సేవిస్తే అది చక్కటి వ్యాయామం అవుతుందని భావించే శాస్త్రజ్ఞులున్నారు. ఆ మాట కొస్తే, బ్రహ్మచర్యాన్ని పూర్వం తప్పు చేసిన వాడికే శిక్షగా విధించే వాళ్ళు.

ఉదాహరణకు గౌతమధర్మ సూత్రాల్లో, "ద్వాపరవారే" అనేసూత్రంలో, పక్కింటి వాడి భార్యను (పరదార) అనుభవించిన వాడికి రెండు సంవత్సరాలు బ్రహ్మచర్యాన్ని పాటింపచేయడం శిక్ష....అని నిర్దేశించబడింది అలా బ్రహ్మచర్యాన్ని పాటిస్తూ, స్వప్నస్ఖలనం [Nocturnal Emissions] చేసుకున్న వాడి వృషణాలను కత్తిరించి వేయడమే [Castration] శిక్ష— అన్నారు. ఇదీ బ్రహ్మచర్యం ప్రాధాన్యత!

బ్రహ్మచర్యాన్ని నియమబద్ధంగా పాటిస్తే బలమైన కోరిక పెరుగుతుందనీ, స్థిరమైన భావాలు ఏర్పడతాయనీ మన పూర్వులు

ఆశించారు. ప్రేమించడం చేతకాని వాడూ, బ్రహ్మచర్యాన్ని పాటించలేనివాడూ వెంటనే నిరభ్యంతరంగా అమ్మానాన్నలు కుదిర్చిన పెళ్ళి చేసుకోవడం ఉత్తమం.

యీ అల్పరేతస్కుల చెవులలో స్వేచ్ఛా శృంగారం గురించి శంఖం పూదడం, ఆత్మనిగ్రహం "బాండ్ మేళాలు" వాయించడం రెండూ శుద్ధదండుగ!

## రేతస్సును ఓజస్సుగా మార్చాలి!

శారీరికంగా సెక్సును నిగ్రహిస్తూ, మానసికంగా లైంగిక వ్యాపారాలలో పాల్గొనే బలహీనులు నాడీ సంబంధిత వ్యాధులకు లోనయ్యే ప్రమాదం వుంది. ఈ కారణంగానే ఆధునిక వైద్యం ఆత్మ నిగ్రహాన్ని వ్యతిరేకించవలసి వచ్చింది.

ఇది కల్తీ బ్రహ్మచర్యంవలన మాత్రమే సంభవం. అరవిందుడు ఈ విషయం ప్రస్తావిస్తూ, నిజమైన నిగ్రహం జాగృతం చేస్తుందని చెప్పాడు. మనిషి "రేతస్సు"లోని అంశరూపాలు లైంగిక వ్యాపారాన్ని నిర్వహిస్తున్నాయి. నిగ్రహించడం అంటే ఈ అంశరూపాలను నిరోధించి లైంగిక వ్యాపారాన్ని కొనసాగకుండా చేయడం అందువలన నాడీ వ్యవస్థను బలపరిచే యంత్రాంగంగా ఈ అంశరూపాలు పనిచేస్తాయి. యువకులను వివాహకాలం వరకూ బ్రహ్మచర్యాన్ని పాటించమన్నది ఈ బలమైన "వ్యవస్థ" కోసమే నంటుంది భారతీయ బ్రహ్మచర్య సిద్ధాంతం. బలమైన "వ్యవస్థ" అంటే "ఓజస్సు"। రేతస్సును ఓజస్సుగా మార్చేరసాయన ప్రక్రియ నిగ్రహం!!

లైంగికానందాన్ని పొందే వ్యక్తి మనోమయ పురుషుడు [Mental Purusha]. కాని, నిగ్రహాన్ని నిజంగా పాటించే

"ప్రాణమయ పురుషుడు" [Vital purusha] యౌగికానందాన్ని పొందుతాడు.

మహర్షి అరవిందుడు సెక్సును నిషేధించమని చెప్పలేదు. దాన్ని పరిమితం చేసిన కొద్దీ మనసు ఎదుగుతుంది— అన్నాడు. ఆయన దృష్టిలో సెక్సు జీవన మార్గంలో మనిషిని నడుపుకుపోయే మహత్తర శక్తి! దాన్ని కొంచెం ఉన్నత మార్గానికి మరల్చితే "ఓజస్సు" జనిస్తుంది. అందువలన మనిషి ఆత్మవంతుడవుతాడు. దానికి కేవలం నిగ్రహం సరిపోదు. సాధన కావాలి—

నిజజీవితంలో సెక్సు ప్రాధమిక శక్తిగా ఉపయోగపడుతోంది. దాన్ని మోక్షాన్ని సాధించాలనే తాత్త్విక దృష్టితో గాక, జీవన వేగాన్ని తీవ్రతరం చేసుకునేందుకు ఉపయోగించుకోవడం అవసరం... అన్నాడు అరవిందుడు సెక్సు శక్తిని, మానసిక ఎదుగుదలకూ, జ్ఞాన సాధనకూ ఉపయోగించడం వలన జాతి కూడా వీర్యవంతం, విజ్ఞానవంతం అవుతుందని సూచించాడు అరవిందుడు.

లైంగిక వ్యవహారాలలో నిజాయితీతో వ్యవహరిస్తూ, పరిమితంగా లైంగిక శక్తిని ఖర్చుపెట్టుకునేవాడు జ్ఞానవంతుడవుతాడు, వృధా చేసేవాడు నపుంసకుడవుతాడు;

ఇది రేతస్సును ఓజస్సుగా మార్చుకొనేందుకు మనిషి అనుసరించవలసిన ప్రాధమిక నియమం. లైంగిక శక్తిని దుర్వినియోగపరిస్తే, జీవన శక్తి కూడా ముక్కలు ముక్కలై నశించిపోతుంది. కాబట్టి నిగ్రహంతో కూడిన లైంగిక కృత్యాలు మనిషిని మహోన్నతుణ్ణి చేస్తాయి.

శరీరంలో లైంగిక శక్తి రెండు ప్రధానాంగాలను కలిగి ఉంది. ఒకటి రేతస్సు. ఇంకొకటి ఓజస్సు.

రేతస్సు [Semen] వలన సంతానోత్పత్తి సాధ్యపడుతుంది. కాబట్టి మానవాభివృద్ధికి రేతస్సు అవసరం. రెండవది ఓజస్సు—

[Immunity] ఇది మనిషికి శారీరక శక్తినీ, మనోబలాన్నీ చైతన్యాన్నీ [Vital] అందిస్తుంది. లైంగిక ఆనందాన్ని సద్వినియోగం చేయడం అంటే, ఓజస్సును బలపరచుకోవడం. రేతస్సును బహిర్గతం కానీయకుండా నిరోధిస్తే అది ఓజస్సుగా మార్పునొందుతుంది. ఓజోవంతుడు సర్వశక్తిమంతుడు. బ్రహ్మచర్యాన్ని యువకులు పాటించాలనడానికి కారణం, ఓజోసంపన్నులు సంతానోత్పత్తికి తలబడితే సత్సంతానాన్ని సాధించగలరని భావించడమే!

రేతస్సును ఓజస్సుగా మార్చడం అంటే "భౌతిక పదార్థాన్ని [Matter] భౌతిక శక్తి [Energy]గా మార్చడం. అందువలన సెక్సు గ్రంథులు శోషించి పోతాయనే "పుకారు"లో నిజం లేదు.... నిగ్రహిస్తే నపుంసకులవుతారనేది అంతకంటే మూర్ఖపు ఆలోచన. నపుంసకత ఎప్పుడూ అతిరతి వలనో, అక్రమ రతి వలనో ఏర్పడుతుంది.

నియంత్రణని కొంతైనా పాటించడం వలన లైంగిక శక్తిలో ఒక భాగం మానసిక శక్తిగా మార్పునొందుతుంది. జీవన శక్తులకు [life energies] నియంత్రించబడిన లైంగిక శక్తే మూలం.... అని నమ్ముతోంది హిందూతత్వ చింతన. *

జపాన్‌లో "మోరిట" అనే వైద్యవిధానం అమలులో వుంది. షోమా మోరిటా అనే వైద్యుడు 1930 ప్రాంతాల్లో ఈ చికిత్సా పద్ధతిని రూపొందించాడు.

"మోరిట" వైద్యం ఆత్మకు సంబంధించిన చైతన్యం అధికంగా వున్నప్పుడు దాన్ని క్రమపరిచే విధానాన్ని కనుగొంది.

అంటే. కోరికలు తీవ్రమై, మనసు ఉద్వేగానికిలోనై బలహీనపడి మనిషిలో వికారాలు సంభవించినప్పుడు మోరిట చికిత్స వాళ్ళకు మానసిక బలాన్ని చేకూరుస్తుంది!

*See-Aravinda's Letters: vol 24: P.15 1/.

## నిగ్రహం ప్రోసెస్

ప్రతి మనిషిలోనూ "నేనూ" లేక "నాదీ" అనే తత్త్వం ఉంటుంది. ది వుండడమే "చైతన్యం" అంటున్నాం. "నేను" లేకుండా సృష్టిలేదు.

ఈ "నేను" అనే భావన ఎంత ధృఢంగా వుంటే మనసు అంత బలంగా ఉంటుంది. అహంకారం [Ego] మనిషిని పెంచు తుంది.

అహంకారం అంటే అదిరిపాటు తనం కాదు, మనిషిలో అంతర్గతంగా వున్న స్పృహ! *

కోరికలనేవి మనసు నుంచి ప్రవహించే ప్రవృత్తుల [Instincts] కారణంగా జనిస్తాయి మనిషిలో దృఢంగా వున్న "నేను" అనే తత్త్వం వలన మనసుకు సంక్రమించిన శక్తి రెచ్చి పోయిన ఈ ప్రవృత్తుల్ని నిరోధి చగలుగుతుంది. అదే నిగ్రహం. అహంకారం అనే తత్త్వం ఈ నిగ్రహ శక్తికి మూలం!

మనసు కోరికలకన్నా బలమైనదైనప్పుడు కోరికకూ, మనసుకూ మధ్య పోరాటం జరుగుతుంది. ఈ సంఘర్షణలో సహజంగానే మనసు కొంత అలసట నొందుతుంది!

మనిషికన్నా అతని కోరిక బలవత్తరమైనప్పుడు, అందని ద్రాక్షని ఆశించిన ఆ వ్యక్తి మనసులో విపరీతమైన సంఘర్షణ బయలుదేరుతుంది. ఫలితంగా, ఆకోర్కెకు బదులుగా మరో కోర్కె బయల్వెడలుతుంది. లేక, ఆకోర్కె మరో రూపంలో సాక్షాత్క రిస్తుంది.

అణగారిపోయిన కోరిక తాలూకు మనసులో మిగిలిపోయిన రకరకాల వాసనలు [Symptoms] ఆ కోర్కెకు ప్రతినిధి కోరికలను [Substitute Formation] పుట్టిస్తాయి.

---

* అహంకారం [Ego] గురించి 'మనిషీ-మనసు' అనే చివరి అధ్యాయం చూడండి!

దాదాపు రెండేళ్ళ వయసున్న మగపిల్లలకు తల్లుల పైనా, ఆడపిల్లలకు తండ్రులమీదా కోరికలు జనిస్తాయనే ఫ్రాయిడ్ శిశు శృంగార సిద్ధాంతంలో పిల్లల ఈ కోర్కెలు తీరేవి కావు కాబట్టి, అవి పిల్లల మనసులోనే అణిగిపోతాయి. అలా నిగ్రహించుకోవడం వలననే పితృభావం, మాతృభావం అనేవి బలపడ గలుగుతున్నాయి. పిల్లలు అమ్మా నాన్నలను గౌరవించగలుగుతున్నారు. ఈ గౌరవ భావం ఒక దుర్మార్గపు కోరిక అణచివేయబడడం వలన జరిగింది. కాబట్టి అది ప్రతినిధి కోరిక. ఇదీ, నిగ్రహం వలన మనిషి పొందుతోన్న లాభం.

కొన్ని సందర్భాలలో, ఒక పసిపిల్ల తన తండ్రి పట్ల పెంచుకున్న ఈ భావం తీరక తాత్కాలికంగా అణిగిపోయి, అది తండ్రి పట్ల భక్తి భావాన్ని పెంచక, తన తండ్రికి ప్రతినిధిగా ఏదైనా జంతువును తన కోర్కెల సముదాయానికి తగినదిగా భావించుకోవచ్చు. ఇలాంటి మనోవికారాలూ మనోనిగ్రహం వలన సంభవించేందుకూ అవకాశం లేకపోలేదు. అంతేకాదు, ఈ మనోనిగ్రహం పిల్లలలో విచిత్రమైన భయాన్ని ప్రేరేపిస్తుంది. "యాంగ్జయిటీ హిస్టీరియా" అనే వ్యాధి ఇలా ఏర్పడిందే! ఇది "ఎలక్ట్రా"కు వచ్చిన వ్యాధిగా షేక్స్పియర్ వ్రాశాడు.

అందుకే మనోబలంలేని వ్యక్తికి నిగ్రహం అనర్థదాయకమే!

### కోరిక తీరకపోతే?

మనోబలహీనత అనేది మనిషి నిజజీవితానికి దూరంగా పారిపోవడంవలన సంభవిస్తుంది. సత్యానికి భయపడేవాడు మానసికబలహీనుడు! సత్యాన్ని భరించలేనివాడికి అల్పసత్యం వుంటుంది—"అన్నాడు పియేర్ జెనెట్ అనే పాశ్చాత్య పండితుడు.

ఇది "హాల్యూసినేటరీ సైకోసస్" (విభ్రమాత్మక మనస్తత్వం)కు సంబంధించిన మనో వికారం.

ఫ్రాయిడ్, సుఖాన్ని సాధించేందుకు లేక దుఃఖాన్ని కొని తెచ్చుకొనేందుకు ఓ నియమాన్ని ప్రతిపాదించాడు. దీన్ని "ప్రమోద

వేదనా నియమం" (Pleasure-Pain Principle) అన్నాడు. ఈ నియమం ప్రకారం సుఖాన్ని సాధించేందుకు మనిషి దుఃఖకారక శక్తుల్ని జయించాలి. ఇది Lowering Cathexv దీన్ని అను కూల వేదనగా చరకుడు చెప్పాడు సుఖసాధనకోసం మనిషి సాగించే పోరాటంలో అసౌఖ్యం ఏర్పడితే దుఃఖం కలుగుతుంది (Pain) దీన్ని ప్రతి కూల వేదన " ఆయుర్వేదం చెప్పింది. ఫ్రాయిడ్ [Hightening Cathexy] అన్నాడు. ఈ కేథెక్సీ అంటే వేదన!

కోరికలు ప్రతి కూల వేదనను పెంచుతాయి. తృప్తి అను కూలవేదనను సాధిస్తుంది. కాబట్టి కోరికలు పెరిగే కొద్దీ మనసులో స్థిరత్వం దెబ్బతింటుంది.

ఒక బాహ్య ప్రేరణ శరీరంపైన కలిగినప్పుడు, ఆప్రేరణ అంతర్గతంగా మారి, శరీరంలో ప్రవహించే అంతః ప్రేరణలను [Instincts] ఉత్తేజితం చేస్తుంది. ఫలితంగా కోరిక కలుగు తుంది. ఈ అంతః ప్రేరణలను తృప్తి పరచడం అంటే కోరిక తీరడం. అప్పుడు ఆనందాన్ని పొందుతాడు మనిషి. కోరికను అంటే, ఈ Instinctsను అణిచేందుకు ప్రయత్నించడంవలన మల మూత్రాదివేగాలను నిరోధించడంవలన ఎటువంటి దుర్లక్షణాలు కలుగుతాయో, మనసు ఎలా వికావికలమై పోతుందో కోరికను నిరోధించడంవలన కూడా అవే దుర్లక్షణాలు కలుగుతాయి.

"ఇచ్ఛా ద్వేషాత్ తృష్ణా సుఖదుఃఖాత్ ప్రవర్తతే" అన్నాడు చరకుడు. కోరికతీరితే సుఖం కలుగుతుంది. ఫ్రాయిడ్ Satisfaction of an instinct isalways Pleasurable-" అన్నాడు తృప్తి లేకుంటే కలిగేది దుఃఖం Physical Pain [ప్రతి కూలవేదన]

నిగ్రహం అనేది ఎంత ఆనందాన్ని కలిగిస్తుందో, అంత బాధనీ కలిగిస్తుంది. ఒక భాగంలో ఆనందాన్ని, మరో భాగంలో బాధనీ పుట్టిస్తుంది.

కవయిత్రి సరోజినీ నాయుడు ఈ రెంటినీ కలిపి "Sweet Agony" అన్నారు. "మధుకీల" అంటే ఇదే. కోరిక తీరకుండానే అందులోని ఆనందాన్ని పొందగలిగినప్పుడు శరీరం ఎక్కువ అలిసిపోతుంది. మనసు దగ్గరున్న శక్తంతా ఎక్కువగా ఖర్చు ఐపోతుంది. ఎప్పటికప్పుడు మనోబలాన్ని పుంజుకోగలగాలి. లేక పోతేయోగికీ, కామికీ మధ్య "మిథ్యా ప్రపంచం"లో ప్రేలాతు తుంటాడు-నిగ్రహించుకోవడం అనేపిచ్చి పని చేసిన అమాయకుడు!

## దుర్భర వ్యాధులకు దివ్యౌషధం

స్త్రీ సంయోగం,బాగా పరిణతి చెందిన అవయవాలకు రక్త ప్రసారాన్ని అధికం చేసి మనసును ప్రసన్నంగా వుంచుతుంది.

"మత నియమాలనువ్యతిరేకిస్తూ, ఆత్మ నియంత్రణను పాటించదలచుకున్నవారు ఈ నియంత్రణను ఒక ఉద్యమంగా భావించుకోవాలి.అందుకు పట్టుదలకావాలి. దాన్ని ఉపవాసాలతోటీ జాగరణలతోటీ సాధించుకోవడం మూర్ఖత్వం" అని అప్పటి కేథలిక్కులను విమర్శిసూ "లూథర్" అనే సామాజిక వాది ఉపన్యసించి అక్కడికక్కడే మతానికి ఆహుతై పోయాడు. ఇది 16వ శతాబ్దంలో జరిగింది.

ఆ తరువాత, మూడు శతాబ్దాలైనాక, లూథర్ మార్గాన్నే అనుసరించిన "బెబెల్", "హిన్టన్" అనే ఉద్యమ కారులు లైంగిక స్వేచ్ఛా వాదంలో విప్లవాన్ని రేత్తించారు.

హింటన్ అంటాడు—"ఇవన్నీలెక్కలేనన్ని వ్యాధులు: అంతా నాశనమే; ఎక్కడ చూసినా వెర్రి, దీనికంతటికీ స్త్రీ పురుషులు ఐక్యం అయిపోవడమే మందు...." అని!

దుర్భర వ్యాధులకు దివ్యౌషధం ... Delight & Joy!!

సెక్సు కోరిక వుండీ, తీర్చుకోలేని వ్యక్తులకు హిస్టీరియా. అపస్మారం వంటి వ్యాధులు కలుగుతాయి. ఆధునిక మానసికశాస్త్ర వేత్తల్లో అధిక శాతం సెక్సుకు ప్రాధాన్యత నిచ్చిన వాళ్ళే. మనసును నడిపే ఇంధనంగా సెక్సుకు ఒక గుర్తింపు ఉంది.

ఆధునిక వైద్యశాస్త్రం తెచ్చిన తాత్త్విక విప్లవంగా సెక్సు-సైకాలజీ అభివృద్ధి అని వాళ్ళు చెప్పుకొంటారు.

కాని, "క్రాఫ్ట్ ఎబింగ్" వంటి శాస్త్రజ్ఞులు లైంగిక విషయాలను నిగ్రహించుకోవడం వలన మనిషి మానసికంగా సమధికోత్సాహుడౌతాడంటారు. సెక్సువల్ హైపరీస్థీషియా వంటి వ్యాధులకు ఆత్మ నిగ్రహం ఒక్కటే మందు ... అన్నారు. ఇటీవల ప్రయోగాలు ఈ వాదనను అంగీకరించడం లేదు.

పదహారేళ్ళ వయసొచ్చే వరకూ ఎడతెగకుండా హస్తప్రయోగాది దురభ్యాసాలకు బానిసయి పోయిన ఓ అబ్బాయిలో అకస్మాత్తుగా పశ్చాత్తాపం కలిగింది. ఒక రాత్రికి రాత్రి పరివర్తన చెందాడు. సెక్సు భావాలను దగ్గరకు రానీలేదు. సెక్సు వూసెత్తకుండా ఇరవై సంవత్సరాల వైరాగ్యాన్ని అనుభవించాడు.

వయసు నలభైకి చేరుకుంటోంది. పెళ్ళి లేదు. కోరికలులేవు. అలా బ్రహ్మచారి జీవితాన్ని నిష్కల్మషంగా గడుపుతోన్నప్పుడు అతనికి అకస్మాత్తుగా "సెక్సువల్ హైపరీస్థీషియా" అనే వ్యాధి వచ్చింది.

దాని పర్యవసానంగా గాలి మళ్ళీ ఆడదాని మీదకు మళ్ళింది. మనిషి మొదటి కొచ్చాడు. ఎంత మూర్ఖంగా తయ్యారయ్యాడంటే, నలభైయేళ్ళ వయసొచ్చిం తర్వాత కూడా, సెక్సు లేకపోతే తానేలేనన్నంతగా మారిపోయాడు. విచ్చలవిడిగా వ్యభిచరించాడు. "ఆడది" పక్కన లేకపోతే క్షణం అయినా నిలువలేనంత పిచ్చి పట్టిందతనికి. మరి, ఇరవై ఏళ్ళ నిగ్రహం ఏవయ్యిందీ ? అసలంతలా నిగ్రహించడం వలననే ఇదంతా అన్నాడు హావెలాక్ ఎల్లిస్.

పెళ్ళయ్యే వరకూ ఇలాగే పరమ పవిత్రంగా గడిపిన మరో వ్యక్తి, నిగ్రహానికి అలవాటుపడిపోయి, పెళ్ళయ్యిం తర్వాత కూడా భార్యను కన్యగానే ఉంచెయ్య గలిగాడు.

ఇది పురోగమనమే ననగలరా పండితులు? కట్టుకున్న

భార్య ఉసురు పోసుకొని నరకానికే పోతాడు. మోక్షాన్ని కాదు తెచ్చుకొనేది!

నిగ్రహించుకునే ఋషులకీ, విరాగులకీ సహజంగానే. నరాల బలహీనత; వెన్నులోనూ, కాళ్ళలోనూ విపరీతమైన వేదన; కాళ్ళు తరచూ వాయడం, మోకాళ్ళ పోటు మొదలైన బాధలు కలుగుతాయి.

కోరిక కలగడమే విరాగుల విషయంలో తప్పు. దాన్ని అనవసరంగా చంపుకోవాలని ప్రయత్నించి, స్ఖలనం చేసుకొని, బైటకు వేగంగా ప్రవహిస్తోన్న శుక్రాన్ని నిరోధించబోయి, వృషణాలు వాచి మెలిపెట్టినట్లు బాధ కలుగుతుంటే, సన్యాసం దేవుడికి వప్పగించి హస్త ప్రయోగం చేసుకునే యోగులెంత మందో ... !

లైంగిక వాంఛ విపరీతంగా ఉండి తృప్తి కరువైతే, ప్రోస్టెయిటిస్ (గుద మార్గంలో వాపు) కు దారితీస్తుంది. నిద్ర పట్టక పోవడం (ఇన్సోమ్నియా) కూడా తీరని కోరిక వలననే జనించే వ్యాధి! ఇలాంటి ఒక రోగికి ఎన్ని ఔషధాలిచ్చినా ఈ నిద్రపట్టక పోవడాన్ని రూపుమాపలేకపోతే, డా॥ రెమాన్‌డినో లైంగిక కార్యాల్లో పాల్గొనమని సలహా యిచ్చాడు.

ఈ ఉదాహరణలన్నీ మనసు బలంగాలేని వ్యక్తులను నిగ్రహం పేరుతో వ్యాధిగ్రస్తులుగా మార్చవద్దని కోరడానికే!

నిగ్రహించుకొనగలవారిని అభ్యంతరం పెట్టవద్దు. "యోగ శ్చిత్త వృత్తి నిరోధః" అన్నారు. చిత్త వృత్తిని నిరోధించియోగిక ఆనందాన్ని పొందగలిగిన వారికి కోటి దండాలు. వాళ్ళను అనుసరించవలసిందిగా అందరినీ ప్రోత్సహించ బూనడంఅమానుషం!

పరిమితమైన కోర్కెలతో అనంతమైన తృప్తిని పొందాలనే ఓ ఆలోచన మనుష్య జాతికి కలిగిన రోజున మనం సెక్స్ స్వేచ్ఛను కోరేందుకు నైతికంగా అర్హులం అవుతాం. ఇదీ అమలిన శృంగారం ఆశిస్తున్న పరిణామం.

# గర్భవతుల మానసిక వ్యవస్థ

182 (A)

## PSYCHIC STATE IN PREGNANCY



అధ్యాయం మూడు

ఉదరములోన శిశువెంతగ జననిని
కదిలించును, నొంచును, పాపము
అయిన నామె కోపించున? ముదమున
అయినవఱకు సాకదె నిత్యము!

— (దుర్గానంద్ సూరిదాసుపదాలు)

[అప్పుడేపుట్టిన కాంగో తెగలలోని పిగ్మీజాతి శిశువు తల్లిఒడిలో తృప్తిగా నిద్రిస్తున్నాడు. పుట్టుకలోనే భారీశరీరాన్ని కలిగిన ఇంతపెద్ద శిశువుని ఇంతవరకూ మరేజాతి ప్రసవించలేదు.]

153

# గర్భవతుల మానసిక వ్యవస్థ

## Psychic State in Pregnancy

గర్భవతైన వరూధిని పరమ నీరసంగా వున్నది. కాని, మనసు కక్కుర్తిపడి, మెల్లగాలేచి, చేతులతో మాయాప్రవరుణ్ణి వదులు వదులుగా కౌగిలించుకున్నది. మనిషి బాగా అలిసి పోయివుంది. నోరు మట్టి వాసన కొడుతోందిట చాలామంది. గర్భవతులకు మట్టితినే అలవాటుంటుంది. ఈ అలవాటు మన వరూధినికీ వుంది. అయినా నోరు కమ్మటి రుచిగా వున్నదట.

రోజూ మాయా ప్రవరుడి అధరపానం చేస్తూ నిద్రపోయేదిట వరూధిని. ముందుగా అతనే రతికి తలపడితే, ఊపిరి బిగపట్టే పాటి ఓపిక కూడా లేక, అదిమాన్పించి, నర్మోక్తులతో పరిపెట్టి, అతన్ని బుజ్జగించేదిట. అతనితో సుఖాన్ని పంచుకునేందుకు శరీరం వశంకానందుకు నిట్టూర్చేదిట.

ఒకవేళ ఆకోరిక తనకే ముందు కలిగితే, పరిస్థితిని గ్రహించి, ప్రియుడు ఆమెకు కోరిక పుట్టిందని ముందుగానే ఊహించి, దాన్ని తీరిస్తే మెచ్చి పొగిడేదిట. తనకు కోరిక లేనప్పుడు అతను ప్రయత్నిస్తే వద్దని ప్రతిమాలేదిట.

పెద్దన వారు గర్భవతిగావున్న వరూధిని సాగించిన శృంగార వర్ణనలో ఒక భాగం ఇది.

# 1. గర్భవతులనం రమించ వచ్చా?

మన వాళ్ళు చాలా మంది గర్భవతులను సంభోగించడానికి ఇష్టపడరు. ఆమె అలిసి పోతుందని పెద్దవాళ్ళు సాధ్యమైనంత దూరంగా వుంచుతారు.

మన పండితులు గర్భిణీ రతిని నిరశించారు. పరమపాప పంకిలమైనదిగా భావించారు. కొందరు పురుష పుంగవులకు వాళ్ళతో మాత్రమే తృప్తి కలుగుతుంది. ఎవరి ఆనందం వాళ్ళది।

గాథా సప్తశతిలో బిడ్డను కన్నాక, ఆ బిడ్డకు దంతాలు వచ్చేవరకూ పురుషుడితో కలీకూడదనే ఓ నియమం మనకు కనిపిస్తుంది. బహుశః ఇలాంటిదా రోజుల్లో ఆచారంగా కూడా వుండి వుండవచ్చు *

"మనబిడ్డ రెండుదంతాలతో కొరికిన యీరేగు పండును పుచ్చుకోండి—" అని భార్యభర్త చేతిలో వుంచిందట!

ఆముక్తమాల్యదలో ఇదే ఆచారాన్ని సమర్థించే ఒక పద్యంలో వనలక్ష్మి అనేకాంత తన కడుపున పుట్టిన చెట్లనే సంతానానికి మొగ్గలనే దంతాలు రావడం మొదలు అయ్యాక.... ఇంక తాను వసంతుని సాంగత్యం పొంద వచ్చని పొంగి పోతోందని వర్ణించబడింది • ఎంతమనోహరంగా వున్నదా ఉపమానం!

---

* "ఏవంచ తనయస్యదంతజననేన ప్రసవోత్తర జాయమాన సరస సంభోగ సుఖానుభవ సమయోఽయం ప్రాప్త ఇతి"

దీన్నిబట్టి చాలామంది ఉన్నత కుటుంబాలవారు బిడ్డకు దంతాలు వచ్చేవరకూ, అంటేబిడ్డకు ఏడెనిమిది నెలలు వచ్చే వరకూ, గర్భంవాల్చింది మొదలు సంవత్సరంనరపాటు మైథున నిషేధాన్ని పాటించే వారని ఒక నిర్ణయానికి రావచ్చు

మను చరిత్రవలెనే కవిరాజ మనోరంజనంలో కూడా—

"ఉ. వీనని ప్రేమలం గలియు వేఁకటి ప్రేఁగుటలంతి కూటముల్
వేడుకకున్ వినోద మెఁదవింపఁగ నయ్యువనాథుతో హిత
క్రీడ మెలంగుచుండ నరిగెన్ నవమాసములున్...."
అని పెద్దన ఫక్కీలోనే వర్ణించ బడింది.

గర్భిణీరతిని, నిరశిస్తూ, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగారు, గర్భవతులకు కామవాంఛ అసలే వుండదని ఓ నిర్ణయాన్ని చేశారు. సాహితీ మీమాంస ఇక్కడ అప్రస్తుతమైనా, విషయ వివరణ కోసం, కొంత శాఖా చంక్రమణం చేయక తప్పడంలేదు.

"వరూధిని వేశ్య, కేవలకామార్త గర్భధారణానంతరము గలిగిన అశక్తి చేఁగూడఁ గలయుకలఁ గోరెనను టయామె కామాతి రేకమునే తెలుపును.... అని సమర్థింపబడినది. వరూధిని వేశ్యగాక కులస్త్రీగాని, వరస్త్రీగాని అగుచో కామము తఱిగి పోవునా? వేశ్యయై నను, నెవ్వతెయైనను, గర్భవతి కామార్తయైనఁ గావ్యమున వర్ణించుట హేయముగాక యుపాదేయ మెట్లగును? ఆమెకుఁ

---

చ. తన యుదరంబునన్ బొడమి తామ్రరుచిచ్ఛటలుల్లసిల్లఁగో
ల్కొను ధరణీజ సంతతికిఁగోరక దంతములించుకంతని
క్కినయది యాదిగాఁగఁజెలఁగెన్ వనలక్ష్మి కడుం జెలంగఁగాఁ
జనుఁబ్రియుఁడైన మాధవుని సంగతి మీఁదటఁజాలఁగ గల్గుటన్
(అము. 5-116)

గామాతిరేకమున్నను నామె పొందాసించి సిద్ధమైన గంధర్వుని రసికత పాశవికముకాదా? మహిష్యాం ప్రసవారాయాం మహిషో మదనాతురః అనినట్లుండును." అని విమర్శించారు. శ్రీ శాస్త్రి గారు, పెద్దన గర్భిణీరతిని వర్ణించాడని కోపిస్తూ.

కాని, శాస్త్ర ప్రకారం గర్భవతులకు కోరిక లేకపోవడం అనేది జరగదు. పెద్దనార్యుని వర్ణన సశాస్త్రీయమైనదే! అది కావ్య దోష్యమేమో మన కనవసరం.

గర్భిణీరతి ఇద్దరికీ సుఖదాయకమైనదేగాని— గేదెకు ప్రసవ వేదన, దున్నపోతుకు మదనవేదన అనదగింది మాత్రంకాదు!

## తొలిచూలాలికి కోరిక ఎక్కువ

డబ్ల్యు డి. సదర్‌లాండ్ అనే ఆయన హిందువులు గర్భిణీ రతికి వ్యతిరేకులు కారని వ్రాశాడు.-వాళ్ళు చివరి పదిహేనో రోజు వరకూ కలుస్తూనే వుంటారన్నాడు.

సంయోగంవలన స్రవించిన శుక్రం ఎదుగుతోన్న గర్భాన్ని పోషిస్తుందని "హిందువులు" నమ్ముతారట. ఇది మనదేశంలో ఏ మారుమూల ప్రాంతంలోనో వుండి వుండేదేమో మనకు తెలీదు. చైనా ప్రజలు గర్భిణీ సంయోగాన్ని పూర్తిగా నిరశించారు.

మైథునంవలన విడుదలైన శుక్రం పెరుగుతోన్న గర్భాన్ని చంపేస్తుందనీ, తత్ఫలితంగా గర్భస్రావం జరగవచ్చునీ చాలా మంది ఇప్పటికీ నమ్మేవాళ్ళు అన్నిదేశాల్లోనూ వున్నారు. ఈ కారణం చేతనే ఈ పురుషులు గర్భవతుల జోలికిపోరు. కేథలిక్కులు గర్భవతి సంభోగాన్ని వ్యతిరేకించారు. యూరపుదేశాల్లో ఇప్పటికీ గర్భవతి ముద్దాడితే పిల్లలు చచ్చిపోతారనీ, మూత్ర విసర్జన చేస్తే మొక్కలు చచ్చి పోతాయనీ నమ్మే వాళ్ళున్నారు.

"విత్తనం నాటాక, వంట చేతికి వచ్చేవరకూ భూమినిదున్న కూడదు—ట"! చర్చిపాపంగా ప్రకటించి చేసిన ప్రచారం మాత్రమే ఇది. ఖురాను కేవలం తొమ్మిది నెలలు మాత్రమే ఈ నిషేధాన్ని ప్రకటించింది.

ఇదీ మతం శాస్త్రంలోకి ప్రవేశిస్తే వచ్చేగొడవలు. అందుకే దాన్ని ఎంత దూరాన వుంచితే అంతమంచిది!!

ఆధునిక శాస్త్ర విజ్ఞానం ఈ నమ్మకాలన్నింటినీ కొట్టి పారేసింది. డ్రిబేయన్ అనే వైద్యుడు గర్భిణీ రతిని అవకాశం, ఓపిక ఉన్నంత మేరకు కొనసాగించ వచ్చని హామీ ఇచ్చాడు.

ఆయుర్వేదం, గర్భవతి అలిసిపోయే ప్రమాదం వుంది కాబట్టి "మైథునం వర్జనీయం" అంది! అయితే, సంభోగవాంఛ జనిస్తే గర్భవతిని ఎట్టి పరిస్థితులలోనూ నిరోధించవద్దని గర్భిణీ రతిని ప్రోత్సహించింది.

ఏమైనా, ఆరునెలల తర్వాత గర్భస్థశిశువు రక్షణ కోసరం సంయోగం జరగకుండా వుంటేనే మంచిది!

అసలు, లైంగిక భావోద్రేకం గర్భవతులలోనే ఎక్కువని ఒక పరిశీలనలో తేలింది. అందులోనూ, గర్భందాల్చిన తొలి రోజుల్లో ఈ కోరిక ఎక్కువగా వుంటుందిట।

హారీ కాంప్‌బెల్ అనే వైద్యుడు కనడానికి అలవాటు పడిపోయిన "మాతృశ్రీ"లకు తప్పిస్తే, తొలిచూలాలులకు కోరిక ఎక్కువగానే వుంటుంది....అన్నాడు.

ఒకావిడ, తనకు ఒకే ఒకబిడ్డ పుట్టాడనీ, ఆ బిడ్డను కనే రోజుల్లో అంతకు మునుపులేనంత ఎక్కువగా సంభోగంలో పాల్గొవాలనే కోరిక వుండేదనీ చెప్పినట్లు వ్రాశాడు హేవలాక్ ఎల్లిస్.

ఇది తరతరాలనుంచీ వస్తున్న వివాదమే! ఇవ్వాళదాని గురించి విశేషంగా చర్చిస్తే, ఎవడిష్టంవాడిది, ఎవరి ఓపిక వాళ్ళది—దాని గురించెందుకింత రభస-" అనిపిస్తుంది చాలా మందికి.

కాని, ఇవ్వాళ్టికీ ఈ సందేహంకలగని దంపతులు బహు కొద్దిమంది.

నూతన దంపతులకు శాస్త్రజ్ఞులిచ్చే సలహా ఏవిటంటే, "సున్నితమైన సురతి మాత్రమే ఆమోదయోగ్యం. ఇంక ఆవేశం వచ్చాక వెనకా ముందూ ప్రసక్తి మనవాళ్ళకు ఉండదు కాబట్టి ఈ విషయంలో కాస్త జాగ్రత్తగా ఉండండి—" అని!

నిండు చూలాలిని మితిమీరి రమిస్తే, అప్పటికప్పుడే ప్రసవం జరిగి పిండం మరణించవచ్చు. సంభోగం జరిగిన ఉత్తర క్షణానే ప్రసవ వేదనలు సంభవించవచ్చు. నెలలు నిండకుండానే ప్రసవం జరిగే [Pre-Mature Deliveries] చాలా సందర్భాలలో, ఈ "అతిరతి" మాత్రమే కారణం అన్నాడు "సీరోపియాన్" అనే యూరోపియన్!

మన ఆచారంలో, కొత్తగా పెళ్ళయిన ఆడపిల్లని, మూడో నెలలోనో, ఐదో నెలలోనో పుట్టింటికి తీసుకు రావడం ఒక రివాజు. ఇది ఆమెను కేవలం శారీరిక శ్రమనుంచే కాక, భర్తకు దూరంగా ఉంచడం కోసమే ప్రధానంగా ఆచరిస్తుంటారు.

ఎల్లీస్ అంగీకరించిన "పైనార్డ్" అనే సుప్రసిద్ధ వైద్యుడు, గర్భిణీ రతిని పూర్తిగా నిషేధించాలి— అన్నాడు. తన "కన్సల్టింగ్ రూం"లో ముఖ్య ప్రకటన అనే ఓ బోర్డు పెట్టి, గర్భవతులను సంభోగంలో పాల్గొనవద్దని హెచ్చరించాడు.

ఫేరే అనే వైద్యుడు నిర్లక్ష్యంగా గర్భవతుల్ని రమిస్తే వాళ్ళకు పుట్టబోయే పిల్లల్లో రకరకాల నాడీ రుగ్మతులు ఏర్పడతాయి అన్నాడు.

గర్భ స్రావంగానీ, గర్భ పాతంగానీ [Abortions] జరిగేందుకు దీనివల్ల ఎక్కువ అవకాశాలున్న సంగతి అందరికీ తెలిసినదే! ముఖ్యంగా గర్భవతులకు కావలసింది పూర్తి విశ్రాంతి. అలాగని, పురుషుడికి దూరంగా వుంచినందు వలన వాళ్ళకు మానసిక శాంతి లభిస్తుందనుకోవడం పొరపాటు.

భర్తలు గర్భవతులైన భార్యలను ఎంత ఉత్సాహ పరిస్తే అంత మంచిది. వాళ్ళను శారీరికంగానూ, మానసికంగానూ ఏ మాత్రం అలవనీయకూడదు.

## అసలు కడుపులూ—
## దొంగ కడుపులూ !

ఒక స్త్రీ గర్భవతి అయ్యిందంటే ఆమెలో కొన్ని లక్షణాలు వ్యక్తమౌతాయి. నాలుగో నెలలో గర్భిణీ కోరే కోర్కెలకీ, గర్భవతి కాంగానే మొదటి మూడు నెలల్లోనూ కనిపించే ఇచ్ఛా విశేషాలకూ కొంత తేడా ఉంది.

నెల నెలా వెడలే ఋతు స్రావం నిలిచి పోతుంది. నోటి వెంబడి నీరు కారుతున్నట్లనిపిస్తుంది (సంస్రవణం) అన్నం తినాలని పించదు. వాంతులవుతాయేమో ననిపిస్తుంది (ఛర్ధి). తియ్యటి పదార్థాలంటే అసలే అసహ్యం పుడుతుంది. ఎంత సేపూ "పులుపు" కోసం ఆరాటపడుతుంటారు. మంచి చెడు అనే విచక్షణ ఉండదు.

ఏది పడితే అది కావాలని కోరుతుంటారు. వొళ్ళంతా బరువుగా ఉంటుంది. కళ్ళు వాడిపోయి, వాలిపోతుంటాయి. స్తనాలు బలిసి ఉంటాయి. స్తన మండలం నల్లగా మారుతుంది. పాదాలలో కొంచెం వాపు కనిపిస్తుంది. యోని విశాలం అవుతుంది. శరీరంలో మంట ఉంటుందని కొందరు చెప్తారు. ఇవీ గర్భవతిని గుర్తించడానికి సామాన్య లక్షణాలు. *

అయితే కొంత మంది ఆడవాళ్ళు నిజంగానే కడుపనుకొని దొంగకడుపుని నెలలు తరబడి మోస్తారు. దీనికి కారణం తెలుగులోనే చెబితే బాగా అర్ధం అవుతుంది.

మామూలుగా నెల నెలకూ కనిపించే ఋతు స్రావం కొన్ని పరిస్థితుల్లో గర్భాశయంలో అడ్డగించబడి అక్కడే పేరిగిపోతుంటుంది. ఫలితంగా గర్భ చిహ్నాలన్నీ ప్రవ్యక్తమౌతాయి. గర్భ లక్షణాలు కనిపించేసరికి, నిజంగానే అది కడుపనుకొని సీమంతం దగ్గర నుంచి సూడిదలు దాకా నానా హంగామా చేసేస్తారు భారత నారీమణులు.

ఇదే పరిస్థితి ఒక పెళ్ళికాని కన్నెపిల్లకు జరిగిందనుకోండి.... ఇంక, ఆ "మేరీమాత" ఇంట్లో బ్రతకగలదా?

ఇంట్లోంచి గెంటేందుకు ఓ పెద్ద మనిషి తయారైతే, ఉరి పోసుకోవడానికి తయారౌతుంది రేపో మాపో అన్నట్లున్న నాయనమ్మ. అది కడుపు అవునో కాదో డాక్టర్ల చేత పరీక్షచేయించి తరవాత అఘాయిత్యాలకు తలపడమని ఇంట్లో వృద్ధ జనాభాకు నచ్చచెప్పాలి ముందు!

తీరా, ఇంట్లోంచి గెంటేయడమే జరిగిందనుకోండి...., దిక్కు తోచక పాపం ఆ అమాయకురాలు ఎండ వేడిలో మాడిపోతుంది.

---

* (చరకం, శారీరం, అధ్యాయం 4 )

ఆ శ్రమచేత, దుఃఖం చేత, వేదన చేత లోపల రక్తపుగడ్డ బైటకు స్రవించడం ప్రారంభిస్తుంది.

అలా స్రవిస్తున్న ఋతు రక్తాన్ని చూసి, మళ్ళీ నాయనమ్మలు, అమ్మాయికి దయ్యాలూ, పిశాచాలూ పట్టి దాని రక్తాన్ని పీల్చేస్తున్నాయని భూత వైద్యానికి తయారౌతారు.

చరకుడు, కొందరు కన్నెపిల్లల ఈ దురవస్థను ఇంత చక్కటి కథగా వర్ణించాడు. ఈ గ్రహశాంతుల్ని చేసేవాళ్ళని తిట్టిపోశాడు....

అలా పడిపోయిన దొంగ గర్భాన్ని కేవలం రక్తపుగడ్డని చూసి, అమాయకులైన నరులు గర్భం పిశాచాది భూతాల చేత అపహరించబడిందనుకుంటారు. మనిషి ఓజస్సునీ లేక, మనిషిలోని చైతన్యాన్నీ అపహరించుకుపోయే పిశాచాలు [Bacteria, virus ఇత్యాది], మనిషి గర్భాన్ని ఆహారం కోసం మేసి మనిషిని మాత్రం సజీవంగా వదిలి పోతాయా... ? అన్నాడు వ్యంగ్యంగా! *

ఈ దయ్యాల మీద నమ్మకం కేవలం మన దేశానికే కాదు, పురాతన జాతులన్నింటిలోనూ ఉంది.

బాబిలోనియన్లూ, ఇజ్రాయిలైట్లూ, క్రిస్టియన్లూ మానసిక వ్యాధులకు కూడా దయ్యాలే [Demons] కారణం అనుకొనే వాళ్ళట. క్రీస్తు కాలం వరకూ ఈ నమ్మకం చాలా విపరీతంగా ఉండేదిట

---

* ఓజోఽశనా నాం రజనీ చరాణాం
అహారహే తోర్నశరీర మిష్టమ్" (చ. శా)

"ఎగ్జోర్సిజమ్" అనే ఉత్సవం జరుపుకొని దయ్యాలను దూరంగా పారద్రోలే వారట ఆనాటి ప్రజలు.

ఆత్మ గురించీ, మనసు గురించీ, శాస్త్రజ్ఞులు ఒక వైపు పరిశోధిస్తుంటే, ఆరోజుల్లో ఎవరో కొందరు "మానసిక బలహీనులు" ఇంకొకవైపు ఈ దయ్యాల్ని సృష్టించారు.

క్రీ.పూ 2,850 నాటి ఈజిప్టు వైద్యుడు "ఇమ్హోటెప్" ఈజిప్ట్ వైద్యానికి పితామహుడు. అలాగే గ్రీకుల వైద్యానికి "అస్క్లిపియస్" అనే ఆయన ఆద్యుడు. వీళ్ళంతా ఆత్మ గురించీ, మనసు గురించి చదవడానికి ప్రయత్నించిన వాళ్ళే!

ఆత్మకు సంబంధించిన విజ్ఞానం అంతా కేవలం భారతదేశపు సొత్తేకాదు. అది దాదాపుగా అప్పటికున్న జాతులందరికీ తెలిసిన విషయమే. ఆత్మ వాదులూ, అనాత్మ వాదులూ మత ప్రచారంలో ఆత్మకు అంత ప్రాముఖ్యత నీయడానికి కారణం ఇదే!

బౌద్ధ యుగం అంతరించే వరకూ "ఆత్మ" కు సంబంధించి ప్రపంచ వ్యాప్తంగా చర్చలు సాగిన కాలం. కాబట్టి అది "ఆత్మ యుగం" అనొచ్చు మనం

## నరాల బలహీనతకు కడుపే మందు!

స్త్రీలలో కడుపుతో వుండడం అనేది మానసికంగా కొంత అలజడిని కలిగిస్తుంది. అంతకు మునుపులేని విచిత్రమైన మార్పులు చాలా కనిపిస్తాయి. ప్రసవం స్త్రీమూర్తికి రెండో జన్మ.

అప్పుడే అమ్మయిన ఆడపిల్ల తను వాళ్ళ అమ్మ అంత అయ్యాననుకొంటుంది. కొంత మంది ఆడవాళ్ళయితే, అంతకు మునుపటికన్నా ఆరోగ్యంగా కనిపిస్తారు. తరచూ నాడీ బలహీనతలతో బాధపడే ఆడవాళ్ళకు ఒక్కోసారి గర్భం దివ్యౌషధంగా

పనిచేస్తుంది. తలనొప్పి, నిద్రపట్టక పోవడం వంటి వ్యాధులు గర్భం దాల్చాక వాటికవే రూపుమాసిపోయే అవకాశం ఉంది. డా॥ వినయ్, మానసిక రోగాలున్న స్త్రీలకు గర్భం కలిగేలా చూడమన్నాడు.

ఆడవాళ్ళు పిలిస్తే పలికే హిష్టీరియాకు పెళ్ళే మందు!

హావెలాక్ ఎల్లిస్ మరికొన్ని ప్రయోజనాలనుదహరించాడు. గర్భం వచ్చాక ఒకావిడకు తెలివితేటలు పెరిగాయి. ఒకావిడకు పిచ్చి కుదిరింది. ఇంకో స్త్రీమూర్తికి గర్భం కలిగాకే అసలు స్త్రీత్వం అంటే ఏమిటో తెలిసింది.

కొందరిలో నాడీవ్యవస్థ, వెన్నుపాము వగైరా పరిపూర్ణంగా ఎదిగి ఉండవు ఒక వయసు వచ్చి, పెళ్ళయి, సంసారం అంటూ ఏర్పడి, బాధ్యతలు నెత్తినపడి, మాతృత్వం అనే ఓ పవిత్రమైన భావం కలిగిం తర్వాత, స్త్రీ మనసును చాలా పెంచుకుంటుంది. అప్పటికిగానీ నాడీ వ్యవస్థ పూర్తిగా ఎదగదు.

కొత్త సంసారంలో మనసులు కలీక, చిన్న చిన్న తగవులతో కాపురం అస్తవ్యస్తంగా వున్నప్పుడు, ఆయిల్లాలే గనక "అమ్మ" అయినట్లయితే గొడవలు వాటికవే సర్దుకున్న సందర్భాలు మన సమాజంలో చాలా ఎక్కువ.

కాని, విచిత్రం ఏమిటంటే, అసమర్థుడి పెళ్ళానికి కడుపొస్తే, అనుమానం ముందు ప్రసవిస్తుంటుంది!

జిప్సీలలో ఓ సామెతవుంది. ఓ పెళ్ళికాని ఆడపిల్లకు కడుపు వస్తే, ఆమె చంద్రపుష్పాన్ని వాసన చూసిందనుకుంటారట! "She has Smelt the Moon Flower"—అని!

చంద్రుడి శిఖరాగ్రంమీద పెరిగే అపుష్పం వెదజల్లె సువాసనను అఘ్రాణిస్తే, వంధ్యత్వం పోతుందని వాళ్ళనమ్మకం. అందు

కని, గర్భవతులంతా అపనిచేసిన వాళ్ళుగా భావించుకొంటారు. పిల్లలను కనగలిగిన స్త్రీకి అక్కడ రాజపూజ్యంట. పెళ్ళికాకుండానే కడుపొచ్చినా పట్టించుకోని సమాజం జిప్సీలది।

# 2. వెవిళ్ళు ఎందుకు కలుగుతాయి?

సర్ ఆర్థర్ మిచ్చెల్ల్ మనిషి మూర్ఖుడుగా ఎందుకు తయారవుతున్నాడన్న విషయంపై విశేష పరిశోధన చేశాడు.

ఆయన అభిప్రాయం ప్రకారం, ఈ మూర్ఖత్వం [Idiosy] అనేది పిల్లల్లో పుట్టుక నుంచే వున్నట్లయితే. అది తల్లి గర్భవతిగా వున్నప్పుడు, ఆమెలో మానసికంగా, ఏర్పడిన తీవ్రమైన అశాంతి [Emotion] బిడ్డపైన ప్రసరించడంవలన ఏర్పడిందని *

తల్లి మనఃస్థితి ప్రభావం కడుపులో ఎదుగుతోన్న బిడ్డపైన పడుతుంది. ఎలాగంటే, తల్లి నిర్ణుంగదిసే ఆ విషయం రక్త ప్రవాహంద్వారాబిడ్డను చేరుతుంది — అన్నాడు మిచ్చెల్ల్. వీటికి మెటర్నల్ ఇంప్రెషన్స్ అనిపేరు పెట్టాడు.

ఇడియసీ గురించి పరిశోధించినందుకు, ఇలా వ్రాసినందుకూ మిచ్చెల్ల్‌ని పెద్ద "ఇడియట్" గా జమకట్టారు ఆధునిక వైద్యులు. అతని సిద్ధాంతాన్ని వాళ్ళంగీకరించలేదు.

---

* Idiosy May be Produced on the child by Strong and Prolonged emotional influence working on the mother, because Such general influence may be transmitted through a deteriorated blood Stream"

తల్లి తీవ్రమైన మానసిక వేదనను అనుభవిస్తున్నప్పుడు, ఆ వేదన గర్భస్థశిశువుపైనకొన్ని లక్షణాలను కలుగుచేస్తుంది. ఈ లక్షణాలనే మెటర్నల్ ఇంప్రెషన్స్ అంటారు.

ఇదంతా మూఢనమ్మకం పొమ్మంటున్నారు — నేటి ఆంగ్ల వైద్యులు. చరకుడి అభిప్రాయాన్ని కూడా పరిశీలిద్దాం.

గర్భాశయంలో ఎదుగుతున్న పిండానికి మూడో నెలవరకూ ఒకరూపు రాదు. అప్పటివరకూ వాటి అవయవాలన్నీ సూక్ష్మంగా వుంటాయి. ఈ అవస్థలో పిండానికి ఆకలిదప్పులుండవు *

ఆ తర్వాత అన్ని అవయవాలూ ఏర్పడినాక, తల్లి భుజించిన ఆహార సారం (రసధాతువు) కడుపులో ఎదుగుతోన్న బిడ్డకు కొంత రోమరంధ్రాలనించీ, కొంత నాభినాడీ మార్గం" [Umblical cord] నించీ, చేరి గర్భాన్ని పోషిస్తుంది.

ఎదుగుతోన్న శిశువునూ, గర్భాశయపు లోపలి గోడలనూ కలిపే "సంచి" వంటి భాగాన్ని అపర—Placenta (మావి) అంటారు.

బిడ్డను పోషించడం, దానికి శ్వాసను కల్గించడం, దాని మలాదులను బైటకు విసర్జింప చేయటం దీని పని.

పిండాన్నీ, ఈ "మావి" నీ కలిపే సన్నటి నాళాన్ని గర్భనాడి [Umblical cord] అంటారు. తల్లి రక్త ప్రసారానికి సంబంధించిన [Maternal circulation] ధమనులు [Arteries] ఈ మావికి రక్తాన్ని అంద చేస్తాయి.

---

* వ్యపగతా పిపాసా బుభుక్షస్తుఖలుగర్భః పరతన్త్రవృత్తిః (చ. శా అ.4)

ఇలా తల్లి ఆహార పాన, రక్తాదులతోటి పోషించబడ్తోన్న గర్భస్థ శిశువూ, తల్లి నిఃశ్వాస, ఉచ్ఛ్వాస, సంచలన నిద్రలలో ఏవనిచేస్తే అదే పని చేస్తుంది. తల్లి నిట్టూరిస్తే బిడ్డ కూడా నిట్టూరుస్తుంది, తల్లి నిద్రిస్తే గర్భస్థ శిశువూ నిద్రిస్తుంది 1)

అంటే కేవలం శారీరిక చేష్టలేగాక, తల్లి మానసిక స్థితి కూడా బిడ్డపైన ప్రభావాన్ని చూపిస్తుంది-అన్నారు ఆయుర్వేదజ్ఞులు. ఆధునికులు, మొన్న మొన్నటిదాకా, తల్లి బిడల ఇద్దరి రక్తం ఒకటి కాదనీ, వేర్వేరనీ భావించుకునే వాళ్ళు ఇప్పుడిప్పుడే కొన్ని విషయాలు పరిశీలిస్తుంటే కొన్ని మరుగున పడిన సత్యాలు వెలుపలికి వస్తున్నాయి.

గర్భానికి సంబంధించిన కొన్ని కణాల తల్లి రక్తంలో కనిపించడాన్ని బట్టి అటూ ఇటూ మార్పిడి చెందించుకునే అవగాహన ఏదో ఈ ఇద్దరి రక్తాలకూ వుందని ఆధునికులు అనుమానిస్తున్నారు ఇది చాలా తరచూ జరిగే ప్రక్రియ! 2)

---

1] The Foetal and Maternal circulation Were Formerly considered entirely Seperate. There is now convincing evidence of the escape of Foetal cells into the Maternal circulation. The increasing Frequency of A B O Iso immunisation indicates that this escape of Foetal cells in to the maternal System, Is much more Frequent than was Formerly thought

[Clinical obstetrics. A.C. Mudaliar]

2] శ్లో॥ నిఃశ్వాసోచ్ఛ్వాస సంక్షోభ స్వప్నాకాన్ గర్భోఽధిగచ్ఛతి।
మాతుర్నిశ్వసితోచ్ఛ్వాస సంక్షోభ స్వప్న సంభవాన్॥

[సు. శా. అ. 8]

## ఎనిమిదవనెలలో విచిత్రం

ఏడోనెలకు వచ్చేసరికి గర్భానికి సంబంధించి అన్నిధాతువులూ పరిపూర్ణంగా అభివృద్ధి చెంది వుంటాయి. అంటే తల్లిరాను రానూ తన శక్తిని అధికంగాఖర్చు చేస్తుంది. అందుకని, కొంచెం హీనబలాన్ని కలిగివుంటుంది. ఫలితంగా బడలిక (క్లాన్త)ను పొందుతుంది.

ఈనెలలోనే కాళ్ళు, చేతులూ, వ్రేళ్ళూ, ముక్కూ, వెంట్రుకలూ ఇలాంటి ప్రత్యంగాలు ఏర్పడతాయి గర్భస్థశిశువులో.

కాబట్టి ఏడోమాసంలో శిశువు జన్మిస్తే జీవిస్తాడు.

కాని, ఎనిమిదోనెల కొచ్చేసరికి ఒక పెద్ద విచిత్రం కనిపిస్తుంది.

మనం ప్రాణంతో వున్నామంటే, అందుకు "ఓజస్సు" కారణం. ఈ ఓజస్సు మనలోని చైతన్యం. దీనినే Immunity అంటున్నారు. మనలోని మహత్తర శక్తి ఇది. దీన్ని ఎంత ఎక్కువ కలిగి వుంటే మనిషి అంత ప్రకాశిస్తాడు.

తల్లి ఓజస్సును గర్భం రక్త ప్రసారంద్వారా ఆకర్షించుకొంటుంది. ఆ ఓజస్సు తన దగ్గర వున్నంతకాలం గర్భం అద్భుతమైన చైతన్యాన్ని ప్రదర్శిస్తుంది. ఎనిమిదోమాసంలోనే తల్లి నుంచి బిడ్డకు, బిడ్డనుంచి తల్లికీ ఈ ఓజస్సు మార్పునొందుతుందని ఆయుర్వేదీయులు చెప్తున్నారు.

ఈ కారణంవలనే తల్లి కొంతకాలం ఉత్సాహంగానూ, మరి కొంతకాలం నీరసంగానూ జడంగానూ వుంటుంది. కాబట్టి గర్భంలో ఓజస్సు ఎనిమిదోనెలలో స్థిరంగా వుండదు.అందుకుని ఈనెలలో

కాన్పు జరిగితే బిడ్డ బ్రతకక పోవచ్చునని చెప్తారు. ఓజస్సు మార్పిడి నొందేప్పుడు అది బిడ్డనుంచి తల్లిని చేరి, బిడ్డ ఓజోహీనంగావున్న సమయంలో ప్రసవం జరిగితే ఆ బిడ్డ నిస్పందేహంగా మరణిస్తాడు.

జాతూ కర్ణుడు, "తల్లీ, బిడ్డలిద్దర్నీ ఓజస్సూ ఒకరికొకరికి మారివుండే ఈనెలలో ప్రసవం జరిగితె బిడ్డకే ప్రమాదం" అన్నాడు *

అయితే ఈ విషయం ఆధునిక శాస్త్రజ్ఞులదృష్టికి ఇ.కా వచ్చినట్లు కనిపించదు. వాళ్ళు Immunity (ఓజస్సు) బిడ్డనుంచి తల్లికీ, తల్లినించి బిడ్డకూ మార్పిడి జరుగుతుందన్న విషయాన్ని మాత్రం అంగీకరిస్తున్నారు. అందుకు ఉపయోగిస్తున్న Placenta (మావి)ని, దానికి వున్న ఈమార్పిడి చేసే గుణాన్ని (Diffusion) విశ్లేషించగలిగారు. ఓజోధాతువు [Immune Body] తల్లినించిబిడ్డకు మావిలోని "కోరియోనిక్ విల్లయి" అనే వ్రేళ్ళలా పొడుచుకువచ్చే అంగాలలోంచి జరుగుతుంది.

అదే ఆవులవంటి పశువులలో, వాటిదూడలకు ఈ ఓజో మార్పిడి జరగదు. అయినా, బైటకురాంగానే ఓజస్సు లేకుండా ఆవుదూడలెలా బ్రతుకుతున్నాయి–అంటే, గ్లోబ్యులిన్ [ఇది ఒక ఓజోధాతువు] పదార్థం ఎక్కువగా వుండే తమ తల్లిపాలు వెంటనే త్రాగడంవలన పశుసంతానం రక్షించబడుతోంది.

---

* "స్త్రీ గర్భావన్యోన్య ఓజ ఆదదాతేఽష్టమే, తస్మాత్తదా ప్రసూతిః గర్భవినాశైవ"

మానవ సంతతి విషయంలో, బిడ్డ పుట్టిన వెంటనే పాలు పట్టించక పోవడానికి కారణం, పాపాయి అప్పటికే తల్లినించి ఓజస్సును గ్రహించడమే!

## దౌహృదా పచారాలు

గర్భంలో ఎదుగుతున్న శిశువుకూ సుఖదుఃఖ భావన లుంటాయని ఆయుర్వేదం చెప్తోంది.

ఈమనోభావాలు ఇంకా కళ్ళు తెరవని బిడ్డలో ఎలా పనిచేయ గలుగుతున్నాయో కొంత ఆశ్చర్యమే!

శిశువుకు సరిగ్గా నాలుగోమాసంలో "హృదయం" ఏర్పడు తుంది "హృదయం చేతనాస్థానం" అని ఆర్యోక్తి. చేతనత్వానికి స్థానమైన హృదయం ఏర్పడగానే శిశువులో చైతన్యం పెల్లుబుకు తుంది.

ఈ చైతన్యదశలోనే బిడ్డకు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ స్వరూపమైన పంచేంద్రియజ్ఞానం కలుగుతుంది. అలాంటి చేత నావశిష్ఠమైన తనదొకటి, తన గర్భంలోని బిడ్డదొకటి—మొత్తం రెండు హృదయాలు కలిగినది కాబట్టి నాలుగోనెలనుంచి తల్లిని "దౌహృదిని" అనిపిలుస్తారు.

చైతన్యానికి చిహ్నం కోరికలు కలగడం. అది ప్రకృతికి ప్రతిస్పందించడమే: కాబట్టి, నాలుగు నెలల గర్భస్థశిశువూ కోరి కలు కోరడం ప్రారంభిస్తాడు.

తల్లి నిట్టూర్పు బిడ్డపైన పడ్తుందన్నట్టే. బిడ్డనిట్టూర్పూ తల్లి పైన పడ్తుంది. ఈకోరికలు Transfer చేసిపెట్టే Placenta [మావి] పుణ్యమా అంటూ. బిడ్డ కోరిన కోర్కెలు-తల్లి హృద యాన్ని చేరి, అవి తల్లి కోర్కెలుగామారి తల్లిచేత కోఁబడ

తాయి. వీటినే మనం వేవిళ్ళు అంటున్నాం. బిడ్డపడే బాధ కూడా తల్లి పడే బాధగా మార్పిడి చెందడమే యీ వేవిళ్ళ సిద్ధాంతంలోని విచిత్రం.

బిడ్డ పరిరక్షణా, తల్లి ఆరోగ్యం ఒకదానికొకటి పైన ఒకటి ఆధార పడివుంటాయి. తల్లిని నిరాశ పరిస్తే పిండమూ నిరాశ పడ్తుంది. కాబట్టి తల్లి ఏంకోరితే అది బిడ్డకోరికగా భావించి తీర్చవలసి వుంటుంది.

గర్భవతులలో ఈ ప్రార్థన (ఇచ్ఛకలిగిన వానిపై ప్రబల మైన కోరిక) అహితపదార్థాలమీద విశేషంగా కలిగితే హితమైన దానితో వాటిని కలిపి, సంస్కరించైనా సరే, ఆమెను తృప్తి పరచాలి. కోరికని నిరోధించి, ఆత్మ నిగ్రహం కబుర్లు వల్లిస్తే చెల్లదు. అందువలన గర్భానికి వివిధ వికారాలు సంభవించ వచ్చని ఆయుర్వేదం భావిస్తోంది.

కోరికను తీర్చడం అనేది, కేవలం మానసికంగా ఉల్లా సాన్ని పెంచడానికే! తల్లి ఉల్లాసంగా వుంటే బిడ్డకూడా ఉల్లా సంగా ఎదుగుతాడు.

ఈ వేవిళ్ళు [Cravings] గురించి హావెలాక్ ఎల్లిస్ కొంత చర్చించాడు. ఆయన "గర్భిణీ మనోరథ పూరణం" చెయ్యకపోతే, పుట్టబోయే బిడ్డ అవయవాలలో లోపాలు కలగుతాయనే వాదాన్ని మూఢ నమ్మకంగా కొట్టి పారేశాడు. కోరికలనేవి Auto Suggest-ions— స్వయం ప్రేరణలు వాటిని తీర్చకపోతే ఏ ప్రమాదమూ లేదని అల్లోపతీయులు ఇవ్వాళ్టికి గట్టిగా విశ్వసిస్తున్నారు.

సూక్ష్మంగా ఆలోచించి చూస్తే గర్భవతులకే కాదు, మామూలు మనుషులకు సైతం, కోరిక తీరనప్పుడు మనసు వికా వికలమైనట్లుంటుంది. ఇంక అల్పనిరోధక శక్తివున్న గర్భిణీస్త్రీల మాట వేరే చెప్పాలా....?

కోరికలు మనసునుంచి బయలుదేరిన ప్రవృత్తుల కారణంగా జనిస్తాయి. ఈ ప్రవృత్తులచలనాన్ని "వాత" చలనంగా ఆయుర్వేదం వివరించింది. కోరికలను నిగ్రహించడం అంటే, ప్రవృత్తులను అడ్డుకోవడంగానూ, వాత గమనాన్ని నిరోధించడంగానూ భావించారు.

నిరోధించబడిన వాతం ముందుకు కదల్లేక బంధించబడినట్ల వుతుంది. అలాబంధించబడి అక్కడే "వృద్ధి" చెందికొన్ని విప త్కర పరిస్థితులను కల్పిస్తుంది. [Vitiatedvata] వృద్ధి చెందిన వాతం ఇంకా నిగ్రహాన్ని దాటి చే వ్యక్తిలో ప్రకోపావస్థ పొందు తుంది. ప్రకోపం అంటె వక్రమార్గాన పయనించడం 1)

కోరికలు గర్భాశయానికి సంబంధించిన వి కాబట్టి, శరీరంలో ప్రకోపించబడిన వాతం గర్భాశయంపైనే దృష్టిని కేంద్రీకరి స్తుంది. దీన్ని "అసంతృప్త వాతం అనుకొందాం. ఈ అసంతృప్త వాతం గర్భాశయంలో అప్పుడప్పుడే అవయవాలను రూపొందించు కొంటోన్న శిశువుపైన తన ప్రతాపాన్ని చూపించేందుకు అవ కాశాలు ఎక్కువ వున్నాయి. గూని, చేతులు ఊచలా వుండడం, కుంటి, చైతన్యంలేక జడపదార్థంలా వుండడం, పొట్టితనం, వికా రంగా వుండే నయనాలు, అసలు కళ్ళు లేకపోవడం, వంటి అవ లక్షణాలున్న పిల్లలను కోరికలుతీరని తల్లులు ప్రసవిస్తారు అన్నాడు సుశ్రుతుడు.

కోరికలు తీరిన గర్భవతులకు శౌర్యము, దీర్ఘాయువుగల సంతానం కలుగుతుంది। 2)

---

1 కోపస్తూన్మార్గగామితా ..

2—దౌహృద విమాననాత్, కుబ్జం, కుణీ, ఖజ్జం, జడం, వామనం, వికృతాక్ష మనక్షం వానారీ సుతం జనయతి। తస్మాత్ సా యద్యాదిచేత్ తత్తస్యై దాపయేత్। లబ్ధ దౌహృదాహి వీర్యవన్తా చిరాయుషంచ పుత్రం జనయతి॥ [సు.శా.6.3]

## కోరిక తీరకపోతే?

ఇలా అంటే చాలా మందికి కోపం రావచ్చు. కాని, గర్భం దాల్చిక స్త్రీలలో "క్లెప్టోమానియా" అనే విచిత్రమైన మనో వికారం ఏర్పడేందుకు కొన్ని అవకాశాలున్నాయి. దొంగతనం చేయాలనే ఓ పిచ్చి కోరిక కలగడం క్లెప్టోమానియా. ఇది గర్భవతులలో ఎక్కువగా ఉంటుంది. ఇది వాళ్ళకు సహజమైనదే ననుకుని మనమే సర్దుకుపోవాల్సి వుంటుంది విషయంలో.

మనదేశంలో అయితే, మామిడి కాయలకూ, చింతకాయలకూ మాత్రం "ఈ చేతివాటం" జరుగుతుంటుంది. కాని, ఏ మాత్రం నైతిక ప్రమాణాలు పాటించని పాశ్చాత్య దేశాల్లో సరదాకు దొంగతనానికి పాల్పడే గర్భవతుల బెడద ఎక్కువగా ఉన్నదట.

వీళ్ళందరూ "ఫామిలీ టైపు" కావడంతో పాలక వర్గం వాళ్ళనేమీ చేయలేక పోతోందని వార్తలు. కొందరిలో హత్యలు చేయాలన్నంత నేర ప్రవృత్తి కూడా ఉండవచ్చునన్నాడు ఎల్లిస్. ఇది కూడా ఒక విధమైన వేవిళ్ళనుకుందాం... !

ఫ్రాన్స్‌లో వేవిళ్ళను "Envie" అంటారు. కోరిక తీరకపోతే, ఆ కోరిక ఏ అవయవానిదో బిడ్డకు ఆ అవయవం మీదే మచ్చలు ఏర్పడుతాయి అని వాళ్ళకూ ఆచారంతో కూడిన నమ్మకాలున్నాయి. ఈ మచ్చల్ని కూడా వాళ్ళు "ఎన్వీ" అనే పిలుస్తారు.

గర్భం దాల్చిన తొలి రోజుల్లో ఒకావిడ తను ప్రియాతి ప్రియంగా చూసుకునే ఒక కుందేలు పిల్ల చచ్చిపోవడం వలన విపరీతమైన విచారంలో మునిగిపోయింది. ఆ కుందేలును ఓ పిల్లి చంపుకుతింది. దాన్ని గురించిన నిరంతరమైన వేదనతోటే నెలలు నిండాయి ఆమెకు.

తీరా పుట్టిన ఆ బిడ్డకు వంకర కాళ్ళూ, ఒక కాలికి రెండే వేళ్ళూ, మిగతా మూడూ చిన్నవిగా, కలిసిపోయి ఉండడం

వగైరా అవలక్షణాలు కనిపించాయి. ఇలా ఎందుకు జరిగింది అని ఆవిడ హావెలాక్ ఎల్లిస్‌ను ప్రశ్నిస్తూ ఒక ఉత్తరం వ్రాశింది.

ఆయన వాకు "తెలీదు" అని జవాబిచ్చాడు. బహుశా, మానసికంగా ఆవిడ చింతా, శోకాదులకు గర్భవతిగా ఉన్నప్పుడు లోనుకావడం వలననే ఇది జరిగిందేమో ... అయినా కేవలం అందు వలననే ఇన్ని వికారాలు సంభవిస్తాయనుకోను.... అని సమాధానం చెప్పుకున్నాడు. ఆయుర్వేదం పూర్తిగా నమ్మే ఈ విషయాన్ని ఆధునికులు పూర్తిగా కొట్టివేస్తున్నారు. కాబట్టి ఇది కాస్త ఆలోచించ వలసిన వివాదమే!

గర్భవతిగా ఉన్నప్పుడు శోకించడం వంటి పనులు చేయడాన్ని "దౌహృదాపచారం" అంటారు. "దౌహృదాపచారం" వలన పిల్లలలో అనేక వికారాలు సంభవమే! శ్రోత్రేంద్రియానికి ప్రీతికరమైన గానాది శబ్దశ్రవణాదుల మీద కోరిక కలిగి అవి తీరకపోతే, శిశువుకు శ్రోత్రేంద్రియంలోనే బాధ కలుగుతుంది.

చర్మానికి సంబంధించిన ప్రీతికరమైన వస్త్రాలంకారాది ఉపభోగాల పట్ల తల్లికి పెరిగిన మక్కువ అణచివేయబడితే బిడ్డ త్వగింద్రియం బాధ పడుతుంది.

చక్షురింద్రియానికి సంబంధించిన విషయాలు కోరిన తల్లి— ఆ సినిమానే గనక చూడకపోతే— శిశువు నేత్రేంద్రియాలలో బాధ కలుగుతుంది.

ఇలా ఏ అవయవానికి సంబంధించిన కోరిక తీరకపోతే బిడ్డ కూడా ఆ అవయవంలోనే వేదనను పొందుతాడు.

కాని, బిడ్డకు వచ్చే ఎలాంటి వేదన అయినా, అది తల్లి హృదయంపైన పడుతుంది. ఆ బాధను తల్లి కూడా అనుభవిస్తుంది.

కాబట్టి శిశు బాధా నివారణార్థం తల్లి కోరికల్ని తీర్చాలి అని శాసించాడు సుశ్రుతుడు. 1)

తాము గర్భవతులం కావడాన్ని స్త్రీలు ఒక "అదృష్టం"గా భావించుకోవాలి. ఇది కుటుంబ నియంత్రణ వ్యతిరేక ప్రచారం ఎంత మాత్రం కాదు. అదే పనిగా పిల్లల్ని కనమనే దేశ ద్రోహం కాదిది.

వాగ్భటుడు చెప్పినట్లు, భర్తలచేత, భృత్యులచేతా గర్భవతులు మనసుకింపైన, పథ్యమైన ఆహార విహారాల రూపంలో సేవ చేయించుకోవాలి! మన దేశంలో ఇంతటి మహత్తర అవకాశం ఆడవాళ్ళకు గర్భవతులుగా ఉన్నప్పుడే లభిస్తుంది కాబట్టి, అదీ అదృష్టమే! వెన్న, నెయ్యి, పాలూ మొదలైన సాత్వికాహారాలతో గర్భవతి నిత్యం ఉపచరింపబడాలి. తప్పదు!! 2)

## గర్భవతులు అలంకరించుకోవాలి!

గర్భం దాల్చింది మొదలుకొని, స్త్రీ ఎప్పుడూ శుచిగా చక్కగా అలంకరించుకొని, తెల్లటి వస్త్రాలు ధరించి, చాలా సంతోషంగా తిరుగుతూండాలి. అలంకరణ మనకు తెలీకుండానే మనసుపైన విశేష ప్రభావాన్ని కలిగిస్తుంది.

అంతేకాదు, దుర్గంధం, భయంకర పదార్థాల్ని చూడడం వంటి వాటికి దూరంగా ఉండాలి. చిత్తవ్యాకుల్యాన్ని కలిగించే

---

1) ఇంద్రియార్థాస్తు యానుయాను యోక్త మిచ్ఛతిగర్భిణీ।
గర్భా బాధ భయాత్తాంస్తాన్ భిషగాహృత్య దాపయేత్।
(సు. శా. 3)

2) ఉపచారః ప్రియహితైః భర్త్రా భృత్యైశ్చ గర్భధృక్
నవనీత ఘృతక్షీరైః సదాచైవ ముపచరేత్
(వా. శా.)

కథలూ, సినిమాలు వంటికి మంచిదికాదు. ఎండి పోయినవీ, చల్ది వాసన వచ్చేవీ, తడిసి నానినవీ అయిన ఆహారపదార్థాలు ముట్టుకోకూడదు.

గాలిలో తిరగకూడదు. సుశ్రుతుడైతే, పాడుబడిన గృహాల్లోకీ, బౌద్ధారామాల్లోకి, స్మశానాల్లోకీ, పెద్ద పెద్ద చెట్ల క్రిందకీ పోవద్దన్నాడు వాళ్ళని. ఇవన్నీ మనిషిని మానసికంగా బలహీనుణ్ణి చేసే స్థలాలు.

క్రోధం భయం వదిలి పెట్టాలి. శ్రమను కల్గించే రీతిలో అతి మైథునం, పగటి భోజనం, రాత్రి జాగరణం, ఏడవడం ఇవన్నీ గర్భవతులకు మంచి అలవాట్లు కావు! ఎడ్లబళ్ళు ఎక్కడం, కాళ్ళు చేతులూ వంకరగా మడిచి కూర్చోవడం, ఎగుడూ దిగుడూగా వున్న నేలపైన పడుకోవడం వంటి పనులు చెయ్యకూడదు.

మృదువైన పడక ఉండాలి. వెనకాల అనుకునేందుకు మెత్తటి బాలీసు లేనిదే కూర్చోకూడదు. పొడవు తక్కువ, వెడల్పు ఎక్కువగా వుండి, మనిషికి సరిపడ్డ శయనం ఉండాలి.

ఇలా ఆయుర్వేదంలో రకరకాల జాగ్రత్తలు గర్భవతులకు చెప్పారు. పైకివి బూర్జువా కోరికలుగా కనిపించవచ్చు. కాని, సాధ్యమైనంత వరకూ, కనీసం మధ్యతరగతి గృహిణులు వీటిని పాటించడానికి ప్రయత్నిస్తే సత్సంతానాన్ని పొందవచ్చని భవిష్యత్తరంపై కోటి ఆశలతో ఇది వ్రాయడం.

ఈ విషయాన్ని నొక్కి చెప్పడానికి ఓ కారణం వుంది. ఈ బీద దేశంలో కార్మిక స్త్రీలలో ఎంత మందో కూలికిపోయి పొలంలోనే నొప్పులు వడ్డ సంఘటనలున్నాయి. కాబట్టి, పొట్ట

కూటికోసం జరిపే నిత పోరాటంలో వాళ్ళకు "విశ్రాంతి" అనే పదం పరమ అసహ్యమైనదిగా గోచరిస్తుంది. కాని, మధ్యతరగతి గృహిణులు ఇటు కాయకష్టానికీ, అటు విశ్రాంతికీ రెంటికీ నోచుకున్నవారు కాదు. వాళ్ళు కేవలం అజ్ఞానంతో అనేకమైన దౌహృదాపచారాలు చేస్తున్నారు.

ఉపవాసాది వ్రతాలు మొదలుపెట్టి, అపథ్యాలైన ఆహారాలనూ, విహారాలనూ సేవిస్తూ నెలలు గడుపుతారు. అసలే వాళ్ళ శరీరాలు నీరసాలు పైపెచ్చు పూజా పునస్కారాలూ। దీనివల్ల నష్టాలను తల్లి తట్టుకోగలదేమోగాని, పుట్టబోయే బిడ్డ పెళాగికి పనికిరాకుండా పోతున్నాడు.

రూక్షంగానూ, కఠినంగానూ ఉండే ఆహారాన్ని సేవించడం మనవాళ్ళకు బాగా అలవాటై పోయింది. అందువలన పుట్టే బిడ్డలూ అలాగే తయారౌతారు.

మనం తీసుకునే ఆహారం ఏ సత్త్వాన్ని కలిగివుంటే, మనసూ అదే లక్షణాల్ని ప్రదర్శిస్తుందని శాస్త్రం చెప్తోంది. ఆ కఠిన, రూక్ష పదార్థాల వలన పోషించబడే పిల్లలూ అంతే. కఠినమైన మనస్తత్వాన్ని ఏర్పరచుకొంటారు.

ఇది ఆయుర్వేదం చెప్తోన్న మానస విజ్ఞానం.

అంతేకాదు, ఇలాంటి అపథ్య ఆహార విహార సేవనల వలన గర్భస్థ శిశువు స్వల్ప చలనాన్ని కలిగి, చాలా కాలం బయటకు రాకుండా, నానాటికీ క్షీణిస్తూ, గర్భాశయంలోనే వుండి పోతాడు. నెలలు మించిపోయినా ప్రసవం జరగక పోవడాన్ని "నాగోదరం" అనే వ్యాధిగా చెప్పారు.

గర్భం గర్భాశయంలోనే రోజు రోజుకూ క్షీణిస్తూ, అలా పన్నెండు సంవత్సరాలవరకూ వుండి పోవచ్చు ఈ వ్యాధిని "గజ గర్భ" అంటారు పూర్వం అందరికీ అన్ని వసతులూ అందుబాటులో లేని కాలంలో అలా ఏళ్ళతరబడీ గర్భాన్ని మోసే తల్లులు ఏ మారు మూల ప్రాంతాల్లోనో వుండేవాళ్ళు కాబోలు. వీళ్ళ అనవసర పు మోత, గర్భిణీ ఉపచారాలు సక్రమంగా జరగక పోవడంవలననే నని మనం గ్రహించాలి. పన్నెండేళ్ళపాటు "భరించడం అనేది సామాన్య విషయంకాదు.

ఇంకోరకం విచిత్రమైన వ్యాధి వుంది. బాగా కారపు పదార్థాలనూ, ఆవకాయి, మాగాయల్ని, తీక్షణ పదార్థాల్ని అధి కంగా సేవించడం మొదలుపెట్టిన గర్భవతి— ఉపవిష్టకం అనే వ్యాధిని పొందుతుంది. ఈ ఉపవిష్టకంలో గర్భస్థశిశువు ఎదుగూ బొదుగూ లేకుండా మూడో నెలలో వున్నట్లే వుంటాడు.

బాగా కాచిన నెయ్యి, పాలు, కమ్మటి, పుష్టికరమైన భోజనం, కోడిగుడ్లూ వంటివి వాడడమే దీనికి చికిత్స! వీటివలన గర్భం ఎదుగుతుంది. ప్రసవం తేలికవుతుంది.

బాగా అలిసిపోయే పనులు చేస్తూ, అందుకు తగ్గ ఆహా రాన్ని సేవించకపోతే, కడుపులో పెరుగుతున్నది ఆడశిశువను కోండి, ఆ శిశువులో ఒక విధమైన కర్కశ గుణం ఏర్పడుతుంది. ఈ కర్కశతవలన గర్భస్థ స్త్రీ శిశువు "యోని" ద్వారం చిన్నదిగా అయిపోతుంది. యోని ముడుచుకు పోతుంది. పాపం పుట్టె పాపలో ఈ అవలక్షణం తల్లి చేసిన మిధ్యాహార విహారంవలనకాదూ...! ఈ వ్యాధిని "సూచీ ముఖి" అన్నారు.

23)

ఈ నిరూపణలు స్నిగ్ధంగా వుండే కమ్మటి, ఇంపైన భోజనాన్ని తీసుకొంటూ, మనసును ఆహ్లాదంగా వుంచుకొంటూ, దేశానికి పనికి వచ్చే సంతానాన్ని కనమని గర్భవతులైన స్త్రీ మూర్తులను అర్థించడానికే!

# 3. ఏ రకెలాంటి పిల్లలు కావాలి?

మైథునం ప్రయోజనం కోరిక తీర్చుకోవడం మాత్రమే కాదు. సత్సంతానాన్ని పొందడంగా ఆయుర్వేదం భావించింది.

కుటుంబ నియంత్రణ అవశ్యకతను గుర్తిస్తోన్న ప్రజల్ని ఆత్మ నియంత్రణ వైపు ప్రోత్సహించాలి....అని కొందరి ప్రయత్నం. ఏమైనా, పుట్టిన ఆ ఇద్దరో, లేక ముగ్గురో సమాజాభివృద్ధిని కాంక్షించే వాళ్ళై వుండాలని కోరుకోవడం దంపతుల కనీస బాధ్యత.

కేవలం, మనసులో దేశాన్ని గురించీ, దాని అభివృద్ధి గురించీ దేశభక్తితో కూడిన భావం వున్నంత మాత్రానే పని పోతుంది. తాము ఈ దేశానికి పనికి వచ్చే పనులేమీ చెయ్యలేక పోయినా, వాళ్ళ సంతానమైనా ఆలోటును తీర్చి పెట్టేందుకు అవకాశాలున్నాయి.

అందుకు వాగ్భటుడు చెప్పిన చిట్కా ఒకటి వుంది.

ఎలాంటి సంతానం తమకు కావాలని దంపతులు కోరుకుంటారో, అలాంటి ఆచారాల్ని పాటిస్తూ, దానికి అనుకూలంగా వుండే వస్తువాహనాలనూ, పడకనూ, పడకగది అలంకారాలనూ ఏర్పాటు చేసుకోవాలి. ఎవరివంటి శీలసంపత్తులు గల బిడ్డలు

కావాలని తాము ఆశిస్తున్నారో ... వాళ్ళ చరిత్రనూ, ఆ ప్రదేశాలనూ మనసులో తలచుకుంటూ, అదే ధ్యాసతో, అదే ఆశతో సంభోగించాలి.... అన్నాడు. 1)

మన మనసులో దృఢంగా నాటుకుపోయిన కొన్ని విషయాలు మనకు తెలీకుండానే మనచేత అనేక పనులు చేయిస్తాయి.

మనిషి "తలంపు"కు మించిన శక్తిలేదు. శ్రద్ధకలిగిన ఆలోచనే అతణ్ణి కార్యశూరుణ్ణి చేస్తుంది!

## మైథునం ప్రయోజనం

అసలు, మన నూతన దంపతులకు మొదటి రోజే, మీకింక పిల్లలు పుట్టవచ్చు, అందుకు తగిన జాగ్రత్తలివి, వాటిని పాటించండి—" అని తెలియ చేయవలసిన అవసరం ఎంతైనా వుంది.

సంభోగానంతరం "పరిషేచనం" చేసుకోవడం కూడా తెలీని దంపతులింకా (మన మధ్య తరగతిలో ముఖ్యంగా) వున్నారంటే మనం సిగ్గు పడాలి.

అసలు మైథునం ప్రయోజనం ఏవిటో చాలామంది తల్లి దండ్రులకే తెలీదు. 2)

1) ఇచ్ఛేతాం యాదృశ్యాం పుత్రం తద్రుపచరితాంశ్చతే!
చింతయేతాం జనపదాం స్తదాచార పరిచ్ఛదే!!
(వాగ్భటం-శారీరం)

---

2) "ఆయుష్మన్తో మన్దజరా వపుర్వర్ణా బలాన్వితాః!
స్థిరో పచిత మాంసశ్చ భవన్తి స్త్రీషు సంయుతాః॥
(యోగరత్నాకరం, పూర్వ ఖండం)

"సంభోగ విషయంలో నియమబద్ధంగా వుండే వాళ్ళు, ఆయుష్మంతులౌతారు. వాళ్ళకు త్వరగా ముసలితనంరాదు, శరీరవర్ణం చక్కగా వుండి ప్రకాశవంతంగా వుంటారు. కోల్పోయిన బలం మైథునంవలన పుంజుకొంటుంది బాగా వృద్ధి నొందిన స్థిర మైన మాంసకండరాలు కలిగివున్న వారౌతారు...." అన్నాడు యోగరత్నాకరుడు.

సృష్టి కార్యానికి ఆయుర్వేదం ఇచ్చిన ప్రాముఖ్యత గొప్పది. సంభోగ నియమాలను వాళ్ళు చెప్పినంతగా మరే శాస్త్రమూ చెప్పలేదు. "సెక్సు-సైకాలజీ" మనకు కావలసినంత "రాశి"గా వున్నది అందులో!

ఇంతవరకూ అల్లోపతీయులకు అంతుపట్టని సిద్ధాంతం ఒకటి వున్నదిక్కడ. శిశువు మానసిక భావాలు సంభోగ సమయంలో తల్లిదండ్రుల మనోభావాలనుసరించే వుంటాయి.... అనేది ఈ సిద్ధాంతంలోని సారాంశం.

భార్యా భర్తలిద్దరూ ఎటువంటి ఆహార, విహార, చేష్టావేష ధారణలను కలిగి వుండి సంభోగిస్తారో అలాంటి ఆహార విహార చేష్టాదులు గలిగిన సంతానమే పుడుతుంది. ఇది అనువంశిక లక్షణాల గురించిన వర్ణన ఎంత మాత్రమూ కాదు. మైథునం జరిగే ఆకొన్ని క్షణాల కాలం పుట్టబోయే బిడ్డ భవిష్యత్తును ఎలా నిర్ణయిస్తుందో- ఒక పరిశీలన మాత్రమే!

గర్భవతి సంగీతాన్నిగానీ, వేదాన్నిగానీ, వేదాంతాన్ని గానీ వినడం మొదలు పెడితే ఆయాశబ్దాల కనుగుణమైన సత్త్వమే పుట్టబోయే బిడ్డలో కనిపిస్తుందిట!

ఆధునిక మానసిక శాస్త్రం గర్భాన్ని చీల్చుకొని వచ్చిన ఉత్తర క్షణాన్నుంచి ప్రవర్తనా నియమావళిని రూపొందించ గలిగింది. ఆయుర్వేదం గర్భస్థ శిశువుని సైతం మనో విశ్లేషణ చేయడానికి ఎంతగానో ప్రయత్నించింది.

సంభోగించే సమయంలో భార్యాభర్తలిద్దరూ శారీరికంగా గానీ, మానిసికంగా గానీ ఏ దోషం లేకుండా వున్నట్లయితే, అందరూ మెచ్చుకోగలిగిన సత్త్వ గుణ సంపన్నుడైన బిడ్డ కలుగుతాడు. అందులో సందేహం లేదు. కాని, మన మధ్య తరగతి కుటుంబాలలో వంట గదీ, పడక గదీ ఒకటే అయి, ఆఫీసు వ్యవహారాలూ భార్యామణి వ్యవహారాలూ ఒకేసారి చూసుకోవాల్సి రావడం ఎంత దురదృష్టకరమో.... !

భక్తి, శీలం, శౌచం (శుభ్రంగా వుండడం) ద్వేషం, జ్ఞాపక శక్తి, మోహం, త్యాగం, ప్రేమ, మాత్సర్యం, శౌర్యం, భయం, క్రోధం ఇలాంటి లక్షణాలు తలిదండ్రుల మనసు నుంచే బిడ్డలకు సంక్రమిస్తాయి.

బిడ్డలో మృదువుగా వుండే, హృదయం వంటి అవయవాలన్నీ మాతృ అంశ వలనా, కఠినమైన ఎముకల వంటి అంగాలు పితృ అంశ వలనా ఏర్పడతాయి. బిడ్డ శరీరం స్త్రీ శోణితాంశ. బిడ్డ మనసు అమ్మా నాన్నల మిశ్రమం.

తలిదండ్రులు ఎంత దుర్మార్గులైనా, సంభోగ సమయంలో నిర్మలమైన మనసుతో వుంటే చాలు, గజదొంగలక్కూడా దేశ భక్తులు పుడతారు. తత్కాలిక, తాత్కాలిక సంభోగం మరో నూరేళ్ళ జీవిత మనోపథాన్ని నిర్దేశిస్తుంది. ముఖ్యంగా పిల్లల కోసరమే సంభోగించే దంపతులు ప్రశాంతమైన వాతావరణాన్ని కల్పించు కోవాలి!

మీకెలాంటి బిడ్డ కావాలో ముందుగానే నిర్ణయించండి. భార్య ఋతుస్నానం చేశాక మొదటి పన్నెండు రోజుల్లో సరి దినాలు — 2, 4, 6, 8, 10, 12.... ఈ రోజుల్లో సంయోగిస్తే పురుష సంతానం, 3, 5, 7, 9, 11 ఈ రోజుల్లో అయితే స్త్రీ సంతానం కలుగుతుంది,

శుచిగా, నిర్మలంగా వున్న మనసుతో, ఏవ్యాకులతలూ లేకుండా, మీకిష్టమైన "లెనిన్"ను గాని, బుద్ధుణ్ణిగానీ మనసులో స్మరించుకోండి. మీకు పుట్టబోయే బిడ్డ కనీసం మిమ్మల్ని మించిన వాడవ్వేది ఖాయం. మన మనసును బట్టే మన పిల్లలని మరువకండి!!!

## పుట్టబోయే మీబిడ్డ ఏమంటువ్నాడు?

పుట్టబోయే బిడ్డ మనసు ఎలాంటిదో ముందే తెలుసుకునేందుకు భారతీయులు విచిత్రమైన పద్ధతిని రూపొందించారు. ముఖ్యంగా పుట్టబోయే బిడ్డ ఆడా లేక మగా, అనే విషయాన్ని నిర్ధారించడానికి మనస్తత్వ శాస్త్ర రీత్యా కేవలం కొన్ని ఆంగికాభినయాల ఆధారంగానే, ఆయుర్వేదీయులు ముందుగానే చెప్పగలరు;

అందుకు మనకు కొంత ఓపిక, శ్రద్ధ వుంటే ఈ విషయాన్ని నిరూపించుకోవచ్చు. వేరే ఎటువంటి పరిక్షలూ [Investigations] అవసరంలేదు.

ఆడ శిశువును కననున్న తల్లి తన ఎడమ భాగంలోని అవయవాలతోటే ఎక్కువ పనిచేస్తుంటుంది. పురుష సంభోగం మీద అంతకు మునుపు లేనంతగా మోజు పుడ్తుంది. రాత్రిళ్ళు వచ్చే

కలిలు స్త్రీ సంబంధమైనవిగా ఉంటాయి. గర్భం ఎడమ వైపున ఎత్తుగా ఉంటుంది. ఎడమ స్తనంలో పాలు ఎక్కువగా పడతాయి.

అలాగే, పురుష శిశువును తన గర్భాశయంలో కలిగి వున్న స్త్రీపై వాటికి విరుద్ధమైన లక్షణాలు ప్రదర్శిస్తుంది.

అంతేకాదు, ఈ బిడ్డ ఎలాంటి మనస్తత్వాన్ని కలిగిన వాడౌతాడు.... రాబోయే యుగాన్ని పాలిస్తాడా. పీడిస్తాడా.... అనడానికి పిండ దశలోనే అందుకు సంబంధించిన లక్షణాల్ని ప్రదర్శిస్తాడని, అవి తల్లి హృదయం ద్వారా వ్యక్తీకరించబడతాయనీ ఆయుర్వేదం చెప్తోంది.

వీటిని నమ్మి మూఢనమ్మకాలు పెంచుకుని—తల్లినీ, ఆమె బిడ్డనీ అనుమానించి, అవమానించవలసిన పనిలేదు.

ఇవి చదివిం తర్వాత మీలో ఒక కొత్త ఆలోచన, శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన ఒక అవగాహన కలిగింప చేయడమే ఆశిస్తున్న ప్రయోజనం.

దౌహృదకాలం (నాల్గవ నెల)లో రాజ సందర్శనం కోరిన గర్భిణి ధనవంతుడు, గుణవంతుడు అయిన పుత్రుణ్ణి కంటుంది. పల్చటి చీనాంబరాలు, బంగారు ఆభరణాలు కావాలని కోరిన తల్లులు అలంకార ప్రియులూ, సుందరులూ అయిన సంతానాన్ని పొందుతారు.

ఋషాశ్రమాన్ని చూడాలని కోరే గర్భిణికీ లేక అక్కడే ఉండిపోవాలనిపించే ఈ కాబోయే తల్లులకి జితేంద్రియుడూ, ధర్మశీలుడూ అయిన బిడ్డలు కలుగుతారు. దేవతా ప్రతిమారాధనపైన విశేషమైన కేంద్రీకరణ చేసే తల్లి సఖాధ్యక్షుణ్ణి కంటుంది.

సర్వ వ్యాఘ్రాది క్రూర జంతు దర్శనం కోసం ఆరాటపడే గర్భిణీ హింసా శాలినీ, ఉడుము మాంసం తినాలనే కోరిక వున్న

తల్లికి నిద్రించే తత్త్వం వున్నవాడైనా పట్టుదలగల వాడినీ, దున్నపోతు మాంసం తినాలనిపించిన తల్లికి శరీరంమీద రోమాలు ఎక్కువగా ఉండి, ఎర్రటిజీరవున్న కళ్ళు కలిగిన శౌర్యవంతుడైన బిడ్డనీ, పంది మాంసం తినాలనిపించిన తల్లికి చ డాలుడూ, జింక మాంసాన్ని తినగోరిన స్త్రీకి వేగంగా నడవగల, ఎప్పుడూ తిరగ డానికి అలవాటుపడిన బిడ్డలు కలుగుతారు.

ఇవన్నీ ఎందుకు, ఏఏ పదార్థాలు తినాలనిపిస్తే అందుకు సంబంధించిన గుణ ధర్మాలున్న బిడ్డలే పుడతారు ... అన్నాడు సుశ్రుతుడు!

ఈ విషయాల గురించి అంతగా ఆలోచించిన వాళ్ళుగాని, సత్యాసత్యాలు విమర్శించిన వాళ్ళుగానీ ఇంత వరకూ కనిపించ లేదు. కొత్తగా వస్తోన్న యువతరం అయినా భారతీయ శాస్త్రాలకు న్యాయం చేస్తుందని ఒక ఆశ!

ఏనుగలూరి పావరాజుగారు రాసిన "రుక్మాంగద చరిత్ర"— యక్షగానంలో పుట్టబోయే బిడ్డ ఆడా లేక మగా అని నిర్ణయించ డానికి కొన్ని లక్షణాలను వర్ణించారు.

"శుక్ల పక్షంబు పంచమి శుక్రవార
మంచితంబుగ నతివల కగును మేలు
తరుణికి దావలి కుచమున
స్థిరమగు కెంపలరు మచ్చదాకొనియున్న
వరసుతుడు పుట్టు...."

"ఫాలతికి దావలి పక్కను
తిలకము వలె మచ్చ గలిగి స్థిరమై యున్నన్
తొలి చూలు కొడుకు కలుగున్"

"మండూ కోదర గతి భూ
మండలమున తరుణి కుక్షి మానితమైనన్
మెండుగ లాభము భాగ్యము
పండితులగు సుతులఁగాంచు బరమప్రీతిన్...."

ఈ నిరూపణలను అందచేయడం ఋజుపట్టిన భావావేశం తోటి, మతమౌఢ్యంతోటీ, ఛాందస్తంతోటి కాదు.

మానస శాస్త్రానికి సంబంధించి, ఆధునిక వైద్యశాస్త్రానికి అంతు పట్టని కొన్ని విషయాలు భారతీయ విజ్ఞాన శాస్త్రాలలో కనిపించినప్పుడు, వాటిని కొంచెం ఆలోచించ గలిగి, శాస్త్రీయ దృక్పథం వున్న వ్యక్తులు అభివృద్ధి చేసేందుకు అవకాశం వుంటుందేమో.... నని!

## మీ బిడ్డకు మీ పాలే పట్టండి!

"మీబిడ్డ మిముఁబోలి మేటియై మించఁగా
మీ పాలే త్రావించి మీ వానిగాఁజేసి
దేహ సౌఖ్యం బిడుఁడు జనులారా!
దేశ సౌఖ్యము వందు జనులారా!!

(వైద్యావధాని శ్రీ కందుకూరు వెంకట సుబ్బారావు—
ఆరోగ్య ప్రబోధ గీతం)

హావెలాక్ ఎల్లిస్ ఒక సందర్భంలో స్త్రీల స్తనాల గురించి వ్రాస్తూ, మాతృమూర్తి, సంపూర్ణమైన ఆరోగ్యాన్ని పరిపూర్ణమైన

స్త్రీత్వాన్నీ ప్రతిబింబించాలంటే. చక్కటి—నిండైన—పిల్లలు స్తన్యాన్ని గ్రోలడానికి అనువైన చూచుకాన్ని [Nipple] కలిగిన స్తనాలు వున్నదై వుండాలి— అన్నాడు.

చాలా మంది ఆడవాళ్ళ విషయంలో స్తనాలు పురుషుల్ని ఆకర్షించడానికి ఓ ఆయుధంగా ఉపయోగించడానికే తప్ప. అవి బిడ్డల పోషణకు పనికిరావడం లేదు.

ఫీడర్లను బిడ్డల నోటికి తగిలించి, స్తనాల్ని భర్తల చేతికి వప్పగించే ఆధునిక "పూతన"లె ఎక్కువగా కనిపిస్తున్నారన్నది ఈ ఆధునిక నాగరిక సమాజం నిరూపిస్తున్న సత్యం!

పిల్లలకు తల్లులు స్వయంగా పాలీయక పోవడానికి కారణం, కొంతమందికి పాలు లేకపోవడం అయితే, చాలా మందిలో స్తనాల అందం చెడిపోతుందేమోననే పరమ భయంకరమైన ఆలోచన కనిపిస్తుంది.

ఒక ఆంగ్ల వైద్య వనిత తన దగ్గరకు వచ్చిన 209 మంది స్త్రీలలో కేవలం డెబ్భై నలుగురు— పిల్లలకు పాలిచ్చే స్త్రీలనీ, నూటముప్పై అయిదుగురు— ఫీడర్లతో పిల్లలను పెంచుతున్న వాళ్ళని, ముప్పై అయిదు మంది— రోగకారక స్తన్యం వుండడం చేత వద్దంటే ఆగిపోయిన వాళ్ళనీ తెలియ చేసింది.

మరి, పాలివ్వడంవలన స్తనాలు వ్రేలాడతాయని పిల్లల్ని దగ్గరకు రానీయని పట్నవాసపు తల్లుల గురించి ఆలోచిస్తే, వీళ్లో అసలు రహస్యాన్ని గమనించడంలేదేమోననిపిస్తుంది.

మానసికంగా బిడ్డకు పాలిచ్చేటప్పటి అనుభూతి గొప్పది. అప్పుడు మాతృహృదయం పొందే ఆనందం ఎంతని చెప్పగలం.

స్తన చూచుక భాగంలో చాలా సున్నితమైన నాడీవలయా లేర్పడి వుంటాయి. బిడ్డ వ్రేళ్ళతో నొక్కుతూ నోరు పట్టినప్పుడు

ఈనాడీవలయాలు స్పందిస్తాయి. ఈస్పందన స్త్రీ పురుషుల సంభోగ సమయంలో జననేంద్రియాలు ప్రేరేపించబడినప్పుడు కలిగే ఆవేశం ఎటువంటిదో అటువంటిది!

బిడ్డకు పాలిచ్చేప్పుడు కలిగే ఈ ఆవేశం తల్లిలో బిడ్డపైన అపారమైన అనురాగాన్ని, ప్రేమను పుట్టిస్తుంది.

బిడ్డకు పాలీయని తల్లి కూడా తన బిడ్డను ప్రేమిస్తుంది కాని, పాలిచ్చే తల్లి ముందు అదెంత? Such love is liable to remain Selective on the Fundamental and inst_Inctive Side....అన్నాడు ఎల్లిస్. తల్లులకు బిడ్డలపైన ప్రేమలేక పోవడం అనేది ఒక రకంగా వ్యాధి లక్షణం. ఈ వ్యాధిని బిడ్డకు తన పాలీయడంద్వారానే నయం చేయడం సాధ్యం అవుతుంది.

బిడ్డకు పాలిచ్చేప్పుడు తల్లి మైథునంలో పాల్గొన్న తృప్తిని పొందుతుందన్న ఆయుర్వేద సిద్ధాంతాన్ని ఎల్లిస్ వంటి పాశ్చాత్య పండితులు సైతం అంగీకరించారు. అంతేకాదు, స్తన్యం లేని తల్లులలో చాలామందికి తను బిడ్డమీద మక్కువ, అనురాగం, వాత్సల్యం లేకపోవడమే కారణం. "ఈ శనిగ్రహాలు నాకెందుకు పుట్టారుదేముడో—" అంటూ ఏడ్చేతల్లి మాతృస్థానంలో వుండడానికి అర్హతలేనిది! భయం, దుఃఖం, మోసం అనే ఈ మూడింటివలన స్తన్యం బయటకు స్రవించదు.

ఈ మానసిక కారణాలే కాక, శరీరంలో బలం లేకపోవడం, చేత, పోషక పదార్థాలు తగినంత తీసుకోక పోవడం చేత-పాలు స్వల్పంగా వుండి స్తన్య ప్రవృత్తి సరిగ జరుగక పోవచ్చు.

అసలీ స్తన్యం ఎలా బయటకు ప్రవర్తిస్తుందో భావప్రకాశ కారుడు చెప్తున్నాడు—*

"బిడ్డను స్పృశించడంవలనా, బిడ్డని తలచుకోవడంచేత, బిడ్డ చేతులతో స్తనాల్ని తాకినప్పుడూ, స్తన్యం బయటకు వస్తుంది. స్త్రీని కలిసినప్పుడు శుక్రం ఎలా ఉబికి వస్తుందో, బిడ్డను చూసినా, తలచినా, తాకినా స్తన్యం కూడా అలాగే ప్రవర్తిస్తాయి...." అని!

అందుకే, బిడ్డను ప్రేమించలేని తల్లికి స్తన్యం తక్కువ గానే వుంటుంది. అంతేకాదు, పిల్లలను ఎంత ఎక్కువగా ప్రేమించ గలిగితే పెద్దలలో సంభోగ సామర్ధ్యం అంత ఎక్కువగా వుంటుంది.

సెక్సుకూ, బిడ్డలకూ ఇదొక నిరంతర, అవినాభావ సంబంధం.

బిడ్డ పుట్టడంలో సెక్సు. పాలు తాగడంలో సెక్సు. ప్రేమిం చడంలో సెక్సు. ఆలోచనల్లో సెక్సు, ఎదగడంలో సెక్సు. ఇంతగా సెక్సు మనుషుల్ని పాలిస్తోంది!

దారువాహుడు స్త్రీలు భుజించిన ఆహారం జీర్ణమై ఏర్పడిన సారం పుత్రప్రీతి చేత క్షీరంగా పరిణమిస్తుంది....అన్నాడు.

పుత్రప్రీతి లేకపోతే స్తన్యం తయారు కాదు!

గర్భిణి భుజించిన పుష్టికరమైన ఆహారసారం మూడు రకా లుగా విభజింపబడుతుంది. అందులో ఒక భాగం తల్లి శరీరాన్ని

---

* పయః పుత్రస్య సంస్పర్శాద్దర్శనా త్స్మరణాదపి।
గ్రహణా దప్యురోజస్య శుక్రవత్సం ప్రవర్తతే॥
(భా.ప్ర.పూ.ఖ.)

పోషిస్తుంది. రెండవ భాగం స్తన్యాన్ని వృద్ధిపొందిస్తుంది. మూడవ భాగం గర్భనాడి మూలంగా గర్భస్థ శిశువును పోషించి దాని జీవనానికి ఆధారమై వుంటుంది — అని చెప్పాడు చరకుడు. *

ఈ స్తన్యం కోసం పసిపిల్లలు మొరపెడతారు. స్తన చూచుకం దొరికిందను కోండి, మహదానందంతో పానం చేస్తారు.

"చూచు ఇతికాయతి బాలేన పీయమాన మితి చూచుకం" అన్నారు. బాలలచేత పానంచేసేప్పుడు చూ-చూ-అనేశబ్దాన్ని చేస్తుంది కాబట్టి నల్లటి స్తనాగ్రానికి [Nipple] "చూచుకం" అనిపేరు వచ్చింది.

ఈ స్తన్యం మధురంగా వుంటుంది కొద్ది "వగరు" రుచిని కూడా కలిగి వుంటుంది. మంచి ఆకలిని పుట్టిస్తుంది. పుట్టిందగ్గర్నుంచీ పిల్లలకు సాత్మ్యంగా వుంటుంది. కాబట్టి, తల్లి స్తన్యం శుద్ధమైనదైతే, ఆమె పాలు బిడ్డకు పడవు అనే ప్రసక్తి వుండదు.

రక్తస్రావం (Haemorrhage] జరిగే చోటమనుష్య స్తన్యాన్ని పోస్తే వెంటనే రక్తం స్రవించడం ఆగిపోతుంది. గాయాలు తగిలినప్పుడు ఈ చిట్కాను చాలామంది ఆచరిస్తుంటారు. కళ్ళు పోట్లు, కళ్ళు అంటుకుపోవడం [Conjunctivitis) వంటి వాటికి స్తన్యం దివ్యౌషధం.

ఈపాలను కాచగూడదు. పశువులపాలను కాచనిదేవాడకూడదు!

---

* సచ సర్వరసవా నాహారః స్త్రియాహ్యాపన్న గర్భాయా స్త్రిధారసః ప్రతి పద్యతేస్వ శరీర పుష్టయె, స్తన్యాయ గర్భవృద్ధయేచ, సత్యేనాహారె నోపష్టబ్ధః పరత స్త్రివృత్తిర్గా తరమాశ్రిత్య వర్తయత్యన్నగతః (చ.శా.అ.6)

## పాలిచ్చే స్తనాలెలా వుండాలి?

స్తనాలు బిడ్డకు పాలీయడానికి అనువైనవిగా వుండాలి కాబట్టి వాటి రూపు ఎలా వుండాలో వివరిస్తూ "స్త్రీల స్తన చూచుకాలు ఎక్కువ పైకీ, ఎక్కువ క్రిందకీ వంగి వుండకుండా, అలాగని మొత్తం స్తనం క్రిందకు వ్రేలాడకుండా వుండాలి. అవి కృశించి శుష్కించి వుండకూడదు. బాగా బలిసీ వుండకూడదు. బిడ్డ సుఖంగా పానంచేయదగినవై వుండాలి...." అన్నాడు చరకుడు.1) ఒకవేళ స్తన చూచుకం ఊర్ధ్వంగా వున్నదనుకోండి, పిల్లలకు వక్రమైన దంతాలు ఏర్పడతాయి. క్రిందకు వ్రేలాడే స్తనాలను పానంచేసిన బిడ్డలు ఊపిరాడక, నాసికాద్వారాలు మూసుకుపోయి మరణించే ప్రమాదం వుంది. చనుబాలు నశించి పోతే స్తనాలు శుష్కించి పోతాయి. శుష్క స్తని బిడ్డకు పాలీయడానికి ప్రయత్నించకూడదు. అంతేకాదు. తల్లికి బాగా అకలి అవుతోన్నప్పుడు, తన పాపకు పాలీయకూడదు. అలాగే అలిసి పోయినప్పుడు, తను జ్వరంతో బాధపడుతున్నప్పుడు పాలు పట్టడం మంచి పద్ధతికాదు. తిరిగి గర్భం ధరించినాక కూడా పంతానానికి స్తనాలు అందించవద్దు చిక్కిపోయిన తల్లులూ, బాగా వళ్ళు చేసి, స్థౌల్యంతో బాధపడుతున్న తల్లులూ పాలు ఇవ్వడానికి తయారవకండి. ఏకారణం చేతనయినా, తల్లిపాలు లభించకపోతే, శిశువుకు మేక పాలనుగాని, ఆవుపాలలో "ముయ్యాకుపొన్న" నువేసి, కాచి, వడియుగట్టి పంచదారను చేర్చి దానినిగాని ఇవ్వాలి.... పాలపిండి వంటి రకరకాల పశువుల పాలు గలి సేవదార్థాలు బిడ్డల చేత తినిపించడం మంచిదికాదు.

---

1) శ్లో॥ "నాత్యూర్ధ్వౌనాతి లమ్బౌ వనతి కృశౌ వనతిపీనౌ
యుక్తపిప్పలకౌ సుఖ ప్రపానౌ చేతి స్తన సంపత్॥
(చ.శా)

సైన్సు చదువుకున్న కొందరు తల్లులు పోషక పదార్థాలుంటా యని "పాలపిండి" తో చేసిన పదార్థాలతో బిడ్డను పెంచుతుంటారు. పశుసంతతికి హితకరమైన పాలు మానవ సంతతికి హితకరమైనవే ననే ఓ "భ్రమ" వాళ్ళలో వుంటుంది. ఇది తప్పు—అన్నాడు పాశ్చాత్య పండితుడు ఎల్లిస్. ఇదంతా కేవలం illusion—భ్రమ-అని కొట్టి పారేశాడు.

తల్లి పాలుతాగే పిల్లలలోనే వ్యాధి నిరోధక శక్తి ఎక్కువగా వుంటుంది. టి.బి, రికెట్స్, పోలియో వంటి వ్యాధులు డబ్బా పాలుతాగే శిశువులలోనే ఎక్కువ. అమ్మపాలలో వున్నంత స్వేచ్ఛ కొన్నపాలలో ఎలా వుంటుంది?

సంవత్సరం వయసున్న పిల్లలలో రకరకాల వ్యాధులు వచ్చి మరణించిన ఓవందమందిలో తల్లిపాలు తాగే వాళ్ళు 8 మంది వుంటే, 51.7 శాతం పాలపిండిపాలుతాగే వాళ్ళని ఒక అంచనా!

అందుకే స్తన్యాన్ని "బాల జీవనం" అన్నారు.

వ్యాపారస్థుల ప్రకటనలు చూసి, పిల్లలచేత పాలు మాన్పించి డబ్బాపాలు అలవాటు చేయకండి. పోషకపదార్థాలను తల్లులే సేవిస్తే ఒక వైపు తాము బలపడతారు. వేరొక వైపు బలమైన స్తన్యాన్ని బిడ్డలకందచేస్తారు. తల్లిపాలే శ్రేయస్కరం!!

ఉదాహరణకు. తల్లి పిప్పళ్ళను సేవిస్తే, బిడ్డ 'లివర్' బలంగా వుంటుంది.

1978లో ఇంగ్లాండులో హడర్స్ ఫీల్డ్ స్కీమ్ అనేపేరున "జననచట్టం" ఒకటి అక్కడి బ్రిటిష్ ప్రభుత్వంచేసింది.

ఇంగ్లీషు జాతిని వృద్ధి పరచడం ఈ "స్కీము" లక్ష్యం. ఈ చట్టం ప్రకారం, ప్రతి ఇంగ్లీషు బిడ్డా ముందు చట్టబదం కావాలి.

ఈ బిడ్డల్ని తల్లులు తమ అనుభవంతోగాని, చాకచక్యంతో గాని పెంచడానికి వీలులేదు. ప్రతి ఇంటికీ ఒక చదువుకున్న నర్సు వుంటుంది. బిడ్డలందరినీ ఆమెకు వప్పగించాలి. ఆమె చెప్పినట్టు ఆ యింట్లో అంతా జరగాలి.

ఇంకా అప్పటికి వైద్య శాస్త్రం ఏ మాత్రం అభివృద్ధి చెంద లేదు. మల విసర్జన తరువాత శౌచనం కూడా చేతకాని వాళ్ళు అప్పటి బ్రిటిష్ ప్రజలు ఇండియాలో లాగానే అక్కడా గ్రామీణ జీవితం ఎక్కువ. వీళ్ళమీద చట్టాలు రుద్ది వచ్చీరాని శాస్త్ర జ్ఞానంతో ఎదుగుతోన్న పిల్లల్ని ఇంకా చావుదెబ్బ తీశాడు.

ఫలితంగా బ్రిటిష్ జాతి నిర్వీర్యం అయిపోయింది. ఇంగ్లండుకు అటు పబ్లిక్ డబ్బూ, ఇటు ప్రైవేట్ డబ్బూ బోళ్ళ డంత దుర్వినియోగం అయ్యింది.

ఎవరి బిడ్డకు వాళ్ళే పాలిచ్చే ఏర్పాట్లు చేయించి, తల్లికి పాలు పెరిగేందుకు మంచి పోషక పదార్థాలు ఇప్పిస్తే యీ బాధలేవీ వుండేవి గాదు గదా!

# 4. రజస్వలా విధి

ఋతుమతి అయిన స్త్రీలను హిందూవర్గం త్రిరాత్రి నియమం ప్రకారం మూడు రోజులు దూరంగా ఉంచుతుంది.

ఇరాన్, పారశీక దేశాలలో ఇప్పటికీ రజస్వలా ధర్మాల్ని పాటిస్తున్న వాళ్ళున్నారు. జొరాస్టరు అనుయాయులూ, వైదిక మతస్థులూ ఈ విషయాన్ని ప్రముఖంగా గుర్తించారు. జెండ్ అవెస్థా, ఋగ్వేదం, స్త్రీలను ఋతుకాలంలో దూరంగా వుండమని శాసించాయి.

ఇది మతంతో ముడిపెట్టబడి ఉంది కాబట్టి, ఈ త్రిరాత్రి నియమం బ్రాహ్మణ కుటుంబాలకూ, మరికొన్ని శాకాహార జాతులకు మాత్రమే పరిమితంగా ఉండి పాటింపబడ్తోంది. మూర్ఖమైన ఆచారంగా దాన్ని దాదాపు అందరూ ఖండిస్తూనే ఉన్నారు.

అందుకని, ముట్టయిన స్త్రీని దూరంగా వుంచడంలో శాస్త్రీయతను నిరూపించాలని కొందరు, ఋతురక్తం స్రవించే కాలంలో బాక్టీరియా వంటి సూక్ష్మక్రిముల బారినుండి ఇతరులను కాపాడడానికేననడం మొదలుపెట్టారు. మరికొందరు దుర్గంధపూరితమైన రజస్సు స్రవిస్తుంటుంది కాబట్టి దూరంగానే ఉంచాలనీ వాదించారు. ఇదంతా మతం తాలూకు వెర్రి — అనని అభ్యుదయవాది లేడు!

అయితే, ఆచారాన్ని పాటించే వారినికాక, ఆచారాన్ని ఏర్పరచిన గ్రంథాలను చదివితే, త్రిరాత్రి నియమం పాటించడం వలన సులక్షణమైన పుత్రికలు జనిస్తారని, అందుకోసరమే ఈ నియమాన్ని ఏర్పరచవలసి వచ్చిందనీ తెలుస్తుంది.

ఆమాటకొస్తే, హిందువులలో కూడా చాలా కులస్థులు ఈ నియమాలను పాటించడం లేదు. పాశ్చాత్య దేశాల్లో ఎవరూ ఈ బైట చేరిన పాపాన పోవడం లేదు. అసలు పాశ్చాత్యులు ఋతుకాలంలో మైథున నిషేధాన్ని కూడా పాటిస్తున్నారని మనం అనుకోనవసరం లేదు.

ఆధునిక వైద్య శాస్త్రం "కలిపేసుకోండి" అనే అభయమే ఇస్తోంది.

అందుకు, వీళ్ళు సేకరించిన కొన్ని ఆధారాలను బట్టి, ఋతుకాలంలో ఆడవాళ్ళకు లైంగికోత్తేజం ఎక్కువగా ఉంటుందనీ, పెళ్ళికాని ఆడపిల్లలలో విరహవేదన తీవ్రంగా ఉంటుందనీ, ఉన్నతవర్గాలకన్నా, సాధారణ స్త్రీలలో లైంగిక వాంఛలు మితి

మీరి ఉంటాయనీ అంచనా — కాబట్టి, ఋతుకాలంలోనే మైథునం చేయాలని ఓ సిద్ధాంతం!

ఆడపిల్లలకు ఆరో సంవత్సరం నుంచే లైంగికోత్తేజం ప్రారంభం అవుతుంది. రజస్వల అయినాక సంవత్సరానికి రెండు మూడుసార్లు ఆవేశం పొంగి వస్తుంటుంది. ఇంక పదిహేనేళ్ళు దాటాక ఋతుకాలం రాగానే మనసు చలించడం ప్రారంభిస్తుంది. దాంపత్య జీవితం మొదలయ్యాక క్రమేణా ఈ ఆవేశం తగ్గిపో తుంది. చివరికి మెనోపాజ్ (వృద్ధ) —ముట్లు ఎండిపోయే దశ—కు చేరుకునే సరికి ఋతుమతి కావడం అనే విషయం అసలు పట్టించు కోనంత సాధారణం అయిపోతుంది.

ఈ దశలలో, లైంగికోత్తేజం ఎక్కువగా ఉన్నంత మాత్రాన ఋతుకాలంలో సంభోగం వాంఛనీయమా.... అనే విషయాన్ని కొంత చర్చించవలసిన అవసరం వుంది.

## రజస్వలా సంభోగం

కామోన్మత్తుడైనప్పటికీ భర్త రజోదర్శనమైన తర్వాత భార్యను రమించబోవడం చేటు. ఆమెతో ఏకశయ్యాగతుడు కారాదు. అలా చేస్తే, వాడి ప్రజ్ఞా, తేజస్సు, బలం ఇవి హరిస్తాయి.... అని ఆచారాలు ఘోషిస్తోన్నాయి.

ఋతుమతిని కనీసం చూడకూడదు. ఎందుకంటే, చక్షువులు సూర్య శక్తి కావడం వలన అవి ప్రకాశ స్వరూపాలు— ఆర్తవం సౌర ప్రకాశానికివి విరోధం. అందుకని రజస్సును దర్శించ కూడదు అన్నారు వేదాంతులు.

విష్ణు ధర్మోత్తరంలో యిలావుంది—"సత్సంతానం సిద్ధించా లంటే, రజస్వల తన విధి నియమాలను పాటించి తీరాలి. తక్కువ ఆహారం తీసుకొంటూ ఎక్కువ నిగ్రహాన్ని పాటిస్తూ, విలాస త్యాగం చెయ్యాలి"

అలంకారాలన్నీ రజోద్దీపకాలు. అందు వలన శోణిత శక్తి క్షీణిస్తుంది. క్షీణమైన శోణితం వలన పుట్టబోయే బిడ్డలలో మాతృ అంశ బలహీనంగా ఉంటుందని ఋతుమతి నియమాల వెనుక రహస్యాన్ని తెలిసినవారు చెప్తున్నారు.

ఈ నియమాలను పాటించకపోతే. సోమరులు, గూండాలూ, ఆడపిల్లలూ ఎక్కువగా పుడతారు. ఈనాటి ఈ సామాజిక పరిస్థితులలో పై ముగురూ అధికం కావడానికి రజస్వలా నియమాలు పాటించని తల్లులే బాధ్యత వహిస్తున్నారంటారు మరి కొంతమంది!

మూడు రోజులూ అయినాక, పాత శోణితం పోతుంది. కాబట్టి స్త్రీ పరిశుద్ధురాలౌతుంది. నాలుగో రోజు స్నానం చేసి, కొత్త బట్టలు కట్టుకొని చక్కటి ఆభరణాలు ధరించి, పసుపూ, కుంకుమల చేత అలంకరించుకొని, మంగళ స్వస్తి వాచన పూర్వకంగా ముందుగా భర్తని చూడాలి.... అని ఆయుర్వేదం చెప్పింది.

ఎందుకంటే, ఋతుస్నాత మొట్ట మొదటగా ఏ పురుషుణ్ణి చూస్తుందో అలాంటి సంతానాన్నే కంటుంది, కాబట్టి భర్తను చూడాలి. 1) ఇదీ నియమంలోని రహస్యం! అది సాధ్యపడక పోతే, దేవ, గో, బ్రాహ్మణ, గురు, వృద్ధ, ఆచార్యులను, సజ్జనులను చూడాలి. మంచి మనసు గలిగి ఉండాలి.

వ్యాస మహర్షి— ఇతర పదార్థాలకు రజోదోషం అంటుతుందనే భయంతో స్త్రీ గృహకృత్యాలు వర్జించాలన్నాడు. నాలుగో రోజు స్నానంచేసి, పవిత్రమయ్యే వరకూ ఎవరినీ చూడవద్దన్నాడు. ఎవరికీ తన గొంతు వినిపించనీయవద్దన్నాడు. ఇంటిలో ప్రత్యేక స్థానంలో ఉండి పొమ్మన్నాడు.

---

పూర్వం పశ్యేదృతుస్నాతా యదృశాం నరమఙ్గనా
తాదృశా జనయేత్ పుత్రం భర్తారం దర్శయేదతః ।
(సు.శా.అ. 1)

ఈ ప్రత్యేక స్థానాలను "ఉదక్యాగారం" [Zenana] అంటారు.

"మీనో" అంటే "మాసం" అని అర్థం. మీనో మీంచే మెనిసిస్, మెనిస్ట్రుయేషన్ వంటి పదాలు వచ్చాయి.

స్త్రీ ఋతురక్తంలో "మీనోటాక్సిన్" అనే విషపదార్థం వుంది. అది ఆవిరయ్యే లక్షణం గలది [Olatile] ఈ విషపదార్థం ఋతుమతి శరీరం నుండి, ఊపిరితిత్తుల నుండీ వెలుపలికి వస్తుంటుంది.

ఈ కారణంచేత, ఈ విషపదార్థాన్ని శోధించడానికి ప్రకృతే రజస్సును స్రవింపచేసే ఏర్పాటు చేసినట్లు "ప్రొఫెసర్ షిక్" మహోదయుడు భావించాడు.

ఈ విషపదార్థం సోకితే కొన్ని మొక్కలు మాడి పోతాయి. మొక్కలపైనుండే కీటకాలు పారిపోతాయి. అంతే కాదు, కొన్ని ఉపయోగకారక "యీస్ట్" కణాల పెరుగుదల మందగించిపోతుంది. ఈ "మీనోటాక్సిన్"కు భయపడే భారతీయులూ, జొరాస్టరులూ స్త్రీని మూడురోజులు నిషేధించారు.

రజస్సులోని మీనోటాక్సిన్ ప్రభావం మొదటి దినం ప్రారంభమై, రెండవ రోజుకు బాగా పెరిగి, మూడవ రోజుకు తగ్గిపోతుంది. నాలుగవ నాటికి ఏమీ ఉండదు....!

## వేదాలలో రజస్వలా విధి రహస్యం

స్త్రీల ఋతురక్తానికి రజస్సు అనీ, పుష్పం అనీ, ఆర్తవం అనీ పేర్లు *

ఈ రజస్సును స్రవించే రజస్వల గురించి శతపథ బ్రాహ్మణంలో ఓ కథ వుంది.

---

1) రజ్యతె రజః ఎఱ్ఱగా చేయునది.
2) పుత్రాఖ్యఫల హేతుత్వాత్పుష్పమ్ః పుత్రాఖ్య ఫలానికి హేతువైనది.
3) ఋతౌభవ మార్తవం: ఋతుకాలంలో పుట్టినది. *

ఒకసారి మనస్సుకూ, వాక్కుకూ "అహంభద్రం" అనే స్పర్ధ బయలుదేరింది. అప్పుడు మనస్సు—"ఓ వాక్కా! నేను నీకన్నా శ్రేష్ఠుణ్ణి— నేను ఏం తెలుసుకుంటే దాన్ని నువ్వు పలుకుతున్నావు. కాబట్టి శ్రేష్ఠుణ్ణయిన నన్ను నువ్వు అనుసరించాలి—" అంది.

దానికి వాక్కు — "నీకు తెలుసునన్న మాట వాస్తవమే! కాని, నీకు తెలిసిందాన్ని నేను నా సామర్థ్యంతో పలుకుతున్నాను. అందుకని నేనే నీకన్నా శ్రేష్ఠుణ్ణి—" అంది.

వీళ్ళ తగువు చివరికి ప్రజాపతిని తీర్పు కోరే వరకూ వెళ్ళింది. అప్పుడు ప్రజాపతి "మనసే ప్రధానమైంది, శ్రేష్ఠమైంది కాబట్టి వాక్కు మనసును అనుసరించాలి...." అని ప్రకటించాడు. అప్పుడు వాక్కు న్యాయమూర్తి ప్రజాపతి మీద కోపగించి "నీకు హవిర్భాగాలనందియను" అంది. అందుకే యజ్ఞాలలో ప్రజాపతికి హోమం చేసేటప్పుడు మౌనంగా వుంటారు.

కోపగించడం వలన ఆ సమయంలో పతనమయిన వాక్కు యొక్క వీర్యాన్ని గురించి దేవతలు సంభాషించుకొంటూ, ప్రశ్నించుకొంటూ, "అత్రైవ తత్" అన్నారు. అందుకని వాగ్దేవత వీర్యానికి "అత్రి" అనే పేరు వచ్చింది.

అత్రి ప్రాణరూపమైన రజస్సు వున్న కారణంగానే రజస్వలా స్త్రీలను "ఆత్రేయి" అని పిలిచారు. ఆత్రేయి అంటే పొందరానిది. అలాగే ఋతుమతి స్త్రీలకు "మలినీ" అనే మరో పేరుంది. పాత ఆర్తవం కలిగివుంది కాబట్టి మలినీ. నాలుగో రోజు ఉదకానికి అర్హురాలు కాబట్టి "ఉదక్యా." ఇలా రకరకాలుగా ముట్టయిన స్త్రీలను పిలిచారు.

ఇది శతపథ బ్రాహ్మణంలోని ఒక సైన్సు ఫిక్షన్. ఈ కథలో సారాంశం ఏమిటంటే, స్త్రీ వాగ్రూపమైన దేవత. (అందుకే

ఆడవాళ్ళ నోళ్ళు నొక్కారు పండితులు!). వాగ్దేవత వీర్యాన్ని "అత్రి" అన్నారు. అత్రిలోని ప్రాణరూపమే రజస్సు. ఋతుకాలానంతర రజస్సు ఈ సమస్త చరాచర సృష్టినీ ప్రవర్తింపచేస్తోంది.

అత్రి తత్త్వం వెలువడడం వలన ఆత్రేయిగా లెక్కింపబడుతున్న స్త్రీ స్వరూపం "ధాయఃచ్ఛద" అని వర్ణింపబడింది.

"ప్రకాశానికి నిరోధం" అని దాని అర్ధం. దర్పణం, అభ్రకం ఇవి. ప్రకాశాన్ని నిరోధించి ప్రతిబింబాన్ని కనబరుస్తాయి. కారణం దానిలోని ఈ "ధాయచ్ఛద" అనే ప్రాణశక్తి వుండడమే!

అందుకనే ఆత్రేయి అస్పృశ్యగా, అసంభాష్యగా, అనధిగామిగా మూడు రోజులపాటు విసర్జించబడింది. నాలుగవ నాటి నుంచీ స్త్రీ రజస్సు శుద్ధమై సంతానోత్పత్తి కార్యక్రమాన్ని చేపడుతుంది. ఋతుస్నానం అయ్యాక తప్పనిసరిగా ఆ స్త్రీ పురుషుడితో సంపర్కాన్ని పొందాలి.

పరాశర స్మృతిలో "ఏ స్త్రీ స్నానం చేసి భర్తతో పిలువబడిరాదో, ఆ స్త్రీ మరణించాక నరకం అనుభవించి, అనేక జన్మలు విధవగా జన్మిస్తుంది—" అని వుంది. అలాగే "ఏ పురుషుడు ఏ రోగమూ లేకుండా. సమీపాన వుండి, ఋతుస్నానం చేసిన భార్యతో సంగమించడో వాడు భయంకరమైన శిశు హత్యా పాపాన్ని అనుభవిస్తాడు—"ట!

## రజస్వలా సంభోగ నిషేధం

హావెలాక్ ఎల్లిస్, ఋతుకాలంలో యోనిద్వారం బాగా విప్పారి ఉంటుందనీ, అందువలన మైథునం సుకరం అవుతుందనీ, కోరిక బలంగా వుండడం చేత సుఖప్రాప్తి సుసాధ్యం అనీ

ప్రాశాడు. సంభోగానికి సరైన కాలం ఋతుకాలమే నన్నాడు. ఋతు సమయంలో చివరి రోజులు గర్భధారణకు కూడా అనుకూలమైనవిగా పేర్కొన్నాడు. *

కాని, కాశ్యపుడు రజస్వలా సంభోగాన్ని నిషేధిస్తూ, మొదటి రోజు గర్భం కలిగితే అది నిలబడక నశించి పోతుందన్నాడు. దీనిని "వాతగర్భం" అంటారు. రెండో రోజు గర్భం ధరిస్తే, అది కొంత కాలంలోపు స్రవించడమో, అకాల ప్రసవమో జరుగుతుందనీ. మూడో రోజు వచ్చిన గర్భం చివరి వరకూ నిలిచినా పురిటిలోనే మరణిస్తుందని. లేకపోతే వికలాంగా లేర్పడడానికి అవకాశం వున్నదనీ అన్నాడు. ఈ రోజుల్లో కలిగిన గర్భాలు హీనంగా, దుర్బలంగా, ఎముకలు లేనివిగా, కృశంగా, వంకర టింకరగా వుంటాయి—. "అకాలంలో పండిన ధాన్యం లాంటివీ గర్భాలు" అని పోల్చాడు.

(చూ: కాశ్యప సంహిత శా. జా. అ.)

---

* This is so when desire is specially strong at this time, or when inter course is physically difficult at other times, but easier during the relaxation of the parts caused by mensturation. It must be remembered also that the time when the menstrual flow is beginning to cease is probably more than any other Period of the month, the biologically proper time for sexual inter course.since not only is inter course. easiest then. and also most gratifying to the female. but it affords the most favourable opportunity for recuring fertilization.

సుప్రుతుడైతే, ఋతుమతిని సంభోగిస్తే, ఆ సంభోగించిన వాడి ఆయువు క్షీణించి పోతుందనీ (వ్యాధుల పాల్పడతాడని!) చెప్పాడు.

నదీ ప్రవాహానికి ఎదురుగా నీటిపైన తేలే పదార్థాన్ని వేస్తే అది ఎలా వెనక్కి తిరిగి వచ్చేస్తుందో, అలాగే యోని మార్గం నుండి రజస్సు స్రవించేప్పుడు శుక్రం గర్భాశయం లోపలికి ప్రవేశించక రక్తంతోటే బయటకు వచ్చేస్తుందన్నాడు. *

ఋతుకాలం తర్వాత పన్నెండు రాత్రులు సంభోగయోగ్యమైన రోజులు ఆ రోజుల్లో సంభోగిస్తే సంతానం కలుగుతుంది! దీన్ని మనం Dangerous period అంటున్నాం. ఆ తర్వాత కాలమే Safe period — భద్రత వున్న రోజులు! భద్రత కాలంలో పొరబాటున కూడా సంతానం కలుగదు.

## రజస్వలకు లైంగిక విజ్ఞానం

"Mothers are sexual teachers" అన్నారు. తల్లులు లైంగిక విద్యా గురువులు. కాని, ఎంత మంది తల్లులు తమ వృత్తికీ, బాధ్యతకూ న్యాయం చెయ్య గలుగుతున్నారు?

ఈ విషయంలో ఉపాధ్యాయుల బాధ్యత కూడా లేక పోలేదు. కాని, మన విద్యా వ్యవస్థ ఈనాడు అంతటి ఉన్నత స్థాయిలో లేదు. పిల్లల భవిష్యత్తును తీర్చిదిద్దే బాధ్యతను తలిదండ్రులతో పాటు, గురువులు కూడా విస్మరిస్తే, నేటి బాలురు కేవలం రేపటి పౌరులుగానే మిగిలిపోతారు.

---

* నచ ప్రవర్తమానె రక్తె బీజం ప్రవిష్టం గుణకరం భవతి
యథా నద్యాం ప్రతిస్రోతః ప్లవిద్రవ్యం ప్రక్షిప్తం ప్రతి
నివర్తతె నోర్ధ్వం గచ్ఛతి తద్వదేశద ద్రష్టవ్యమ్ ।
తస్మా న్నియమ వర్తి త్రిరాత్రం పరిహరేత్ । అతః
పరం మాసాదు పేయాత్ ॥ (సు. శా. అ. 2)

పెద్దమనిషి కానున్న ఆడపిల్లలలో ఎక్కువగా రక్తక్షీణత (ఎనీమియా) నరాల బలహీనత వంటి వ్యాధులు ఎక్కువగా కనిపిస్తున్నాయి.

రజస్వలలైన వాళ్ళలో అనార్తవత (ఎమెనోరియా—ఋతు స్రావం ఆగిపోవడం) తలనొప్పి, ఋతుకాలం వచ్చే సరికి కడుపు నొప్పి (డిస్మెనోరియా), నడుంనొప్పి ఇవి తరచూ రజస్వలలకు ఎదురయ్యే వ్యాధులు.

ఇవి కేవలం వయసు తెచ్చి పెడుతోన్న రోగాలు. అందుకు కారణం, స్వాస్థ్యపరంగా వాళ్ళు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి సరైన మార్గదర్శకత లేకపోవడమే!

ఈ అనారోగ్యానికి భ్రాంతి, భయమూ కూడా దోహద పడ్తాయి. కొన్ని మరీ విచిత్రంగా వుంటాయి. ఆత్రం ఎక్కువగా వున్న ఒక అమ్మాయి మామూలు తన ఋతు స్రావం చూసి, తన శరీరం లోంచి విలువైన Life fluid పోతున్నదేమో నన్న భయంతో దాన్ని ఆపాలని ప్రయత్నించి, "వేగ నిరోధం" చేసి కొన్ని కొత్త రోగాలను కొనితెచ్చుకోవడం, ఆమెకు విషయజ్ఞానం లేకపోవడం వలననే సంభవించింది.

"కువైద్యులు" కొందరు చెప్పిన చిట్కాలు తెలుసుకొని, భవిష్యత్తులో మైథునానికి తన అవయవం సులభంగా వుండాలని ఏవేవో లేపనాలు పట్టించి, యోనిమార్గంలో అవరోధాన్నేర్పరచు కొని అజ్ఞానంతో, అనేక అనర్థాలను నెత్తిన పెట్టుకున్నదింకో కన్నెపిల్ల!

హెచ్ క్రాఫర్డ్ యాంగస్ అనే పరిశోధకుడు అజింబా జాతి ప్రజల గురించి చెబుతూ, అక్కడి ఆడపిల్లలు రజస్వలలైనప్పుడు "చెన్నమ్‌వలీ" అనే పండుగ [Initiation ceremony] చేస్తారనీ, ఆరోజే స్త్రీకి సంబంధించిన అన్ని రహస్యాలనూ బోధిస్తారనీ వ్రాశాడు.

సంభోగంలో ఎలా పాల్గొనాలి, అందుకు సంబంధించిన వివిధ భంగిమలు కూడా ఆ రోజే నేర్పిస్తారట.

ఒక అమ్మాయి పెద్దమనిషి అయ్యిందని తెలియగానే ఊరంతా, చాటింపు వేయిస్తారు. ఆ రోజు బ్రహ్మాండమైన నృత్య ప్రదర్శన జరుగుతుంది. అక్కడికి మగ పురుగనేది రావడానికి వీల్లేదు.

ఆరోజు ఉదయం నించే గుడిశెలో ఒంటరిగా కూర్చోబెట్ట బడిన ఆ అమ్మాయిని అక్కడికి తీసుకు వస్తారు. ఆడవాళ్ళంతా ఆ పిల్ల చుట్టూ గుండ్రంగా నిలబడి నృత్యం చేస్తుంటారు.

జననేంద్రియాల వర్ణన లగాయితూ నానా బూతులూ నిండిన పాటలను పాడి వినిపిస్తారామెకు. స్త్రీ రహస్యాలను ఆ విధంగా బోధిస్తారు. ఆ తర్వాత మూకాభినయం (మైమ్) ద్వారా సంభోగం ఎలా చెయ్యాలో, దాని వివరాలేవిటో ఆ అమ్మాయికి క్షుణ్ణంగా తెలియబరుస్తారు.

ఉన్న వాళ్ళలో అందరికన్నా ముసలావిడ తాను పురుషుడిలా ప్రవర్తించి, ఆమెకు తెలియజేయాల్సినవన్నీ తెలియ బరుస్తుంది.

స్త్రీ పురుష సంబంధాల గురించి రకరకాల పాటలు పాడు తుంటారు.

భవిష్యత్తులో తను "భార్య" అయినప్పుడు ఎలా ప్రవర్తించాలో ఆడపిల్ల రజస్వల అయినప్పుడే నేర్పేస్తారు.

ఋతుకాలంలో పరిశుభ్రంగా ఎలా వుండాలో, ఆరోగ్యాన్ని ఎలా కాపాడుకోవాలో, వగైరాలన్నీ బోధిస్తారు.

ఈ పండుగని ఇంత వైభవంగా జరపడంలో వుద్దేశ్యం, ఆమె వైవాహిక జీవితంలో తీసుకోవాల్సిన జాగ్రత్తలన్నీ తెలియ బరచడమే!

## ఋతు రక్తం ఎలా వుండాలి?

ఆడవాళ్ళకు నాభి ప్రాంతంలో 14 దిశలున్న ఒక పుష్పం వుంది. దీనిని "యోని" అంటారు. ఇది కన్నెపిల్లలలో మొగ్గలా ముడుచుకొని వుండి యౌవన కాలంలో వికసించి ముఖ భాగం తెరుచుకొంటుంది. అప్పటి నుంచీ ఆర్తవం లేక రజస్సు అనే ఎర్రటి స్రావాన్ని నెల నెలా విడుదల చేస్తుంటుంది. ఈ ప్రక్రియ మొదటి సారిగా జరిగినప్పుడు ఆ కన్యకను "పుష్పవతి" అంటారు. "పుష్ప మార్తవ మస్యాః పుష్పవతి" అన్నట్లు, పుష్పం అంటే ఆర్తవం. ఆర్తవం కలిగిన కన్యకని "పుష్పవతి" అంటారు.

అమర కోశంలో నెల నెలా ఋతుస్రావాన్ని విడుదల చేసే స్త్రీకి రెండు పేర్లు చెప్పాడు. [స్యాన్మధ్యమాదృష్టరజాః]

1. 'మధ్యమా' అనే పేరు పుష్పవతికి మధ్య వరుస్సుకు చేరు కుంటోంది కాబట్టి కలిగింది— [మధ్యే వయసి తిష్ఠతీతి మధ్యమా]

2. దృష్టరజాః అంటే కనపడిన రజస్సు గలది [దృష్టం రజోఽస్యా ఇతిదృష్టరజాః ]

స్త్రీలకు ఆర్తవం పన్నెండవ సంవత్సరం మొదలుకొని ప్రవృత్తమై వృద్ధి చెంది ప్రతి మాసంలోనూ బైటకు వెడలుతుంటుంది.

ఈ ఆర్తవం రజస్సు అనే మరో పేరున్న రక్తం నుండి ఏర్పడుతుంది. రక్త ధాతువుకు ఆర్తవం ఉపధాతువు.

రక్తమూ, ఆర్తవమూ రెండూ ఒకే రూపాన్ని కలిగి వుంటాయి. రెండూ ప్రధానంగా అగ్ని భూతం వలననే ఏర్పడ్డాయి.

ఈ ఆర్తవం కుందేటి రక్తంలా, లక్క రంగులో వుంటుంది. అది వస్త్రం పైన పడితే, ఉతికిన తర్వాత కూడా ఆ మరక పోక పోతే అటువంటి ఆర్తవం అశుద్ధమైనదని ఆయుర్వేదం శుద్ధ ఆర్తవ లక్షణాన్ని చిన్న ఉపాయం ద్వారా చెప్పింది.

గర్భం కలిగినప్పుడు ఈ ఆర్తవం బైటకు స్రవించడం ఆగిపోతుంది. అది కొంత రక్తధాతువుగా మారి, శరీరాన్నీ, యోనిని అనుసరించి ప్రసరిస్తుంది. ఈ ఆర్తవంలో కొంత భాగం గర్భ పోషణ చేస్తుంది. మిగతా ఆర్తవం శరీరధాతు పోషణ, శరీరానికి వేడీ కలిగిస్తుంది. గర్భ పోషక భాగమే స్తన్య వృద్ధికి కారణం అవుతుంది....

## ఋతుస్నాత చిత్త ప్రవృత్తి

"నాలుగో రోజు స్నానం చేసి, పుష్ప మాలికలు, ధవళ వస్త్రాలు ధరించి, మనస్సునూ, శరీరాన్నీ నిర్మలంగా వుంచుకుని,

తన భర్తకు సమానుడైన పుత్రుడు తనకు కలగాలని, ఇతరుల్ని చూడడానికంటే ముందు, తన భర్తనే ప్రేమతో చూడాలి స్త్రీ...." అని ఆయుర్వేదం *

శుచిస్నాత అయిన స్త్రీ ముందుగా ఎవరిని చూస్తే వారి సంస్కారం ఆమె మనస్సులో నాటుకుపోతుందని భారతీయ తాత్త్వికుల అభిమతం. అందుకే ఆమె భర్తను గాని, సంస్కారవంతులైన పెద్దలను గానీ దర్శించాలి.

మనం తీసుకునే ఆహారంలోని సత్త్వాన్ని బట్టి మనిషి మనసులోని ఆలోచనలు ఆధారపడి వుంటాయి. మనిషి సత్త్వాని బట్టీ, మానసిక స్థితిని బట్టీ, సంస్కారాన్ని బట్టీ, ఆవ్యక్తి శరీరధాతువుల అభివృద్ధి ఆధారపడి వుంటుంది. అలాగే మనిషి చేసే రకరకాల విహారాలూ అతని మనసును ప్రభావితం చేస్తాయి.... అని ఆయుర్వేద శాస్త్రం ఉద్బోధిస్తోంది.

ఈ కారణం చేతనే, స్త్రీ ఉన్నత సంస్కారి కావాలన్నా, ఆమె చక్కటి ఆరోగ్యాన్ని పొందాలన్నా త్రిరాత్రి నియమం పాటించి, ఆ తర్వాత నిర్మలమైన మనసుతో ఉన్నత సంస్కారిని దర్శించమని తాత్త్వికులు పేర్కొన్నారు.

నిర్మలమైన మనసుతో దంపతులు జతకూడితే ఉన్నతమైన సంతానం నిస్సందేహంగా కలుగుతుందన్నది శిర్వివాదం. అందుకే "రజస్వలా విధి" ఏర్పరచబడిందని ఆయుర్వేదం.

---

* చతుర్థోఽర్వితతః స్నాత్వా శుక్ల మాల్యామ్బరా శుచిః
ఇచ్ఛన్తీ భర్తు సదృశం పుత్రం పశ్యేత్పురః పతిమ్ ॥

(వా. శా. అ. 1)

అలా ప్రసన్నమైన వదనంతో, మనసుతో, కోరికతో వున్న స్త్రీని పుత్రేచ్ఛ గలిగిన భర్త నాలుగో రోజు సంభోగిస్తే ఆయుష్మంతుడైన పుత్రుడూ, ఆరో రోజు ఆరోగ్యవంతుడూ, ఎనిమిదో రోజు ఐశ్వర్యవంతుడైన పుత్రుడూ జన్మిస్తారు.

ఆడపిల్లలు కావాలనుకున్న దంపతులు ఐదు, ఏడు, తొమ్మిది, పదకొండు....యీ రోజులలో ఏ రాత్రైనా జంట కట్టాలి!

సరిదినాలలో పురుషుల శుక్రం శక్తివంతంగా ఉంటుంది. బేసి దినాలలో స్త్రీ ఆర్తవాధిక్యత వలన స్త్రీ సంతానం కలిగేందుకు అవకాశం వున్నదని ఆయుర్వేదం నమ్ముతోంది.

దుష్టసంతానం, తమకూ, దేశానికి కూడా కీడు తెస్తారు కాబట్టి, కుటుంబ నియంత్రణను ప్రచారం చేసే వ్యక్తులు సత్సంతానాన్ని పొందే నియమాలను కూడా ఆచరింప చేయాలి. అందుకు ఆయుర్వేదోక్త సిద్ధాంతాలపై ముందు నిరూపణలు చేయాల్సిన అవసరాన్ని విమర్శకులూ, శాస్త్రజులూ పరిశీలింతురు గాక.

ఎలాంటి సంతానం కావాలంటే అలాంటి ఆలోచనలతో, అలాంటి మనస్సుతో, అలాంటి వేషధారణతో సంభోగించమన్న భారతీయ మానస శాస్త్రజ్ఞుల సిద్ధాంతం అతి త్వరలో కార్య రూపంలోకి వచ్చే అవకాశాలున్నాయి. అందుకు యువతరమే ఉత్సాహం చూపించాలి.

త్రిరాత్రి నియమాన్ని పాటించడం మీయిష్టం. కాని, ఋతు స్నానం చేశాక, మనసును ఉల్లాసంగా వుంచుకొని భర్తను సమీపిస్తే నిస్సందేహంగా మీరు కోరుకున్న సంతానం కలుగుతుంది. ఇది "రజస్వలా విధి"ని తెలియజేయడం ద్వారా రచయిత ఆశిస్తోన్న ప్రయోజనం.



# మనిషి – మనసూ

## EGO AND THE INSTINCTS

### అధ్యాయం నాలుగు

నిజంసుమీ మనిషి మనసునిర్మల తారుణ్య రేఖ
నిజంసుమీ పదిపదులే తరతరాల కల్పశాఖ
సౌజన్యం చందనమై సౌహార్ద్రం తిలకమైన
మనిషిమనసు మహత్తరము అజేయ వాజ్రేయుభరము

(ఆవంత్స సోమసుందర్)

[ఏడవ శతాబ్దం నాటి శరీర రచనకు సంబంధించిన "డిహూమానీ కార్పోరిస్ ఫాబ్రికా" అనే విజ్ఞాన గ్రంథంలో ఈ చిత్రం ప్రచురితమయినది. "విసేలియస్" అనే చిత్రకారుడు మనిషి మెదడులో ముఖ్యాంగాల్ని మలిచాడు. ఇది ప్రపంచప్రసిద్ధిచెందిన చిత్రం.]

# మనిషి - మనసు

## Ego And The Instincts

మనిషి ఆకారాన్ని చూసి మనస్తత్వాన్ని అంచనావేసే ప్రయత్నం అనాదిగా సాగుతూనే వుంది.

"అనంగరంగ" అనే పుస్తకం వ్రాసిన కళ్యాణమల్లుడు పద్మిని జాతి స్త్రీలనీ, హస్తినిజాతి వారనీ, శంఖినీ జాతి వారనీ చిత్రిణీ జాతనీ స్త్రీలను నాలుగు రకాలుగా వర్గీకరించి, ఆయాజాతి స్త్రీల ఆకారాలు వర్ణిస్తూ, ఆ ఆకారానికి ఎలాంటి మనసుంటుందో, వారి కోర్కెలు ఎలా వుంటాయో చక్కగా వివరించాడు.

ఇటీవలికాలంలో ఈరకం ఆలోచన చాలా మూర్ఖమైందిగా పేరుగాంచడంతో అంతా ఈ సిద్ధాంతాన్ని పట్టించుకోవడం మానేశారు. కాని, దీనిపైన గతంలో అనేకమంది చేసిన పరిశోధనలు చాలా వున్నాయి.

జర్మన్ మానసవేత్త "ఎర్నెస్ట్ క్రెస్చిమర్" "పర్సనాలిటీ" సిద్ధాంతానికి ఊపిరిపోసినవాడు.

ఆయన మనుష్యజాతిని మూడురకాలుగా విభజించాడు వాళ్ళ ఆలోచనా విధానానికీ వాళ్ళకు వచ్చే వివిధ మానసవ్యాధులకూ వాళ్ళ శరీర రచన [Morphology] కూ సంబంధాన్ని

చక్కగా నిరూపించాడు. క్రెస్చిమర్ సిద్ధాంతం ఇప్పటికీ మానస శాస్త్రంలో గౌరవ ప్రదమైన స్థానంలో నే వుంది.

మానసిక వ్యాధులకు లోనయ్యేందుకు ఎక్కువ అవకాశం వున్న జాతిని Pyknic Type (గురునితంబజాతి) అన్నాడు క్రెస్చిమర్. వాళ్ళ పిరుదులు బరువుగా వుంటాయి. విశాలమైన కటిప్రదేశం వుంటుంది. చేతులు కొంచెం పొట్టిగా వుంటాయి. బరువు ఎక్కువగా తూగుతారు వయసు పెరిగే కొద్దీ బరువూ పెరుగుతుంటుంది. వాళ్ళ కోరికలు అస్థిరంగానూ, బలహీనంగానూ వుంటాయి. కోరికల సంఖ్య ఎక్కువ వాళ్ళకు వచ్చే వ్యాధుల సంఖ్య కూడా ఎక్కువే.

దీర్ఘకాయులైన [Asthenic Type] రెండవరకం వ్యక్తులకు వంటరితనం (షైజోఫ్రీనియా) అనే వ్యాధి త్వరగా సోకుతుంది. వాళ్ళ శరీరం-ముఖ్యంగా కాళ్ళు బారుగా వుంటాయి. మనిషి వాసపుకర్రలా వుంటాడు. సన్నగా నీరసంగా ఎముకలు కనిపిస్తూంటాయి. వాళ్ళను "లెప్టోజోమ్స్" అన్నాడు క్రెస్చిమర్. వాళ్ళకు కోపం ఎక్కువ. ఆవేశం ఎక్కువ. "బక్కపౌరుషం" అని మనం అనుకొనేది వాళ్ళను చూసే! వాళ్ళు సమాజంతో ఏ విషయంలోనూ ఏకీభవించరు. మనుషులకు దూరంగా పోయి వంటరితనాన్ని అలవరచుకొని అన్ని రకాల అవలక్షణాలను కొని తెచ్చుకొంటారు.

ఆజాను బాహులైన [Athletic Type] మూడవరకం వ్యక్తుల జోలికి మనో వ్యాధులు అంత తేలికగా రావు. విశాలమైన వక్షస్థలంవుండి. గుండ్రటి నితంబ ప్రదేశం, పొడవైన చేతులూవున్న వ్యక్తులు సహజంగానే మనో వ్యాధి నిరోధక శక్తి వున్న వాళ్ళు. అలాగని మిధ్యాహార విహారాలవలన వ్యాధులు సోకకూడదనే రూలు లేదు.

# 1. సెక్స్-సంఖానంభరాతి

ఆధునిక మానసిక విజ్ఞానాగికి ఆద్యుడనదగిన "స్పెన్సర్" (1855) తన ప్రిన్సిపల్స్ ఆఫ్ సైకాలజీలో ప్రేమను గురించి వర్ణిస్తూ, ప్రేమించడానికి కారణాలను తొమ్మిది ముఖ్యమైన భాగాలుగా విభజించాడు.

1. భౌతికంగా మనిషిలో లైంగిక ప్రవృత్తులను తృప్తి నొందించడానికి ఏర్పరచుకునే "ప్రేమ" [The physical impulse of sex]
2. సౌందర్యారాధన [Feeling for beauty]
3. అనురాగం [Affection]
4. అభినందన, గౌరవం [Admiration and respect]
5. ప్రశంస [Love of approbation]
6. ఆత్మగౌరవం [Self- esteem]
7. ఔచిత్యం వున్నదని భావించి [Feeling of proprietory]
8. అడ్డుచెప్పే వ్యక్తులు లేకపోవడం వలన లైంగిక స్వేచ్ఛ [Extended liberty of action from the absence of personal barriers]

9. ఓదార్చి ఉల్లాస పరచడానికి [Exaltation of the sympathies]

ఈ స్పెన్సర్ వర్గీకరణని లోతుగా పరిశీలిస్తే, లైంగికత మిశ్రమం కాకుండా ప్రేమని స్త్రీ పురుషుల మధ్య సాధించు కోవడం కష్టసాధ్యమైన కార్యం కాదని అర్థం అవుతుంది. లైంగిక విషయాలకు వచ్చినప్పుడు మాత్రం — ఈ తొమ్మిదింటిలోనూ ఏ ఒక్కటి లేకపోయినా అది శుద్ధ వ్యభిచారం అనడానికి ఎటువంటి అభ్యంతరమూ వుండదు.

"సెక్స్"కు లాటిన్ "సెక్సస్" అనే పదం మూలం. సెక్స్‌కు నిఘంటు అర్థం " స్త్రీ పురుషుల విభజన [Split]

స్త్రీని పురుషుణ్ణి విభజించే ఈ పదాన్ని స్త్రీ పురుషుల కలయిక నుద్దేశించి ప్రయోగించడం ఇష్టంలేకనే కాబోలు లాటిన్ భాష మాట్లాడేవారు మాత్రం సెక్స్‌ను— "అమోర్" అని పిలిచారు. సెక్స్‌కు లాటిన్ మూలమైనా, లాటిన్ మాట్లాడేవారిలో "సెక్స్" పదం వాడుకలో లేదు.

గ్రీకులు సెక్స్‌ను "ఫిలోన్" అని పిలుస్తారు. ఫిలోన్ అంటే లైంగిక కృత్యం. జంతు శాస్త్రంలో ఫిలోన్ అంటే జాతి, తెగ అని అర్థం. వాళ్ళు స్నేహాన్ని, సౌహార్ద్రాన్ని "ఫిలియా" అని పిలుస్తారు. సెక్స్‌ను మాత్రం ఫిలోస్ అంటారు. ఈ రెంటికీ తేడాను గమనించాలి.

కాబట్టి, గ్రీకుల ప్రకారం సెక్స్ అనేది జంతుపరమైన పదం. అది అన్ని జంతువులకూ, అన్ని ప్రాణులకూ వర్తిస్తుంది.

కాని, "మాస్టర్స్" అనే స్త్రీ శాస్త్ర విజ్ఞాని సెక్స్ "నాడీ స్పందన"కు సంబంధించిన విషయం కాబట్టి సెక్స్ సమస్యలన్నీ

జననేంద్రియాల నుపయోగించి మనిషి చేయబోయే ప్రయత్నంలోనే ఉంటాయి.... అన్నాడు.

"షోఫీల్డ్" సెక్సు మనిషిని నడిపే మౌలిక తత్వాలలో ఒకటి ... అన్నాడు.

ఎల్లిస్ — "జీవితపు తొలి అంచు సెక్సుతో ముడిపడి వుంది. ఈ జీవితానికి గౌరవం ఆపాదించుకోవాలంటే సెక్సును అర్థంచేసుకోవాలి. సెక్సు జీవితపు కేంద్ర సమస్య!" అన్నాడు.

"గిడ్డీస్" అనే పండితుడు ఈ సెక్సు ప్రాముఖ్యాన్ని ఇంకా గొప్పగా వివరించాడు.

"ఇది మనిషిని ఎటుపడితేఅటు నడుపుకు పోతుంది. మనిషి ప్రవర్తనను నియమించే శక్తి దీని కొక్కదానికే వుంది. సెక్సు మనిషి ఆలోచనలను ప్రభావితం చేస్తుంది. అతనిలో ఆత్మస్థయిర్యాన్ని కలిగిస్తుంది. అమితమైన విచారాన్నీ భయాన్నీ కూడా కలిగిస్తుంది. మనిషిని సిగ్గుపడేలా చేస్తుంది. తలఎత్తుకోలేని పరిస్థితులను కలిపిస్తుంది. ఒకడికి బలాన్ని ప్రసాదిస్తుంది. ఒకణ్ణి భయకంపితుణ్ణి చేస్తుంది—" అని!

ఇలా ఎన్నో సెక్సు నిర్వచనాలు! ఇవ్వాళ సెక్సుకు తలపడ్తోన్న అనేక మందిని పరిశీలిస్తే ఈ నిర్వచనం ఒక్కటీ అతికేది కాదని మాత్రం తెలిపోతుంది.

కొందరు మగవాళ్ళు పిల్లలు పుడతారేమోవనీ, వాళ్ళని పెంచలేకపోతామేమోననీ భయంతోటీ, భార్యని సుఖపెట్టడానికి జంకుతూనే సంభోగానికి తలపడతారు.

కొందరాడవాళ్ళు భర్త ఎంత కోపిష్టి, దుర్మార్గుడైనా, ఎన్ని కష్టాలు పెట్టినా పట్టించుకోరు. చాలా మంది ఎంత అసమర్థుడు సంభోగించినా తృప్తినే పొందుతారు.

ఒకాయనకు రెండో పెళ్ళి చేసుకునే వరకూ "సెక్సు" అవసరం ఏమిటో అర్థంకాలేదు.

ఒక్కొక్కస్త్రీకి ఎంత ప్రయత్నించినా ఆవేశంకలగదు. కోరిక లేకపోయినా, భర్త ప్రయత్నిస్తే అభ్యంతరపెట్టని సాధ్వీ మణు లున్నారు. మరబొమ్మలా ఎటుకదలమంటే అటుకదిలి "హమ్మయ్య" అనుకునే స్త్రీ మూర్తులున్నారు.

ఒకావిడ తన భర్త ఇంకా ప్రయత్నిస్తే బావుణ్ణు— అను కొంటుంది. ఇంకో పుణ్యమూర్తి తన బతుక్కి ఇంతకంటే సుఖం ఎందుకులే అనుకుంటుంది.

కొందరి దాంపత్యం మరీ విచిత్రంగా వుంటుంది. భార్య భర్తని సుఖపెట్టాలని ఏనాడూ ప్రయత్నించదు. భర్తభార్యను స్పృశించి చాలాకాలం అయ్యుంటుంది. ఎప్పుడో సరదాగా కలసు కుంటారు. ఈలోగా ఎవరి దారులు వారివి. ఎవరి ప్రయత్నాలు వారివి. సమాజం కోసం దంపతుల్లా మాత్రం నటిస్తారు.

ఇది డబ్బున్న వ్యక్తుల "మదం." కదూ?

కొందరు మగవాళ్ళకు మగవాళ్ళే కావాలి. కొందరు స్త్రీలు కృత్రిమావయవాలతోటే తృప్తి పడతారు.

రెండోసారి "రతి"ని కోరే భర్తలంటే చాలామంది భార్య లకు మంట. భార్య తనకుగా తాను కోరితే అనుమానించి, వేశ్యలా ప్రవర్తిస్తోందని నిందించి హింసించే "మగరాయుళ్ళు" కుప్ప తెప్పలుగా వున్నారీ సమాజంలో! వీళ్ళంతా మానసిక నపుంసకు లకు ప్రతినిధులే ననడంలో ఎటువంటి సందేహంలేదు.

## యాంటీ సెక్సువల్ ఇన్‌స్టింక్ట్

అబ్బాయిలూ, అమ్మాయిలూ పరస్పరం ప్రేమించుకోవా లంటే, కవ్వింపు చూపులూ, స్పర్శలె (Sight and Touch) ప్రధాన పాత్రవహిస్తాయి....అన్నారు డాన్టే, పెన్టా అనే ఇద్దరు శాస్త్రజ్ఞులు.

పాశ్చాత్య దేశస్థులు వ్రాసిన పుస్తకాల్లో షేక్‌హేండ్ ఇచ్చి నంత మాత్రానికే లైంగికోత్తేజాన్ని పొందే అమాయకు లున్నారు....అంటూ ఆశ్చర్యం ప్రకటిస్తుంటారు.

షేక్‌హేండిచ్చుకునేటంత స్వేచ్ఛ మనకింకా ఇక్కడ అలవడ లేదు. మర్యాద పూర్వకమైన నమస్కారాన్నేమనం వాడు కుంటున్నాం.

స్నేహానికి పెట్టుకున్న ముద్దు జీవితాల్ని ముడిపెట్టుం దక్కడ. జీవితం ముడి పడ్డాకే ముద్దిక్కడ. ముద్దు అనేది మర్యాద కలిగిన పలకరింపక్కడ. గదిలో చాటుగా చెయ్యవలసిన తతంగం ఇక్కడ.

ఫ్రాన్స్‌కు 17వ శతాబ్దం తర్వాత ఇంగ్లండునుంచి ఈ ముద్దు ఆచారం అలవాటైంది. కాని, ఫ్రాన్స్ ఈ ఆచారానికి మొదట తట్టు కోలేక పోయింది. దేశంలో సంచలనం రేగడంతో బుగ్గపైన, చేతి పైన, ముద్దిడడం స్నేహానికి గుర్తుగానూ, అధరపానం ప్రేమికుల పనిగానూ విభజించారా తర్వాత.

ఇలాంటి సందర్భాల్లో, కేవలం "స్పర్శ" తగిలినంత మాత్రానికే ప్రతి స్పందించడం "యాంటీ సెక్సువల్ ఇన్స్టింక్ట్" (వ్యతిరిక్త లైంగిక ప్రవృత్తి)గా కొందరంటారు. రోడ్డుమీద నడిచిపోయే అమ్మాయికో సిటీబస్సులో ఇరుకుగా నిలబడ్డప్పుడు

ముడుచుకున్న ఆడపిల్లకో, "స్పర్శ" కొట్టేమన అబ్బాయిలు ముద్దు పెట్టే స్వేచ్ఛని పొందితే... ?

## సృష్టి కార్యంలో సుఖానుభవం ఎలా కలుగుతోంది?

"కోరిక ఎప్పుడూ తృప్తిని కోరదు....అది ఇంకా ఇంకా కొనసాగాలనీ, అది కలకాలం నిలవాలనీ కోరుకుంటుంది...." అని ఫ్రెంచి సామెత.

కోరిక ఎంత ఎక్కువ సేపునిలిచి వుంటే, ఆనందం అంత లభిస్తుంది మనిషికి.

లైంగిక కార్యంవలన కోరిక నిలిచేకాలం తగ్గిపోతుంది. అది తగ్గిపోకుండా దంపతులు జాగ్రత్త పడితే సుఖానుభవం ఎక్కువగా వుంటుంది.

కోరిక నిలిచివుండే కాలాన్ని రెండు రకాలుగా వర్గీకరించారు ఆధునిక శాస్త్రజ్ఞులు. "ట్యూమ్‌సెన్స్" అంటే కోరిక తారాస్థాయికి వెళ్ళడం. "డిట్యూమ్‌సెన్స్" అంటే తారాస్థాయిన వున్న కోరిక తృప్తినొంది క్రమేణా మందగించడం ఇవి రెండూ— రెండు మదన దశలు.

వాత్స్యాయనుడు కూడా సృష్టి కార్యాన్ని సురతి, రతి అని రెండు దశలుగా విభజించాడు.

సురతిని 'Tumescence' అనవచ్చు.దాని పర్యాయాలు, వాటి వ్యుత్పత్తులూ ఒకసారి పరిశీలించండి.

సురతం లేక "రతం" అంటే వాత్స్యాయనుడి ప్రకారం రెండు శరీరాలు మానసికంగానూ, శారీరికంగానూ ఐక్యం అవడం.

అంగ స్తంభనాదులు జరిగే దశ ఇది. ఆవేశం తీవ్రంగా వుండడం దీని ప్రత్యేకత.

అలా సంగమించిన స్త్రీ పురుషులకి మంచి "యోగం" [Sexual pleasure] కలుగుతుంది కాబట్టి ట్యూమ్‌సెన్సును "సంప్రయోగం" అని కూడా పిలుస్తారు.

ఈ యావద్సృష్టి కార్యమూ ఇతరులకు కనిపించకుండా రహస్యంగా ఆచరిస్తారు కాబట్టి దీన్ని "రహస్సు" అంటారు.

దంపతులు శయనీయ ప్రతిశయ్యకలపైన పరుండి సురతికి తలపడతారు కాబట్టి ఈ ఆవేశ [Orgasm] దశని "శయనం" అని కూడా అంటారు.

ఈ పరిస్థితుల్లో మనసులో మరో ఊహ రాదు. మనసు ఎదుటి వ్యక్తి పైనే లగ్నం అవుతుంది. అంటే "మోహం" కలుగుతుంది. కాబట్టి "ట్యూమ్‌సెన్సు"ను "మోహనం" అనీ పిలుస్తారు.

ఈ మన్మథావస్థలో పురుషులైతే చాలా బలంగానూ, శక్తివంతంగానూ వుంటారు. ఆడవాళ్ళలో "లవ్‌లినెస్" ఎక్కువగా వుంటుంది. హర్షానుభూతి వలన పసన్నమైన ఇంద్రియాల నుంచి చక్కటి తేజస్సు ఉత్పన్నమౌతుంది. శరీర వర్ణం చాలా ప్రకాశవంతంగా వుంటుంది. కళ్ళు పొడవుగా అవుతాయి. కాంతితో వెలుగొందు తుంటాయి. ఈ లక్షణాలను పొందిన వ్యక్తులలో విరహం తారాస్థాయిన వున్నదని అర్థం.

మొద్దుగా వుండే శరీరాన్ని కలిగిన ఆడదైనాసరే, విరహావస్థలో పలుచగా కనిపిస్తుంది. విరహం శరీరంలో నాడీప్రసారాలను [Nervous flow] ఎక్కువ చేస్తుంది. దీనివలన స్థిరత్వం దెబ్బతింటుంది. పండూరి వారి ఎంకి—

"గుండె గొంతులోన కొట్టుకుంటాది

కూకుండ నీదురా కాసింత సేపు" అన్న అనుభూతి కలుగుతుందీ విరహదశలోనే!

కొంచెం నల్లగా, బారుగా కనిపిస్తారు. శరీరం తేలిపోతున్నట్లు. లఘుత్వాన్ని పొందుతుంది. ఓర్పు నశిస్తుంది. దీనిని "Involuntary chastity" అంటారు.

మనకు తెలీకుండానే మనలో నియతంగా సంభవించే ఒకానొక స్పందన విరహం. అదొక నిగ్రహించుకోలేని లైంగిక వాంఛ. పురుషుడితో సమానమైన ఆహారాన్ని రెండుసార్లు తీసుకొనే స్త్రీ ఆ పురుషుడి పట్ల నాలుగురెట్లు దుస్సాహసం (రెక్‌లెస్)గా ప్రవర్తిస్తుంది. అంతకన్నా అరురెట్లు స్వతంత్రంగా వ్యవహరిస్తుంది. అంత మాత్రం తెగింపువున్న స్త్రీ మూర్తికి విరహాన్ని నిగ్రహించుకొనే శక్తి కూడా సహజంగానే వుంటుంది. అందువలన, స్త్రీ సహజమైన సిగ్గు కొంచెం తక్కువ వుంటుంది.

సిగ్గు తక్కువైనంత మాత్రాన దేశానికి వచ్చే నష్టం లేదు. స్త్రీసమానత్వం కోరే స్త్రీలు కళ్యాణమల్లుడు తన "అనంగరంగ"లో చెప్పిన ఈ లక్షణాన్ని కలిగివుండడమే ఉత్తమం!

పరమ ముదుసలులు కూడా విరహంలో యువతులుగానే కనిపిస్తారు. ముఖ కండరాలు కుంచించుకొని గట్టి పడతాయి. ముడుతలు మాయమవడం వలన అమ్మమ్మలు కూడా యవ్వనుల్లాగే కనిపిస్తారు.

సెక్సు వలన ఉత్పన్నమైన హర్షం వలన, వృద్ధాప్యంలో సైతం ధాతుపోషణ అధికంగా వుంటుంది. అందుకే "హర్షః ప్రీణనానాం" అన్నారు.

కాబట్టి జీవించి వున్నంత కాలం లైంగికోత్తేజం పొందేలా మనిషి జాగ్రత్త పడాలి.

చంచలమైన మనసుతో, అస్థిరమైన ప్రేమతో ఏర్పరచుకునే తాత్కాలికమైన అనుబంధాలు మనిషిని లైంగికంగా అసమర్థుణ్ణి చేస్తాయి. ఒకే వ్యక్తి పట్ల బలమైన బంధాన్ని పెంపొందించుకుంటే, దాంపత్యం, దాంపత్య సుఖం కలకాలం నిలుస్తాయి. అందుకే "జంట వివాహ వ్యవస్థ" ఏర్పరచబడింది!

## వృద్ధస్య తరుణీ విషం

హావెలాక్ ఎల్లిస్, "ముసలివాళ్ళు పడుచు పిల్లలను రమిస్తే, ఆ మైథున వేగానికి తట్టుకోలేక, పక్షవాతం, రక్తపోటు వంటివి కలిగి మెదడులోని రక్తనాళాలు పగిలిపోతాయి.... been unable to resist the high blood-pressure and cerebral haemorrhage with paralysis has occured ..." అన్నాడు.

మనవాళ్ళు "వృద్ధస్య తరుణీ విషం" అని స్పష్టంగా చెప్పారు. మూడో పెళ్ళికి తలపడ్డ తాతయ్యలు కొత్త పెళ్ళికూతురి కౌగిలిలోనే మరణించిన సంఘటనలు మనం ఎరగనివి కాదు. అందుకు కారణం అమ్మాయి జాతకం కాదు, అయ్యగారి ప్రారబ్ధమే!

వృద్ధులు "అతిరతి"కి తలపడితే, అప్పటికప్పుడు, మూర్ఛ, వళ్ళంతా కంపం [Convulsions] వస్తాయి. లేక పక్షవాతం జనిస్తుంది. శరీరం బిగదీసుకు పోతుంది. అవయవంలో వాపు

కలుగుతుంది. దారుణమైన ఆయాసం, దగ్గూ వస్తాయి. శుక్రంతో పాటు రక్తం కూడా బైటకు స్రవిస్తుంది.

అంతేకాదు, ఎక్కువగా భుజించిన స్త్రీనీ, ఆకలిగావున్న స్త్రీనీ పొరబాటున కూడా రమించకండి. దాహంవేస్తున్నప్పుడు, భయం కలిగినప్పుడూ ఆడవాళ్ళు సంభోగానికి తలపడకూడదు. దాని వలన మానసిక రుగ్మతలు వస్తాయి.

సంభోగంమీద మనసులేని స్త్రీనీ, దుఃఖపీడితురాలుగా వున్న వ్యక్తినీ, కోపంగా వున్న వ్యక్తినీ, ఇంకో పురుషుణ్ణి మనసులో కోరుకుంటున్న వ్యక్తినీ రమించినా పురుషుడు సుఖాన్ని పొందలేడు. పైగా ఆ స్త్రీని మరింత హీనమైన స్థితిలోకి నెట్టిన వాడౌతాడు.

మైథునంలో అతిగా కోరికవున్న స్త్రీని తక్కువ కోరికవున్న పురుషుడు రమిస్తే తృప్తి, సంతానం రెండూ ఇద్దరికీ లభించవు అని స్పష్టంగా చెప్పాడు చరకుడు. ఒకవేళ సంతానం కలిగినా, వాళ్ళు గుణహీనులౌతారట!

వృద్ధులైనా, బలమైన శుక్రధాతువును కలిగి, బలమైన కోరిక గలిగి నియమబద్ధంగా సంభోగిస్తే తరుణత్వం పొందుతారు. పడుచువాడు తనకంటే వయసులో పెద్దదైన స్త్రీని సంగమిస్తే, వృద్ధప్రాయుడౌతాడు అన్నాడు భావమిశ్రుడు. *

---

* వృద్ధాపి తరుణీ గత్వా తరుణత్వ మవాప్నుయాత్
వయోఽధికాం స్త్రియం గత్వా తరుణః స్థవిరాయతే.
(భావప్రకాశం అ. 4. 170)

## మధ్యలో ముగించ వద్దు

"లైంగికత" అనేది శరీరంలో కలిగే నాడీ స్పందన మాత్రమే. సంభోగించిన తర్వాత "చేష్టావహనాడులు" (Motor nervous system) పైన దాని ప్రభావం ఎక్కువగా వుంటుంది. అలసిపోయిన మనిషి మత్తుగా నిద్రకు లొంగిపోవడం అనేది ఈ నాడీ సంస్థానం చాలా తీవ్రమైన ఉత్తేజానికి లోనవడం కారణంగా జరుగుతుంది.

ఈ ఉత్తేజం వలనే మగపందీ, ఆడగుర్రం మగతేనెటీగా వగైరా సంభోగానంతరం చాలా విపత్కర పరిస్థితుల నెదుర్కొంటాయి. అందుకే, రతి కార్యం అయ్యాక ఆవేశం తగ్గే వరకూ చాలా జాగ్రత్తగా వుండాలి!

మనుషుల్లో స్త్రీలకు ఓ వరం వుంది. వాళ్ళలో సంభోగం ముగిశాక ఆవేశం చాలా నెమ్మదిగా తగ్గుతుంది. అందు వలన సంభోగానంతరం చాలా సేపటి వరకూ వాళ్ళు తృప్తిని అనుభవిస్తూనే వుంటారు. కాబట్టి, సంభోగ జనిత దుర్లక్షణాలు స్త్రీలకు వర్తించవు. ఈ తృప్తి కొనసాగడం వలన, స్త్రీలు మరణాన్నుంచీ, రకరకాల యోని వ్యాధుల నుంచీ కాపాడబడుతున్నారు.

రతి వలన కండరాలూ, నరాలూ ఉత్తేజితం అయి, వెంటనే ఆవేశం తగ్గిపోతే, ప్రమాదకరమైన పరిస్థితులే జరగవచ్చు. రతిని మధ్యలో ముగించడం కూడా మంచి పద్ధతి కాదు.

స్పృహతప్పి పడిపోవడం, వాంతులవడం, మల విసర్జన చేయాలనిపించడం వగైరా లక్షణాలు యువతీ యువకుల్లో మొదటి సారిగా సంభోగంలో పాల్గొన్నప్పుడు కనిపించవచ్చు. వీటి వలన భయంతో, చాలా మంది అమ్మాయిలు సెక్సు విద్వేషాన్ని పెంచు

కుంటారు. నరాల ఉత్తేజం, కండర చలనం తగ్గేవరకూ స్త్రీ పురుషులు ఆవేశాన్ని సడలనీయకుండా జాగ్రత్తపడితే ఇటువంటి ప్రమాదాలుండవు.

## ఆవేశానికీ తృప్తికీ మధ్య....!

లైంగికోత్తేజంలో కనిపించే సడలింపును "డిట్యూమ్‌సెన్స్" (రతి) అంటారు. రెండవ మన్మథావస్థ ఇది. ఈ దశలో తృప్తి ప్రధానంగా వుంటుంది.

స్త్రీ గర్భాశయంలో కొన్ని కదలికలు కనిపిస్తాయి. ఒక్కొసారి గర్భాశయంలోని చలనాలు యోని కండరాలను కూడా చలింపచేస్తాయి. యోని ద్వారం విచ్చుకోవడం, ముడుచుకోవడం చేస్తుంది.

అబిసీనియా దేశపు స్త్రీలకు ఈశక్తి సహజమైంది. వీళ్ళు పురుషావయవాన్ని బాహ్య ప్రయత్నం లేకుండానే లోనికి చొప్పింపచేసుకోగల శక్తి వున్నవారట. స్వయంశక్తితో అబిసీనియా స్త్రీల యోని కుడ్యాలు కుంచించుకోవడం, వికసించుకోవడం.... చేయగలుగుతాయి. పురుష ప్రయత్నానికి ప్రాముఖ్యత లేకుండానే మైథున కార్యం ముగిసిపోతుంది. ఈ కారణం వలననే కాబోలు, అబిసీనియా పురుషుల జననేంద్రియం చాలా చిన్నదిగా వుంటుందన్నాడు హావెలాక్ ఎల్లిస్.

మైథున కార్యం ముగిసే ఈ డిట్యూమ్‌సెన్స్‌లో తృప్తి ఎక్కువగా వుండడంచేత, వాళ్ళు తెలీని ఆత్రం కూడా సహజంగానే ఉంటుంది. "సంజ్ఞావహ ప్రవృత్తులు" [Sensory impressions] అధికంగా వుండడం వలన దంపతులు ఆవేశానికీ, తృప్తికీ మధ్య నలిగిపోతుంటారు. అటు ఆవేశాన్ని తట్టుకోవడానికీ,

ఇటు తృప్తిని పెంచుకోవడానికి తాపత్రయ పడుతుంటారు. నాడీ వ్యవస్థ బలంగా వున్న వాళ్ళు మాత్రమే సంపూర్ణమైన తృప్తిని సాధించుకోగలుగుతారు.

కంటి లోపలి నల్లగుడ్డు (Pupil) విచ్చుకునుంటుంది. నాసికా కుహరాలు సాగుతాయి. నోట్లో లాలాజలం ఎక్కువగా వూరుతుంది. నాలిక స్పందిస్తుంది. మనస్సు హర్షాతిరేకంతో ఉప్పొంగుతుంది. కాని, ఒక్కోసారి ఊపిరి బంధించి పోవచ్చు. గుండె ఎక్కువగా కొట్టుకొంటుంది. కళ్ళు మత్తుగా వాడిపోతాయి. నీరసం వచ్చేస్తూ వుంటుంది.

ఉచ్ఛ్వాస నిఃశ్వాసాదులలో ప్రతిబంధకం ఏర్పడడం చేత, హృదయం నుంచి రక్తం సిరల్లోకి [Venes] ఎక్కువగా చేరుకుంటుంది. సిరలలో వుండే రక్తం అశుద్ధమైంది. అది పుప్పుసాలను చేరి ప్రాణవాయువుతో కలిసి శుద్ధమై శరీరం అంతా ధమనుల ద్వారా [Arteries] వ్యాపిస్తుంది. కాని, ఇక్కడ ఊపిరి బిగదీయడం వలన ప్రాణవాయువును గ్రహించలేడు మనిషి. ప్రాణవాయువు లేకపోవడం చేత రక్తం శుద్ధం కాదు. శరీరంలో "సిరా రక్తం" ఎక్కువవడం చేత, దాని వేగ తీవ్రతకు సిరలు తట్టుకోలేక పోవచ్చు. ఫలితంగా రక్తపోటు (బి.పి) పెరుగుతుంది. అంతేకాదు, చర్మానికి దగ్గరగా వుండే రక్తనాళాలు బాగా ఉబ్బి పైకి కనిపించేలా అల్లుకు పోతాయి. కళ్ళు ఎర్రబడతాయి. తల తిరుగుతుంది.

మన ఆధీనంలో లేకుండా, మన ఇష్టా ఇష్టాలతో నిమిత్తం లేకుండా తమ పని తాము చేసుకుపోయే కండరాలు (Involuntary muscles) విరహం ముగింపు దశకొచ్చే సరికి కొద్దిగా సంకోచిస్తాయి. అందువలన మూత్రాశయం [Urinary bladder] పైన వత్తిడి పెరుగుతుంది. చివరికి, స్తంభనం

విరమించబడంగానే, అప్పటి వరకూ అవరోధింపబడిన మూత్రం, వత్తిడి వలన బైటకు రావాలని ప్రయత్నిస్తుంది. కొందరు ఆడ వాళ్ళకు తెలీకుండానే మూత్రం జారి అయిపోతుంది.

ఈ కారణం చేతనే, ముందు మూత్ర విసర్జన చేశాక, ఆ తర్వాత మైథునానికి తలపడమని చెప్పారు. మలమూత్ర వేగాలను నిరోధించి మైథునంచేస్తే నపుంసకత కలుగుతుందని ఆయుర్వేదం

ముందుగానే మూత్ర విసర్జనచేస్తే కండర శక్తి వృధాకాదు. అంతేకాదు, మూత్రాశయం నిండుగా వుంటే, మనోచాంచల్యం ఎక్కువగానూ, లైంగికవాంఛ తక్కువగానూ వుంటుంది.

సురతి ముగించబోయే సమయానికి కొందరు స్పృహ తప్పి పడిపోతారు. కొందరికి వాంతులవుతాయి. కొందరికి వెంటనే మల విసర్జన చెయ్యాలనిపిస్తుంది. ఇవి కేవలం నరాల, కండరాల ఉత్తేజం వలన కలిగేవే! కొందరికి ఆ సమయంలో తాత్కాలికంగా కొన్ని మనోవికారాలూ సంభవించవచ్చు.

## రతి అంటే ఏమిటి?

సృష్టి కార్యంలో ఈ విరమించేదశ [Detumescence]ని 'రతి' అని పిలుస్తూ దీనికి ఏడురకాల పేర్లు పెట్టాడు వాత్స్యాయనుడు.

అందులో "ఫలావస్థ"లో సుఖం ఎక్కువగా వుండి చిత్త పరిస్పందనం వుంటుంది కాబట్టి ఈ స్థితి వరకూ రమించడాన్ని "రతి" అని చెప్పాడు వాత్స్యాయనుడు.

ఉపస్థేంద్రియం (స్త్రీ పురుషుల జననేంద్రియం) ద్వారా రసనం (సుఖానుభవం) వుంటుంది కాబట్టి "రతిని" రసం అని కూడా పిలుస్తారు.

మనసు సరిగ్గా ఈ తారాస్థాయిలోనే పూర్తిగా బంధించబడి తాను రమిస్తున్న వ్యక్తి పైన లగ్నం అవుతుంది కాబట్టి "ప్రీతి" ఎక్కువగా వుంటుంది. రతికి ప్రీతి అనేది పర్యాయం!

రతికే భావం అనే పేరుంది. కామిత భావం రతి ముగింపు దశలో తీవ్రంగా వుండడమే ఇందుకు కారణం.

రాగం అంటే, మనసును సంపూర్ణంగా రంజింప చేసే దశ ఇది— అని.

వేగం అనే పదానికి Impulse అనే ఆధునికుల అర్థాన్ని చెప్పుకోవాలి. వాత్స్యాయనుడు Impulse (వేగం)ను సుఖాన్ని అందించేదిగానూ, నాడీ సుఖం వలన శుక్రధాతువును ప్రేరేపించేదిగానూ నిర్వచించాడు. ఇది కూడా తారాస్థాయి దాటాకే సంభవిస్తుంది.

ఈ స్థాయిని "సమాప్తి" అని కూడా పిలుస్తారు. రతాన్ని ముగింప చేయుడమే సమాప్తి.

కాబట్టి, "రతి" అనే పదం ఆధునికుల Detumescence కు సరిపోతుందని మనం భావించవచ్చు.

## స్త్రీకి భావప్రాప్తి ఎక్కువ

వాత్స్యాయనుడి ప్రకారం, స్త్రీకి పురుషుడికి లైంగికవాంఛలో చాలా తేడా వుంది. పురుషుడికి కోరిక కలిగి, రతికి పూనుకొని తృప్తి వచ్చాక విరమించు కోవడమేగాని, వెంటనే తిరిగి పూనుకోవడం అనే ప్రశ్నే లేదు. కాని, స్త్రీ— ఒక పురుషుడు విరమిస్తే పురుషాంతరుణ్ణి కోరుతూనే ఉంటుంది.... అంటూ కామ

సూత్ర పరిష్కర్త. పురుషుడి భావాల కన్నా స్త్రీ భావ పటిమ గొప్పదన్న విషయాన్ని నిర్ద్వంద్వంగా ప్రకటించాడు.

"ఎన్ని కట్టెలైనా, అగ్నికి తృప్తి కలగడం అనేది జరగదు. ఎన్ని ప్రాణులు వచ్చినా యముడు తృప్తిపడతాడా? ఎందరు పురుషులు కలిసినా, స్త్రీ తృప్తిని పొందడం అనేది అంతకంటే అసంభవమైన విషయం...." అన్నాడు *

ఇవ్వాళ్టి స్త్రీకి సెక్సుధ్యాస వున్నంత తీవ్రంగా అంతటి పట్టుదల వున్నట్టు కనిపించదు. ఆమెకు బలమైన భావం లేదు. అందువలన సృష్టి కార్యంలో పరిపూర్ణమైన ఆనందాన్ని పొందలేక పోతోంది స్త్రీ. యాంత్రిక జీవితానికి అలవడిపోయి, ఆ కొంచెం సేపు అనుభవించిందే "సుఖం" అనుకొని మురిసి పోవడం స్త్రీ అల్ప సంతోషానికి నిదర్శనం.

బొంగరం ముందు నెమ్మదిగా, మధ్యలో కొంచెం వేగంగా, పోను పోనూ వేగాన్ని పుంజుకుంటూ తిరుగుతుంది. స్త్రీ భావావేశం కూడా అంతే! మొదట మృదురతిని కోరుకుంటుంది. మధ్యలో అల్ప సహిష్ణుతని కలిగి వుంటుంది. రాను రానూ కోరిక తీవ్రం అవుతుంది.

అదే పురుషుడైతేనో, "ధాతుక్షయాచ్చ విరామాభిప్సేతి" అన్నాడు. అంటే స్త్రీ సంబంధమైన ఆలోచన కలగంగానే మానసిక ప్రవృత్తుల [Instincts] ప్రేరణ వలన శుక్రధాతువు ప్రేరేపించబడి లైంగిక వాంఛలను [Sexual impulses] కలుగచేస్తుంది. దాన్ని "కామితం" అనే భావంగా పేర్కొన్నాడు వాత్స్యాయనుడు.

---

*"అగ్నిః స్తృప్యతినో కాష్టయిర్నాపగాభిః పయోదధిః నాంతకః సర్వ భూతైశ్చ నపుంభిర్వామలోచనా ఇతి ..."

ఈభావం వలన శుక్రం (Semen) స్వస్థానాన్ని(Testes) వదలి, దాని నాడులను [Spermatic cord] చేరుకుంటుంది.

ఇంక సురతి క్రియ ఆరంభమైనాక, శుక్రధాతువు క్రమేణా క్షీణించడం ప్రారంభిస్తుంది. దానితో లైంగిక ప్రవృత్తులు (Sexual impulses) బలహీనమౌతాయి. పురుషుడిలో కోరిక తరిగిపోతుంది. శుక్రధాతువు పట్టు సడలడం వలన "విసృష్టి" (Ejaculation—శుక్రబహిర్గమనం) జరుగుతుంది. వెంటనే సురతి నుండి విరమించాలనే కోరిక కలుగుతుంది. అంటే, శుక్రధాతు క్షయం వలన కోరిక నశిస్తుంది....

స్త్రీకి ఆరంభంలో కలిగిన భావం చివరి వరకూ వుంటుంది. పురుష సంబంధమైన ఆలోచన కలగంగానే, లైంగిక ప్రేరణ (Sexual instincts)ల వలన స్త్రీ శుక్రధాతువు ప్రేరేపించబడి, లైంగిక ప్రవృత్తు లేర్పడతాయి. తత్ఫలితంగా కోరిక జనిస్తుంది. కోరిక జనించిందే తడవు, పగిలిన నీటి కుండలా స్త్రీ యోని తడిగలిగిందౌతుంది.

అంటే, స్త్రీకి విసృష్టి(Ejaculation) ముందే జరుగుతుంది.

మొత్తం సృష్టి కార్యం ఒక ఎత్తూ, "విసృష్టి" సమయాన కలిగే సుఖం ఒక ఎత్తు. ఈ సుఖాన్ని "విసృష్టి సుఖం" అన్నారు. ఇది పురుషుడికి చివరిలో లభిస్తుంది. అంటే, నిజమైన సుఖం అతనికి రతి చివర లభిస్తుంది. కాని, ఈ సుఖాన్ని స్త్రీ ఆది నుంచీ పొందుతోంది కాబట్టి ఆమెకు భావ ప్రాప్తి ఎక్కువ.... అంటుంది వాత్స్యాయనుడి సిద్ధాంతం. *

---

* సాతత్యాద్యువతి రావం భాత్రృభృతి భావ మధిగచ్ఛతి
పురుషః పునరంతఏవ — (2. 1. 32. వాత్స్యాయనం)

## శీఘ్ర స్ఖలనాలను నిరోధించడం ఎలా?

శీఘ్ర స్ఖలనం [Premature Ejaculation] అనేది నవయువకుల్లో అత్యంత సాధారణమైన విషయం. దీనికి ఏదో మానసికమైన పరిస్థితులు కారణం అనుకోవాల్సిన అవసరం లేదు. శరీరంలో లైంగిక ఉద్వేగం అధికంగా వున్నప్పుడు కొస్త బలహీన మైన వ్యక్తి త్వరగా స్ఖలనం చేసుకుంటాడు. రెండు మూడు సార్లు మైథునానికి తలపడితే ఈ ఇబ్బంది తొలగిపోతుంది.

అమెరికాలో సగటున పురుషుడు షుమారుగా రెండు నుంచి మూడు నిమిషాల సేపు రతిలో నిలిచి వుండగలుగుతాడు. ఇండియాలో ఈ కాలపరిమితి చాలా తక్కువ.

బాహ్య ఆయతనాన్ని లేక రతిపూర్వ కృత్యాల్ని [Petting] ఎక్కువగా ఆచరించడం వలన ఈ ఇబ్బంది తప్పుతుందన్న వాత్స్యాయనుడి వాదనను ఆధునిక వైద్యశాస్త్రం అంగీకరించలేదు.

ఎందుకంటే, ఆలింగన, చుంబన ఔపరిష్టకాదుల్ని [Fore-play] స్త్రీకి ఆవేశం [Orgasm] వచ్చే వరకూ ఆచరిస్తూ, చివరికి స్త్రీయోనిని పూరింపచేస్తే. ఆమెకూ సంపూర్ణమైన తృప్తి లభిస్తుంది, పురుషుడూ శీఘ్రస్ఖలనాన్ని పొందడు అని వాత్స్యాయనం. అందువలన పురుషుడిలో కూడా ఆవేశం వచ్చి, రతికి పూర్వమే స్ఖలనం పొందితే అసలుకే మోసం వస్తుందని ఈ వాదనను మరికొందరు ఖండించారు.

ఇంకొంత మంది, అలైంగిక విషయాల గురించి రతి సమయంలో ఆలోచిస్తే శీఘ్రస్ఖలనం జరగదు— అని చెప్తారు. కాని, దీని వలన సంకల్పం వికల్పమయ్యే ప్రమాదం వుంది.

"మాస్టర్స్, జాన్సన్" అనే ఇద్దరు ఓ కొత్త పద్ధతిని సూచించారు.

శీఘ్రంగా స్ఖలించే పురుషుడిని ఆవేశం వచ్చే వరకూ సంయోగింపచేసి, ఆతర్వాత స్ఖలనమయ్యే సమయానికి పురుషావయవం ముందరి భాగాన్ని రెండు వ్రేళ్ళతో నొక్కిపట్టమని, అందువలన శుక్రం బైటకు స్రవించకుండా నిరోధించబడ్తుందనీ చెప్పారు.

ఆధునిక వైద్యులు ఈ పద్ధతిని చాలా శ్రేష్టమైనదిగా ప్రకటించారు.

చివరికి ఇంత నీచానికి దిగజారి పోతున్నా, ఇంకా మనం మేల్కొలేక పోవడం శోచనీయం.

శీఘ్రస్ఖలనానికీ మనసుకూ సంబంధం చాలా వుంది. మనసును బలంగా వుంచుకోవడమే దీనికి మార్గం. ఆయుర్వేదంలో చెప్పబడ్డ వాజీకర ఔషధాలను నిత్యం వాడటం ఒక్కటే తరుణోపాయం.

శీఘ్రస్ఖలనాలున్న వ్యక్తులకు సహజంగానే "స్వప్న స్ఖలనాలు" కూడా సంభవిస్తాయి.

అయితే, స్వప్న స్ఖలనాలు సంభోగంతో నిమిత్తం లేకుండానే జరిగిపోతాయి. శీఘ్రస్ఖలనాలకైతే ఒకసారి సంభోగిస్తేగాని తెలీదు.

ఇవి రెండూ మహా మహులైన వాళ్ళలో కూడా వుంటాయి.

కొందరు సుప్రసిద్ధులైన యోగులే అరవిందుడికి స్వయంగా చెప్పారట.... తమకు కనీసం ఆరునెలలకొకసారైనా లైంగిక స్వప్నం వస్తుందని.

స్వప్నస్ఖలనాలని నిరోధించాలనే దృఢ నిశ్చయం కలిగి నిద్రిస్తే, తప్పకుండా నిరోధించబడ్తాయనీ, ఇది యోగులే కాదు, సాధారణ పౌరులూ పాటించవచ్చుననీ మన నిశ్చయమే మనల్ని నడుపుతుందనీ అరవిందుడు వ్రాశాడు.

సృష్టికార్యం మీంచి దృష్టి చెదరకుండా వుంటే, ప్రేమ బలంగా వుంటే, కోరిక తీవ్రంగా వుంటే శీఘ్రస్ఖలనాలు కూడా నిరోధించబడ్తాయి— అనేది తిరుగులేని సత్యం!

మనిషి మనోవికారాలు లేకుండా నిర్మలంగా ఉండాలి. ధైర్యంగా వుండాలి. నిష్కల్మషంగా వుండాలి. కోరిక, ప్రేమ నిండుగా వుండాలి. వీళ్ళు మాత్రమే సంభోగ సమర్థులు. సంభోగానికి అర్హులు. వీళ్ళ సృష్టి కార్యాన్ని ఏశక్తీ ఆపలేదు!!

## బద్ధకస్తులకు సంభోగ సామర్థ్యం వుండదు!

ప్రేమ దృష్ట్యా ఆలోచిస్తే, వృత్తినైనా, పశువునైనా, మనిషినైనా— ప్రేమించడం అనేది ఒకే ప్రవృత్తి [Impulse],

సత్త్వగుణ సంపన్నులు ప్రేమించగల సమర్థులు. సత్త్వగుణం అనేది శుక్రసారుల లక్షణం. "శుక్రధాతువు" సంపూర్ణంగా అభివృద్ధి చెందిన వ్యక్తి చంచలతలేని ప్రశాంతమైన మనసు కలిగి వుంటాడు. అంటే, అతని ప్రవృత్తులు [Impulses] నిరాటంకంగా ప్రవహిస్తున్నాయనీ, బలంగా వున్నాయనీ అర్థం.

అందుకే, కార్యసాధకులు ప్రేమించేతనాన్ని ఎక్కువగా కలిగి వుంటారు. శ్రమించడంపట్లా, శ్రామికులపట్లా ప్రేమను ప్రదర్శించలేని వ్యక్తి భార్యను కూడా ప్రేమించలేడు.

వృత్తిని గౌరవించేవాడు అమ్మనూ, నాన్ననూ గౌరవిస్తాడు. వృత్తిని ప్రేమించేవాడు భార్యను ప్రేమించగలుగుతాడు. పిల్లల్ని ప్రేమించగలుగుతాడు. పొరుగువారిని ప్రేమించగలుగుతాడు.

ఒక వ్యక్తి సంభోగ సామర్థ్యాన్ని నిర్ణయించడానికి అతని "పనితనం", శ్రమించేందుకతను చూపించే ఉత్సాహం, అతని పట్టుదల— ఇవి ప్రమాణాలుగా ఎంచుకోవచ్చు.

సృష్టికార్యంలో పూర్తి తృప్తిని ఈయగలగడం, పొందగలగడం అనేవి బద్ధకస్తులో లోపించిన విద్యలు!!

## అందరూ సమర్థులే!

వర్ణనాలిటీ సిద్ధాంతంలో ఇంత వరకూ పరిశోధన చెయ్యగలిగారు ఆధునిక శాస్త్రజ్ఞులు. కాని, లైంగికోత్తేజం విషయంలో శరీర రచనకున్న ప్రాముఖ్యత ఇంకా వీళ్ళకు పూర్తిగా తెలీలేదనే చెప్పాలి.

మనుషులంతా నాడీ శాస్త్ర ప్రకారమే లైంగికోత్తేజం పొందుతున్నారుకదా.... కాని, సంభోగసామర్థ్యం విషయంలోగాని, భావావేశం విషయంలోగాని, సంభోగ కాలపరిమితి విషయంలోగాని మనిషికీ మనిషికీ చాలా తేడా కనిపిస్తుంది.

కొందరు అనేకమార్లు రతికి తలపడతారు. కొందరు కొద్దితోటే తృప్తి పడతారు. కొందరు వెంటనే ప్రతిస్పందిస్తారు. కొందరు తట్టుకోలేనంత తలక్రిందులై పోతారు. కొందరు నెమ్మదిగా, ఎప్పటికో తృప్తిని పొందుతారు.

మనుషుల్లో ఈ భేదాలకు కారణం పూర్తిగా తెలియదు. ఈ భేదాల్ని ఒక పద్ధతిలో అధునికులు వర్గీకరించినట్లు కూడా కనిపించదు.

వాత్స్యాయనుడు సంభోగ సామర్థ్యాన్ని మూడు రకాలుగా విభజించాడు. 1. స్త్రీ పురుష లైంగిక అవయవ ప్రమాణ రీత్యా. 2. సురతి కార్యంలో వారు పొందే భావప్రాప్తి రీత్యా. 3. సురతిలో వీళ్ళు నిలిచే కాలపరిమితి రీత్యా సంయోగానికి తలపడే వ్యక్తుల్ని మూడు తెగలుగా వర్గీకరించాడు.

లింగప్రమాణ విషయంలో పురుషులను 1. శశజాతి [Hare] [శాస్త్రంలో నిర్ణయించిన ప్రమాణం కంటే అల్పమైన, కొద్దిపాటి ప్రమాణం వున్న పురుషావయవం కలిగినవాడు— షుమారు ఆరు అంగుళములు.] *

2) వృషజాతి [Bull] సమానమైన ప్రమాణం కలవాడు- 9 అంగుళములు) 3) అశ్వజాతి (Horse) ఉండదగిన దాని కంటె అధిక పరిమాణం కలవాడు—[12 అంగుళములు] అని విభజించాడు.

అలాగే స్త్రీల అవయవ పరిమాణరీత్యా, వారిని మృగి [Deer], బడబ [Mare], హస్తినీ [Elephant] అని మూడు రకాలుగా వర్గీకరించాడు.

శశజాతి పురుషుడు మృగిజాతి స్త్రీని రమిస్తే అది సమరతి. వృషజాతి వ్యక్తి బడబజాతి స్త్రీలనూ, అశ్వజాతి హస్తినీ స్త్రీలనూ సంయోగిస్తే అది సమరతి!

---

* అంగుళీ— అంటే, బొటన వ్రేలు వెడల్పంత.

అలా కాక, ఒక జాతి పురుషుడు వేరొక జాతి స్త్రీని రమిస్తే అది విషమ రతి అనీ, నీచరతి అనీ చెప్పబడుతుంది.

"ఏది ఎలా వున్నా యోనిరంధ్రం సమంగా పూరించబడితేనే — అది సమరతి" అని స్పష్టంగా చెప్పాడు వాత్స్యాయనుడు.

భావ ప్రాప్తి విషయంలో స్త్రీ పురుషులిద్దరూ మృదు, మధ్యమ, అతి—మాత్రాభేదాలచే మూడురకాలు. ఎవరికి సంప్రయోగ కాలంలో సంభోగేచ్ఛ తక్కువగా వుండి, ఉదాసీనంగా వుంటారో, ఎవరి "సంభోగ వ్యాపారం తక్కువగా వుంటుందో వారు మృదుభావం కలవారనీ, వారిని "మందవేగులు" అంటారనీ వాత్స్యాయనుడు పేర్కొన్నాడు.

ప్రీతి మధ్యమంగానూ, వీర్యం మధ్యమంగానూ, ఓర్పు సంపూర్ణంగానూ వుంటే "మధ్యమవేగు"లనీ, ప్రీతి తీవ్రంగా, వీర్యంవిస్తారంగా, సహన శక్తి ఎక్కువగా వుంటే చండవేగులనీ పిలువబడతారు.

ఆధునిక మానస శాస్త్రం ఈ భేదాలకు కారణాలని గురించి ఇంకా పరిశోధిస్తూనే వుంది. వంశ పారంపర్యమైన లక్షణాలు [Genetic] దీనికి దోహదపడ్తున్నాయని నిరూపించలేకపోయినా, "సంభోగ సామర్థ్యం" అనేది మిగతా అన్ని శరీర వ్యాపారాలలాగే అనువంశికమైనదనే సత్యాన్ని కాదనలేకపోతోన్నారు ఆధునికులు.

ఏమైనా ఇంతవరకూ ఇతమిత్థంగా ఇది అనే నిర్ణయానికి రాలేకపోయారు.

## సెక్సు పరికరం చరిత్ర

కళ్యాణమల్లుడు పురుషావయవం గురించి చెబుతూ, చిన్నదైన అవయం వున్నవాడు "రాజు" అవుతాడని, పెద్ద అవయవం వున్నవాడు దరిద్రుడౌతాడని అన్నాడు.

కాని, ప్రపంచంలోకెల్లా ధనికులైన అరబ్బీయుల పురుషావయవం చాలా బారుగా వుంటుందని కోబెర్ అనేపండితుడు వ్రాశాడు. ఇప్పుడు యూరోపియన్లు అవయవం పొడుగులో మూడో స్థానంలో వున్నారట.

పురుషావయవానికి ముందు గుండ్రంగా వుండే భాగాన్ని గ్లాన్స్ పెన్నిస్ అంటారు. అరబ్బులకీ భాగం సంభోగ సమయంలో సన్నగా మారుతుండట. అందువలన ప్రారంభంలో వేదన వుండదంటారు వాళ్ళకు. అదిగాక, "సున్తీ" అనే ఆచారం, వాళ్ళను కునేట్లు సుఖవ్యాధులు సోకకుండా నివారించేందుకు కాకపోయినా, అది సురతిని సుకరం చేసుకోవడానికి బాగా వుపయోగపడ్తోంది. సాధారణంగా అరబ్బుల వస్త్రధారణ-వాళ్ళ పురుషావయవానికి "స్వేచ్ఛ" నిచ్చేరీతిలో వుంటుంది. అవయవం దినదినాభివృద్ధి చెందాలని ప్రపంచంలో ముస్లింలు కోరుకున్నంతగా మరేజాతీ పట్టించుకోవడంలేదట. దాన్ని గురించే అంత అత్యాశ ఆశ్చర్యకరమైన సంఘటనే!

ఈ పురుషావయవాన్ని Pennis అంటారు. వ్రేలాడుతుండేది లేక "పెన్డెంట్ పొజిషన్"లో వుండేది కాబట్టి పెన్నిస్ అనే పేరు లాటిన్ భాషనించి వచ్చింది. యూరపుదేశాల్లో పురుషావయవాన్ని కోలిస్ అంటారు. నాళం [Tube] లేక చెట్టు మూలంలా వుండేవి కాబట్టి దీన్ని కోలిస్ అన్నారు. "విర్గా" అని దీనికి మరో పేరు. "విర్గా" అంటే ఇనుపకడ్డీ. మనం "యార్డ్" (గజంకొలత)

అనిపిలిచే పదం అప్పటి "విర్గా" మీంచే వచ్చింది. అప్పట్లో పురుషావయవాన్ని "యార్డ్" అనిపిలిచేవాళ్ళు.

ఇలా "వేగ్"గా, చిలిపిగా వుండే వ్యుత్పత్తులు పాశ్చాత్య భాషలలో లభిస్తాయి. ఏమైనా, పేర్లుపెట్టే విషయంలో సంస్కృత భాషకు సాటిలేదేమోననిపిస్తుంది. పేరులోనే దాని ప్రయోజనము కనిపిస్తుంది.

"శిశ్నం" అంటే శ్లిష్యతి భగేన శిశ్నః... శ్లిష్ అంటే ఆలింగనం. స్త్రీ "భగం"తో కలిసేది కాబట్టి పురుషావయవాన్ని శిశ్నం అన్నారు. శుక్రంచేత స్త్రీయోనిని తడుపుతుంది కాబట్టి దీనికి "మేఢ్రం" "మేహనం" అనిపేర్లు వచ్చాయి. రేతస్సును విడిచి చివరకు నిద్రిస్తుంది [Detumescence] కాబట్టి దీనికి "శోఫసి" అనే మరోపేరుంది.

"లింగం" అనేపదానికి "గర్భాదానకరమ్" అని అర్థం. కాని, శారంగధరుడు "పురుషావయవం లింగమయనం వీర్యమూత్రయోః ...అంటూ, గర్భాన్ని కలుగచేసేది వీర్య, మూత్రాలను ప్రసరింప చేయడానికి మార్గాన్నిచ్చేది కాబట్టి దీన్ని లింగం" అన్నాడు.

పాశ్చాత్యులు జననేంద్రియాల గురించి మాట్లాడుకునేప్పుడు వాటిని Privates అని సంబోధిస్తారు. జర్మన్లు "షేమ్" అంటారు.

తెల్లజాతి స్త్రీలయోని చాలా పెద్దదిగా వుంటుందట. అందరికంటే నీగ్రో స్త్రీల అవయవం చాలా చిన్నది. జపాన్, జావాదీవుల స్త్రీలు కూడా చిన్న అవయవాన్నే కలిగివుంటారట, "యోని" కేవలం మానవజాతిలోనే సంపూర్ణంగా అభివృద్ధి చెందింది

తక్కిన జంతుజాలం అసంపూర్ణంగా ఎదిగిన యోనినే కలిగి వున్నాయి. వెజినా అనేపదం "వీసస్" మీంచి వచ్చింది. అలాగే "ఉపస్థ" అనే సంస్కృతపదం "పరస్పరం కలిసివుంటుంది కాబట్టి—" అనే అర్థంలో స్త్రీ పురుషావయవాలు రెండింటికీ వర్తిస్తుంది. "భగం" అంటే, పురుషులచేత ఆశ్రయించబడేదనీ. యోని అంటే" "యౌతి శిశ్నే నయోని" శిశ్నంతో కలిసివుండేదనే అర్థాలు వివరించబడాయి.

# 2. హస్త ప్రయోగం- వ్యాధి విశేషాలు!!

కామం అంటే కోరిక. ఈకోరిక, ఆత్మ [Ego], మనసు, ఇంద్రియాల సంయోగం కలిగినప్పుడే జనిస్తుంది. *

ఆత్మ ప్రేరణతో మనసు ఎప్పుడు ఏ యింద్రియంతో సంబంధాన్ని పెంచుకుంటుందో అప్పుడు ఆయింద్రియానికి సంబంధించిన కామంలేక కోరిక కలుగుతుంది. మనసు అటు ఆత్మతోటీ ఇటు ఇంద్రియాలతోటీ సమానమైన స్నేహాన్ని చేయు బట్టే మనిషి చైతన్యవంతుడౌతున్నాడు.

వాత్స్యాయనుడు ఈ కోరికల్ని రెండు రకాలుగా వర్గీకరించాడు. 1 సామాన్య కామం. 2 విశేష కామం. సామాన్య కామం

---

సూ॥ శ్రోత్ర త్వక్చక్షు ర్జిహ్వా ఘ్రాణానాం ఆత్మ సంయుక్తేన మనసా అధిష్ఠి తానాం స్వేషు స్వేషు విషయే ష్వాను కూల్యతః ప్రవృత్తిః కామః

అనేది సాధారణంగా అనేకానేక విషయాలపై మనిషికి కలిగే వివిధ కోర్కెల సముదాయం.

విశేష కామం కేవలం ఒకే విషయానికి సంబంధించి వుంటుంది. దాన్ని అనుభవిస్తున్న కొద్దీ ఇంకా ఇంకా పొందాలని పిస్తుంటుంది. ఒక అవయవానికి సంబంధించి ఆ అవయవం విశేషంగా చేసే కృత్యాన్ని బట్టి పెరిగిన కోరిక ఆ అవయవానికి విశేష కామం అవుతుంది. జననేంద్రియానికి సెక్సూ నయనేంద్రియానికి "తెలుగు సినిమా" విశేష కామంగా చెప్పుకోవచ్చు.

మనుషుల లైంగిక వాంఛలు తృప్తి నొందాలంటే స్త్రీ పురుషుల సంప్రయోగం [Sexual Deed] జరగాలి. ఈ సంప్రయోగానికి రెండు ఆధారాలున్నాయి. అంగసంప్రయోగం, ఆయతన సంప్రయోగం అని సృష్టికార్యాన్ని వాత్స్యాయనుడు రెండు రకాలుగా విభజించాడు. అందులో అంగాలంటే, లైంగిక వాంఛను ఉద్దీపింపచేసే-ఆభరణాలూ, Dressing, పుష్పమాలికలూ, వాజీకర ఔషధాలూ.....ఇలాంటివి. ఇవి కృత్రిమ పద్ధతులవలన కోరికను రెచ్చగొట్తాయి. అలాకాక, చక్కటి వాక్చాతుర్యం, పరళ హృదయత వుండి, లైంగిక వాంఛతో మత్తెక్కిన స్త్రీ పురుషుల్ని "ఆయతన" అనిపిలస్తారు. ఈ ఆయతనలు జరిపే సృష్టి కార్యం "బాహ్య ఆయతనం Petting అనీ, అభ్యంతర ఆయతనం [సురతం] అనీ రెండు పద్ధతుల్లో వుంటుంది.

ఇందులో బాహ్య ఆయతనం సామాన్య కామం. అభ్యంతర ఆయతనం విశేష కామం.

జననేంద్రియాలలో కలిగే లైంగిక అనందం త్వగింద్రియానికి [Skin] సంబంధించింది! లైంగిక వాంఛ స్పర్శ విశేష విషయంకదా. స్పర్శవలన కలిగే "ప్రతీతి" కాబట్టి ఈ ఆనందానికి 'అర్ధప్రతీతి' అని పేరు పెట్టాడు వాత్స్యాయనుడు.

అర్ధ ప్రతీతి అంటే, "త్వగింద్రియ బుద్ధి" ఈ బుద్ధి కామిత (Sexual Desire) అనేభావం వలన కలుగుతోంది. కాబట్టి కామిత భావంవలన అర్ధప్రతీతి [Sexual Pleasure] కలుగుతోంది. స్త్రీలకు పురుష చిహ్నం అయిన త్వగింద్రియప్రతీతి, పురుషులకు స్త్రీ చిహ్నం అయిన "పురుష వ్యంజన త్వగింద్రియప్రతీతి" కలుగుతాయి.

కాబట్టి కామాన్ని [Sexual Appetite] స్పర్శ విశేష విషయంగానూ, స్త్రీరూపంలో గాని, పురుషరూపంలో గాని వుండే జీవులకి సుఖాన్ని అందించేదిగానూ, ఫలవతి [Resultant] గానూ వున్న అర్ధప్రతీతిగా మనం నిర్వచించుకోవచ్చు. *

వాత్స్యాయనాన్ని జయ మంగళ వ్యాఖ్యానుసారంగా తెలుగు చేసిన శ్రీ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు ఈ విషయాన్ని ఇంకా విపులీకరిస్తూ హస్తప్రయోగంలో "ఫలవతి" వుండదు కాబట్టి అది విశేష కామం కాదు— అన్నారు.

రాత్రి స్వప్నాలు, స్వప్నస్ఖలనాల [Nocturnal emissions]లో కూడా లైంగికోత్తేజం వుంటోంది కాబట్టి అది అర్ధ ప్రతీతే అవుతుంది. అయినా, అది సాధారణ కామంలో భాగమే. ఎందుకంటే, ఆ కామంలో "ఫలవతి" లేదు. దానికి సత్ఫలం సిద్ధించదు. స్త్రీ పురుష అనురాగ సంకల్పంతో తృప్తి నొందేందుకు అవకాశం వున్నదే విశేష కామం. హస్తప్రయోగానికి "విశేష కామం" అనిపించుకునే అర్హత లేదు.

---

"స్పర్శ విశేష విషయాభిమానిక సుఖాను విద్ధాఫలవత్యర్ధ ప్రతీతిః ..." [వాత్స్యాయన కామ సూత్రాలు. అ.2.]

## తనని తాను ప్రేమించుకునే మనుషులు

ఫ్రాయిడ్ ప్రేమించేవాళ్ళను రెండురకాలుగా వర్గీకరించాడు. సృష్టిలో ఎవరైనాసరే ప్రేమిస్తున్నది....

1) ఆత్మరతీ వికారులు [Narcissistic type]

A) అచ్చం తనలాగే వుండే వ్యక్తులను.

B) ఒకప్పుడు తామెలా వుండేవారో అలాంటి వ్యక్తులను.

C) భవిష్యత్తులో తామెలా వుండాలనుకుంటున్నారో అలాంటి వ్యక్తులను.

D) ఒకప్పుడు తనతో భాగస్వామ్యాన్ని వంచుకొని తనను సుఖపెట్టిన వ్యక్తిని పోలిన వ్యక్తులను.

2) ఆరోగ్యవంతమైన మనసు గలవారు.

A) తనను పరిపూర్ణంగా ఆకర్షించిన స్త్రీని.

B) జీవన పోరాటంలో తనకు చేదోడుగా వుండే పురుషుడిని.

ఈ విభజనలో రెండు రకాల మనస్తత్వాలు ప్రధానంగా కనిపిస్తున్నాయి మొదటి రకం వ్యక్తులు "ఆత్మరతి"ని కోరుకునే వారు. ఫ్రాయిడ్ వీళ్ళను మనోవికారులే నన్నాడు.

ఈ మనోవికారాన్ని "నార్సిసిజం" అంటారు. ఇది విచిత్రమైన మనోవ్యాధి. స్త్రీలు గానీ పురుషులు గానీ, తమ లైంగిక వాంఛల్ని తృప్తిపరచగలిగే వ్యక్తిని మనసులో వూహించుకొని, ఆవ్యక్తి తానే అనుకొని "ఆత్మరతి"ని పొందడం నార్సిసిజంగా మొట్ట మొదట "హావెలాక్ ఎల్లిస్" నిర్వచించాడు.

స్త్రీ పురుషు లిద్దరూ కలిసి చేయవలసిన సురతి కార్యాన్ని ఒక్కరే, రెండో వ్యక్తిగా కూడా తననే భావించుకొని, హస్త ప్రయోగాది వివిధ "కర్మ"లకు పాల్పడడం నార్సిసిజం. ఈ మనో వికారం వున్న వ్యక్తి పురుషుడైతే స్త్రీత్వాన్ని జీర్ణించుకొని వుంటాడు. వీళ్ళు నిస్సందేహంగా మానసిక నపుంసకులే!

సాడ్గర్, నార్సిసిజం అనేది లైంగికతలోని అస్థిరత వలన సంభవిస్తుందన్నాడు. ప్రతి మనిషిలోనూ తను ప్రేమించినవ్యక్తితో ఐక్యమైపోయే ప్రవృత్తి వుంటుంది. ఆవ్యక్తి వలెనే ప్రవర్తించడం అత్యంత సహజమైన విషయం. కాబట్టి ప్రేమించడం చేతనైన ప్రతి వ్యక్తీ నార్సిసిస్టే! అయితే, ఈ ప్రేమకు వక్రభాష్యమే "నార్సిసిజం" అనే మనోవికారం— అన్నాడు.

తను ప్రేమించిన వ్యక్తిని తననుగా భావించుకోవడం అంటే కోరిక ఆత్మాశ్రయం అయ్యిందని! ఆత్మాశ్రయ కోరికలు వక్ర మార్గం పట్టడం వలన వివిధ మనోవికారాలు జనిస్తున్నాయి. అంటే, ప్రేమ వెర్రితలలు వేయడం!దీన్ని "నార్సిసిజం" అన్నారు. నిర్మలమైన స్నేహాన్ని కూడా చాలా మంది Spiritualized Homo sexuality గా వర్గీకరించారు. సాడ్గర్ వీళ్ళలో ముఖ్యుడు.

వీళ్ళ ఆలోచన ప్రకారం స్నేహితాన్ని చేయడం అంటే, తానే అతనూ, అతనే తానూ అనే తత్త్వాన్ని పెంపొందించు కోవడం. స్నేహం చేసే వ్యక్తి తనని తాను ప్రేమించు కుంటున్నాడనమాట.

మన స్నేహితుడు— అంటే, మన మనసుకీ, మన ఆత్మకి (Ego) ప్రతినిధి కావాలి!!

## అద్దంలో శృంగారం

"నార్సిసస్ అనబడే ఈ ఆత్మ ప్రేమికుణ్ణి కవులు రకరకాలుగా వర్ణించారు. సౌందర్యారాధకులకు నార్సిసస్ పరమ అభిమాని. తనను తానే నార్సిసస్‌గా భావించుకొని ఆనందించిన మేధావు లున్నారు.

ఆస్కార్‌వైల్డ్ వంటి ప్రకృతి సౌందర్యారాధకులు, తామభిమానించే ఆ ప్రకృతిలో లీనమైపోయి, తమ అనుభూతినే "ప్రకృతి" అనుకున్నారు.

"మెర్జికోవ్‌స్కీ" అనే రష్యన్ రచయిత టాల్‌స్టాయ్ గురించి వ్రాస్తూ, టాల్‌స్టాయ్ మూడేళ్ళ వయసులోనే సౌందర్యాన్ని ఆరాధించసాగాడనీ, తన నగ్న స్వరూపాన్ని చూసుకొని మురిసిపోయేవాడనీ, ఆ రూపాన్నే ఆరాధించే వాడనీ అన్నాడు. పదహారేళ్ళ వయసు వచ్చిందగ్గర్నించీ టాల్‌స్టాయ్ నగ్నంగా నిలబడి అద్దంలో చూసుకునే వాడట. అంతకు మించి హస్త ప్రయోగాది మనోవికారాలు టాల్‌స్టాయ్‌కు లేవని వ్రాశాడు మెర్జికోవ్‌స్కీ.

అంతటి సౌందర్యారాధకుడు ముసలివాడైనాక తన నగ్న రూపాన్ని చూసుకుని అసహ్యించుకున్నాడట. తననో "మౌజిక్"గా భావించుకునేవాడట, తన పొడుగాటి కాళ్ళనీ, చేతుల్ని చూసుకుని వాపోయేవాడట, ఈ సంఘటనను ఉదహరించిన హావెలాక్ ఎల్లిస్, "ఇది నిజమైన సౌందర్యారాధన. ఇది టాల్‌స్టాయ్ హృదయాన్ని ప్రతిబింబిస్తోంది...." అన్నాడు. సున్నితమైన హృదయంగల సౌందర్యపిపాసకులకి "విచారం" సహజమైన దేనన్నాడు ఎల్లిస్.

దీన్ని "అతీత ఆత్మరతి" [Excessive norscissism] అంటారు. ఇది మనోవికారం ఎంత మాత్రమూకాదు. అది భావుకుల

కొక వరం. దీన్ని దుర్వినియోగపరచడమే నార్సిసిజం అనే మనోవైక్లబ్యం!

నార్సిసస్ అనే వ్యక్తి భాసియన్ల ప్రేమదేవత. గ్రీకుల పురాణాలలో ఇతని ప్రసక్తి వుంది.

ఒకసారి నార్సిసస్ ఒక సరస్సు నీటిలో తన ప్రతిబింబాన్ని చూసుకొని "అబ్బ! ఎంత బాగున్నాడో ఆ నీటిలో అబ్బాయి—" అనుకున్నాడట. సుందరమైన ఆ రూపాన్ని అతను అమితంగా ప్రేమించేశాడు. చివరికి ఆ బింబాన్ని వదిలి రాలేనంత లోతుగా ప్రేమించాడు. ఆ ప్రేమతోటే మరణించాడు.

అలాగే నార్సిసిస్టులు కూడా తను ప్రేమించిన వ్యక్తిని తనను గానే భావించుకొని అద్దంలో కనిపిస్తున్న మరో వ్యక్తితో క్రీడిస్తున్నట్లు ఊహించుకుంటారు.

ఈ మనోవికారులకు ఎక్కడలేని "అహంకారం" వుంటుంది. గర్వంతో విర్రవీగుతూ వుంటారు. "అసలు వీడు ఏంచేశాడని ఇంత అతిశయం ....?" అని మనం వాళ్ళను చూసి విస్తుపోతూంటాం.

ఏవీ చెయ్యలేనన్న "జ్ఞానం" అతనలో వుండబట్టే దాన్ని కప్పిపుచ్చుకోవడానికి, మనసును తృప్తిపరచుకోవడానికి వీళ్ళు గర్వాన్ని నటిస్తారంతే!

ఎప్పుడైతే అసమర్థత అనే భావం మనిషిలో మొలక లేస్తుందో అప్పుడే "అహంకారం" [Ego] అతనిలో విజృంభిస్తుంది. ఇది అసమర్థులందరిలోనూ సహజగుణం. సమర్థుడు ఎంత అతిశయాన్ని ప్రదర్శించినా అందులో "రాజసం" కనిపిస్తుంది. అసమర్థుడు అతిశయిస్తే మొట్టబుద్ధి అవుతుంది!

కాబట్టి, అసమర్థుని కోరిక సాధించుకోలేక పోవడంతో పాటే అతిశయం [Arogancy] మనసులో ప్రబలుతుంది. ఇంక క్రమేణా సాధింపబడని ఆ కోరిక అతనిలో నశించిపోతుంది. నశించిపోవడం అంటే ఆ వ్యక్తి మీంచో, వస్తువు మీంచో వెనక్కు మరలి మళ్ళీ అతని మనసుకే చేరుతుంది. మనసులో అతిశయం, అప్పటికే ప్రబలి వుంది కదా— ప్రబలిన అహంకారాన్ని కోరిక తాకుతుంది.

అంటే, కోరిక ఆత్మాశ్రయం అయ్యిందేగాని నశించలేదు, కోరిక నశించదు. ఇంకో కోరిక గామారితీరుతుంది. ఇలా నశించని "ఆత్మాశ్రయ కోరిక"నే "నార్సిసిజం" అంటారు. నార్సిసిస్టులు తమనితామే లైంగిక పదార్థాలుగా భావించుకుంటారు. అతను ప్రేమించిన ఒక అమ్మాయి తనను "కాదు" అన్నప్పుడు, ఆ అమ్మాయి చుట్టూ పరిభ్రమించిన అతని కోరిక వెనక్కిమరలి వచ్చి అతని ఆత్మ—లేక "అహం" [Ego]ను ఆశ్రయిస్తుంది. అప్పుడా భగ్నప్రేమికుడు తననితాను ఆ అమ్మాయిగా భావించుకుంటాడు. ఆ అమ్మాయిలానే ప్రవర్తిస్తాడు. క్రమగా అతని భావాలూ, చేష్టలూ ఆవిడకు సంబంధించినవిగా మారిపోతాయి. మానసికంగా స్త్రీత్వాన్ని పొందుతాడతను.

నగ్నంగా అద్దం ముందు నిలబడితే, అందులో అతని పురు రూపం కనిపిస్తుంది. నగ్నంగా వున్న పురుషుణ్ణి చూసినప్పుడు స్త్రీలో ఎలాంటి భావాలు కలుగుతాయో అవే అతనిలోనూ కలుగుతాయి.

31)

ఇంక, ఆ పురుషరూపం తనను రమిస్తున్నట్లు ఊహించు కొంటూ, నీరసం వొచ్చేవరకూ హస్త ప్రయోగం చేసు కుంటాడు.

ఇదీ ఆత్మాశ్రయ (Norcississtic) కోరికలువున్న వికారులు చేసుకునే పని!

## మానసిక నపుంసకతకు కారణం

Manus అంటే హస్తం. హస్తంతో చేసే మైథునాన్ని Masturabtion [హస్తమైథునం లేక ముష్టిమైథునం] అంటారు.

ఆడవాళ్ళు ఆడవాళ్ళతోటీ, మగవాళ్ళు మగవాళ్ళతోటీ పెంచుకునే లైంగిక సంబంధాలు హోమోసెక్సువాలిటీ [స్వలింగ కాముకత] అనబడతాయి.

మనుషుల్లో కొందరు "ఆత్మాశాపరులైన అసమర్థులు" కృత్రిమపద్ధతులకు లొంగిపోయి అసహజ సంబంధాలను పెంచు కుంటుంటారు. ఇందుకు కారణం ఇదమిత్థంగా తెలీదు. అందుకు శారీరికంగానూ, రాసాయనికంగానూ కలిగే మార్పులేవిటో కూడా తెలీదు.

దీన్ని మానసిక నపుంసకతగా భావించుకోవడానికి ఎటువంటి అభ్యంతరమూ వుండదు.

ఈ నపుంసకతకు కారణం, స్త్రీ పురుష సంబంధమైన, యీస్ట్రోజన్, యాండ్రోజన్ హార్మోనుల స్రావంలో "బాలెన్స్" తప్పడంవలన జరుగుతోందని పూర్వం భావించుకొనే వారు. కాని, ఆ తరువాతి పరిశోధనలు ఈ వాదాన్ని కొట్టి పారేశాయి.

స్త్రీ పురుషుడినీ, పురుషుడు స్త్రీనీ ప్రేమించగలగడాన్ని "హెటరో సెక్సు వాలిటీ" అంటారు. అంతర్గతంగా హెటరో సెక్సు

వల్స్ కూ, హోమో సెక్సు వల్స్ కూ తేగాలేదని కూడా అను కోవడం జరిగింది.

అయితే, స్త్రీ రూపంవున్న ఒకనపుంసకుణ్ణి పరిశీలించి నప్పుడు, స్త్రీకి సంబంధించిన ఒక "క్రోమోజోము" అతనిలో ఎక్కువ వున్నట్లు తేలింది. అందువలన శారీరిక నపుంసకత అతనికి సిద్ధించింది.

కాని, హోమో సెక్సువాలిటీకి ఇది ఎంత మాత్రమూ నిరూపణ కాదు. అది కేవలం నరాల బలహీనతే నంటారు చాలామంది!

జంతువులపైన జరిగిన పరిశోధనలలో ఇటీవల మరికొన్ని కొత్త విషయాలు బయల్పడ్డాయి.

ప్రతి జంతువులోనూ స్త్రీత్వం, పురుషత్వం రెండూ వుంటాయి. ఆరెంటిలోనూ స్త్రీత్వం ఎక్కువవున్న జంతువు ఆడది. పురుషత్వం ఎక్కువవున్న జంతువు మగది. దీన్ని Sexual response patterns (లైంగిక ఆచరణలు—) అన్నారు.

పురుషత్వానికి సంబంధించిన ఆచరణని "నియామక" [Mounting] అనీ, స్త్రీత్వానికి సంబంధించిన ఆచరణని నియమిత [Mounted] అనీ పిలుస్తారు.

పురుష జంతువులలో "ఈస్ట్రోజను" అనే హార్మోను వుంటుంది. దాని వలన నియామక ఆచరణలు వెలుగొందుతాయి. స్త్రీలలో "యాండ్రోజను" స్రావాల వలన నియమిత ఆచరణలు వృద్ధినొందుతాయి.

పురుష జంతువులలో "నియమిత" (స్త్రీ సంబంధిత) ఆచరణలు అణిగి ఉంటాయి. స్త్రీ జంతువులలో నియామక (పురుష సంబంధిత) ఆచరణలు అణిగి ఉంటాయి.

ఇలా అణిగివున్న ఆచరణలు కొన్ని సందర్భాలలో తిరిగి తలఎత్తేందుకూ అవకాశం లేకపోలేదు. ఎప్పుడో, పరిస్థితులు అనుకూలించినప్పుడు పురుషుడిలో స్త్రీత్వం కూడా తలెత్తే దుర్దశ వస్తుంది. అలాగే స్త్రీ జంతువులలో మగతనం పుట్టుకు రావచ్చు.

ఇది కూడా మానవజాతిలో సంభవమేనని ఒక వాదన వుంది. అయితే, అది ఏపాటి స్థాయిలో వుంటుందన్న విషయంమీద ఇంకా నిర్ధారణ జరగలేదు.

ఇది జరిగితే మనిషి నపుంసకతను జయించినవాడే కాగలడు!

## హస్తప్రయోగులను గుర్తించడం ఎలా?

ఆధునిక పరిశోధనలు హస్తప్రయోగం చేసుకునే వాళ్ళను గుర్తించడానికి కొన్ని సాధారణ లక్షణాలు సేకరించగలిగాయి.

కంటి చుట్టూ నల్లగా వుండడం, మనిషి నీరసంగా వుండడం, ఏపని పట్లా శ్రద్ధ, ఉత్సాహం ప్రదర్శించలేక పోవడం, ఒంటరిగా వుండేందుకు ప్రయత్నించడం, ఎప్పుడూ స్త్రీల గురించి, సెక్సు గురించి అధికంగా సంభాషించడం, తన అవయవం చాలా పొడవైనదని సందర్భం లేకపోయినా ప్రకటిస్తుండడం, అదే పనిగా స్త్రీ సంబంధమైన ఆలోచనలు, చీటికీ మాటికీ అంగస్తంభనం కలగడం, కలిగినా ఎక్కువసేపు నిలిచి వుండక పోవడం వంటివి మగవాళ్ళలో మనం గమనించవచ్చు.

లైంగిక వికారాలున్న ఆడవాళ్ళు సాధారణంగా చాలా అందంగా వుంటారు. "సెక్సువల్ షైనెస్" అనేది అసలే వుండదు. పర పురుషుల ముందు సిగ్గు లేకుండా ప్రవర్తించే ఆడవాళ్ళు సాధారణంగా హోమో సెక్సువాలిటీకి అలవడి వుంటారన్నది పాశ్చాత్యులు నిర్ధయించిన విషయమే!

పూసుకుతిరగడం వలన పురుషులను ఆకర్షిస్తున్నామని కొంద రాడవాళ్ళు భ్రమిస్తుంటారు. సిగ్గు విడిచి ప్రవర్తించే అమ్మాయిల పైన కాముక భావమే కలుగుతుందిగాని, ప్రేమ, గౌరవం అనేవి పొరబాటున కూడా కలగవ్. స్త్రీ గౌరవాన్ని సాధించే ఈ ఉద్యమంలో స్త్రీలు తమకు తామే గౌరవించుకునేట్లు ప్రవర్తించాలి గదా....!

## ఆడవాళ్ళూ — హస్తప్రయోగం

హస్తప్రయోగం అనేది విశ్వవ్యాపితం. ఆడవాళ్ళంటే హస్తప్రయోగానికి మరో పేరు— అన్నంతగా వాళ్ళు దీనికి ప్రచారం చేసి పెట్టారట పూర్వం.

ఒరిస్సాలో ఆడవాళ్ళు మగవాళ్ళకు హస్తప్రయోగం చేసి పెడతారని ఎల్లిస్ వ్రాశాడు.

జపాను స్త్రీలు హస్తప్రయోగాన్ని సుకరం చేసుకోవ డానికి, యంత్రాలను కూడా ఉపయోగించేవారని తెలుస్తోంది. జపాను తరుణీ మండలి మందపాటి కంచు కడ్డీలను యోని మార్గంలోకి చొప్పించి వదిలేస్తారట. శరీరంలోని నాడీస్పందవల వలన ఈ కడ్డీలు కూడా వాటంతట అవే కదలి స్త్రీకి తృప్తి నిస్తాయట!

హవాయి దేశపు పురాణంలో దేవతా స్త్రీలకు గర్భం— ఎలా వచ్చిందంటే, దేవతలు తమ దుస్తుల అడుగున అరటిపళ్ళు పెట్టు కోవడం చేత.... అని వ్రాయబడి వున్నదట. టర్కీ, ఈజిప్ట్‌లలో ఇప్పటికీ అరటిపళ్ళ వాడుక ఉంది. అరేబియన్ నైట్స్‌లో ఒక పద్యం ఇలా వుంది....

ఓ అరటి పళ్ళూ....
చక్కటి వల్చటి మెత్తటి చర్మం మీకే వుంది,

కన్నెపిల్ల కళ్ళు తెరిపించేది మీరే కదూ....!
వళ్ళల్లోకెల్లా కరుణ హృదయిం మీకే వుంది.
విధవలకూ, విడాకులిచ్చిన అమ్మాయిలకూ దిక్కు మీరే కదూ!!

వాత్స్యాయనుడు ఆడవాళ్ళ హోమో సెక్సువాలిటీ గురించి వ్రాస్తూ, ధాత్రేయికల (చెలికత్తె లేకదాసి) చేత పురుషుడి వేషం వేయించి, పురుషావయవం బోలిన అపద్రవ్యాలతోటీ, కంద మూలాలతోటీ రమింపచేసి. "ఆత్మాభిప్రాయ నివృత్తి" [Sexual satisfaction] పొందేవారని వ్రాశాడు. *

దీనికి వ్యాఖ్య వ్రాశిన జయమంగళుడు అపద్రవ్యాలంటే, బంగాళా దుంపలు, అరటి, తాడి, మొగలి, వంగ, దోస మొదలైన కందమూలాలని వివరించాడు. ఈ స్త్రీలకు ఇంకా కోరిక తీరక పోతే, పురుష రూపం వున్న ఆడవాళ్ళతోటే రమించమన్నాడు.

పూర్వం కొంత మంది "కృపాసీలు" లైన రాజులు కామాతురులైన అంతఃపుర స్త్రీల నందరినీ ఒకేసారి తృప్తిపరిచే ఓపిక లేక, కటి ప్రవేశంలో కృత్రిమ సాధనాలు కట్టుకొని తృప్తి పరచేవారట.

అలాగే పురుషుల హస్తప్రయోగం గురించి చెబుతూ, స్త్రీ సంయోగావకాశం దొరకని అబ్బాయిలు వియోనులలోనూ, పశువుల యోనులలోనూ, యోని ఆకృతి పోలిన ఇతర వస్తువుల లోనూ "ఉపమర్దనం" చేసుకొంటే అభిప్రాయ నివృత్తి అవుతుందంటూ, ఆకాలం నాటి ఆచారాన్ని "రికార్డ్" చేశాడు వాత్స్యాయనుడు.

---

సూ॥ ధాత్రేయికాం సఖీం దాసీం వా పురుష వదలు కృత్య
ఆకృతి సంయుక్తైః కందమూల ఫలావయ వైర్వా
ఆత్మాభిప్రాయం నివర్తయేయుః

## ఇద్దరాడవాళ్ళు రమిస్తే?

ఆడవాళ్ళు ఇద్దరు కలిసి సంయోగానికి తలపడడం అసాధారణమైన విషయం కాదు. కలిసి పడుకోవడం, కావులించుకోవడం, ముద్దిడుకోవడం దగ్గర్నించీ అంతా మామూలే. ఇది ఆడవాళ్ళ హాస్టళ్ళలోనే కాదు, సర్వత్రా వ్యాపించి వున్న కక్కుర్తి!

వీళ్ళను "లైయింగ్ స్వాన్స్" అంటారు. ఈ పనిని "ట్రైబాడిజం" అనీ, "కన్నిలింక్టస్" పనులనీ అంటారు. ఇదొక రకం "ఇన్వర్షన్". ఈ వికారం వున్న ఆడవాళ్ళు అందమైన ఆడపిల్లల్ని పెళ్ళిచేసుకున్న సంఘటనలుకూడా చరిత్రలో వున్నాయి.

కృత్రిమ అవయవాలతో ఆడవాళ్ళూ ఆడవాళ్ళూ రమించడానికి జర్మనీ అనేక సదుపాయాలు చేసింది. 18వ శతాబ్దంలో "మార్గరీతా లింకెన్" అనే జర్మన్ స్త్రీ దాదాపు వందమంది ఆడవాళ్ళను పెళ్ళి చేసుకుందట.

మన దేశంలో ఆడవాళ్ళను పెళ్ళి చేసుకున్న "అమ్మల్ని" హోమో సెక్సువాలిటీకి పాల్పడే బాబాల్ని మనం ప్రత్యక్షంగా చూస్తున్నాం. ఈవికారం తరాల పూర్వం నాటిది. దీనికి అంతంలేదు.

ఇద్దరాడవాళ్ళు రమించకూడనితే ఏమౌతుందో ఏనాడో ఆయుర్వేదం వ్రాసింది. కామాతురులైన స్త్రీలు సంగమించకూడనితే,

ఇద్దరూ పరస్పరం శుక్రం విసర్జించుకొని, ఆ శుక్రం తమ శోణితంతో కలిసి ఎముకలు లేని పిండం ఏర్పడుతుంది...." అని సుశ్రుతుడు వివరించాడు. *

ఈ రకం పిండాన్ని "హైడాటిడీ మోల్" అంటారు. అయితే, ఇలాంటి సంఘటనలు చాలా అరుదు. ఇటీవలి కాలంలో జరిగిన దాఖలాలు లేవు. కాని, ఈ అలవాటు మాత్రం పెరిగిందే గాని, తరగలేదు.

స్త్రీ స్వలింగ కాముకులు పురుషత్వాన్ని ప్రదర్శిస్తుంటారు. వీళ్ళ రూపు రేఖా విలాసాలలో కూడా పురుషత్వం కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. వీళ్ళను "పోటా" అని, "Butch" అనీ పిలుస్తారు.

వీళ్ళు తమ వంటి స్వలింగ కాముక భావాలున్న స్త్రీలనే [Femmes] సాధారణంగా ఎంచుకుంటారు. ఇది మనోవికారమైతే దీనికి మానసిక చికిత్స చేయువచ్చు.

కోరికతీరే మార్గం వేరే లేక, మనసులో వేగాన్ని తట్టుకోలేక, నిగ్రహించుకోలేక ఆడవాళ్ళుగానీ మగవాళ్ళుగాని, ఈ స్వలింగ కాముకతకు తలబడితే అది చట్ట వ్యతిరేకతగా చాలా దేశాలు ప్రకటించాయి.

సోవియట్ క్రిమినల్‌కోడ్ ప్రకారం స్వలింగ కాముకులకు 5 సంవత్సరాల కఠినకారాగార శిక్ష పడేందుకు అవకాశాలున్నాయి.

---

* "యదానార్యావుపే యాతాం వృష స్యన్తౌ కథన్చన
మృన్చన్తౌ శుక్ర మన్యోన్య మన స్థి స్తత్ర జాయతే"

## జంతువులలో హస్త ప్రయోగం

వంటరిగా వున్నప్పుడు మనిషికే కాదు, జంతువులకూ మనసు వక్రంగా ఆలోచిస్తుంటుంది.

సోమరితనంతో. ఏపనీలేకుండా తిరిగే గుర్రానికి తరచూ అంగస్తంభనం జరిగి, అకారణంగా అతిగా స్ఖలిస్తూ వుంటుంది. ఈ అతి స్ఖలనంవలన నీరసపడిన గుర్రం మరింత సోమరితనాన్ని పెంచుకొంటుంది.

జంతువుల్లో కూడా హస్త ప్రయోగం అలవాటుంది. కొన్నింటి అలవాట్లు నవ్వు తెప్పిస్తాయి.

వెనక కాళ్ళమీద నిలబడి, ముందరికాళ్ళతో మరో జంతువును కావలించుకొని లైంగికోద్రేకాన్ని అణుచుకొనే పశువులు తరచూ కనిపిస్తూనే వుంటాయి. వాటికి ఆడామగా తేడాగాని, తనజాతి పశువు అవునా కాదా అనేవిచక్షణగానిలేదు. సోమరి తనం వలన పెరిగిన "మదం" ఇందుకు కారణం. ఎదుటి జంతువు జఘనానికి తన అవయవాన్ని ఆన్చి రుద్దుకోవడం మొదలు పెడతాయి.

శునకాలకు మైలురాళ్ళు మిత్రులు. మేకలకు ఇంకా విచిత్రమైన శక్తి వుంది. తమ అవయవాన్ని అవి నోటితో తమంత తామే అందుకోగలవు. తద్వారా స్తంభించిన అవయవాన్ని ఔపరిష్టకం ద్వారా తృప్తి పరచుకోగలవు. దీన్ని "ఆటో ఫెల్లేషియో" అంటారు. ఈ శక్తిలేనందుకు బాధపడే మగవాళ్ళు చాలామంది వున్నారు మనలో!

కొన్ని జంతువులు భాగస్వామి దొరకనప్పుడు, అవయ వాన్ని చెట్లకేసి రుద్దుకొంటాయి. ఒంటెలూ, మేకలూ ఈ ఆచారాన్ని పాటిస్తున్నాయి.

ఏనుగు వెనక కాళ్ళు రెండింటి మధ్యా అవయవాన్ని చేర్చి నొక్కుకొంటూ నృత్యం చేస్తుంది.

అనంతమైన లైంగిక స్వేచ్ఛ కలిగినప్పటికీ కోతులకూ హస్త ప్రయోగం అలవాటుంది. ఆడకోతులు బ్రహ్మచర్యం గురించి పట్టించుకోవు. మగకోతులు కొంత వయసొచ్చేవరకూ విధిగా బ్రహ్మచర్యాన్ని పాటిస్తాయని పరిశీలకులు చెప్తోన్నారు. ఈకాలంలో బ్రహ్మచర్యాన్ని పాటించే ఘోటక బ్రహ్మచారులైన కోతిరాయుళ్లు ముందరి చేతుల్నే ఉపయోగించి ముష్టిమైథునానికి తలపడతాయి. అంటే, ఈ జాడ్యం, మనకు మన కోతి తాతల నుంచే సంక్రమించిందని, ఇవాళ్టికివ్వేళ పుట్టింది కాదనీ అనుకోవచ్చు. ఇంకా చెప్పాలంటే, మనిషిని చూసి కోతులు మాత్రం మొదలు పెట్టలేదు.

అంతేకాదు, జంతువులలో స్వలింగ కాముకత [Homo-sexuality] కూడా అత్యంత సాధారణమైన విషయము!

మగజాతికి చెందిన ఒకరకం చేప (Stickle Back Fish) ఆడచేపతో మగగానూ, మగచేపతో ఆడగానూ సంభోగంలో పాల్గొని సుఖించగలదట.

తన కంటే బలమైన బల్లులు బలవంతం చేస్తే బలహీనమైన బల్లి స్వలింగకాముకతకు బలై పోక తప్పదని ఒక పరిశీలన!

కోడి పుంజులు తరచూ స్వలింగ కాముకతకు పాల్పడతాయని ఆధునికులు గమనించారు.

ఆవులలోనూ, కుక్కలలోనూ, కుందేళ్ళలోనూ, సింహాలలో కూడా ఈ స్వలింగ కాముకత వున్నదట.

ఈ విధంగా మానసికంగా సంతరించుకోబడిన రకరకాల వికారాలు సమాజంలో విచ్చలవిడిగా వెదజల్ల బడ్డాయి. పురుషుడిలా చలామణి అయ్యేనపుంసకులెంతమందో మన మధ్య సంచరిస్తున్నారు. మనోనపుంసకుల్ని చూడగానే గుర్తించడం అందరికీ సాధ్యంకాదు. ఈ అజ్ఞాత నపుంసకులే తమ వికారాల్ని అంటు వ్యాధుల్లా ప్రజానీకానికి అంటగడ్తున్నారు. వీళ్ళు అంటించే పరమ తుచ్ఛమైన అలవాట్లలో హస్త ప్రయోగం ముఖ్యమైంది. చాలామందికి ఇది కేవలం అలవాటే! కొందరికి అది మనోవికారం.

కిన్సే అంటాడు - మనుషుల్లో ప్రతి అయిదుగురిలోనూ ముగ్గురు హస్త ప్రయోగానికి అలవాటు పడ్డ వాళ్ళేనని!

మరి ఈ వికారం ఇంతలా చొచ్చుకురావడానికి కారణం ఏమిటో అర్ధంకాదు. దానికి తోడు. ఆధునిక వైద్యులు శుక్రనష్టం వలన శరీరానికి ఏ అవలక్షణంలేదని, పరోక్షంగా ఈ దురలవాటును ప్రోత్సహిస్తున్నారు. ఇంతకుమించిన దౌర్భాగ్యం విజ్ఞాన శాస్త్రానికి వేరేలేదు.

## జంతువులతో శృంగారం

రోడ్డుమీద రెండు కుక్కలు సంభోగిస్తుంటే చిన్నపిల్లలు చూసి వినోదిస్తుంటారు. కాస్తవయసొచ్చిన పిల్లలకైతే, ఈ దృశ్యాన్ని చూసేసరికి లైంగికోత్తేజం కలుగుతుంది. కన్నెపిల్లలకు విరహం కూడా కలగవచ్చు.

దీనిని హావెలాక్ ఎల్లీస్ "మిక్సోస్కోపిక్ జూఫిలియా—" అన్నాడు. లాటిన్ భాషలో "జూఫిలియా ఎరోటికా" అంటారు.

ఒక పశువైద్యుడు పశుగుదమార్గంలోకి చేతిని పోనిచ్చి పరీక్షిస్తుంటే, చూసిన ఓ అల్పసంతోషి వెంటనే లైంగికోత్తేజనాన్ని పొంది రోజూ అదే కలలుకనడం మొదలు పెట్టాడట.

చాలామంది అమాయకులూ, అనాగరికులూ, సంస్కారహీనులూ ఈ జూఫిలియా అనే నపుంసక భావాన్ని కలిగినవారే! పెద్ద పెద్ద ఆఫీసర్ల సుందరాంగులైన భార్యలు యీ ఆచారాన్ని పాటించే వాళ్ళలో ముఖ్యులు. పెంపుడు కుక్కల అవశ్యకత వాళ్ళకు తెలిసినంతగా మరెవరికీ తెలీదు.

ఆ మధ్య బందరులో ఓకాలేజి విద్యార్థి. పాలిచ్చే గేదెని ఓ అర్ధరాత్రి సమయంలో చెరిచే ప్రయత్నాలు చేసే సరికి, అది మళ్ళీ రెండేళ్ళు వరకూ పాలీయడం మాగివేసింది. మనషులకు లేకపోయినా సిగ్గు గేదెల కుంటుంది!

## హస్త ప్రయోగ వ్యాధిని రూపుమాపగలమా?

సైకో ఎనలిస్టులదగ్గర్నుంచీ రకరకాల మనోవేత్తలు రకరకాల పద్ధతులను ప్రయోగించి హోమోసెక్సువాలిటీకి అలవడ్డ వ్యక్తుల్ని చికిత్సించసాగారు. కాని, ఒక్కటీ పూర్తి సత్ఫలితాన్నీయలేదు.

"మోల్" అనేపండితుడు "నిజమైన ప్లేటోనిక్ సంబంధాలను పెంచుకుంటేనే "హస్త ప్రయోగం" అనే వ్యాధి నయమౌతుంది. ఇది మనో బలహీనతవలన జనిస్తుంది. స్థిరమైన భావాలనూ, స్థిరమైన కోర్కెలనూ కలిగి వున్నవాడే ప్లేటోనిక్ స్నేహానికి అర్హుడు. కాబట్టి అతను జన్మలో ఎటువంటి వికారాలూ పొందలేడు. ఆస్థితికి మనం ఎదగాలి" అన్నాడు.

ఇవ్వాళ 90 శాతం యువతీయువకుల్లో యీ జబ్బు పేరుకు పోయిందంటే ఎంతమంది బలహీనులు మన కళ్ళ ముందు పుట్టి పెరుగుతూ హస్త ప్రయోగ వ్యాధితో బాధపడ్తున్నారో చూడండి! ఇంతకంటే దౌర్భాగ్యం వుందా?

ఒక స్త్రీ మూర్తి తను 14 రకాలుగా హస్త ప్రయోగాన్ని అభ్యసించగలనని చెబుతూ, "పిన్టన్" అనేచెట్టు ఆకుల్ని యోని పైన రుద్దితే విపరీతమైన వేడిపుడుతుందనీ, ఆ వేడివలన అనంతమైన లైంగికానందం కలుగుతుందనీ చెప్పినట్లు హావెలాక్ ఎల్లీస్ వ్రాశాడు.

ఐదవ సంవత్సరంతో హస్త ప్రయోగం అనే జాడ్యం ప్రారంభం అవుతుంది వత్సాలుగేళ్ళొచ్చేసరికి శుక్రధాతువు స్రవించడం ప్రారంభం అయ్యాక ఇంకా పెరుగుతుంది.

అయితే, హస్త ప్రయోగపు అలవాటున్న యువకులందరినీ మనో వికారులుగానే జమకట్ట కూడదు.

వాళ్ళ మనసులో ఉదయించిన కోరికలను తీర్చుకునేందుకు సామాజిక వ్యవస్థ అంగీకరించదు కాబట్టి, వాళ్ళీ సమాజాన్ని ఎదిరించగలిగే శక్తివున్న వాళ్ళు కాదు కాబట్టి. ఆ మనసులోని కోరికే వాళ్ళను ఈ పెడమార్గాన్ని పట్టిస్తుంది.

అందుకు పెద్దలు చేయవలసింది, చేయగలిగింది ఒక్కటే—

సాధ్యమైనంతవరకూ వాళ్ళను ఒంటరిగా వుండనీయకండి మానసికంగా వుల్లాసంగా వుండేందుకు వాళ్ళను Extracurricular Activitiesలలో పాల్గొనేట్లు చెయ్యండి.

# 3. నపుంసకుల మనోభావాలు

ఎవడికైతే సహజమైన భావం కలగదో, వాడు మానసిక నపుంసకుడు. అవసరం వచ్చినప్పుడు ఆవేశం [Orgasm] కలగక పోతే, కృత్రిమంగా, అసహజ మార్గాల ద్వారా "భావాన్ని" కొని తెచ్చుకొని, అప్పటికి ఓపిక ఇంకా మిగిలివుంటే, అప్పుడు "రతి" కుపక్రమిస్తాడు మానసిక నపుంసకుడు.

నపుంసకుల జననానికి తలిదండ్రులదే పూర్తి బాధ్యత. అల్పవీర్యులకు పుట్టే పిల్లలు, షండులుగానూ, శుక్రహీనులుగానూ, అల్పరేతస్కులుగానూ జన్మిస్తారు.

పుట్టినప్పుడు బలమైన మనసే వున్నా పిల్లలు పెరిగే వాతావరణం కూడా వాళ్ళను మనోనపుంసకులుగా మార్చే ప్రమాదం వుంది. తలిదండ్రులే ఈ ప్రమాదాన్ని నివారించాలి.

"మంద, అల్పబీజాలు" కలిగిన స్త్రీ పురుషులు అహర్షంతో - బలమైన కోరిక లేకుండా — రతికి తలపడితే పురుష, స్త్రీ షండ సంతానం కలుగుతుంది. ఈ దుర్లక్షణాన్ని 'క్లీబత' అంటారు" అని చరకుడు శారీరికంగా, పైకి నపుంసకుడిలా కనిపించే షండుల గురించి చెప్పాడు. *

ఈ షండులలో పురుష రూపం వున్న వ్యక్తిని షండుడనీ, స్త్రీ రూపం వున్న వ్యక్తిని షణ్డ అనీ పిలుస్తారు.

---

* మన్దాల్ప బీజావబలావహర్షయి క్లీబౌచ హేతుర్వికృతి ద్వయస్య।
క్లీబావితి దుష్ట బీజౌ, హేతుర్వికృతి ద్వయశ్చేతి।
(చ.శా.అ.)।

సంభోగ విధిలో, పురుషుడికిపైన స్త్రీ వరుండి రతికి తలబడడాన్ని (ఉపరి సురతం) ఆయుర్వేద శాస్త్రజ్ఞులు అంగీకరించరు. అందువలన ఆ స్త్రీకి కలిగే సంతానం షండులయ్యే అవకాశం వున్నదని వాళ్ళ నమ్మకం. దీన్ని "వ్యత్యస్తరతి" అని కూడా అంటారు.

చరకుడు, ఈ దంపతులకు కలిగిన షండ సంతానం గురించి చెబుతూ, పురుషాకృతి వుండీ, పురుషుడుకాని బిడ్డని "తృణ పుత్రిక" అని పిలిచాడు.

మైథునంలో అసమర్థుణ్ణి నపుంసకుడనీ, అతని నపుంసకతను "క్లైబ్యం" అనీ అంటాం. ఇది శారీరికం, మానసికం అని రెండు రకాలు.

తన అధీనంలో వున్న స్త్రీయైనా సరే, సమీపించినప్పుడు "సంకల్పాం వికల్పం" చేసినవాడు మానసిక నపుంసకుడు.

వీళ్ళు మైథునానికి తలపడే సమయానికి ఆయాసం, దగ్గూ, ఒళ్ళంతా చెమటలూ, ఏర్పడి, మనిషి నిలువెల్లా వణికిపోతాడు. అంగ స్తంభనం అనేది జరగదు.

ఈ మనోనపుంసకులు చక్కటి వృష్యపదార్థాలు [Aphrodisiacs] సేవించడం వలన తిరిగి పుంసులవగలరని ఆయుర్వేదం అభయం ఇస్తోంది.

అనవసరంగా సెక్సు స్పెషలిస్టుల జోలికి పోవద్దు. ముందు గుండె ధైర్యం పెంచుకోవాలి.

## మానసిక నపుంసకుల జన్మవృత్తాంతం

తలిదండ్రులే బలమైన వీర్యం లేనివారైతే వారి సంతానం దేశానికి పనికొచ్చేదిగా ఎలా తయారౌతుందో ఆలోచించండి! ఈ అల్పవీర్యులకు పిల్లలను కనే హక్కు _తికంగా లేదు.

"వీర్యవంతులు కాని దంపతులకు పుట్టిన బిడ్డ "ఆసేక్య నపుంసకుడు" గా తయారౌతాడు. వీడు కేవలం మానసిక నపుంసకుడు మాత్రమే. పైకి మంచి వర్చస్సు కలిగి, చక్కటి రూపవిలాసాన్ని కలిగివుంటాడు. అయితే ఏం.... వీళ్ళ అసలు రహస్యం దాంపత్య జీవితంలోకి ప్రవేశిస్తేగాని బైట పడదు.

ఇలాంటి వ్యక్తికి పెళ్ళయితే. వేరే మగవాడు వచ్చి వీడి నోటిలో మైథునాన్ని [Fellatio] చేస్తేనేగాని, ఈ వ్యక్తికి "లింగోత్థాపన" కాదు. మన సమాజంలో పెద్ద పెద్ద గజిటెడ్ ఆఫీసర్లలో కూడా ఈబాపతు నపుంసకులున్నారనడానికి బలమైన సాక్ష్యాలున్నాయి.

వాత్స్యాయనుడు ఇలాంటి వ్యక్తులతో ఔపరిష్టకాదులు యధేచ్ఛగా సాగించమన్నాడు.

ముఖాన్ని యోనిగా చేసుకున్నవాడు కాబట్టి "ముఖయోని" అనే మరో పేరుంది మనోనపుంసకులకు.

శుక్రభక్షణం వీళ్ళకున్న అలవాటు. మరో పురుషుడికి నోటితోనో. చేతితోనో మైథునంచేసి ఫలితంగా పతనమైన శుక్రాన్ని పానం చేసాక, లింగోత్థాపన కలిగితే అప్పుడు స్త్రీ సంభోగానికి తయారౌతాడు.

అలాగే, రకరకాల సుఖవ్యాధులతో నిండిపోయి, కుళ్ళిపోయి, చీమూ నెత్తురూ పురుగులతో దుర్గంధయుక్తంగా వుండే యోనిలో జనించినవ్యక్తికూడా నిస్సందేహంగా నపుంసకుడౌతాడు. ఇతనికి తాను సంభోగించదలచిన స్త్రీ జననేంద్రియాన్ని ముందు వాసన చూస్తేగాని, లింగోత్థాపన జరగదు. ఈ వాసనచూసే అలవాటు చాలా మందిలో వుంటుంది. ఇదీ మానసిక నపుంసకతే; వీళ్ళని నాసాయోను అంటారు.

ఇలాంటి మరో రకం నపుంసకుడికి తన గుదమార్గంలో మైథునం చేయించుకొంటేనేగాని [Anal coitus] అవయవం స్తంభించదు. మనిషిలో ఇటువంటి దుర్బలత్వానికి మైథున కాలంలో తల్లి చేసే విపరీతాలూ, దానికి తోడు తండ్రి బీజదోషం కారణం అని ఆయుర్వేదీయులు చెప్తారు.

తనను రమిస్తున్న పురుషుడితో తృప్తిచెందని స్త్రీ పర పురుషుణ్ణి మనసులో స్మరించుకొంటూ సంభోగానికి తలపడితే, ఆమెకు ఇలాంటి నపుంసకులు జనించే ప్రమాదం వున్నదని కాస్యపుడు హెచ్చరించాడు. దీన్ని "వ్యవహితరాగం" అంటారు.

అందుకే కోరిక బలంగా వుండాలి. ప్రేమ స్థిరంగా వుండాలి. అదిలేని దంపతులు దేశానికి పనికొచ్చే సంతానాన్ని ప్రసాదించలేరు!

తలిదండ్రుల శుక్రార్తవాలు బలమైనవి కానప్పుడు, వాళ్ళకు పుట్టే సంతానం— "ఈర్ష్యారతి" అనబడే ఒక రకం మనోనపుంసకు లయ్యేందుకు అవకాశం వుంది.

స్త్రీలను నగ్నంగా నిలబెట్టి కొంతసేపు అలా చూస్తుంటేనే గాని వీళ్ళకు అంగజం, ఆవేశం రావు. చాలామంది ఈ వికారం వున్న వ్యక్తులు తామ ఎదురు డబ్బిచ్చి తనకు నచ్చిన స్త్రీని రమించమని "కిరాయి విటుల్ని" నియమించి వాళ్ళ రతిక్రీడను చూసి వినోదిస్తుంటారు. *

---

* "దృష్ట్వా వ్యవాయ మన్యేషాం వ్యవాయేయః
ప్రవర్తతే ఈర్ష్యకస్స తు విజ్ఞేయః"

(సు. శా. అ. 2)

ఇతరుల రతిక్రీడను చూసి వినోదిస్తేనే వీళ్ళకు లింగోత్థాపన కలుగుతుంది.

అన్యమైథున దర్శనానంతరం అంగస్తంభనం కలిగి మైథునంలో ప్రవర్తించేవాణ్ణి ఈర్ష్యక నపుంసకుడు అని పిలుస్తారని సుశ్రుతుడు పేర్కొన్నాడు. వీడికి నేత్రయోని, దృగ్యోని అని పేర్లున్నాయి.

ఇది "Voyeurism" [ఈర్ష్యారతి] అనే మనోవికారం.

ఇవ్వాళ పాశ్చాత్య దేశాలలో విపరీతంగా వ్యాపించిన ప్రసిద్ధ మనోవికారం ఇది. టీ.వీలలో రతిక్రీడల్ని చూసాక అవయవం స్తంభించాక స్త్రీని కలిసే ఆచారం ఎక్కువగా వున్నదక్కడ!

## శుక్రం ఎందుకు క్షీణిస్తుంది?

అధికంగా పరిశ్రమించడం శుక్రధాతువు నష్టపోయేందుకు ప్రధాన కారణం. శ్రమకు తగ్గ పోషణ లేకపోతే ధాతుక్షయం ఏర్పడుతుంది.

శుక్రధాతువు క్షయించడం అంటే శరీరంలో సారమైన భాగం లోపిస్తోందని అర్థం. ఇది నిరూపితం కావాలంటే, మన ఆలోచనలు ప్రయోగశాలలోంచి జీవితంలోకి రావాలి.

అధికంగా స్త్రీ సంగమం మనిషికి ఇరవైలో అరవైని చూపిస్తుంది. మన శరీరానికి సరిపడని పదార్థాలను తీసుకోవడం, మనకు "ఎలర్జీ" వున్న గాలులనూ, శబ్దాలనూ గ్రహించడం.... ఇవి కూడా శుక్రధాతువును నష్టపరుస్తాయి. అకాల మైథునం శుక్ర క్షయకరాలలో ఒకటిగా ఆయుర్వేదం చెప్తోంది. అలాగని, మైథున

వర్జనం పూర్తిగా పాటించినా శుక్రధాతువు నష్టపడుతుంది. కఠిన పదార్థాలూ, ఎండి శుష్కించిన పదార్థాలూ శుక్రధాతువును లోపింపచేస్తాయి. ఉప్పు, కారం, చేదు, వగరూ అయిన ఆహారాన్ని అధికంగా సేవించకూడదు.

స్పెర్మటూరియా (శుక్రమేహం) అనే వ్యాధిలో శుక్రం [Semen] మూత్రంతో కలిసి విసర్జించబడుతుంది. ఈ వ్యాధిలో ఈ శుక్రధాతు నష్టలక్షణాలన్నీ స్పష్టంగా కనిపిస్తాయి.

వృద్ధులకు సహజంగానే శుక్రధాతువు క్షీణించి వుంటుంది. అది వ్యాధి విశేషంగా ఓ యువకుడికి సంభవిస్తే అతనిలో వృద్ధుడి మనోభావాలన్నీ ప్రతిబింబిస్తాయి. ఇది పరిశీలకులు గుర్తించ వలసిన విషయం.

దుఃఖభాజనుడూ, సమస్యలతో సతమతమయ్యేవాడు, నిద్రలేనివాడు, ఒళ్ళు కాలినవాడు, గాయాలు తగిలినవాడు, పిరికివాడూ, కోపిష్ఠి, అనుమాన పిశాచీ, నిరంతర రోగపీడితుడూ, విరేచన వ్యాధి కలిగినవాడూ, సక్రమంగా మలమూత్రాది వేగాల్ని విసర్జించకుండా వాయిదావేసేవాడు....వీళ్ళంతా శుక్రధాతువును నష్టపోయే వాళ్ళని ఆయుర్వేదం స్పష్టం చేసింది.

## నపుంసకులు బారుగా వుంటారు

వస్తి (Pubes) ప్రాంతంలో రోమాలు పెరగడం మనిషి యవ్వనంలోకి వచ్చారనడానికి గుర్తు. ఈ రోమాలు పెరిగే రూపం స్త్రీ పురుషులలో వేర్వేరుగా వుంటుంది. నపుంసకులలో అసలు పెరగవు. గొంతులో చాలా తేడా వుంటుంది. కొద్ది "జీర" గమనార్హం.

సాధారణంగా శారీరిక నపుంసకులు బారుగా వుంటారు. ఎక్కువ మంది దృఢ కాయులేకావడం గమనించవచ్చు. అందుకే. భారీ కాయాలను చూసి పుంసత్వాన్ని అంచనావేయకూడదు పొట్టి వాళ్ళలో లైంగిక వాంఛ బలీయంగా వుంటుంది. ముఖ్యంగా పొట్టిగా వున్న ఆడవాళ్ళకు సంభోగ వాంఛ ఎక్కువ. ప్రియుడి పట్ల మమతానురాగాలు ప్రదర్శించడంలో యీ పొట్టి ఆడవాళ్ళదే పై చేయి.

"మారో" అనే పండితుడు-అసూయా పరులైన ఆడవాళ్ళూ, వ్యభిచార భావాలున్న ఆడవాళ్ళూ ఎక్కువమంది పొట్టి వాళ్లే నంటాడు. యూరప్‌లోని గ్రామీణ జీవితాల్లో లావుపాటి వెడల్పయిన మెడవున్న "ఆడవాళ్ళు శృంగార భాండాలు"గా అభివర్ణింప బడతారు.

## నపుంసకతకు కారణాలు

ప్రతి వ్యక్తిలోనూ కోరికను కలిగింప చేసే ప్రేరకాలెలా వుంటాయో, కోరికను నశింప చేసే ప్రేరణలూ అలాగే వుంటాయి.

ఈ కోరికనాశక ప్రేరకాలు అప్పుడప్పుడూ, మనసు చంచలంగా వున్నప్పుడు తీవ్రంగా పని చేస్తాయి, అలాంటి సందర్భాలలో మనిషి నపుంసకుడిలా ప్రవర్తిస్తాడు.

తనంటే ఇష్టపడని స్త్రీ ప్రవర్తన—ఆమెను ప్రేమించే పురుషుడిలో నపుంసక భావాలను రేకెత్తింప చేస్తుంది.

కారం, పులుపు, ఉప్పు, వేడిచేసే పదార్థాలను ఎక్కువగా తింటుంటే శరీరంలో "సౌమ్యం"గా వుండే ధాతువులన్నీ దెబ్బ

తింటాయి. అందులో శుక్రధాతువు ఒకటి. శుక్రధాతువు లోపించడం వలన "క్లీబత్వం [నపుంసకత] కలుగుతుంది.

సంభోగ సామర్థ్యాన్ని పెంచే ఔషధాలు సేవించకుండా సంభోగానికి తలపడడం నపుంసకత్వానికి కారణంగా సుశ్రుతుడు పేర్కొన్నాడు. అందువలన శుక్రధాతువుక్షీణించి "ధ్వజభంగం" * అనబడే వ్యాధి కలుగుతుంది. పురుషావయవం స్తంభించే శక్తిని కోల్పోతుంది. దీన్ని "డిస్పెనూరియా" అనే వ్యాధిగా చెప్తారు. డిస్పెనూరియావలన సంభోగించే శక్తి కోల్పోతారు మనషులు.

"పుష్పవతి" కాని ఆడపిల్లలను రమించబూనడం [pedophilia], "యోని"లో కాకుండా ఇతర అపద్రవ్యాలలో మైథునం చేయుడం, దీర్ఘవ్యాధులతో బాధపడే స్త్రీలను రమించడం, అలాగే, చాలా సంవత్సరాల నుండీ మైథునాన్ని పొందని స్త్రీతో కలీడం, దుర్గంధం— చీమూ వగైరా వున్న యోనిలో సంభోగించడం, పశువుల యోనిలో కామకలాపాలు సాగించడం [Zoophelia] అవయవానికి అభిఘాతం కలగడం, సంభోగానంతరం జననేంద్రియాన్ని శుభ్రం చేసుకోక పోవడం, ముష్టి మైథునం, శుక్రాన్ని బయటకు రాకుండా నిరోధించాలని ప్రయత్నించడం వంటి అకృత్యాల వలన మనిషి నిస్పందేహంగా నపుంసకుడౌతాడు.

బలవంతంగా మనసును నిగ్రహించుకొని, కోరికని మాత్రం చంపుకోలేక నిత్యం మదన వేదనతో సతమతమయ్యే వ్యక్తులలో "శుక్రవేగధారణ" చేయడం వలన శుక్రం గడ్డగట్టిపోయి నపుంస

---

* శ్లో॥ అతివ్యవాయ శీలోయోనచ వాజీక్రియారతః।
ధ్వజభంగ మవాప్నోతి తచ్ఛుక్రక్షయ హేతుకమ్॥

కత్వం కలుగుతుంది. దీన్ని "ఖర శుక్ర క్లీబత్వం" అంటారు ఆయుర్వేదీయులు.

అసలు పుట్టిందగ్గర్నించీ పురుషత్వంలేని నపుంసకాగ్ని "సహజ క్లీబత్వం" అంటారు.

ఈ సహజమైన క్లీబత్వం, శుక్రవహ స్రోతస్సు [Spermatic card] గాయపడడం వగైరా జరిగినప్పుడు ఏర్పడే క్లీబత్వం— ఇవి రెండూ చికిత్సచేసినా తిరిగి వాళ్ళని పురుషుడిగా మార్చవీలులేనివి.

మిగతా అన్నిరకాలూ మానసిక నపుంసకులే. వీళ్ళను వాజీకర ఔషధాల్ని, ఆయుర్వేద రసాయనాల్ని సేవింపచేయడం, శుక్రధాతువును బలవత్తరమైనదిగా తయారుచేయడం వలన నపుంసకత్వాన్ని జయించ వచ్చని ఆయుర్వేదం సూచింస్తోంది!

## వియంతలలో నపుంసకత

వాత్స్యాయనుడు అసమర్థుల ఆలోచనా విధానం గురించి వ్రాస్తూ, అనేకమంది భార్యలున్న వ్యభిచారి కొంత కాలానికి సురతిలోని సున్నితమైన సుఖాన్ని పొందే అర్హతని కోల్పోతాడని చెప్పాడు.

షడ్రసాలతో రోజూ పుష్టికరమైన తిండి తింటున్నా, ఏసీ రూముల్లో కులుకుతున్నా, గంటకొకర్తె చొప్పున రకరకాల "రుచులు" చవిచూస్తోన్నా, రతిలో వున్న విస్రంభ సౌఖ్యం [Erotic plesure] వాళ్ళకు బొత్తిగా దొరకదు పొమ్మన్నాడు వాత్స్యాయనుడు.

సుఖానికి దూరమైన ఈ వ్యభిచార ఖార్జువాలు నిరంకుశంగా వ్యవవహరిస్తారు. నియంతల్లో వుండే కర్కశత్వం వాళ్ళలోని "నపుంసకత"గా వాత్స్యాయనుడు అభిప్రాయ పడ్డాడు.

కొందరు మనుషులకి తనంతవాడు లేడనే గర్వం విపరీతంగా ఉంటుంది. కాని, వీళ్ళు సాధించిన ఘనకార్యం మచ్చుకి ఒకటి కూడా కనిపించదు. నిజమైన అసమర్థుడు తన గురించి తాను అధికంగా అంచనా వేసుకోవడం మానస శాస్త్రరీత్యా ఒక మనో వికారం. దీన్ని "మెగలోమానియా" అంటారు. *

అంతా తనవలననే జరిగినట్టు, "కబుర్లు" చెప్తుంటారు. నిజానికి తానాపనిని చేయలేనన్న సంగతి అతనికి తెలుసు. కాని, తన అసమర్థతను కప్పిపుచ్చు కోవడానికి విశ్వప్రయత్నం చేస్తారు. సందర్భం లేకపోయినా కొందరు యువకులు తామనుభవించిన స్త్రీల సంఖ్యను ప్రకటిస్తుండడం ఇందుకుదాహరణ.

ఇలాంటి భావాల్ని "ఆమ్నిపొటెన్సీ ఆఫ్ థాట్స్" అంటారు. చీటికీ మాటికీ స్త్రీసంభోగాన్ని గురించే మాట్లాడుతూ, తన సామర్థ్యాన్ని అతిశయోక్తులతో నింపి కనిపించిన ప్రతివాడికీ "వినిపించే" వ్యక్తి నిజమైన నపుంసకుడని మనం నిర్ధారించవచ్చు. ఇది అసమర్థుడి ఆలోచనా విధానం [Omni potency of thought]

"టిల్లిచ్" అనే శాస్త్రజ్ఞుడు, తృష్టకీ, మనిషి కార్యసాధకతకూ చక్కటి సంబంధాన్ని నిరూపించాడు.

---

* 'Excessive over estimation of one's own importance, abilities etc .'

మనిషిలో తృష్ణని బట్టి అతని క్రియా సామర్థ్యం ఆధారపడి వుంటుంది. తృష్ణ [Anxiety] లేనిదే, క్రియా సామర్థ్యం [Vitality] లేదు.

ఇవి రెండూ విడదీయ వీలులేని సంబంధాన్ని కలిగి ఉంటాయి.

కాబట్టి, ఒక కార్యసాధకుడి కోర్కెలు కూడా గొప్పవిగానూ, తీవ్రంగానూ వుంటాయి.

కోరిక కలగాలంటే. ఆ పనిమీద లేక ఆ విషయం మీద అతనికి ప్రేమ— అభిమానం వుండాలి. మనం అభిమానించే ఒక విషయం మనకు సుఖానుభూతిని కలిగించేదైనప్పుడు దాన్ని సాధించాలని కోరిక మనకు తీవ్రంగా కలిగితేనే మనం ఆ కార్యాన్ని సాధించగలుగుతాం. ఇది కార్య సాధకులు అనుసరించే సూత్రం.

## అసమర్థులకు కోరిక ఎక్కువ

చింత, శోకం, క్రోధం, భయం, ఈర్ష్య, ఉత్కంఠ, ఇలాంటి మానసిక కారణాల వలన మనసు సంక్షోభం చెంది— చంచలత కలుగుతుంది.

శరీరం ఏకారణం చేతనైనా కృశించి పోయినప్పుడు రూక్షంగా వుండే పదార్థాలను ఎక్కువగా సేవించడం వలన మనిషి సంభోగ సామర్థ్యం కోల్పోతాడు.

అసలు పుట్టుకే బలహీనంగా వుండి, ఆ తర్వాత కూడా తిండి తిప్పలూ సరిగాలేని వ్యక్తులు నపుంసకులయ్యేందుకు అవకాశం ఉంది. వంటికి పడని పదార్థాలను బలవంతంగా భుజిస్తే సెక్సు సామర్థ్యం నశించి తీరుతుంది. దీనికి ఆయుర్వేద సిద్ధాంతం

చెప్తున్న కారణం ఇది:— మనం భుజించిన ఆహారం జీర్ణం అయినాక అందులో మలాలన్నీ విసర్జించబడి కేవలం "సారం" మిగులుతుంది. ఈ ఆహారసారాన్ని "రసధాతువు" అంటారు. ఇది రక్తగానూ, ఆ తర్వాత మాంసంగానూ, మేదస్సుగానూ, అస్థిగానూ, మజ్జగానూ చివరికి శుక్రధాతువుగానూ మార్పుచెందుతుంది.

పోషక ఆహారం లోపించడమో, మనసు క్షోభించడమో జరిగినప్పుడు రసధాతువు అనబడే ఆహారసారం కూడా క్షీణిస్తుంది.

రసధాతువు క్షీణించిందంటే, రక్తం నుంచి శుక్రధాతువు వరకూ అన్ని ధాతువులూ తగ్గిపోవడం ప్రారంభిస్తాయి. దీన్ని "అనులోమక్షయ" అంటారు.

శుక్రధాతువు క్షీణించిందగ్గర్నించీ మనిషిలో సంభోగ వాంఛ తీవ్రతరం అవుతుందని ఆయుర్వేద సిద్ధాంతం.

అసలే శుక్రక్షీణత కలిగిన వ్యక్తి అతిగా సంభోగంలో పాల్గొంటే, శుక్రం మరింత లోపించి ఆ వ్యక్తిని రోజు రోజుకీ బలహీనుణ్ణి చేస్తుంది. *

మానసికంగా చింతా శోక భయాదులు కలిగిన వ్యక్తులు శుక్రధాతువు నష్టపోయి లైంగిక వాంఛను విపరీతంగా పెంచుకుంటే అలాంటి పురుషుల మనోవికారాన్ని "సెటీరియాసిస్" అనీ, స్త్రీల మనోభావాల్ని "నింఫోమానియా" అనీ ఆధునికులు చెప్తారు.

ఈ మనోవికారులు, అంతంలేని సంఖ్యతో [Never ending number of partners] సంభోగాన్ని కోరుకొంటారు.

---

See చరకసంహిత చికిత్సాస్థానం అ. 30.

అసమర్ధత పెరిగినకొద్దీ అహం కూడా పెరుగుతుందన్న ఫ్రాయిడ్ సిద్ధాంతం ప్రకారం, ఈ అసమర్ధులు తన సమర్ధతను నిరూపించుకోవడానికా అన్నట్లు స్త్రీలను నిమిషానికొకరైను మారుస్తుంటారు.

కొంతమంది ఆడవాళ్ళు ఈ వ్యభిచారంలో తాము సుప్రసిద్ధులం అనిపించుకోవాలని మరీ అతిగా ప్రవర్తిస్తుంటారు. ఇలాంటి వ్యక్తులు డబ్బూ, వలుకుబడీ ఎక్కువగావున్న వాళ్ళలో, వున్న దేశాల్లో మనకు తరచూ కనిపిస్తుంటారు.

ఇంకొంతమంది స్త్రీలను ఎంత సమర్ధుడు సంభోగించినా తృప్తివుండదు. "ఇంకొక్కసారి" [One more time] అంటూనే వుంటారు. అందుకోసం ఎంతమంది పురుషుల్ని మార్చడానికైనా వెనుదీయరు. ఒక్కసారీ సంపూర్ణమైన తృప్తి వాళ్ళకు దొరకదు. ఎందుకంటే వాళ్ళ మనసు వికారించివున్నది కాబట్టి. ఈవికారాన్ని నింఫోమానియా అంటారు.

మనదగ్గరలేని ఒక వస్తువు గురించి మన మనసు ఉవ్విళ్ళూరుతుంటుంది. నపుంసకులకూ అంతే, సంభోగ సామర్ధనింలేదని తెలిసి దాని గురించే వాళ్ల మనసు ఆరాటపడ్తుంది.

అన్నిటికంటే ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, ఈ మనోవైక్లబ్యం వున్న ఆడవాళ్ళెప్పుడూ శాంతి, సౌఖ్యం ఇచ్చేవాడుగా వుండి, పరిస్థితులు అనుకూలిస్తేనే ముందుకు కదులుతారు. అలాంటి వాడి కోసమే వెతుకుతారు. ఇది "నింఫోమానియా" ప్రత్యేక లక్షణం.

కాలి. మగరాయుళ్ళు మాత్రం వ్యభిచారం కోసం పవిత్రమైన స్త్రీలెక్కడైనా దొరుకుతారేమోనని ప్రయత్నిస్తారు. ఒక్క

స్త్రీని పూర్తిగా సుఖపెట్టలేరు. ఆ కోరిక అణగారడం అనే ప్రసక్తి మాత్రం వుండదు. ఇది సెటీరియాసిస్ అనబడే వ్యాధి విశేషం.

ఇంత తీవ్రమైన కోరిక అసమర్థత వలననే వస్తోందనీ, అది మానసిక కారణాల వలన శుక్రధాతువు క్షీణించడంచేత ఏర్పడు తోందనీ ఆయుర్వేదం చెప్తోంది.

ఈ మనోవికారులు తమ మనసు చెప్పినట్లు నడిచి అతిగా సంభోగానికి పాల్పడితే ఓజస్సు క్షీణించి మరణానికి పాల్పడతారని చెప్పాడు చరకుడు.

"రిరంస" అనే పదం ఈ "మనోవికారాల"కు సూటైనది. రాజయక్ష్మ (క్షయ) వ్యాధి గురించి చెబుతూ సుశ్రుతుడు ఈ వ్యాధి రాబోయే ముందు "రిరంస" అనే లక్షణం వుంటుందన్నాడు. దానికి వ్యాఖ్యానం వ్రాసిన మధుకోశకారుడు దీన్ని మనోవికారంగా స్పష్టంగా చెప్పాడు. దీన్ని "ఎగ్జాజిరేటెడ్ సెక్సువల్ డిజైర్"గా మనం భావించుకోవచ్చు.

అవే సెటీరియాసిస్ [పురుషులకు], నింఫోమానియా (స్త్రీలకు). దీని వలన భవిష్యత్తులో క్షయవ్యాధి వస్తుందని ఆయుర్వేదజ్ఞుల హెచ్చరిక.

## చంచాతనం నపుంసకత్వమే!

"లోన్లీ క్రౌడ్" రచయిత రైస్మాన్—మనిషి వేదనలకు సెక్సు సమాధానాన్నిస్తుంది— అన్నాడు. ఇతరుల సలహాల కోసం వేచి వుండే వ్యక్తిత్వంలేని బానిస మనస్కులు "సెక్సుహామీ" కోసం, చంచాతనానికి సిద్ధపడ్తుంటారు— అన్నాడాయన.

మాసోచిజం అనేది విచిత్రమైన మనోవికారం. మనం "చంచా" అని పిలిచే చాలామంది వ్యక్తుల్లో ఈ "మాసోచిస్టు" లున్నారు.

బానిస భావాలను మనసులో పెట్టుకు పుట్టిన వ్యక్తులు మాసోచిస్టులు. వీళ్ళు అవసరమైతే తన ప్రేయసి మూత్రాన్ని సేవించడానికి కూడా వెనుదీయరు.

ఒక బోళ్షవిక్కు సైనికాధికారి, ఓ అందమైన ఆడపిల్ల రెండు తొడల మధ్య పడుకొని ఆమె మూత్రమార్గం క్రింద నోరు పెట్టినట్టు ఎప్పుడూ కలలు కంటూండే వాడని క్రాఫ్ట్—ఎబింగ్ పేర్కొన్నాడు. దీన్ని ఆదర్శ పూర్వక బానిసత్వం [Ideal masochism] అన్నాడాయన. దీంట్లో ఆదర్శం మాత్రం మనకు తెలీదు.

తను ప్రేమించిన స్త్రీ దిగంబరిగా తన గుండెలమీద కాళ్ళు పెట్టి ముఖంమీద కూర్చుని మూత్ర విసర్జన చేసినట్లు, తాను పానం చేసినట్లు కలలుకనే ఒక మేధావి గురించి వ్రాస్తూ, కలలో చేసే ఈ పానాన్ని [Urolagnik drinking] అన్నాడు హావెలాక్ ఎల్లిస్.

ఒక్కోసారి అలా చెయ్యమని ఆడవాళ్ళని వేధించే "ఆదర్శ పూర్వక బానిసలూ" వున్నారు.

ఇదొక సింబాలిక్ ఫాజినేషన్. చెమటపట్టిన స్త్రీ పాదాల నాకడం ఇందులో ముఖ్యమైంది. ఈ స్వేదాస్వాదన పరిశీలకుల తరచూ ఎదురయ్యే వికారమే!

చుంబనం పేరుతో ఎదుటి వ్యక్తి లాలాజలాన్ని గ్రహించడం, ఋతురక్తాన్ని, శుక్రాన్ని పానం చెయ్యడం, చివరికి చెవిలో మలాన్ని కూడా వదిలి పెట్టని రతి వికారులు మన మధ్యే పుంసుడిలా ఫోజు పెట్టి తిరుగుతున్నారు.

వీళ్ళకు పొరబాటున అధికారమే దక్కితే. నీతినీ ధర్మాన్ని గుప్పెట్లో పెట్టుకొని, తమ మానసిక వికారాలకనుగుణంగా ధర్మాన్నీ రాజ్యాంగాన్నీ ఎత్తిరాయించినా మనం చూస్తూ పూరుకోవాల్సిందే!

ప్రపంచమతాలన్నింటినీ ఒక్కసారి సమీక్షిస్తే ఈ విషయం ఋజువవుతుంది. క్రైస్తవ సమాజంలో ఒక కాలంలో మతాధికారులు తమ మలాలను [Excreta] ఆహారంతో కలిపి, దాన్ని పవిత్రమైన ప్రసాదంగా అమాయకులైన ప్రజానీకంచేత తినిపించిన సంఘటన....కేవలం కొందరు నపుంసకులైన మతోన్మాదులు మానసిక వికారాలతో బాధపడుతూ, వాళ్ళ ఆలోచనల్ని తృప్తి పరచుకోవడానికి మోక్షం పేరుతో ఆడిన నాటకమే! కాదనగలరా?

ఇప్పటికీ మన తెలుగు దేశంలో "అమ్మ"లూ "బాబా"లూ స్నానం చేస్తుంటే స్నానాల గదిలోంచి వచ్చే మూత్రమిశ్రిత జలాన్ని తీర్థంలా సేవించడం "భక్తి" అనుకొనే భక్త కోటి బానిస భావాలన్నీ మనోవికారాలు కాకపోతేమౌతాయి? ఇది పురోగమిస్తున్నానని భుజాలెగరేసే మనిషిని సిగ్గు పరిచే విషయం!!

కొన్ని పరిశోధనలలో తేలిన విషయం—మూత్రం లైంగికోత్తేజనాన్ని కలిగించే సాధనాలలో ఒకటి—అని!

క్రీస్తు పూర్వంలోనే చాలా దేశాలు కన్నెపిల్లల, చిన్నపిల్లల మూత్రాన్ని వివిధ వ్యాధులలో ఔషధంగా వాడే ఆచారం వుండేది.

మలేరియా, హిస్టీరియా మొదలైన రోగాలపైన మానవ మూత్రం చక్కగా పనిచేస్తుందని తెలుస్తోంది.

మూత్రం నాడీ ఉత్తేజక [Stimulant] గుణాన్ని కలిగినది.

విలియం సాల్మన్ 1678లో వ్రాసిన "డిస్పెనేటరీ"లో అప్పటికే మానవ మూత్రాన్ని ఔషధంగా వాడే వాడుక విశేష ప్రాచుర్యాన్ని పొందినట్లు తెలిపాడు. 1881లో "నీల్" అనే ఇంగ్లీషు వైద్యుడు "యూరిన్ యూజ్ ఎ మెడిసన్" అనే పుస్తకం వ్రాశాడట.

శరీరంలో జలీయాంశ కలిగిన ధాతువులలో రక్తధాతువు శుక్రధాతువు ముఖ్యమైనవి. జలీయాంశ తగ్గినప్పుడు రక్త శుక్ర ధాతువులు క్షీణిస్తాయి. సారభూతమైన ఈ రెండు ధాతువులూ లోపించడం వలన మూత్రపిండాలపైనా, మూత్రంపైనా, ఇంకా వివిధ గ్రంధులపైనా దాని ప్రభావం వుంటుంది. శరీర ప్రేరకాలైన గ్రంధులు సక్రమంగా పనిచెయ్యనప్పుడు, మూత్రపానం వంటి వికారాలపైన మనసు పనిచేస్తుంది. ఇది మానసిక నపుంసకతకు చిహ్నం. మూత్ర వేగాన్ని నిరోధించడం కూడా నపుంసకతను కలిగిస్తుంది.

## సెక్సు బానిసలు

చంచాలలో మరో రకం బానిసలున్నారు. వీళ్ళని "ఫెటిచిస్టు" లంటారు.

వీళ్ళ ఆలోచనా విధానం పరమ విచిత్రంగా వుంటుంది. రోజుకో అమ్మాయిని ప్రేమిస్తుంటారు. ఒక్కరిపైనా స్థిరమైన భావం వుండదు. అసలా ప్రేమకు ఓ కారణం కూడా వుండదు. అనుక్షణం మాట్లాడేది సంభోగం గురించే. కాని, ఆ అవకాశమే వస్తే ఆమడ దూరం పారిపోతారు. వీళ్ళు వ్యక్తుల్ని ప్రేమించరు. వాళ్ళ జుట్టునో, బొట్టునో, బుట్టనో ప్రేమిస్తారు.

గులాబీరంగు జాకెట్టు తొడుక్కున్న అమ్మాయంటేనే అతని కిష్టం అనుకోండి. ఆమె ఆ రోజు ఆకుపచ్చ రంగు తొడిగితే ముఖం మాడ్చుకుంటాడు. గులాబిరంగు బట్టలు వేసుకున్న అమ్మాయి కోసమే వెతుకుతాడు. అక్కడితో ఆగితే, ఇంత వ్రాయాల్సిన అవసరం లేదు. తన కిష్టమైన ఆ గులాబి జాకెట్టును ఎలాగో సంపాయిస్తాడు. నగ్నంగా గదిలో పడుకొని, తన అవయవంపైన ఆ జాకెట్టు నుంచి నొక్కుకుంటాడు. తద్వారా ఆ జాకెట్టు తొడుక్కునే అమ్మాయినే అనుభవిస్తున్నాననుకుంటాడు. వీళ్ళు వస్త్రబానిసలు (క్లాత్ ఫెటిచిస్ట్స్)

అలాగే షూఫెటిచిస్టులు. ఆ అమ్మాయి ఎట్టి చెప్పులంటేనే అతనికి తగని మోజనుకోండి.... అతనితో కలీడానికి ఆమె అంగీకరించడం కూడా జరిగిందనుకోండి.... అయినా, అతను సంభోగానికి ముందు, ఆ అమ్మాయి చేత ఆ చెప్పుకాళ్ళతో తన అవయవాన్ని తొక్కించుకుంటాడు.

ఇలాంటి బానిసలెందరో మన సమాజంలో. అందాకా ఎందుకూ, ఓ ప్రముఖ సినీమా నటి జాకెట్టు ఆకారాన్ని అసలు కొలతలతో సహా ఓ పత్రిక వాల్ స్టర్ సైజులో ముద్రిస్తే, దాన్ని చింపి దాచుకున్న "మగపురుషు" లెంతమంది లేరూ? ఇది బానిసత్వం కాదూ? దాన్ని దాచుకున్న వ్యక్తిని రసికుడనాలా—? నపుంసకుడనాలా??

## పిల్లల్ని చెరిచే పెద్దలు

ఇంకా యవ్వనానికి రాకమునుపే పిల్లల్ని తమ కామదాహాన్ని చల్లార్చుకోవడానికి కొందరు మనోవికారులు "పూతన"లా ప్రవర్తిస్తుంటారు. దాదాపుగా ఇది పురుషవికారమే! అప్పుడప్పుడే

కళ్ళు తెరుస్తున్న ఆడపిల్లల్ని చెరిచి అల్లరిపాలైన పెద్దల కథలు మనమెరిగినవే!

అమాయకులైన ఆడపిల్లల నోటిలోనూ, [Fellatio] గుద మార్గం(Anal)లోనూ మైథునం చేసే ఈ శాడిస్ట్ల మనోవికారాన్ని "పెడోఫిలియా" అంటారు.

పిల్లల్ని బతిమాలో, బలవంతం చేసో తన దాహాన్ని తీర్చుకొనేందుకు ప్రయత్నించే ఈ పీడోఫిలిస్ట్ల వలన ఆ పిల్లలు పెరిగే కొద్దీ లైంగికంగా అస్తవ్యస్తంగా తయారౌతారు. తమకన్నా వయసులో పెద్దవాళ్ళ మీద కోరిక పెంచుకుంటారు.

యవ్వనంలోకి చేరుకునే సరికి ఈ పీడోఫిలిస్ట్లకు ఎరైన ఆడపిల్లలు లైంగికంగా ఎదగకపోవడం కూడా కొన్ని సందర్భాలలో కానవచ్చింది. చాలామంది ఆడపిల్లలు పురుషద్వేషంతో "హోమో సెక్సువల్స్"గా మారిపోవడానికి ఇది ప్రధానకారణం.

ముసలివాళ్ళయినాక కొందరు వృద్ధులకు కోరిక చావక, ఓపికలేక, ఇలా చిన్న పిల్లలపైన తమ కామాన్ని ప్రయోగించి ఆనందించడం చాలా సందర్భాలలో కనిపిస్తుంది.

## శవాన్ని సంభోగించే మనుషులు

తీవ్రమైన శాడిజంవున్న మనుషుల్లో. క్రూరత్వం కూరుకుపోయిన రాతిగుండెల్లో శవానికీ, మనిషికీ తేడా తెలుసుకునే విచక్షణాజ్ఞానంకూడా వుండదు.

స్త్రీని దారుణంగా గాయపరచి, ఆమె మరణవేదన పడ్తుంటే, మదనవేదనతో ఆమెననుభవించే దురాత్ముల్ని కూడా 'సెక్స్' సృష్టించింది.

ఈ వికారాన్ని నెక్రోఫిలియా అంటారు. "నెక్రోఫిలియాక్"లు అంతా హంతకులే కావాలని లేదు. మరణించిన స్త్రీని మోసుకు పోతునప్పుడు చూసినా అంగస్తంభనం కలిగే వ్యక్తులూ మగజాతిలో వున్నారు.

శవాన్ని చూస్తే లైంగికోత్తేజం కలగడానికి మొదటి కారణం, మరణించిన స్త్రీని సంభోగిస్తే, ఆమెకుగానీ అతనికిగానీ, ఎటువంటి సద్యఃఫలితాలూ కనిపించవు కాబట్టి, ఆమెకు కడుపొతుందనే భయంలేదు కాబట్టి ...! అలాగే, స్త్రీ ద్వేషం వున్న వ్యక్తులు, తాము ద్వేషించే స్త్రీని మరణించాక సంభోగించి కసితీర్చుకొంటారు.... ఆధునిక వైద్యశాస్త్రం ఇంతకంటే వీళ్ళ గురించి వివరణనీయులేదు. ఇంకా పరిశీలించవలసింది చాలా వుంది.

## స్త్రీలా తయారయ్యే మగవాళ్లు!

ఆడవాళ్ళు మగవాళ్ళలా పాంట్లూ లుంగీలు తొడుక్కొని రోడ్డుపైన తిరగడం, యువకులు స్త్రీలలా జుట్లు పెంచుకొని, చీర డిజైన్లున్న చొక్కాలు తొడుక్కోవడం ఇవాళ్టి ఫాషన్. మానస శాస్త్ర ప్రకారం ఇలాంటి కోర్కెలు "ట్రాన్స్వెస్టిజం" అనే "మనో వికారం."

మన ఇళ్ళల్లో ఇల్లాళ్ళకు తృప్తిలేని కోరికాలు చాలా వుంటాయి, మగపిల్లవాడు పుడితే ఆడపిల్ల కావాలని, ఆడపిల్లలు పుడితే మగపిల్లలు కావాలని కోరుకోవడం వాటిలో ఒకటి. మగ పిల్లలకు జడలు వేసి, గౌన్లు తొడిగి, ఆడపిల్లగా తయారు చేసి ఆనందిస్తారు. ఆడపిల్లల్ని మగపిల్లల్లా మార్చేస్తుంటారు. అందు

వలన పెద్దలు ఆనందం అనుభవించినా, దాని ప్రభావం పిల్లల మనసుపైన తప్పకుండా వుంటుందంటారు శాస్త్రజ్ఞులు.

1728 నాటి మాట. ఇంగ్లీషు సైన్యంలో ఒక విభాగానికి "షివేలియర్ డి. ఇయోన్" అనే ఆయన సమర్థుడైన నాయకుడు అయన మహాబలవంతుడు. శూరుడు. అందగాడు. ఆయనకు చెల్లెళ్ళు, అక్కలూ లేని కారణంగా చిన్నప్పుడు ఆయన తల్లి అతన్ని ఆడపిల్ల వేషంవేసి అతనిలో ఆడతనం చూసుకొని మురిసి పోయేదిట. సహజంగానే అందగాడు కావడంతో ఆడవేషంలో మరీ అందగా వుండే వాడట ఇయోన్.

జ్ఞానం కలిగిం తర్వాత కూడా ఆడపిల్ల పెంపకం ఇంట్లో కొనసాగడంతో అతనిలో ఆడభావాలు పూర్తిగా నాటుకు పోయాయి. అవి డెభ్భై ఒచ్చేవరకూ ఆయన లోంచి తొలగి పోలేదు. కాబట్టే ఎప్పుడో పుట్టిన ఇయోన్ గురించి ఇవ్వాళ మనం చెప్పుకుంటున్నాం.

నెపోలియన్ను ఎదుర్కొన్న వీరుల్లో ఇయోన్ ఒకడు. ప్రాణాలకు తెగించి పోరాడే వాడు. అతన్ని పరీక్షించిన వైద్యులు కూడా అతను శారీరికంగా నూరుపాళ్ళు పురుషుడేనని ధృవపత్రాన్నిచ్చారు.

కాని, ఇయోన్ మాత్రం స్త్రీలా ప్రవర్తించడం, వొళ్ళంతా ఆభరణాలు ధరించి ఆడదానిలా మురిసి పోవడం.... మరణించే వరకూ అలానే చేశాడు. స్త్రీ దుస్తుల్లో ముద్దొచ్చేట్లుండే ఇయోన్ను ఆ రూపంలో చూసి మిగతా సైన్యాధికారులు అప్పుడప్పుడూ చలించేవారట.

నిజానికి రాణివాసంలో వుండే నపుంసకులలో ఒకడుకాదు ఇయోన్. మహావీరుడు. అధికారంలో వున్న వాడు కాబట్టి యథా

రాజా తథా ప్రజా అన్నట్లు బ్రిటిష్ ప్రజలు ఒక్కొక్కరూ మగవాళ్ళు ఆడవాళ్ళుగానూ, ఆడవాళ్ళు మగగానూ తయారవడం మొదలు పెట్టారు. రానురానూ అది పెద్దఫాషన్ అయిపోయింది.

ఈ అలవాటు "ఇయోన్" నుంచి సంక్రమించింది కాబట్టి ఈ మనోవికారానికి "ఇయోన్ జాడ్యం" లేక "ఇయోనిజం" అని పేరు పెట్టాడు ఎల్లిస్.

ఇది మానసిక నపుంసకత్వంలో మొదటి స్థాయి. ఇది కేవలం దుస్తులకు మాత్రమే పరిమితం అయితే "ట్రాన్స్‌వెస్టిజం" అంటారు. ఈ రూపాంతరణ వికారంలో ఇంకా స్త్రీకి సంబంధించిన అనేక విషయాల్ని పురుషుడు దత్తతపుచ్చుకొని స్త్రీలా ప్రవర్తించడం, లేక స్త్రీలు పురుషుడిలా ప్రవర్తించడం ఇయోనిజం అనబడుతుంది.

## వృషణాలను తొలగిస్తే ఏమౌతుంది?

పూర్వం సుల్తానుల అంతఃపురాలలో నపుంసకులతోపాటు, బానిసలలో కొందరికి వృషణాలు కత్తిరించి వాళ్ళను తమ స్త్రీల కోసం నియోగించేవారు. ఓడిపోయిన రాజుల్ని, శత్రువుల్ని ఈ పనికి ముఖ్యంగా ఉపయోగించేవారు.

వీళ్ళకు అంగ స్తంభనం, స్త్రీ సంగమ సామర్థ్యం రెండూ వుంటాయి. సంతానోత్పత్తి మినహా అన్ని సమర్ధతలూ వున్నవారే ఈ వృషణ హీనులు. రక్తం కలుషితం కాకుండా, తమ స్త్రీలు సుఖపడేందుకు కొందరు పుంసత్వంవున్న వ్యక్తులను ఈ విధంగా వృషణహీనులను చేసేవారుసుల్తానులు. దీనివలన శత్రురాజులవంశం కూడా అంతటితోటే ఆగిపోయేది.

వృషణాలను కత్తిరించి వేయడాన్ని కాస్ట్రేషన్ అంటారు; తనకు సమర్థతలేదని అస్తమానం, అనుమానంతోటీ, అవమానంతోటి కృంగి పోవడాన్ని "కాస్ట్రేషన్ కాంప్లెక్స్" అంటారు. వీళ్ళు మానసికంగా "కాస్ట్రేట్" అయ్యారని అర్థం.

పిల్లల్ని కనాలనే వెర్రి తపనతో విశ్వ ప్రయత్నంచేసిన దంపతులకు, ఎంతకాలానికి సంతానం కలగకపోతే, ఎంతటి వ్యక్తులకైనా తమపైన తమకే అనుమానం కలుగుతుంది. ఈ అనుమానమే కాస్ట్రేషన కాంప్లెక్. ఫలితంగా మరింత నిర్వీర్యులవుతారు దంపతులు.

పూర్వం రకరకాల తప్పులకు రకరకాల శిక్షలు అమలులో వుండేవి. అందులో తమ వృషణాలనుతామే కత్తిరించుకోవడం ఒకటి. రోమన్లు ఈ శిక్షను నాలుగు రకాలుగా విధించేవారు.

మొదటి రకపు శిక్షననుభవించినవాడు నిజమైన కాస్ట్రేట్ ఇతనికి వృషాణాలతో పాటు, పురుషావయువాన్ని కూడా కత్తిరించేవారు. కేవలం వృషణాలను మాత్రమే ఖండించబడిన వ్యక్తిని "స్పాడోను" అనేవారు. వృషణాలను కత్తిరించక చితక గొట్టడాన్ని [Crushing] శిక్షగా అమలుపరచబడిన వ్యక్తిని "త్లిబియే" అంటారు. చిల్లర రాజకీయాలు చేసే వ్యక్తులకిది శిక్ష! "త్లాసే" అనబడే వ్యక్తులకు కేవలం శుక్రవహ స్రోతస్సు [Spermatic cord] ని మాత్రం కత్తిరించేవారట. ఇది నేటి స్టెరిలైజేషన్.

అలాగే స్త్రీలకు గర్భాశయాన్ని [Uterus], అండకోశాల్ని [Ovaries] కత్తిరించే ఆచారం కూడా అనేక జాతుల్లో వుంది. ఫలితంగా బహిష్టు ఆగిపోయిన ఈ స్త్రీని "వద్ధ్ర" అంటారు. వయసులో వుండగానే ఈ శిక్ష అమలు జరిగినా వాళ్ళలో లైంగిక వాంఛలుగాని, లైంగిక సామర్థ్యంగాని నశించవు.

గర్భాశయంలో ఎదుగుతున్న శిశువుకు తొలి రోజుల్లో వృషణాలుగాని, అండాశయంగానీ వుండవు. స్త్రీశిశువులకుగాని, పురుష శిశువులకుగానీ "Gonads" అనబడే అవయవాలుంటాయి. అవి ఎదిగే శిశువులో వృషణాలుగానూ, అండాశయంగానూ పరివర్తన నొందుతాయి.

వృషణాల నుంచి వచ్చే "యాండ్రోజన్" స్రావం వలన పురుష శరీర రచన ఏర్పడుతుంది.

గర్భస్థ శిశువుకు ఏ కారణం చేతనయినా వృషణాలు అభివృద్ధి నొందకపోతే ఆ బిడ్డ స్త్రీ రూపాన్ని పొందే ప్రమాదం వుంది.

యవ్వనం వచ్చే వరకూ, అండాశయంగాని, వృషణాలుగాని తక్కువ స్రవిస్తాయి గాబట్టి, ఆడ, మగ పిల్లలలో పెద్ద తేడా కనిపించదు.

యవ్వనానికి ముందే ఒక మగపిల్లవాణ్ణి వృషణహీనుణ్ణి చేస్తే అతను క్రమేణ స్త్రీ రూపాన్నే సంతరించుకుంటాడు. మీసాలు కూడా పెరగక పోవడంతో మనిషి నపుంసకతను కొట్టొచ్చేట్లు కనబరుస్తాడు. మాంస కండలు తక్కువగా వుంటాయి. గొంతులో ఒక విధమైన జీర వుంటుంది. జననేంద్రియం ఎదగదు.

ఆడపిల్ల అండాశయాన్ని యవ్వనానికి ముందే తొలగిస్తే శరీరం ఎంత వయసొచ్చినా ఎదగదు. స్తనాలు పెరగవు. ఋతు స్రావం, రజస్వల కావడం వంటివి వుండవు.

కాస్ట్రేషన్ వలన చాలా లాభాలున్నాయి. కడుపొస్తుందనే భయం లేదు కాబట్టి, కామార్తులైన ఆడవాళ్ళు వీళ్ళతో కలిసి కామ వాంఛ తీర్చుకుంటారు. వీళ్ళకు విసృష్టి [Ejaculation] వుండదు కాబట్టి, ఓపికున్నంత వరకూ అంగ స్తంభనం జరిగే వుంటుంది కాబట్టి, కాముకులైన స్త్రీలకు కాస్ట్రేట్‌లు ఒక వరం.

మూర్ఛ రోగాలున్న వాళ్ళకూ, మూర్ఖులకూ కాస్ట్రేట్ చెయ్యడం వలన వాళ్ళలో అద్భుతమైన చైతన్యం, జాగృతీ కలుగుతాయని ఒక పుకారు ఉంది.

ఈ నిరూపణల వలన మనం ఒక నిర్ణయానికి రావచ్చు. లైంగిక సామర్థ్యాన్ని కలిగించేవి జననేంద్రియాలుగానీ, పురుషత్వానికి గుర్తుగా భావించే వృషణాలుగానీ, స్త్రీత్వానికి ఉన్నమైన అండకోశాలుగానీ కావనీ. వీటన్నింటికీ మించిన మరేదో శక్తి మన శరీరంలో వుందనీ అర్థం అవుతోంది. ఆ శక్తి వలననే థైమస్, ఎడ్రినల్, థైరాయిడ్, పిట్యూటరీ, మూత్రపిండాల వంటి గ్రంథులు పనిచేస్తున్నాయి. ఆ శక్తి శుక్ర ధాతువే నంటుంది ఆయుర్వేదం. సమస్త నాడీమండలాన్ని స్వాధీనంలో వుంచుకుని నడిపిస్తోంది శుక్రధాతువు. శుక్రం [Semen] లేకపోయినా, శుక్రధాతువే లైంగిక కార్యాన్ని నడుపుకు పోతోంది. సెక్సు పరికరం [Sex apparatus] అన్నప్పుడు ఇన్నింటినీ పరిగణనలోకి తీసుకోవాలి.

## వృద్ధాప్యంలో నపుంసకత

మనసు ఎదగని ఓ బాలుడికి స్త్రీ లభించినప్పుడు లేత యవ్వనంలోనే సంభోగానికి తలబడిన అబ్బాయి మనసు అలాగే [Childish] వుండిపోయి, ముసలివాడైనకొద్దీ మూర్ఖుడిలా తయారౌతాడు. ఈ ముసలితనాన్ని జరావ్యాధి అంటారు. శరీరంలో అన్ని ధాతువులూ క్షీణించడం ప్రారంభమైన ఒకానొక దురవస్థ ఇది.

ధాతువులలో ముందు నష్టపోయేది శుక్రధాతువు. అక్కడి నించి కళ్ళు, ముక్కూ వంటి జ్ఞానేంద్రియాలతో సహా అన్ని జీవన కృత్యాలూ స్తంభించి పోతుంటాయి. మనిషిలో అకర్మణ్యత్వం

పెరుగుతుంది. చర్మం గరుకుగా వుండి ముడతలు పడుతుంది. బలం తగ్గిపోతుంది. ఆయువు క్షీణిస్తుంది.

వయసులో వున్నవాళ్ళయినా సరే, ఎప్పుడూ ఉపవాసా లుండడం, రాత్రి జాగరణ చేయడం ముసలితనాన్ని ముందుకు జరుపుకొస్తాయని మడిబట్టలారేసే ఈ యుగపు మధ్యతరగతి గృహిణులు ఇప్పటికైనా గ్రహించగలగాలి.

ముందుగానే వృద్ధాప్యం వచ్చేసిన యువకుడు వృద్ధుడి లాగానే ఏవని మీదా ఉత్సాహం చూపించలేడు. శరీరంలో కాంతి లోపించిపోతుంది, మనిషి జీవచ్ఛవంలా కనిపిస్తాడు. పేలవంగా నవ్వుతాడు, దీనంగా, వంటరిగా ఓ మూల జారగిలబడి వుంటాడు. ఇలాంటి వ్యక్తి నిశ్శంసయంగా, మానసికంగా నపుంసకు డయ్యాడని అర్థం. భార్య చేత హస్తప్రయోగం చేయించు కొనేందుకు ఈ పెద్దమనుషులు పెళ్ళికి తలబడతారు.

మన సమాజంలో ఇప్పటికీ వార్ధక్యం సమీపిస్తున్నా, ఋతు స్రావం ఆగిపోతున్నా పరిపూర్ణమైన లైంగిక సుఖాన్ని అందించే స్త్రీ మూర్తులున్నారు. ఇలాంటి కొందరు స్త్రీలకు ఋతుస్రావం ఆగిపోయినా, వాళ్ళ లైంగిక కృత్యానికి అభ్యంతరం వుండదు. జననేంద్రియం శుష్కించకుండా, ఇంకా ఆమె ఆరోగ్యవంతంగానే వుండి వున్నట్లయితే, ఆమె ఓపిక మేరకు మరణించే వరకూ లైంగిక కార్యక్రమాల్లో పాల్గొనవచ్చునని వైద్యశాస్త్రం హామీయిస్తోంది.

పురుషులలో అరవైలు దాటినాక కూడా పిల్లలను కన్న తండ్రులు లేకపోలేదు. కాని, సాధారణంగా పురుషులలో రతి నించి రతికి వేగం తగ్గిపోతుంటుంది.

వృద్ధులలో పురుషావయవం స్తంభించడం చాలా ఆలస్యంగా జరుగుతుంది. అదీ ఎక్కువ కాలం నిలిచి వుండదు. అందుకే వృద్ధులు రతి మధ్యలో విశ్రాంతి తీసుకుంటుంటారు. ఇలాంటి Rest periods అనేకం తీసుకుంటేనేగాని వీళ్ళ రతి పూర్తికాదు.

సాధారణంగా, గతప్రాయయౌవన స్త్రీలు (వృద్ధ) వయసు భారాన్ని భరించడంలో పురుషుడి కంటే మెరుగేనంటారు వైద్యులు. ఆరోగ్యవంతులైన దంపతుల్లో కూడా వయసు పెరిగిం దగ్గర్నించి, లైంగిక కృత్యంపట్ల విముఖత పురుషుడి వైపునుంచే గాని, స్త్రీ వైపు నుంచి రావడం సాధారణంగా జరగదు.

## సినైల్ కాంప్లెక్సు

నిజం చెప్పాలంటే, మనకు వృద్ధతరాన్ని ఉపయోగించుకోవడం చేతకాదు; వృద్ధులకు కూడా చాలామందికి సమాజానికి ఉపయోగపడే రీతిలో ప్రవర్తిద్దామనే ఆలోచన లేదు.

"కమ్మింగ్—హెన్రీ" అనే ఇద్దరు శాస్త్రజ్ఞులు వృద్ధులలో క్రియారాహిత్యాన్ని "A process of dis-engagement" అన్నారు. దీన్ని "బద్ధకం" అందాం.

వీళ్ళు సమాజానికి దూరంగానే వుంటారు. సామాజిక కార్యక్రమాలపట్ల శ్రద్ధ చూపించలేరు. యువక దశలో విస్తృతమైన కార్యక్రమాలు నిర్వహించిన వ్యక్తులు కూడా ఆ కార్యదీక్షనీ, ఆ Organisational spirit నీ మరిచిపోవడం మన సమాజం వెనకపడడానికి గల కారణాలలో ఒకటి.

అంతరంగానికీ, బాహ్యప్రేరణలకూ జరిగే స్పర్థలో వృద్ధులు అంతరంగానికే ప్రాముఖ్యత ఇస్తారు. వయసు ఉడిగినా, శక్తి

నశించినా మునుపటి అహంకారం — Self respect — ఆత్మ గౌరవం వృద్ధుల మనసును అంత తేలికగా వీడిపోవు. అందుకే, ఎక్కడా "అడ్జస్ట్" కాలేరు పెద్దలు.

ఇంట్లో కొడుకూ, కోడలూ, భార్యా, మనవళ్ళూ అంతా తనని అసహ్యించుకుంటున్నట్లు భావించుకుంటారు. ముఖ్యంగా రిటైరై పోయిన ఉద్యోగులు నడిచే ఓపిక వున్నంత వరకూ ఒక్కక్షణం కూడా ఇంటి పట్టున వుండరు. కనిపించిన ప్రతివాడికీ తన" యౌవనకాలం విశేషాలు" వినిపిస్తుంటారు.

అధికప్రసంగం, అతిప్రసంగం కూడా పురుషత్వం లోపించిన వ్యక్తుల లక్షణమే. వృద్ధులలో దీన్ని స్పష్టంగా మనం గమనించ వచ్చు. రాజసాన్ని నటిస్తూంటారు. మునుపటి దర్పాన్ని ప్రదర్శి స్తూంటారు. నిజానికి మరణించే వరకూ విశ్రాంతిలేకుండా పని చెయ్యగల వ్యక్తులు అరుదు. ఇలాంటి శ్రమజీవుల్ని మానస శాస్త్రంలో 'Armored' అంటారు. వాడు కన్నకొడుకైనా సరే ఇతరులపైన ఆధారపడాలంటే పొరబాటున కూడా ఒప్పుకోరు. అడుక్కుతిని బ్రతకడానికి సుతరామూ అంగీకరించరు.

మనసును బలంగానూ, దృఢంగానూ, నిశ్చలంగానూ వుంచుకుంటే ఎంతటి బలహీనుడైనా కొండను పిండి చేయగలడు.

వృద్ధాప్యంలో కూడా కోపంలేని వ్యక్తులూ, చంచలతలేని వ్యక్తులూ, ఓర్పుగలవారూ, కాయకష్టాన్ని లెక్కచేయని వాళ్ళూ వున్నారు. ఇవిలేని వ్యక్తులు యువకులైనా వృద్ధులే! పిల్లలను కనేవాళ్ళయినా నపుంసకులే!!

వృద్ధులకు రక్తనాళాలు గట్టిపడిపోవడం వయసును బట్టి సాధారణంగా జరుగుతూనే వుంటుంది. దీన్ని Arteriosclerosis అంటారు.

అందువలన మెదడు పొరలకు రక్తప్రసారం తగ్గిపోతుంది· పోషక పదార్థాలు లోపించడంతో మెదడు దెబ్బతినడం ప్రారంభిస్తుంది. తలనొప్పి, తల తిరగడం వంటి లక్షణాలు తరచూ కలుగుతాయి. మనిషి శారీరికంగానూ, మానసికంగానూ బలహీను డౌతాడు.

"మానసిక బలహీనత" వలన వృద్ధులు యువతరానికి పెద్ద "తలనొప్పి"గా తయారౌతుంటారు. యువకులు కూడా కొందరు వృద్ధుల్లా ప్రవర్తిస్తుంటారు. వృద్ధుల ఈ మనోవికారాన్ని జరావ్యాధి [Senile complex] అంటారు. ఈ తలనొప్పికి మందు, వృద్ధులను [Seniles] ఆరోగ్యవంతులుగా చేయడమే. అందుకు వృద్ధాప్యంలోకి ప్రవేశిస్తున్న వ్యక్తులు కూడా, మనసును నిగ్రహించుకునే ప్రయత్నాలు చేస్తూ సమాజానికి సాయపడాలనే మనస్తత్వాన్ని పెంచుకోవాలి.

అది చేతకాని వ్యక్తులు నపుంసకులేనంటే, ఎవరూ ఆగ్రహించవలసిన పనిలేదు.

# 4. మనిషి - మనసు

మనిషి ప్రవర్తననీ, ఆ ప్రవర్తన వెనకాలి లక్ష్యాల్ని తెలుసుకోవడాన్ని లక్ష్య సిద్ధాంతం [Motivation theory] అంటారు.

వ్యక్తిని ఒక పని పట్ల ప్రేరేపించే శక్తి "లక్ష్యం"! ఆ లక్ష్యం పదవి కోసం కావచ్చు, పరువు కోసం కావచ్చు, ప్రేమకోసం

కావచ్చు. మనిషి విజయం సాధిస్తున్నాడంటే, దాని వెనకాల ఏదో లక్ష్యం [Motive] వుండి తీరుతుంది.

లాటిన్‌లో "మొటివస్" అంటే, నడిపేశక్తి! ఈ మొటివస్ మీంచే మోటివ్ పవర్, మోటివ్ ఫోర్స్, ఆటోమోటివ్ వంటి పదాలు ఏర్పడ్డాయి.

సుఖదుఃఖ ప్రవృత్తులే మనిషిలో ఈ లక్ష్యాన్ని ప్రేరేపించి మనిషిని నడుపుతున్నాయి.... అని శాస్త్రజ్ఞుల నమ్మకం. దీన్ని "హెడొనిస్టిక్ సిద్ధాంతం" అంటారు.

పరిణామ క్రమాన్ని పూర్తిచేసుకున్న జంతువులన్నింటిలోనూ ఈ సుఖదుఃఖ ప్రవృత్తులుంటాయి అని డార్విన్ సిద్ధాంతీకరించాడు. దీనిపైన అనేక తర్జన భర్జనలు జరిగాయి. డార్విన్ సిద్ధాంతం మనిషిలో పశుత్వాన్ని ప్రేరేపించేదిగా అతని సమకాలికులు విమర్శించారు.

జంతువులలో కూడా మానవ లక్షణాలైన సుఖదుఃఖాలుంటాయనేసరికి డార్విన్‌ను పశువుగా జమకట్టి నిరసించారు. అతని ఆనందాన్ని "శునకానందం" అన్నారు.

ఆతర్వాత "1910"—ఆ ప్రాంతాల్లో విలియం జేమ్స్ వంటి పండితులు మనుషుల్లో, జంతువులకన్నా సుఖదుఃఖ ప్రవృత్తులు కొంచెం ఎక్కువగా వుంటాయి— అన్నారు. ఇంకొంత మంది కొంత కాలం గడిచాక మరికొన్ని ప్రవృత్తుల్ని మనిషిలో కొత్తగా కనుక్కొన్నారు, కాలక్రమేణా ఈ ప్రవృత్తులకు Instincts అనే పేరు సార్థకం అయిపోయింది.

మొదట్లో చాలామంది శాస్త్రజ్ఞులు ఈ Instinctsను నమ్మలేదు. అవి వున్నాయన్నవాణ్ణి నోటికొచ్చినట్లల్లా తిట్టడం

మొదలు పెట్టారు. దాంతో కడుపుమండిన ఓరచయిత Instinctsను నమ్మేందుకు మనిషిలో ఓ ప్రత్యేకమైన Instinct వుంటుంది. ఇన్‌స్టింక్ట్స్ లేనివాడే వాటిని నమ్మలేడు— అని ఎదురుదెబ్బ కొట్టాడు. ఈ యుద్ధానికి కారణం, ఈ ప్రవృత్తులు కంటికికనిపించేవి కాకపోవడం మాత్రమే!

మొత్తంమీద 1950 వరకూ ఈ ప్రవృత్తుల విషయం పూర్తిగా మరుగునపడిపోయింది. ఎవరూ వీటిని పట్టించుకునే వాళ్ళు కాదు. ఫ్రాయిడ్ అనుయాయులు మాత్రం నమ్మేవాళ్ళు. అందుకని. వాళ్ళని అంటరాని వాళ్ళుగా చూసేది మిగతా శాస్త్ర ప్రపంచం.

యూరోపియన్ జంతుశాస్త్రజ్ఞుల్ని "ఇథాలజిస్ట్" అంటారు. వాళ్ళు వెలుగులోకి వచ్చాక ఈ Instincts ను పునరుద్ధరించారు. ఆ తర్వాత ఇథాలజిస్టులు తమ "ఇథాలజీ" శాస్త్రాన్ని కేవలం ఈ అంతఃప్రేరణలను పరిశీలించేందుకే పరిమితం చేశారు.

అప్పటికే ఫ్రాయిడ్ మనోవిశ్లేషక సిద్ధాంతం ప్రచారంలోకి వచ్చేసింది. ఫ్రాయిడ్, ఈ ప్రవృత్తులే మనిషి ప్రవర్తనావళిని నిర్ణయిస్తాయన్నాడు.

ఈ Instinctsను ఫ్రాయిడ్ తన జర్మన్ భాషలో "ట్రయిబీ" అన్నాడు. ట్రయిబీ అంటే కోరిక, ప్రేరణ, అవసరం.... ఇత్యాది అర్థాలున్నాయి.

జీవమున్న ఏ ప్రాణికైనా కోరికలుంటాయి— అనే డార్విన్ సిద్ధాంతాన్ని ఈ విధంగా ఫ్రాయిడ్ మెరుగుపెట్టాడు.

ఆయన కోరిక జనించడాన్ని ఒక శక్తి అన్నాడు. కోరిక (Instinct) చైతన్యానికి ప్రతీక. కాబట్టి, చైతన్యం అనేది ఒక "వాంఛాశక్తి" [Instinctual energy] అనేది ఫ్రాయిడ్ పరిభాష.

ఈ శక్తికి ఇద్దరు ప్రధానమైన అధిపతులున్నారు. ఒకడు "ఈరోస్". జీవితాన్ని, దానికి చైతన్యాన్నీ ప్రసాదించే విధాత ఈరోస్. ఈరోస్ వలన కలిగే ప్రేరణల్ని చైతన్య ప్రవృత్తులు (Life instincts) అన్నాడు ఫ్రాయిడ్.

చైతన్య ప్రవృత్తులలో సెక్సు, ఆకలి, దాహం ముఖ్యమైనవి. ఈ మూడింటినీ కలిపి "లిబిడో" అంటారు.

రెండవవాడు మృత్యువు. వీడు సర్వనాశనాన్ని కలిగించే వాడు. వీడినే Thantos అంటారు (థాంటోస్ గ్రీకుల యముడు). ఈ మృత్యుప్రేరణని "Death instinct" అన్నాడు ఫ్రాయిడ్.

ఈ రెండు ప్రేరణలూ "id" అనే తత్త్వంలో అంతర్లీనమై వుంటాయి అని చెప్పాడు. అంటే, తమోగుణమే "కోరిక"లకు మూలం అన్న భారతీయ సిద్ధాంతాన్ని ఫ్రాయిడ్ ఆధునికంగా చెప్పాడు. ఈ విషయమే ఈ వ్యాసంలో నిరూపితం కాబోతోంది.

## మనసంటే ఏమిటి?

గ్రీకు దేవాలయం "డెల్ఫి" గోడలపైన ఎప్పుడో క్రీస్తుకు పూర్వమే, చాలావేల ఏళ్ళ క్రిందట "నిన్ను నీవు తెలుసుకో Know thy self" అని రాసివుందిట. "పారనాసస్" అనే పర్వతంపైన ఫీబస్ అపోలో ఈ గుడిని కట్టించాడు.

తనను గురించి తాను తెలుసుకోవాలనే జిజ్ఞాసా, అహం బ్రహ్మాస్మి— నేనే విజ్ఞానిని— అనే ఆత్మస్థయిర్యం ఆదినించీ మనిషిని వెన్నాడుతూనే వున్నట్లు ఆధునిక మానస శాస్త్రం

చెప్తోంది. ఆత్మను గురించే వెదికే ప్రయత్నంలో క్రీస్తు పూర్వం నాటి గ్రీకులు మనిషిని 'మనసు' [Soul] అనీ, శరీరం[Body] అనీ రెండు రకాలుగా విభజించారు.

ఆనాటి ఆలోచన క్రీస్తు తర్వాత 1594 – 96 ప్రాంతాల్లో "అథోకేస్మానస్" అనే పండితుడి వలన ఒక రూపాన్ని పొందింది. ఆయన గ్రీకు ధాతువులతో కొన్ని పదాలను సృష్టించాడు. అవి యిప్పటికీ ఒక్కొక్కటీ ఒక్కొక్క శాస్త్రంగా రూపొందాయి.

"ఆంథ్రోపాలజీ" అనే పదం మనిషి అవతరణాదుల గురించిన శాస్త్రం అయ్యింది. సోమటాలజీ శారీర శాస్త్రంగా పరిణమించింది. సైకాలజీ మనసును గురించి చదవడం ప్రారంభించింది.

మనిషి నడతనీ, దానికి మూలకారణమైన ప్రవృత్తుల్నీ తెలియజేసే శాస్త్రాన్ని మానస శాస్త్రం [సైకాలజీ] అంటున్నాం. ప్రవర్తనా శాస్త్రంగా దీన్ని మనం భావించుకోవచ్చు.

ప్రవర్తనకు మనసు మూలం. మనసంటే మనోవృత్తుల సమూహం.... అని ఆయుర్వేదం నిర్వచించింది. ఆధునికులు కూడా The organized totality of all mental processes and psychic activities ...అన్నారు.మనసుని.మనోవృత్తుల [Mental processes] సహాయంతోటే మనం శారీరిక మానసిక వ్యాపారాలను నిర్వర్తిస్తున్నాం.

శరీరంలో కొన్ని జడపదార్థాలుంటాయి, ఈ జడపదార్థాలకు వ్యతిరేకమైన గుణ, ధర్మాలున్న ఒకానొక ప్రవృత్తిని 'చైతన్యం' అంటున్నాం. ఈ చైతన్యమే మనోవృత్తులకు [Mental processes] కారణం అవుతోంది. ఈ మనోవృత్తుల సమూహాన్ని చైతన్యంవున్న మనసు— [Seat of conscious ness] అని చెప్పుకోవచ్చు.

## వ్యక్తిత్వం ఎలా ఏర్పడుతుంది?

మనసు ఎంత శక్తివంతమైనదైతే చైతన్యం అంత తీవ్రంగా వుంటుంది. కాబట్టి చైతన్యం అంటే చిత్శక్తి [Power of conscious ness] అందాం. చైతన్యం వలన మనిషిలో ఏర్పడే క్రియాశీలతని "చేతన" [Vital activity or movement] అంటారు.

మనిషి తన చైతన్యాన్ని సన్మార్గంలో వినియోగింప చేయడానికి మానశిక శక్తి, శారీరక శక్తి దోహదపడతాయి. ఈ మానశిక, శారీరక శక్తుల కూర్పులేక సంకలనాన్నే మనం "ప్రాణం" అంటున్నాం. ఈ ప్రాణానికి [Life force] విశిష్ట చేతనత్వం [Specific activity] వుంటుంది. విశిష్టచేతనత్వం వున్న పదార్థాన్ని "క్షేత్రం" అంటారు. ఒక శరీరానికి ప్రాణం లేక చైతన్యం వున్నప్పుడే అది క్షేతం అవుతుంది. క్షేత్రం అంటే సవికార (Activated), సజీవ (Living) శరీరం.

Mind లేక Consciousness అనే పదాలు సమానార్ధకాలు. మనసూ, చైతన్యం ఒకే పనిని నిర్వర్తిస్తున్నాయి. కాబట్టి, ఈ పదాలకు "ఆత్మ" అనే అర్ధాన్ని ఆపాదిస్తే, అనవసరంగా దేవుడి ప్రస్తావన రాకపోయినా, మనసుకు సంబంధించిన కొన్ని విషయాలు తెలుసుకోవడం జరుగుతుంది.

సవికార సజీవ శరీరాన్ని "క్షేత్రం" [The land] అన్నప్పుడు ఈ క్షేత్రానికి ఒక అధిపతి వుండాలి కదా! ఆ అధిపతినే "ఆత్మ" అంది సాంఖ్యం. ఆత్మను క్షేత్రజ్ఞుడు [Owner of the body] అంటారందుకే.

మనిషి చేసే పనులన్నింటికీ ఇతనే బాధ్యత వహిస్తాడు. పాపపుణ్యాలన్నింటినీ నిర్వర్తించే "కార్యకర్త" ఈ ఆత్మ. ఏదు బలంగా వుంటే "శ్రమజీవి"తో సమానం. లేకపోతే వికారాలకులో నై దోపిడీదారుడౌతాడు.

"ఆత్మ" అనే పదార్థం సర్వజీవాలలోనూ ఒకటే కావచ్చు. కాని, ఒక జీవియొక్క ఆత్మ మరొక జీవితో ఏకీభవించాలని లేదు. ఒక వ్యక్తి మరొక వ్యక్తిలా ప్రవర్తించాలనీ లేదు. ప్రవర్తనలో ఈ తేడాని మనం వ్యక్తిత్వం అంటున్నాం. సాంఖ్యులు "అహంకారం" (Individuation) అన్నారు.

ఈ "అహంకారం"లేక "వ్యక్తిత్వం" మనిషి మన స్తత్వాన్ని నిర్ణయిస్తుంది. ఈ మనసుకు ఇచ్ఛ (Like) ద్వేషం (Dislike). సుఖం(Happiness)దుఃఖం(Pain)ఇలా ద్వంద్వ(Couplets) లక్షణాలుంటాయి.

"ద్వంద్వం"గా వున్న మనసు మొత్తం ఒక వ్యవస్థ. ఈ వ్యవస్థను ఫ్రాయిడ్ కూడా "అహంకారం" [Ego] గానే పేర్కొన్నాడు. ఫ్రాయిడ్ ప్రకారం అహంకారంలో చైతన్యం వుంది. అహంకారంలో ప్రకృతికి ప్రతిస్పందించే గుణం వుంది. అహంకారం మనిషికొక ఉత్తేజం. తనకు తానుగానే ఈ ఉత్తేజాన్ని పొంద గలదది.

---

* ఇచ్ఛా ద్వేషాః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనాధృతిః ।
ఏతత్క్షేత్రం సమాసేన సవికార ముదాహృతమ్ ॥
(గీత 13. 6.)

## అభావం లోంచి అస్థిత్వం

జార్జిగ్రాడెక్ ఇలా చెప్పాడు— "అహంకారం అనేది మనిషి ప్రవర్తనను నిర్దేశిస్తుంది.

మనిషి మొత్తాన్నీ అది తన గుప్పెట్లో వుంచుకోగలదు. అంతగొప్పదైనప్పటికీ, అహంకారం అనబడే ఈతత్వం వ్యక్తిగతంగా నిష్క్రియాత్మకమైంది (Passive)" అని।

గ్రాడెక్ ఇలా అహంకారాన్ని పరాధీనమైందిగా చెప్పడంలో ఓ ఉద్దేశం వుంది. మనం మనకు తెలీని (Unknown) మనం నిరోధించలేని (Uncontrollable) శక్తుల వలన జీవిస్తున్నాం అన్నాడు గ్రాడెక్.

గ్రాడెక్ సుప్రసిద్ధ జర్మన్ వేదాంతి. ఆయన ప్రపంచంలోని దర్శనాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించినవాడు. ఫ్రాయిడ్ ఆయన శిష్యులలో ప్రముఖుడు. ఆయన సిద్ధాంతాలన్నింటినీ పూర్తిగా నమ్మాడు ఫ్రాయిడ్. గ్రాడెక్ బోధనల ఆధారంగానే ఇంతటి శాస్త్రాన్నీ నిర్మించగలిగాడాయన. సర్వప్రపంచ తత్వచింతననీ ఫ్రాయిడ్‌కు నూరిపోశాడు గ్రాడెక్.

అందుకే ఫ్రాయిడ్ ప్రచారంలోకి రాగలిగాడనీ, మతానికి సైన్సు రంగు పూసి. "సైకో ఎనాలిసిస్" అంటూ ఓకోతిని తయారు చేశాడనీ ఇప్పటికీ ఆధునిక మానసిక శాస్త్రజ్ఞులు అతన్ని దుమ్మెత్తి పోస్తూనే వున్నారు.

గ్రాడెక్ వేదాంతి, ఈ ప్రకృతిలో కనిపించే ప్రతిదీ వ్యక్తిత్వ హీనమైన దానినించే ఏర్పడిందని ప్రతిపాదించాడు. దీన్ని

భారతీయ మానసవేత్తలు "అవ్యక్తం" అనేతత్త్వంగా పేర్కొన్నారు. గాడెక్ ఈ అవ్యక్తాన్ని "Es" అన్నాడు. ఫ్రాయిడ్, మనిషిలోని ప్రాథమిక తత్త్వాన్నీ "అవిద్య"నూ, అజ్ఞానాన్నీ "వ్యక్తిత్వ హీనత"గా భావిస్తూ, దానికి తన గురువుగారి "ఎస్" అనేపేరునే సూచించాడు.

ఆ తర్వాత "జాన్ రివియెర్", ఫ్రాయిడ్ వ్రాసిన "న్యూరోసిస్—సైకోసిస్" అనేపుస్తకాన్ని 1924లో ఇంగ్లీషులోకి అనువదించాడు. ఆ అనువాదంలో ఈ సిద్ధాంతం ప్రసక్తి వచ్చినప్పుడు, లాటిన్‌లో "ఎస్"కు సూటైన పదం "id"ను ప్రతిపాదించాడు.

అంటే మనిషిలో ప్రాథమికంగావుండే "అవిద్య" అనే తత్త్వాన్ని ఫ్రాయిడ్ "ఇడ్"గా చెప్పాడు. ఇడ్‌ను "తమోగుణం" అన్నారు ప్రాచీన భారతీయ దార్శనికులు. తమోగుణం [Inertia] చీకటి అనే అర్థంలో ప్రకటించబడింది.

ఈ తమోగుణం బాహ్య ప్రవృత్తుల ప్రేరణవలన జాగృతం అవుతుంది. తమోగుణం జాగృతం అవుతేనే మనకు విషయ జ్ఞానం సిద్ధిస్తుంది. జ్ఞానేంద్రియాలద్వారా అనేక విషయాల్ని మనం తెలుసుకొంటున్నాం. ఇలా తెలుసుకోవడాన్ని ఇంద్రియాభిగ్రహణం [Perception Conscious] అంటారు, చీకటిలో వున్నప్పుడు దీపాన్ని వెలిగించుకుంటే, ఆ వెలుగులో మనం అనేక వస్తువుల్ని చూస్తాం. చూడడాన్ని "కళ్ళు" అనబడే జ్ఞానేంద్రియాలు చేస్తున్నాయి. అంటే, వెలుతురు అనే బాహ్యప్రేరణవలన తమోగుణం "id" జాగృతం అయి మనకు విషయ జ్ఞానం లభిస్తోంది. ఈ ప్రక్రియను సాంఖ్యులు, "ఆత్మ, ఇంద్రియాలూ,

ఇంద్రియార్థాలూ, మనసు ఇన్నీ కలిసి మనకు ప్రత్యక్ష జ్ఞానాన్ని ఏర్పరుస్తున్నాయి...." అని సిద్ధాంతీకరించారు. అంటే, తమోగుణం లేకపోతే మనిషికి చైతన్యం సిద్ధించదు. తమోగుణానికి చైతన్య నియామక శక్తి వుంది. *

## చైతన్యం అవతరణ

ఇడ్‌లో అహంకారం (ఇగో) ఒక భాగం. ఈ "ఇగోబాహ్య" ప్రేరణలను తమోగుణంపైకి మరల్చి దాన్ని జాగృతమయ్యేలా ప్రవర్తింప చేస్తుంది.

"ఇగో" సాంఖ్యాది భారతీయశాస్త్రాలలో రజోగుణంగా వర్ణించబడింది, కాశ్యపుడు "రజశ్చాపి ప్రవర్తకమ్" అన్నాడు.

రజస్సుకు ప్రవర్తింప చేసే గుణం వుంది. ప్రవర్తింప చేయడం అంటే ఏమిటో ఫ్రాయిడ్ ఒక చక్కని ఉదాహరణలో వివరించాడు, గుర్రంపైన స్వారీ చేస్తోన్న ఒక సైనికుడు గుర్రం బలం మొత్తాన్ని స్వాధీనం చేసుకొని, దాన్ని తన మార్గంలో ప్రవర్తింప చేసుకోగలుగుతాడు. అలాగే ఇగో [రజోగుణం] మానసిక శక్తుల్ని ప్రవర్తింపచేస్తుంది .... అని చెప్పాడు ఫ్రాయిడ్.

అంటే, జడమైన, నిశ్చేతనమైన తమస్సు [id] ఇంద్రియాభిగ్రహణం [Perception] వలన ఇగో [రజస్సు]గా పరివర్తనం చెందుతుంది....రజస్సు చైతన్యానికి చిహ్నం.

---

* ఆత్మేన్ద్రియ మనోఽర్థానాం సన్నికర్షాత్ ప్రవర్తతే।
వ్యక్తా తదా త్వేయా బుద్ధిః ప్రత్యక్షం సా నిరుచ్యతే॥

మనిషి జ్ఞానేంద్రియాలన్నీ పనిచేయడం మానేస్తాయను కోండి... కళ్ళుచూడవు. చెవులు వినిపించవు. నోటిరుచి తెలీదు. ముక్కు వాసన చెప్పలేదు. చర్మానికి స్పర్శాజ్ఞానం వుండదు. నిలువునా శరీరం తగలబడ్తోన్నా ఆ వ్యక్తికి తెలీదు. ఇలాంటి పరిస్థితుల్లో ఇంద్రియాభిగ్రహణం [Perception] జరగడంలేదని అర్థం. అంటే, ఆ వ్యక్తిలో కేవలం తమోగుణం మాత్రమే పని చేస్తోంది. ఇప్పుడు రజోగుణం కూడా ఏర్పడి, తమోగుణాన్ని పారేపిస్తే కళ్ళు చూడగలుగుతాయి. చెవులు వినగలుగుతాయి. నోటికి షడ్రసాలూ తెలుస్తాయి. ముక్కు సువాసనకూ, దుర్వాసనకూ తేడా చెప్పగలుగుతుంది. చర్మం చల్లదనం, ఉష్ణతా భేదాల్ని గుర్తించగలుగుతుంది. దీనికంతటికి రజోగుణం [Ego] అనబడే చేతనత్వం కారణం. ఇప్పుడా వ్యక్తి ఏవీ తెలీని దశనుంచి, ఏది ఏమిటో తెలుసుకునేదశకు ఎదిగాడు. తమస్సునుంచి రజస్సుకు ఎదిగాడు. అంతటితో చాలదుగదా—కళ్ళుచూడగలుగుతాయి. కాని, ఆ వస్తువును చూడడంవలన అతని మనసు ఆనందంతో ఉప్పొం గాలి. లేకపోతే కళ్ళున్నా అతను గుడ్డివాడితో జమ. చైతన్యం వున్న వ్యక్తుల్లో కూడా జడత్వం ఈ విధంగా వుంటుంది. అందు కని, ఇంద్రియాభిగ్రహణంవలన సుఖదుఃఖ ప్రవృత్తులు అతని మనసులో జనించగలగాలి.

అందుకు "సత్త్వగుణం" కారణం అని భారతీయత చెప్తోంది. "సూపర్ ఇగో" లేక ఇగో ఐడియల్ [శ్రేష్ఠాహం కారం] అన్నాడు ఫ్రాయిడ్, ఈ సత్త్వగుణాన్నే!

కాశ్యపుడు సత్త్వగుణాన్ని "ప్రకాశకం" [Intelligentia] అన్నాడు. అది జ్ఞానకారణంగా ఆయుర్వేదం నమ్ముతోంది.

ఫ్రాయిడ్ కూడా ఈ అభిప్రాయంతోటే దీన్ని "సూపర్ ఇగో" అనీ ఇగో ఐడియల్ అనీ పిలిచాడు కాబట్టి సత్త్వగుణంవలనే మనిషి మేధావంతుడౌతున్నాడన్న విషయాన్ని మనం గుర్తించాలి.

రజస్సు విశేష గుణం ప్రవృత్తి. శరీరాన్ని, మనసునూ. మనిషినీ ఒక విషయంమీదకు ప్రవర్తింపచేస్తుంది. కాబట్టి అది చేష్టాకారకం [Motion Energy].

రజస్సునూ, సత్త్వాన్నీ నియమించేది తమస్సు. తమస్సు లోంచి రజస్సు, రజస్సులోంచి సత్త్వమూ వస్తున్నాయి కాబట్టి తమోగుణానికి నియామక శక్తిని కాశ్యపుడు చెప్పాడు.

ఈ మూడింటినీ త్రిగుణలంటారు. త్రిగుణాలలో ఒక్కోగుణం మరో గుణంతో "సహచరి" భావంతో వ్యవహరిస్తాయని ఆయుర్వేదజ్ఞులు చెప్తారు. *

ఈ విషయాన్నే ఆధునికంగా పంథొమ్మిదో శతాబ్దం మొదట్లో "సైకో ఎనాలిసిస్" అనేపేరుతో ఒక శాస్త్రంగా అభివృద్ధి చేసి గొప్ప సంచలనం రేకెత్తించాడు ఫ్రాయిడ్.

ఇప్పటికీ ఫ్రాయిడ్‌ను ఎవరూ అంగీకరించకపోయినా అతని సిద్ధాంతాలు ఇంకా వరించబడ్తూనే వున్నాయి.

---

సత్త్వం ప్రకాశకం విద్ధి రజశ్చాపి ప్రవర్తకమ్
తమో నియామకం ప్రోక్త మన్యోన్య మిథున ప్రియమ్
(కాస్యప సంహిత సూత్రస్థానమ్)

సత్త్వగుణంలో విశేషంగా జ్ఞానాన్ని పొందే శక్తి వుంటుంది. కాబట్టి ఈ గుణాన్ని ఎక్కువగా కలిగిన మనసును సంస్కారవంతమైనదిగా భావిస్తాం.

సత్త్వగుణాన్ని కలిగిన వ్యక్తుల్ని సాత్త్వికులంటారు. సాత్త్వికులలో వివేకం, క్షమ, సంతోషం, మృదుత్వం, దయ, పాపకార్యాలంటే అసహ్యం, సరళత, నిర్మలత మొదలైన సుఖ సాధనాలుంటాయి.

రజస్సు ప్రవర్తకం అనే లక్షణాన్ని కలిగి వుంటుంది కదా— ఈ గుణం ఎక్కువగా వుంటే, సత్త్వగుణం తక్కువగా వుంటే, ఆ వ్యక్తుల్లో ద్వేషం, కామం, అహంకారం, మదం, లోభం, మాత్సర్యం, విషయలౌల్యం. మొదలైన దుఃఖ సాధనాలుంటాయి.

తమస్సు నియామక లక్షణాన్నే కలిగివున్నా ఇది అవిద్య లేక అజ్ఞానాన్ని కలిగివుంటుంది. తామసులంటే, సత్త్వ రజో గుణాలు తక్కువగా వుండి తమోగుణం ఎక్కువగావున్న జడులు. తామసులలో మిథ్యాజ్ఞానం, నిష్క్రియత [Inactivity], కునికి పాటు (తన్ద్రి), ఆలస్యం (ఏ పనీ చేయాలనే ఉత్సాహం లేకపోవడం) దీనత, మోహం మొదలైన దుర్లక్షణాలన్నీ వుంటాయి. "షైజోఫ్రీనియా" వంటి మానసవ్యాధులు ఈ తామసులకు సోకేందుకు అవకాశాలు ఎక్కువ.

అందుకనే, ఆయుర్వేదజ్ఞులు సత్త్వగుణాన్ని ఉన్నత మైనదిగా పేర్కొని, రజోగుణాన్నీ తమోగుణాన్నీ మానస

వ్యాధులుగా పేర్కొన్నారు. రజస్తమోగుణాలు ప్రకోపించడం వలననే అన్ని మనోవికారాలూ సంభవిస్తాయని ఆయుర్వేద పండితుల నమ్మకం. ఫ్రాయిడ్ ఈ అభిప్రాయంతో ఏకీభవించాడు.

## శుద్ధ మనసు

మనోవృత్తులు [Mental forces] అన్నీ కలిస్తే "మనసు" ఏర్పడుతుంది. ఇది శుద్ధ మనస్సనీ, మలిన మనస్సనీ రెండు రకాలుగా చెప్పారు సాంఖ్యులు. శుద్ధ మనస్సులో సత్త్వ రజస్తము గుణాలు సమానంగా వుంటాయి. మలిన మనస్సులో తమోగుణం పాలు ఎక్కువగా వుంటుంది.

ఇంద్రియాలకు "మనస్సు" అధిష్టానం. మనస్సును బుద్ధి నడిపిస్తుంది. బుద్ధిలో సాత్త్వికత పెరిగితే కోరికలు నశిస్తాయి. దీన్ని "అసజ్జస్థితి" [Repressed state] అంటారు. బుద్ధిలో తామసం పెరిగితే కామం [Lust] బుద్ధిని ఆక్రమిస్తుంది.

దీన్నిబట్టి కోరికలు తగ్గాలంటే సత్త్వగుణం పెరగాలి అని అర్థం అవుతోంది. చిత్తవృత్తుల్ని నిరోధించడమే యోగం అంటుంది పాతంజలి యోగశాస్త్రం. యౌగిక విద్యల వలన సత్త్వ గుణం పెరుగుతుంది!

సత్త్వగుణం మనిషిలోని ఔన్నత్యం. ఈ ఔన్నత్యాన్నిబట్టి పర్సనాలిటీ (వ్యక్తిత్వం)ని అంచనా వేస్తాం.

ఫ్రాయిడ్ ఈ వ్యక్తిత్వాన్ని Higher nature అన్నాడు. ఇది ఎవరో కొందరు మతాధిపతులకు మాత్రమే పరిమితమైంది

కాదు. మనిషన్న ప్రతివాడిలోనూ వుంటుంది. దీన్నే "శ్రేష్ఠాహంకారం" [Ego ideal] అన్నాడు ఫ్రాయిడ్. మనం సాత్త్వికాహంకారం అంటున్నాం.

రజోగుణం బాహ్యప్రపంచానికి ప్రాధాన్యత వహిస్తుంది. సత్త్వగుణం అంతః ప్రపంచాన్ని ప్రతిబింబిస్తుంది.

కాబట్టి ఉత్తమమైన వ్యక్తిత్వం వున్నవాడు కోరికలను పొదుపుచేసుకుంటాడు. అందువలన అతను పొందే ఆనందం సుఖలాలసంకన్నా ఎక్కువగా వుంటుందంటాడు ఫ్రాయిడ్. దీన్ని Concept of sublimation (జాగృత సిద్ధాంతం) అంటారు. కాని, ఇది పవిత్రతను పేరేపించే సంస్కరణ వాదంగానూ, మత మౌఢ్యంగానూ కొట్టివేయబడడం ఓ విధంగా ఫ్రాయిడ్ దురదృష్టం!

## మనోవిగ్రహ ప్రక్రియ

సుఖమైనా, దుఃఖమైనా "id" అనబడే తమోగుణ ప్రేరణ వలన మనిషికి అనుభవంలోకి వస్తుంది.

తమస్సు నుంచి ప్రారంభమైన లైంగిక భావాలను [Instincts] ప్రోత్సహించడమో లేక నిరోధించడమో చేస్తుంది రజస్సు (Ego) ఆ కోరికను ప్రోత్సహించాలో లేక నిరోధించాలో నిర్ణయించేది అతని సత్త్వగుణం [Ego-ideal] ఈ నిర్ణయం ఆవ్యక్తి సంస్కారాన్ని బట్టి వుంటుంది. కుసంస్కారి విచ్చలవిడిగా తిరుగుతాడు. కుహనా సంస్కారి పైకి జితేంద్రియుడుగా

నటిస్తూ అమాయకులైన ప్రజల్ని మోసగిస్తాడు. సంస్కారి కోరికను క్రమపరచుకొని తృప్తిని పెంచుకుంటాడు.

సంస్కారవంతుడైన ఒక వ్యక్తిలోని "ఇగో" అతని కోరికల్ని ప్రేరేపించే "ఇడ్"ను నొక్కిపట్టాలని చూస్తుంది. అంటే, శక్తివంతమైన మనసుగల వ్యక్తిలోని రజోగుణం తమస్సును జయిస్తుంది. ఇదే నిగ్రహం పాటించబడ్తోన్న విధానం. దీన్ని "రిప్రషన్ ప్రోసెస్" అన్నారు.

ఇడ్‌లో కోరికలు అనవసరమైనవిగా భావించబడ్తాయి. ఇగో దాన్ని ఖండించనూవచ్చు. లేక ప్రోత్సహించనూవచ్చు. ఇడ్‌లో వున్నంత కాలం "కోరిక" నీటిలో మొసలి–! దాన్ని జయించడం రజస్సుకు కష్టసాధ్యమైన పని. అందుకని, ఈ ఇగో తెలివిగా ఆ కోరికను ఇడ్ లోంచి తనవైపుకు ఆకర్షించుకుంటుంది.

ఇప్పుడు "ఇగో"కు పెద్ద పరీక్ష. కోరికను తన ఇంటికి ఆహ్వానించి, కంసుడిలా శిశు హత్య చేయడానికి కొంచెం మొహమాట పడ్తుంది. అప్పుడు "సూపర్ ఇగో" కల్పించుకొని, ఇగోకు ధైర్యం చెప్పి వెన్నుతట్టి ముందుకు తోస్తుంది. అంతే.... "ఇగో" పూనుకుంటే కోరిక అక్కడికక్కడే నశించి పోతుంది. సూపర్ఇగో వద్దనుకొంటే కోరికను చంపించగలదు. కావాలనుకుంటే, పెంచిపోషించనూ గలదు!

ఇలా ఎన్ని కోరికలను పెంచిందో. ఎన్నింటిని తుంచిందో...! "ఇడ్" కోరికలను కంటూవుంటుంది. ఇగో కొన్నింటిని పెంచుతుంది. కొన్నింటిని తానే భక్షిస్తుంది. ఏమైనా, సూపర్ఇగో చెప్పినట్లుచేసే ఓ "కిరాయి గూండా" రజస్సు.

రజస్సు కోరికను జయించినప్పుడు, ఆవ్యక్తి ఆవస్తువుపైన ఆశని చంపుకున్నాడని అర్థం. అంటే, కోరిక ఆ వస్తువు మీంచి వెనక్కి మరలి అతని మనసునే చేరుతుంది.

"నార్సిసిజం"లో ఇలా మరలి వచ్చిన కోరిక అంతర్గతంగా అతన్ని బాధించి, అతని "అహంకారాన్ని" పెరుస్తుంది. తత్ఫలితంగా, అతని మనసు అతను ప్రేమించిన వ్యక్తికి సంబంధించి మారిపోతుంది. ప్రేమించిన వ్యక్తి పురుషుడైతే తను ప్రేమించిన స్త్రీలా ప్రవర్తించడం ప్రారంభిస్తాడు. స్త్రీ సంబంధమైన ఆలోచనలతో నిలువుటద్దం ముందు నగ్నంగా నిలబడి అద్దంలో కనిపించే తన పురుష రూపంతో రమిస్తున్నట్లు భావించుకొంటూ హస్తప్రయోగం చేసుకుంటాడు.

ఇలాంటి మనోవికారాలు అభివృద్ధి చెందడానికి తమోగుణం కారణం. తమోగుణం వలన చంచలత పెరుగుతుంది.

తమోగుణ ప్రధానులు ప్రేమకు దూరంగా వుంటారు. సత్త్వ గుణాధిక్యతను పెంపొందించడమే వీరికి చికిత్స. సాత్త్విక ఆహారం, సాత్త్విక విహారం, సాత్త్విక ఔషధ సేవన మనిషిలో స్థిరత్వాన్ని పెంపొందిస్తాయి.

స్థిరమైన మనోభావాలున్న వ్యక్తులే ప్రేమించ గలుగుతారు, ప్రేమించబడతారు.

ప్రేమించగలవారే అమలిన శృంగారాన్ని అమలుపరుస్తారు.

స్థిరమైన మనసుకు స్వాగతం. చంచలతను జయించగల యువతకు ఆహ్వానం.

## ముఖ్యమైన తప్పులకు ఒప్పులు

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 13 | 1 | అమ్మానాన్నల అనుకరణ | అమ్మానాన్నలను అనుకరణ |
| 59 | 16 | అందుకు ఆకలి | అలాకలీడానికి |
| 70 | 9 | ప్రయోగిస్తాయని | ప్రయాణిస్తాయని |
| 83 | 20 | మధురగాత్రాలూ | మధురగాత్రులు |
| 86 | | 86వ పేజీ | 87వ పేజీ |
| 87 | | 87వ పేజీ | 86వ పేజీ |
| 154 | 1 | పెద్దన వారు | పెద్దన వారి |
| 166 | 15 | పుట్ నోట్స్ | ఒకటి రెండుగానూ రెండు ఒకటిగానూ |
| 240 | 20 | అహంకారం [Ego] | అహంకారం Arogancy |
| 261 | 7 | డిస్పెనూరియా | Dyspareunia డిస్పెరూనియా (Dyspareunia) |
| 276 | 23 | వధ్ధ | వృద్ధ |
| 294 | 21 | సాత్త్వహంకారం | సాత్త్వికాహంకారం |

సృష్టి ఎలా ఏర్పడింది? యుగాలుగా ప్రపంచ మేధావులు ప్రవచించిన సృష్టి రహస్యసారం.

## "సృష్టి"

### జి. వి. పూర్ణచందు విశేష పరిశోధన

త్వ ర లో వి డు ద ల!

## సంప్రదించిన గ్రంథాలలో ముఖ్యమైనవి

1. వాత్స్యాయన కామ సూత్రములు (జయమంగళ వ్యాఖ్య) తె: పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి
2. గౌతమ ధర్మసూత్రములు వ్యా: పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి
3. పరాశర స్మృతి
4. శతపథ బ్రాహ్మణం
5. మనుస్మృతి
6. చరక సంహిత (సూత్ర, శారీర, నిదాన, చికిత్సాస్థానాలు) వ్యా: పండిత నుదురుపాటి విశ్వనాథ శాస్త్రి
7. సుశ్రుత సంహిత: (సూత్ర, శారీర, నిదాన స్థానాలు) వ్యా: పండిత నుదురుపాటి విశ్వనాథ శాస్త్రి
8. అష్టాంగ హృదయం (సూత్రస్థానం) వ్యా: పండిత నుదురుపాటి విశ్వనాథ శాస్త్రి
9. ఆంధ్రుల సాంఘిక చరిత్ర : సురవరం ప్రతాపరెడ్డి
10. మను చరిత్ర [వ్యా: వెంపరాల సూర్యనారాయణ శాస్త్రి]
11. ప్రాక్పశ్చిమ తత్త్వశాస్త్ర చరిత్ర : అను: పరివల్లె విశ్వనాథ శాస్త్రి
12. భారతి సంపుటాలు
13. చలం సాహిత్యం
14. పెళ్ళి – దాని పుట్టు పూర్వోత్తరాలు : తాపీ ధర్మారావు
15. కౌమార భృత్య తంత్రం : వల్లూరు సుబ్బారావు
16. సూక్తిముక్తావళి : మహీధర జగన్మోహన రావు
17. కాశ్యప సంహితా [విద్యోతినీ హిందీ వ్యాఖ్య : నేపాల రాజగురు హేమరాజ శర్మ]
18. శారంగధర సంహితా (హిందీ: ఆచార్య శ్రీరాధాకృష్ణ పారాశర ఆయుర్వేదాచార్య)

19. ఆయుర్వేదీయ క్రియా శారీర్ (హిందీ : వైద్య రణజిత్ రాయ్ దేశాయ్)
20. మానసరోగ విజ్ఞాన్ (హిందీ: డా॥ బాలకృష్ణ అమర్‌జీ పాఠక్)
21. యోగరత్నాకరః [సంస్కృత మూలమ్ : కృష్ణశర్మణా సంశోధిత]
22. సాంఖ్య కారికా ఈశ్వర కృష్ణ విరచితా
23. మాధవ నిదానమ్ [మధుకోశ, ఆతంక దర్పణ వ్యాఖ్యాద్వయ సహితమ్]

24 Sane - sex - order [Pitrim. A, Sorokin]
25 The Lonely crowd [David Riesman, Nathan Glazar and Reuel Denney, 1974]
26 Identity : Youth and Crisis [Erik H. Erikson, 1967]
27 Childhood and Society [Erik H, Erikson]
28 Studies in Psychology of sex [HavelocEllis; Vol. 1, 2, 3, 4]
29 Love and will [Rollo May]
30 The Human Dialogue [Matson and Montague]
31 The origin of the Family, Private property and the State - (Engels)
32 Love, Marriage, and Sex [Promillakapur]
33 Capital [Karl Marx]
34 A General selection from the works of [Edi : Jhon Rickman; 1937]
35 The Science and Philosophy of Religion [Swami Vivekananda]
36 What Peligion Is (Swami Vivekananda)
37 Hindu America (Bikshu Chamanlal)
38 Aurobindo volumes [Vol. 15, 16, 19, 22, 23, 24

39 The Upanishads-An Anthology [D.S. Sarma]
40 Sree Bhagavadgeeta Rahasya or Karma yoga Sastra [Bala Gangadhara Tilak - Eng. Trans - Balachandra Sitaram Sukthankar]
41 Marriage and Morals : Bertrand Russell
42 Ananga Ranga [Kalyana malla]
43 Encyclopaedia Britanica volumes (1975)
44 Stedman's Medical Dictionary [23rd Edition]
45 Price's Text Book of the Practice of Medicine [11th Edition]
46 Clinical obstetrics [A. L. Mudaliar, & M.K Krishna Menon, 11th Edition]
47 Shaw's Text Book of Gynaecology (NInth Edition)
48 Digestion and Metabolism in Ayurveda (Dr. C. Dwarakanath]
49 A Short Text Book of Psychiatry (W. L Linford Rees)
50 A Dictionary of Psychology [Penguin Reference Book - James Drever]
51 Pearl's Gem DictionarY [English-English-Hindi]
52 The Abnormal Personality : Robert W. White& Norman F. Watt
53 Work and Human Behaviour : Walter S. Neff
54 Behaviour Therapy : Yates J. Aubrey.
55 The Ages of Life : Lorus J. Milne & Margery Milne
56 An out line of Psychology: William Medcugal
57 The Psychology of Adolescence : Jersild T. Arthur

# అమలిన శృంగారం

సెక్సు నీతి సాధ్యపడాలంటే జంట కట్టేవాళ్ళు ప్రేమికులు కావాలి. ప్రేమించే శక్తి వున్నవాడు భార్యను ప్రేమిస్తాడు. పిల్లలను ప్రేమిస్తాడు అలా ప్రేమించ గలవారికే సంభోగసామర్థ్యం వుంటుంది.

ప్రేమించడం ఒక కళ! మనుషులంతా ప్రేమించే కళాకారులు కావాలి!!

స్థిరమైన మనోభావాలున్న వ్యక్తులే ప్రేమించ గలుగుతారు.

ప్రేమించ బడతారు.

ప్రేమించగలవారే అమలిన శృంగారాన్ని అమలు పరుస్తారు.

స్థిరమైన మనసుకు స్వాగతం!

చంచలతను జయించగల యువతకు ఆహ్వానం!!

జి.వి. పూర్ణచంద్.

